బదరి, క్షుద్రఘోలి, చివిల్లికా, క్షుపము, భూబదరి; ౪: చిటిగొట్టె; ౫: రేఁగుపండు, ఱేఁగుపండు. (సం).—కర్కంధువు, కుల ము-కోలము, కోకిలము, కువలము, గుట, ఘోంట, బదరము, సౌవీరము.(వి.గతవానికి "చూ, స్వాదుఫల. 3."); అ. క్రి. 2. పై కి లే చే. రా మా. 7, ఆ. 279: ఎగయు, కొదరు, గొరించే, నెగయు-నెవయు, నెగయుదెంచే, పుటమెగయు, లేచే. (సం).—ఉద్గమించే,3. రూ-రేయు-ఱేయు-రేచ్చు: చూ, విజృంభించే; 4. ఉ ద్రేకించే: చూ, హుంకరించే.

రేఁగుడు. దే. వి. సిధ్రికి.*: చూ, పొట్ల.

రేఁగుపండు.వా.వి.బదరీఫలము: చూ, రేఁగు.1-౪.

రేఁచే. దే. ప్రే. 1. రేఁగఁజేయు. రూ-రేఁపు; స. క్రి. 2: ఎక్కాడు, ఎక్కులు పెట్టు, ఎత్తుపెట్టు, ఎసకొలుపు, ఎసపెట్టు, కెల్ల గించే, కొలుపు, పురికొలుపు, పెః రేఁచే-పెరరేపు- ప్రేచే- ప్రేరేపించే-ప్రేరేఁచే-ప్రేరేపు, పొలుగుడుపు-పొ ల్గుడుపు. (సం).—ప్రేరించే.

రేఁటెము. దే వి: చూ, రూ-రెంటము.

రేఁపు. దే. ప్రే: చూ, రూ-రేఁచే.

రేఁబగలు. ద్వ. వి. రోజే, అహోరాత్రము: చూ, హోర. 1.

రేక. దే. వి. 1. తాటాకు మట్టతో కట్టిన దొప్ప; నై. వి. 2.=రేఖా. గీఱ; చూ, రేఖ. 3; 3.=రేఖా-లేఖా. జోబు: చూ, లేఖ. 3; 4. పంక్తి: చూ, శ్రేణి. 1; వా. 5: చూ, రేకు. 1.

రేకంటు. ద్వ. వి: చూ, సూర్యుఁడు.

రేకచీరణము. ద్వ. వి. రేఖలుతీర్చెడు చిన్న యులి: చూ, వృక్షాదనము.

రేకు. దే. వి. రూ-ఱేకు. •1. పుష్పదళము: చూ, సంవర్తిక; 2. జలతారు: చూ,సరిగ.2; 3. ఈఁక: చూ, ఱెక్క. 1: 4. అంచే కమ్ములులేనిబట్ట, సయిను: చూ, వస్త్రము; 5. దుప్పటిలోసగము: చూ, వస్త్రము.

రేకుముడఁచే. దే. స. క్రి. రూ-ఱేకుముడఁచే. అణఁగఁద్రొక్కు. విజ. 3, ఆ. 167.

రేకెత్తు. దే. అ. క్రి: చూ, వర్ధిల్లు.

రేఖ. సం. వి. ఆ. స్త్రీ. రూ-లేఖ. 1. ఎడము లేక దగ్గఱయగు వృక్షాదులపంక్తి: చూ, శ్రేణి. 1; 2. పాణిపాదతలముల యందలి గీఱ; 3=రేక: చీరము,కాంతి. (తె.వ.).-గీఁత, గీటు, గీఱ, గెఱ, గోఁటు, చాఱ, జీర, బరి, రేక, అక్కు, వ్రాయి. తద్వి.—౧. గుండ్రనిరేఖను.— (తె).-గిఱి, గుడి; ౨. వడ్లగాసిచేట్టుగీఁచెడు గిటికి.—(తె). పొతుకు; 4.=లేక. జోబు: చూ, లేఖ. [1—30.

రేగటినేల. దే. వి. నల్లనేల: చూ, భూమి.

రేగడ. దే. వి.—పై.—(రూ-రేవడ)

రేగడి. దే.వి.రూ-రేవడి:చూ,భూమి.1—౫౫.

రేగడిమూల. దే. వి. తీఁటకసింద *: చూ, సముద్రాంత. 1.

రేచకనికృష్టము. అం: చూ, కరణములు.

రేచకము. సం. వి. అ. పుం. 1: చూ, కుంభకా దిత్రయము; 2. ఏనుఁగుచెవివంటి పాదకం చుకము: చూ, వారవారణము.

రేచకి. సం. వి. ఈ. స్త్రీ.కరక*:చూ,హరీతకి.

రేచని. సం. వి. ఈ. స్త్రీ. 1: చూ, రూ-రోచని. 1. *; 2. దంతి*: చూ, విశల్య.5.

రేచిక్క. వా వి. 1. తిలతిక్క;2:చూ,వినుపు.

రేచితము. సం. వి. అ. న. 1. వంకరలేక వేగ ముగాఁబోయెడి గుఱ్ఱపునడ: చూ, ధారలు; అం. 2: చూ, భూక్రియలు; 3: చూ, నృత్తహస్తములు;4:చూ, కటిక్రియలు.

రేచీఁకటి. ద్వ. స్త్రీ. రాత్రికన్నులు తెలియమి, నిశాంధ్యము.

రేచీఁకు. ద్వ. వి: అవిటి-అవిడి, కన్నవిటి, కానని వాఁడు, కానరాని వాఁడు, గుడ్డి-గుడ్డి, చీఁకు-చీకు. (సం. వ).—అంధకుఁడు, అంధుఁడు, అదృక్కు, అనేడమూకుఁడు, దివ్యచక్షువు. తద్వి.— ౧. పుట్టు గుడ్డి, పుట్టుచీఁకు. (సం).—జనుషాంధుఁడు; ౨. మెల్లకంటివాఁడు. (సం).—కేకరుఁడు, గోకులికుఁడు, టగరుఁడు, వలిరుఁడు-వళిరుఁడు-వళీరుఁడు. ("చూ, వళీరుఁడు.")

రేచెల్వ. ద్వ. వి. బోగముది: చూ, వేశ్య.

రేజేవరాలిమగఁడు. ద్వ. వి. చేందమామ: చూ, హిమాంశువు.

రేజోతి. వై. వి.—పై.—

రేడియో.వా. వి.(Wireless and Radio) తంతువిరహిత తారాప్రేషణము. (ఇందుకు సంబంధించిన పరిభాషా పదములు — ౧ Wireless Telegraphy=తీగ లేని టపా; తంతు విరహిత తారాప్రేషణము; ౨. Wireless Amplifier=ధ్వనిస్ఫుటీకరణసాధనము; పరివర్తన యంత్రము; ౩. Broad Sasting= పరిప్రేషణము; భూమార్గ టెలిఫోను తంతులద్వారా (శబ్ద) ధ్వనివ్యాపనము; సంగీతము ఉపన్యాసము వగైరాలకుపయోగించునది; ౪. Wireless Loud Speaker= శబ్దప్రస్ఫుటన యంత్రము; తారస్వరయంత్రము; ధ్వనియథాతథముగా వినఁబడునట్లు చేయునది; ౫. Wireless Microphone=శబ్దోత్పాదన యంత్రము; సూక్ష్మశబ్దగ్రాహి యంత్రము, వాయుతరంగములందలి ధ్వనినే విద్యుత్ప్రవాహ తరంగములందునుకలిగించునది; ౬. Wireless Radio Set=విద్యుత్తరంగముల ద్వారా వ్యాపింపఁజేయఁబడు ధ్వనులను మరల నిజరూపములో వినుటకుపయోగించు పరికర యంత్రము; ౭. Wireless Receiver=గ్రాహక యంత్రము; ౮. Wireless Short Wave=చిన్నఅల, హ్రస్వతరంగము; ౯. Wireless Trans Former=పరిణామక యంత్రము. విద్యుత్ పరివర్తన యంత్రము; ఒకవోల్టుపట్టుఁబడి విద్యుత్తునొకవోల్టుపట్టుఁబడికి మార్చునది; ౧౦. Wireles Transmitting= విద్యుత్ ప్రాపణ; ప్రేషణ; ౧౧. Wireless Trans Mitier=విద్యుత్ ప్రేషణ (ప్రాపణ)యంత్రము; ౧౨ Wireless Trans mitter Areal=అంతరిక్ష మార్గవిద్యుత్ ప్రాపణతంతులు; ఎత్తుశిఖరములపై వేయఁబడు సమాంతరతంతులు; ౧౩. Wireless Beam Areal=హ్రస్వతరంగ ప్రాపణ తంతువులు ఇత్యాది. [మయుము (పిడక.)

రేణము. దే. వి. దూషపేష. చూ, శుష్కగో

రేణికివచ్చు. వా. అ. క్రి: సేటుసేయు.

రేణుక. సం. వి. ఆ. స్త్రీ. 1. రేణుకయను గంధద్రవ్యము: చూ, రాజార్హము; 2. జమదగ్నిభార్య: చూ, సహధర్మిణి (భార్య.); 3. (రేణుకలు=నూగుగోస అనికొందఱు).

రేణునాసము. సం. వి. అ. పుం తుమ్మెద: చూ, షట్పదము.

రేణువు. సం. వి. ఉ. పుం, స్త్రీ. 1. కణిక, కలుషము, క్షితికణము. గుండకము, చూర్ణము, తమస్సు, ధూళి, పరాగము, పాంశువు-పాంసువు, వాతకేతువు. (తె. ప).—తుమురు—తువ్వర, తర్రిమ్ము-తుర్రిమ్ము. దప, దుమారము, దుమ్ము-దుమ్ము, దువ్వ, దూలి-దూళి, నలఁకి, నలి,

వలుసంత, వలుసు, నెరసు, పదటి (పడదు)-పదడు,బుగ్గి.తద్వి.౧.-కణము,పరమాణువు, పీలువు; ౨. గవుండ్లవాఁడు కత్తులునూఱెడుపాడికి:(తె).—నెరసు. (చూ,సురుము) (చూ, స్వల్పము.); 2. లవము: చూ, స్వల్పము. [చూ, సిరము.

రేణుసారము. సం. వి. అ. న. కర్పూరము:

రేతము. సం. వి. స్. న: చూ, రూ—రేతస్సు.

రేతలి. దే. వి: చూ, రేణునాసము.

రేతస్సు.సం.వి.స్.న. 1.పురుషునిరేతస్సునకు:-అక్షము, ఇంద్రియము. కల-కళ, కలము, కామము, కిట్టవర్జితము, ఛర్ది, తేజము—తేజస్సు, బిందువు, బీజము, భగము, మదము, వీర్యము, సుక్రము, శుక్లము, శుచి, హిరణ్యము. (తె) —సాఁడు. తద్వి.—౧.ఆఁడుదానిరజస్సు -ముట్టునెత్తురు-రజస్సునకు:— (చూ, రజస్సు. 3); ౨ ఆఁడుదానిరక్తమును మగవాని రేతస్సు సు కలిసినముద్దకు:-కలిలము, కులవలము; 3. ఏనుఁగురేతస్సునకు:—మదము; ర. స్త్రీపుష్పమార్తవమునకు:-(తె).గొర్రెత్తుముట్టు,ముట్టు, సనుగతి—సముర్త ("చూ, హిరణ్యము. 5."); 2. పాదరసము: చూ, సూతము.

రేతిరి. వై. వి.=రాత్రి: చూ, రాత్రి.

రేత్తిరి. వై. వి.=—పై.—

రేత్రి. వై. వి.=—పై.—

రేదొర. ద్వి. వి. చంద్రుఁడు: చూ,హిమాంశువు.

రేద్రిమ్మరి. ద్వి. వి. (రే + ద్రిమ్మరి) రాత్రించరుఁడు. ఉ, రా. ౩, ఆ. 43: చూ, రాక్షసుఁడు. 1; 2. దొంగ: చూ, హారకుఁడు.

రేద్రిమ్మరీఁడు. ద్వి. వి. 1. దొంగ: చూ, హారకుఁడు; 2. నిర్ఋతి: చూ, సోఁకులఱేఁడు.

రేనాఁడు. దే వి. దేశవిశేషము, రేవు: చూ,సీమ(1).

రేను. దే. వి: చూ, రూ-రేఁగు.*.

274

రేపకడ. ద్వి. వి. (రేపు + కడ) రూ—రేపాడి ఎల్లి, రేపు-ఱేపు.

రేపాడి. దే. వి.—పై.—కాశీ. 7, ఆ. 259. (రేపాడియనుచో ఆడియనునది అది వంటిదని యెఱుఁగునది) (చూ, ఏఁడాది.)

రేపు. దే. వి.—పై.—

రేఫుఁడు. వా. విశే. రేఫ్ఫుఁడు. మూఁబడినవాఁడు: చూ, వ్యాసుఁడు. 2. [హీనాంశువు.

రేపాలఁతిమగఁడు. ద్వి వి. చేందమామ: చూ,

రేఫము. సం. వి. అ. పుం. 1. రవర్ణము: చూ, వర్ణము 1. విశే. 2.అధమము: చూ,హీనము.2.

రేఫసుఁడు. సం. విశే: చూ, రేఫుఁడు.

రేఫ్ఫుఁడు సం. విశే.—పై.—

రేబ దే. వి. శయ్యపైపఱపు, సెపు: చూ, శయ్య. 1. [రాత్రి.

రేయి. వై. వి.=రాత్రి. రూ-రే-రేయి: చూ,

రేయింతిమాను ద్వి. వి: చూ, సముద్రము.

రేయిసల్లు. ద్వి. వి: చూ, రేపాలఁతిమగఁడు.

రేయు. దే. అ క్రి. 1: చూ, విజృంభించు; స. క్రి. 2. ఖండించు. రాఘ. 4, ఆ. 148: చూ, నెలగు.

రేగొండ. ద్వి. వి: చూ, వెన్నెల. 1.

రేఱేఁడు. ద్వి. వి: చూ, రేపాలఁతిమగఁడు.

రేల. వా. వి: చూ, రూ-ఱేల*.

రేవ. సం. వి. ఆ. స్త్రీ. 1. నర్మదానది: చూ, నది; 2. నీలి*: చూ, రంజని. [విశేషము.

రేవంతముల్లు. వా. వి. వస్త్రము ధరించుటలోని

రేవంతుఁడు. సం. వి. అ. పుం: అశ్వశిక్షకుఁడు, కళాంకరుఁడు.

రేవఁడు. దే. వి. (రేవు + అఁడు) చాకలవాఁడు. స్వా. 3, ఆ. 104: చూ, రజకుఁడు.

రేవగలు. ద్వి. వి. (రే + పగలు) అహోరాత్రము: చూ, హోర. 1.

రేవడ. దే. వి: చూ, రూ—రేగడ.పర. 2,ఆ.12.

రేవడి. దే. వి: చూ, రూ-రేగడి.

రేవతి. సం. వి. ఈ. స్త్రీ. 1. రూ-రేవంతి-రేవ: చూ, రిక్క; 2. బలరాముని భార్య: చూ, సహధర్మిణి (భార్య.)
రేవతీరమణుఁడు. సం. వి. అ. పుం. బలరాముఁడు: చూ, హలాయుధుఁడు. 1.
రేవలచిన్ని. దే. వి. రూ-రేవల్చిన్ని* (మలమూత్రములు జారీ చేయును.)
రేవల్చిన్ని. దే. వి.—పై.—
రేవు. దే. వి. 1. నద్యాదులయందు మనుష్యులు దిగుట కనువుగా నేర్పఱచిన దారి: నీరాట రేవు-నీలాటిరేవు-నీళ్ళాటరేవు, రేవు. (సం).—అవతారము, ఘటము, తీర్థము: చూ, సరస్సు. 1. తద్వి.—నడచిపోఁదగిన రేవునకు.—పాటిరేవు; 2. సముద్రమునందు సరకులు ఎగుమతిదిగుమతి చేయుచోటునకు:-(సం).—అవతారము, ఘటము, తీర్థము: చూ, సరస్సు. 1; 3. రేవాడు, కరవాఁక పట్టణము: చూ, దేశములు. ౧౭.; 4: చూ, రేఁగు*. య. 2, అ. 47; 5. చౌకలవాని చౌకిరేవుల లెక్క. "ఎన్ని రేవుల ఉతికెను"
రేవుజెక్క. దే. వి. గాడిద: చూ, రాసభము.
రేవుబోయ. దే. వి: చూ, సరంగు.
రేవువాఁడు. దే. వి: చూ, రేవఁడు.
రేవెలుఁగు. ద్వ. వి: చూ, రేపాలఁతిమగఁడు.
రేవెల్గు. ద్వ. వి.—పై—
రేవెల్గుజోడు. ద్వ. వి: చూ, సూర్యుఁడు.
రేస. దే. వి. 1. చేలుకన: చూ, లాఘవము. 1; వా. 2. ఒకానొక కుక్క: చూ, రూ-రేఁచే (రేచే అని కొందరు); విశే. 3. చేలుకనిది: చూ, లాఘవము.1.
రేసుగుడ్డ. దే. వి. చేతిగుడ్డ: చూ, వస్త్రము.
రేసొద. వై. వి. కంకరి: చూ, లేపము.

## రై

రై. సం. వి. ఐ. పుం.=రో. ధనము: చూ, హిరణ్యము. 3. [కంచెల: చూ, వస్త్రము.
రైక. దే. వి.రూ-రవిక-రైక-అయిక-అవిక,
రైటరు. వా. వి. గుమాస్తా (క్లర్కు.)
రైటు. వా. వి. ఒప్పు, క్రమము. (రాంగునకు వ్యతిరేకము.)
రైతు. దే. వి. రూ-రయితు: చూ, సేద్యకాఁడు. తద్వి.—౧. భూస్వాతంత్ర్యము లేని రైతునకు.—పాయకారి; ౨. పొలము కాఁపునకు.—పొలమరి. (మిగతవానికి "చూ, సేద్యకాఁడు.")
రైలు. వా. వి. 1. ఇనుపపట్టు; 2. పొగబండి: (ట్రైన్) :చూ, శకటము.1. (చూ, బండి.)
రైవతకము. సం. వి. అ. న. 1: చూ, ఊల*; 2. ఎఱ్ఱకిత్తలి*: చూ, శర్కరాంకము.
రైవతుఁడు. సం. వి. అ. పుం: చూ, శివుఁడు.

## రొ

రో. దే. అవ్య. 1. సంబుద్ధియందు స్త్రీవాచకంబులకను ప్రయుక్తమగునది. (ఉదా. — అక్కరో, ఇంతిరో, రమణిరో మొ.) రూ-రో; 2. ప్రశంసార్థకమునందు తద్వాచకశబ్దంబులకను ప్రయుక్తంబగునది. "అమ్మరో.": రూ-రో. [శబ్దము. 1.
రొంజోడు. దే. వి. ప్రలాపము, పదరు: చూ,
రొండి. దే. వి. 1: తుంటి, మలుసు; 2. నడుముయొక్క పార్శ్వభాగము: చూ, పిఁగు. 1.
రొండివ్రేటు. అం: చూ, విన్నాణములు.
రొండు. దే. వి. రూ-రొడ్డు, రొప్పు, రోఁజు, శ్వాసరోగము: చూ, వగరుపు.
రొండుడు. దే. వి: చూ, రూ-రొంజోడు.
రొంప. దే. వి: పడిసెము. (సం)—పీనశము-పీనసము. తద్వి.—(సం).-ప్రతిశ్యాయము-ప్రతిశ్రాయము-ప్రతిశ్రయము-పీనశము-పీనసము.(వైద్యశాస్త్రమునందు ప్రతిశ్యాయపీనసశబ్దములు ప్రత్యేకములు.)
రొంపి. దే. వి: చూ, సుబ్బలి.

రొంపిదుక్కి. దే.వి. నీళ్లుగట్టి అడుసు గాదున్నుట (మళ్లీయొకటి వెలిదుక్కి): (చూ, కుదప. 1.): చూ, సేద్యము.

రొంపిమాను. దే. వి. రొంపిదున్నినపిమ్మట మిట్టపల్లములు సరిపఱచుటకు మీఁద పాఁకించెడు మాను: పోకమాను.

రొక్కపుదొర. ద్వ. వి. కుబేరుఁడు: చూ, శ్రీదుఁడు.

రొక్కపుపూఁట. ద్వ. వి: అపువుఁబూఁట

రొక్కము. నై. వి. 1 =రోక. చేతివెల, నగదు (చూ, విత్తము. 1.); 2.=రుక్థ. ధనము: చూ, హిరణ్యము. 3; 3: చూ, సమూహము.

రొక్కములతేఁడు. ద్వ. వి: చూ, రొక్కపుదొర.

రొక్కారొక్కములు. నై. విశే. బ. బహువిధములుగలవి: (సం).— ఉచ్చావచము, నైకభేదము.

రొక్కించు. నై. స. క్రి. 1. రొక్కపఱచు; వా. 2. రొక్కిరొక్కియడుగు.

రొచ్చు. దే. వి. 1. అపవాదము: చూ, నెగ్గింపు; 2. అడుసు. రూ-అరొచ్చు: చూ, సుబ్బలి; 3: చూ, నుచ్చు. 1; 4. మాలిన్యము: చూ, మలినము. 1; వా. 5. రూ-అరొచ్చు, తూముకాల్వలవెంటఁ బాఱెడు మురికిబంక: చూ, సుబ్బలి.

రొట్ట. దే. వి. 1. ఉపశాఖ: చూ, శాఖ. 1; వా. 2. ఆకులప్రోవు.

రొట్టియ. దే. వి. రూ-రొట్టె: చూ, భక్ష్యము.

రొట్టె. దే. వి.—పై.—

రొడ్డు. దే. వి. 1: చూ, రూ-రొండు; వా. 2. పులుపు, ఘల్లన. "చెల్లరొడ్డుగానున్నది"

రొడ్డుడు. దే. వి: చూ, రూ-రొండుడు.

రొద. నై. వి.=రుత. రూ-రొదాళము. 1. ధ్వని: చూ, స్వరము. 2; 2. కలకలధ్వని: చూ, స్వరము. 2.

రొదాళము. నై. వి.=రుత.—పై.—

రొదాళించు. నై. అ. క్రి. ధ్వనించు: చూ, శబ్దించు.

రొప్పు. దే. అ. క్రి. 1. కూయు: చూ, శబ్దించు; 2. (పులి) కూయు: చూ, శబ్దించు; స. క్రి. 3. కోపించు: చూ, రోషించు; 4. తఱుము: చూ, వెంబడించి పఱుగెత్తించు; 5. ఉచ్చాటనముచేయు.

రొమ్ము. నై. వి.=ఉర. రూ-అరొమ్ము. 1: చూ, వక్షము. 1; అం. 2: చూ, తాడితాంగములు; 3: చూ, నఖక్షతస్థానములు.

రొయి. దే. వి. 1. నింద: చూ, నెగ్గింపు; 2. రూ-రొయ్యి, రోఁతబూడిద, కట్టెనిప్పుమీఁదినిగుఱు: చూ, సిగరి. 1 (భస్మము.)

రొయ్య. దే. వి. చిఱుచేఁప: చూ, మత్స్యము. 1.

రొయ్యి. దే. వి: చూ, రూ-రోయి. 2.

రొల్లు. దే. వి. 1 ప్రలాపము: చూ, శబ్దము. 2; అ. క్రి 2: కలవరించు, పనవు, పలవించు, పలవు, పలుకు, పలవరించు-పల్వరించు. (సం).—ప్రలాపించు. ("చూ, శబ్దించు".)

రొష్టు(ష్టు). వా. వి.1. నిష్ఠురము; 2. అప్రతిష్ఠ.

## రో

రో. సం వి. ఐ. పుం. 1. ధనము: చూ, హిరణ్యము. 3; నై. వి. (1). రూ-రోయి. లంజెవల: చూ, శుల్కము. 3; (2) పందెము: చూ, వ్యవహారము 4; (3) కుదువ, తాకట్టు: చూ, వారకము (1); (4) ఎరవు, చేబదులు: చూ, వారకము (1); (5): చూ, విక్రయము; (6)=రై. ధనము: చూ, రో. 1; అవ్య. (7): చూ, రూ-రొ. 1; (8): చూ, రూ-రొ. 2.

రోంత. వా. వి. (రవ్వ + అంత) రూ-రవ్వంత. కొంచెము: చూ, స్వల్పము.

రోఁకటిబండ. దే. వి. 1. శతపది: చూ, సర్పము; 2. పొన్నులేనిపొట్టిరోఁకలి, బండ: చూ, రోఁకలి; 3. క్రోష్టుపుచ్ఛిక*: చూ, సింహపుచ్ఛి.

రోఁకటిలోఁదలఁదూర్చి రోఁకలిపోటులకు వెరువవచ్చునా? లో. కార్యశూరత్వమందు వెనుకంజవేయఁగూడదు. "ఉదా.— కాకున్నది కాకమానదు. రోఁటిలోఁదలఁదూర్చి రోఁకటిపోటునకు వెరుపఁదీరునా?" (నీతిచంద్రిక—మిత్రలాభము)

రోఁకలి. వై. వి.=గోకిల: (సం).—గోకిలము, పేళలము, ముషలము-ముసలము. తద్వి.— ౧ పొట్టిరోఁకలికి.—బండ, రోఁకటిబండ; ౨.బలరాముని రోఁకలికి:-(సం)సౌనందము. ("చూ, సౌనందము.")

రోఁకలితాల్పు. ద్వ. వి. బలరాముఁడు: చూ, హలాయుధుఁడు. 1.

రోఁకలిపోటు. వా. వి: దంపు-దంపుడు, కొట్నము. (సం).—అవహననము.

రోఁజు. దే. వి. 1: చూ, వగరుపు; వా. 2. రేఁబగలు: చూ, రూ— రోజు; అ.క్రి.3: చూ, వగరుచు.

రోఁజోడు. దే. వి.(రూ—రొంజోడు_రొండుడు-రొడ్డుడు—రొల్లుడు) ప్రలాపము: చూ, శబ్దము. 2.

రోఁత. దే. వి. 1. నింద: చూ, సెగ్గింపు; 2.(విణ). ఉల్లటము, ఏవ-ఏవము, ఎంబెటికము-ఎంబెటికి- ఎబ్బెరికము- ఎబ్బెటికము, ఎబెట్టు-ఎబ్బెట్టు, ఎటుబటికము, ఏవ—ఏవము, ఓకర, ఓకరింత, ఓకిలి-ఓకిలింత, కింకిరిపాటు, కికింకిరి, చీఁదఱ, నవ్వు, రోఁత, విసవు-విసుగు-విసుపు-విసువు. (సం. ప).— అనిష్టము, అప్రీతి, అసహ్యత, అసహ్యము, ఆనర్తము, ఋతీయ, ఏహ్యము, ఘృణ, జుగుప్స, హ్రిణీయ-హృణీయ-. తద్వి.— మిక్కిలిరోఁతకు.—ఛెబ్బెట్టు, ఏకు(వా)(యూక్కు)("చూ, హృణీయ.")

రోఁతకాఁడు. దే. వి: ఏవకాఁడు, రోఁతగొట్టు, రోసుబడి. (సం).—అసహ్యుఁడు.

రోఁతగొట్టు. వా. వి.—పై.—

రోఁతగించు. దే. అ. క్రి: చూ, రోఁతపడు.

రోఁతపడు. దే. అ. క్రి: ఈసరించు, ఏవగించు, ఏవపడు, ఓకరించు—ఓకలించు, గోరపడు, రోఁతగించు, రోయు. (సం).—అసహ్యపడు, అసహ్యించు. [వెలివాఁడు.

రోఁతలమారి. దే. విణ. నిందితుఁడు: చూ,

రోఁతిబూడిద. దే. వి: చూ, రొయి. 2.

రోక. దే వి. మూల: చూ, హరిత్తు. 1.

రోకము. సం. వి. అ. న. 1. ఓడ: చూ, హోడము; 2.=రుంకము ఛిద్రము: చూ, రంధ్రము. 1; 3. కదలిక: చూ, లోలము; పుం. 4. వెలుఁగు: చూ, వెలుతురు. 1; 5. రొక్కపమ్మకము: చూ, విక్రయము; 6.=రొక్కము. ధనము: చూ, హిరణ్యము. 3.

రోకు. దే. వి. లలి: చూ, నికాపము.

రోగము. సం. వి. అ. పుం. 1. (దీనిచేఁ దపింపఁజేయఁబడుదురు.): అంహతి, ఆతంకము, ఆమము, ఆమయము, ఆమోగము, ఉపతాపము, కాసువు, కిల్బిషము, క్షిడ్రము, గదము, గుడము, భంగము, రుక్కు—రుజ, రుగ్ణత, వికారము, వ్యాధి, స్పర్శము, హనువు. (అవ్య).—అతి, కచ్చిత్. (తె).—జబ్బు, తెగులు—తెవులు, నలఁక-నలఁకువ-నలి-నలుకువ, నొవ్వి-నొప్పి-నోవి-నోవు, సుస్తి, ("చూ, హనువు. 4."). తద్విశేషములు.— ౧. రోగవిశేషములు.—అక్కు; అతిమూత్రము; ఆమిషి; ఊరుస్తంభము, ఔదుంబరము; ఔపసర్గికము; కదరము; కురము; గదము;

గరము; గర్దభగదము; గుల్మము; ఛర్దువు; ధ; దుర్నామము; పక్షవాతము; పాకలము; పుష్కరము; ప్రదరము; మశకము; మహోదరము; లూత; విదారి; శర్కర; సికత; (తె).— ఎండుతెవులు; (తె).- ఎదురుకుత్తుక; (తె).—చీడ; (తె).—చెండు; (తె).—దొందము; (తె).—నత్తి. (తె).—మశిమిడి. ఇత్యాది; ౨: అంతర్వమి, అజీర్ణము, అజీర్తి, అనుబంధము, చపలతాశయము, వాయుగండము. (తె).—అఱకము, అఱగమి, అఱకువ-అఱుకువ, అఱ్ఱియము—అఱ్ఱము, ఉబ్బరము, ఉబ్బు, కడుపుబ్బు, పొంగరము, పొంగరింపు, పొంగు, మఱ్ఱె-మఱ్ఱెయ; ౩: ఆక్షేపకము, ఆధ్మాతము, ఆర్ధ్వపము, ఖల్లి; ౪: ఉత్పాదిక, ఉద్దేహిక, ఉపజిహ్వక, కంఠశాలుకము, గలశుండిక- గళశుండిక, గళాంకురము, ౬.వి, రోహిణి, వట. (తె).—అంగిటిముల్లు, అరిమి, కొండనాలుక, కోవ, చిఱునాలుక. (చూ, రసన 1.); ౫: ఉపతప్త, ఉపతాపము, ఖిద్యమానము, స్పర్శము, స్పృష్ట; ౬: ఉపదంశము. (తె)- కొఱుకు, కొఱుకుపుండు, సవాయి; (తె).- అడ్డకఱ్ఱ; పచ్చసెగ; సెక-సెగ; ౭: ఉచ్ఛ్వాసనిరోధనము. ఉచ్ఛ్వాసావరోధము, యాపకము. (తె).- ఊపిరికుట్టు, గురుకు; ౮: కందసంజ్ఞము, యోన్యర్శము; ౯: కాంతిదము, పిత్తము, పైత్తము, పైత్యము, మాయువు; ౧౦: కాశము—కాసము, క్షయథువు, క్షవథువు, క్షవకము, క్షయము, గదాగ్రణి, యక్ష్మము. (తె).— అఱుగుఁదెవులు-అఱువుఁదెవులు, ఉక్కిస, ఉబ్బరము, ఉబ్బసము, కక్కువాయి, దమ్ముటు, గస, డగ్గు-

డగ్గు, నవఁత. తద్వి.—(౧) (తె).—పొడిదగ్గు; (౨) రాజయక్ష్మము; ౧౧: క్షౌద్రమేహము, వర్షమేహము, మేహము. (తె).—చెలది, తెలుపు; ౧౨:గృధ్రసి. (తె).—కిరుదెస; ౧౩. గ్రహణికి:—అతిభేదము, అతిసారము, అన్నగంధ, ఆమము, ఉత్థానము, ఉదరామయము, గ్రహణి, పాచనము, ప్రవాహిక, రక్షు, సారణము. (తె).—నోము, పాచేగము, పారుడు, పాసనము, బంక, బేది. తద్వి.—(౧): నెత్తురుబంక; (౨): సీతభేది; ౧౪:సర్పి. (తె).—చేప్పి-రూ—సప్పి; ౧౫: (తె):—చెవ్వ, చెవ్వకాయలు; ౧౬: (తె):- చెలది-చెలిది-చెద్దీ;౧౭:జ్వరభేదములు —(౧): అభిఘాతము;(౨) ఆహికము.(తె).—పాళి, పొలి; (౩): అనుతాపము, ఓజోశనము. (తె):— గాలివేఁత; (౪) కూటపాకలము, పిత్తజ్వరము; (౫): కూటపూర్వము,త్రిదోషజము, పాకలము; (౬) జ్వరము, జూర్తి. (తె).— కాఁక-కాఁక, పులకరము, పులపరము, వెక్క, వెచ్చ, వేఁకి;(౭) (తె).- తాఁకుడు. ఇత్యాది; ౧౮: (తె).—తెగులుగొంటు-తెవులుగొంటు—తెవ్లుగొంటు; ౧౯. సజ్జనకు.— (చూ, శైత్యము. 1.); ౨౦. తెమడకు— (చూ, శ్లేష్మము.); ౨౧: మరిడీవ్యాధి, విషూచిక. (తె):—కలరా; ౨౨: మూర్ఛకు.(చూ, సొమ్మ.); ౨౩. జేన్నికి.— (చూ, సన్నిపాతము); ౨౪. కంటితెవులునకు.—(చూ, హర్షణము); ౨౫. కంతికి.- (చూ, దద్రువు.); ౨౬. పాండురోగమునకు..—పాండువు. (తె).— పాలుఁడు; ౨౭. వ్యాధినిర్ణయమునకు:—సముత్థానము; ౨౮. కుష్ఠువునకు.—(చూ, సితము. 1.); ౨౯. తలనొప్పికి.— (చూ, శిరోభారము);

౩౦. వాంతికి.-(చూ, వాంతి); ౩౧. మశూచక మునకు.-(చూ, స్ఫోటకము.); ౩౨. వెక్కిళ్ళకు.-(చూ, హిక్క. 1) ౩౩: లక్కతెవులు; ౩౪: అంకుతెవులు. ఇత్యాది. ("చూ, హనువు. 4.) 2. కుష్ఠౌషధము: చూ, మందు. 1-3.

రోగహారి. సం. వి. న్. పుం. 1. జోమ*: చిత్రకము, చిత్రకేతువు, జామ, జామి. (తె).: జేమి, జోము-జోమి; 2. బూడిదగుమ్మడి: చూ, సర్వతోభద్రి; విశే. 3: చూ, వైద్యుడు.

రోగి. సం. విశే. (న్. ఈ. న్.): చూ, వ్యాధితుడు. తద్వి.—అతిసారకి. ఇత్యాది.

రోచన. సం. వి. ఆ. స్త్రీ. 1. గోరోజనము, మంగళ్య, క్షితి: చూ, రాజావర్తము; 2. ఉత్తమస్త్రీ: చూ, స్త్రీ; 3. ఎఱ్ఱగలుగ*: చూ, సహస్రపత్రము.

రోచనము. సం. వి. అ. పుం. 1. కొండబూరుగు*: చూ, శాల్మలి. 2; విశే. 2. ప్రకాశించేనది: చూ, శుభ్రము. 5.

రోచని. సం. వి. ఈ. స్త్రీ. 1. రూ—రేచని. తెల్లతెగడ*: చూ, సర్వానుభూతి; 2: కంపిలము- కంపిల్లకము -కాంపిల్యము, కరంబము, కర్కశము, చంద్రము, జాతి, రక్తాంగము. (తె).—కంపిల్లము.* ((సం) రంజకము అని కొందఱు.)

రోచమానము. సం. వి. అ. పుం. 1. గుఱ్ఱపు మెడసుడి: చూ, హయము; అం. 2: చూ, ఆగంతుకములు. 653. పొరట.

రోచిష్ణువు. సం. విశే. (ఉ): చూ, విభ్రాట్టు

రోచిస్సు. సం. వి. స్. న. 1. సూర్యకిరణము: చూ, హాయనము. 2; 2. కాంతి: చూ, వెలుతురు. 1.

రోజా. వా. వి. 24 గంటల (60 గడియల) కాలము: ఓర, తారీఖు, తేది, దివి, నాడు, నిచ్చే, పూట, పొద్దు-ప్రొద్దు, రేబగలు-రేపగలు, రోజు (అని కొందఱు). (సం)- అహోరాత్రము, కల-కళ, కేరలి, దినము, దివసము, వాసరము, హోర. తద్వి.— ౧. ముప్పదికాష్ఠలకాలము, 580 ఱెప్పపాటులకాలమునకు:(సం).—కల-కళ; ౨. ప్రతి దినమునకు.— నాడునాడు, నానాడు. (సం).—అనుదినము, దినదినము, ప్రతిదినము, ప్రత్యహము; (చూ, వాసరము); ౩. పుణ్యదినమునకు.-(సం) పుణ్యాహము; (పగలుమన్నగువిశేషములకు "చూ, వాసరము." "చూ, హోర.1.")

రోటు. దే. వి: చూ, వక్రము. 1.

రోటుపోవు. దే. అ. క్రి: చూ, వంకరపోవు.

రోడ్డు. వా. వి. కంకరపోసినబాట "ట్రంకురోడ్డు": చూ, సృతి. 1. (మార్గము. 1.)

రోదనము. సం. వి. అ. న. 1· చూ, శోకము; 2: అశ్రము-అస్రము-అస్త్రము, అశ్రువు-అస్రువు, ఆరామశాకము, బాష్పము, నేత్రాంబువు. (తె).—కన్నీరు-కన్నునీరు, నీరు. ("చూ, సలిలము."); అం. 3: చూ, రతిధ్వనులు.

రోదము. సం. వి. అ. న. భూమ్యాకాశమధ్యము: రూ-రోదసి- రోదస్సు, ద్యావాపృథ్వులు. ద్యావాభూములు. (తె)—మన్నుమిన్ను. తద్వి.—రెండు దరులనడుమునకు:— పాత్రము, వంకము.

రోదసి. సం. వి. ఈ. స్త్రీ. 1. మన్ను: చూ, హరిప్రియ. 2 (భూమి. 1.); 2. మిన్ను: చూ, సురవర్త్మము; 3: చూ, రూ-రోదము.

రోదస్సు. సం. వి. స్. న: చూ, రూ—రోదము.

రోదించు. సం. అ. క్రి: చూ, శోకించు. 2.

రోధనుడు. సం. వి. అ. పుం. బుధుడు: చూ, రాహువు. 2.

రోధస్సు. సం. వి. స్. న: కచ్ఛము, కూలకము, కూలము, ఘట్టము, జ, తటము, తటి, తీరము, ప్రతీరము, త్రిపుటము, నితంబము, పాట

కము, ప్రాంతము, మర్యాద, వారణ, వేల, శంబలము. (తె. ప).-ఎడగడ్డ, ఒడ్డు, ఓర, కర, గట్టు, చెలియకట్ట-చెలియలికట్ట. చెల్లెలికట్ట, తట్టు, దరి, పొంత. తద్వి.—౧. సముద్రతీర మునకు.—కూలదిక్కు. (తె).-ఏనాసము; ౨. ఈవలావలిదరులకు.— పారావారము.

రోధించు. సం. స. క్రి. అడ్డగించు: చూ, సం రోధించు.•

రోన్న. వా.వి.(రవ్వ + అన్న) కాసిన్న, రోసిన్న.

రోధవక్ర. సం. వి. ఆ. స్త్రీ: చూ, నది.

రోపట్టు. దే. వి. రోయి: చూ, శుల్కము. 3.

రోపణము. సం. వి. అ. న. 1. మోపుట: అధి ష్ఠానము, ఆరోపణము, ఆరోపము, రోప ము, (అవ్య).—అతి; 2. పైరుచేయుట: రోపము.

రోపము. సం వి. అ. పుం. 1: చూ, బాణము. 1; 2: చూ, రోపణము. 1; 3: చూ, రోపణము 2.

రోబంటరి. వా. వి. అశ్వివపంది: చూ, సూకరము.

రోమంథము. సం. వి. అ. పుం. పశువులచర్విత చర్వణము: (తె).—నెమరు.

రోమగుత్సము. సం వి. అ. న. చామరము: చూ, సురటి.

రోమము. సం. వి. న్. న. రూ_లోమము. తనూపహము. ముఖము శిరముతక్కఁదక్క న దేహమునందుఁగల వెండ్రుక, బొచ్చు: చూ, వెండ్రుక; 2. శ్రుప్పుడు: చూ, ఉన్ని; అం. 3: చూ, దేహరోమము. 1—2.

రోమరాజి. సం. వి. ఈ. స్త్రీ: చూ, శిఖరిణి. 4.

రోమవిక్రియ. సం. వి. ఆ. స్త్రీ: చూ, రోమాంచము.

రోమశ. సం. వి. ఆ. స్త్రీ. తోఁటకూర*: చూ, మారిషము.

రోమశము. సం. వి. అ. పుం. 1. పంది: చూ, సూకరము; 2. గొఱ్ఱె: చూ, మేషము. 1; 3: ఆమలకీదళము, గోమేధికము. (తె)— ఆకుపత్రి, లవంగపత్రి; విణ. 4. వెండ్రుకలు గలది. [చూ, హారివాలుకము.

రోమశి. సం. వి. ఈ. • స్త్రీ. ములుదోస*:

రోమశుఁడు. సం. వి. అ. పుం. శరీరమునందు ఎలుఁగునకువలె నిడు వెండ్రుకలుగలవాఁడు.

రోమహర్షణము. సం. వి. అ. న. 1: చూ, రో మాంచము; పుం. 2. తాండ్రి*: చూ, సంవర్తము. 3.

రోమహర్షణుఁడు. సం. వి. అ. పుం. ఒక సూతుఁడు.

రోమాంచము. సం. వి. అ. పుం. (రోమములు గగ్గురుపాటుచేట): అవపుధారిక, ఆకసనము, ఉద్ధర్షితము, ఉన్నిద్రిసు, కంటకము, కూ పాంగము, ణ, త్వక్పుష్పము, త్వగంకురము, పులకము, పులకాంకురము, పులము, రోమ విక్రియ, రోమోద్భేదము. (తె. ప).—గగు రు-గగ్గురు, గగురుపు-గగుర్పు, గగురుపాటు- గగుర్పాటు, గగురుపొడుపు-గగుర్పొడుపు, గరు, గరుదాల్పు, గరుపాటు, గరుపాటు, నిడువెండ్రుక, పులకరము- పుల్కరము, పులకము-పుల్కము, పులకలు-పుల్కలు, పులు, మైమోజో. (చూ, సంధ్రిమము.)

రోమావళి. సం. వి. ఈ స్త్రీ. 1: చూ, రోమ రాజి; అం. 2. (నూగారు): చూ, స్త్రీలక్ష ణాంగములు. (బొడ్డులోనుండి ఱొమ్మునడు ములకు నడుమచీమల చాలువలెనున్న సుఖ వతియు భాగ్యవతియు నగును.)

రోయి. వై. వి. 1. నింద: చూ, సెగ్గింపు; 2: చూ, రూ-రో. (4); 3: చూ, రూ-రో. (5); 4: చూ, రూ-రో. (1); 5: చూ, రూ-రో. (2); 6: చూ, రూ-రో. (3)

రోయిని. వై. వి.=రోహిణి. బండిరిక్క: చూ, రిక్క.

రోయావి. దే. వి. ధనదానము: చూ, స్పర్శము. 3.

రోయు. దే. అ. క్రి: చూ, రోఁతపడు; స. క్రి. 2: చూ, వెదకు; 3. నిందించు: చూ, సెగ్గింపు; 4. విడుచు: చూ, విసర్జించు.

రోయుట. దే. వి: చూ, వెదకుట.

రోరవము. నై. వి.=రౌరవము. నరకము: చూ, సంహారకము. 2. (చూ, నరకములు).

రోలంబము. సం. వి. అ. పుం. రూ—లోలంబము. తుమ్మెద: చూ, షట్పదము.

రోలు. దే. వి. 1: చూ, రూ-ఱోలు; వా. స. క్రి. 2. కొట్టు; 3. విలపించు.

రోలుమ్రాను. దే. వి: చూ, ఱోలుమ్రాను.

రోవి. దే. వి. ఒకచెట్టు: చూ, వృక్షము.

రోవెల. ద్వ. వి. లంజెకు ఇచ్చెదనని ఒప్పుకొనినవెల: చూ, రోయి. 4.

రోవెలఁది. ద్వ. వి: చూ, వేశ్య.

రోషణుఁడు. సం. విశే: అతిఖి, అభిప్రేతుఁడు, అమర్షణుఁడు, ఆయస్తుఁడు, ఉచ్చండుఁడు, కుపితుఁడు, కృత్యుఁడు, కోపి, కోపితుఁడు, క్రుద్ధుఁడు, క్రూరుఁడు, క్రోధనుఁడు, క్రోధాయత్తుఁడు, క్రోధి, గాతువు, తామసి. (తె. ప).—అక్కసి, అక్కసుకాఁడు, కినుకకాఁడు, కోపకాఁడు, ముచ్చిరి. తద్వి.-అత్యంతకోపనుఁడు, క్రోధమూర్ఛితుఁడు, చండుఁడు (తె).-చిట్లకట్టియ. చిట్లకట్టియ-చిట్లుకట్టె-చెట్లకట్టియ-చెట్లకట్టె.

రోషము. సం. వి. అ. పుం. (దీనిచేత హింసింపఁబడును)= రోసము: రూ—రుష, అమర్షము, అనూయ, ఆగ్రహము, ఆవేగము, ఉత్క్రోశము, ఉత్సవము, కలుషము, కల్మషము, కోపము, క్రుధ, క్రోధము, క్లేశము, క్షిపుప్పము, గర్జనము, టంకము, త, తమిస్రము, ప్రతిఘము, భామము, మత్సరము, మన్యువు, రుట్టు, విప్రతీసారము. (అవ్య) —అయె, ఆ, ఈ, ఉ, ఏ, కచ్చిత్, హుం. (తె. ప).— అంకపొంకములు- అంకపొంకాలు- అంకాపొంకములు-అంకాపొంకాలు, అంగద, అంచేలము-అచ్చేలము, అక్కసు, అలక-అలుక-అలుకువ-అల్క, ఆకరము, ఈరస-ఈరసము, ఈసు, కసరు, కనలు, కరకరి, కలుచే, కసరు-కసురు, కసి, కాంతాళము-కాతాళము, కాఁక-క్రాఁక, కింక-కింకిరి, కింకిరిపాటు, కినుక-కిన్క—కినుకము, కినుపు, గంటు, గుబ్బు, గొడ్డ, గొద, చిందఱ, చిందు, చిటచిట, చిటపాట, చిడిముడి, చిరాకు, చిఱ్ఱుచిఱ్ఱు, చెరచెర, జిద్దు, తుకతుక, నేవ, పిసాళము, పుస్సు, పెలుచేన-పెల్చు-పెల్చన, ప్రిల్లఁదనము, ప్రిల్లదము, పైడాలము, బయిడాలము-బైడాలము, మంట, రోసము, విడి, సిడిముడి, సీసము, హూక్కుస్సు. తద్విశేషములు.—౧. (తె).—ముంగోపము-ముక్కోపము; ౨: ఉత్క్రోశము, ప్రణయకోపము. (తె).-ఉక్కుగోసము, ఉఱ్ఱిగోసము, నెయ్యపుటలుక, పొలయలుక-పొలయలుక్క, నవరస; ౩: (తె).—చిఱచిఱ; ౪. కోపభేదమునను. — (అవ్య). ౫; ౬ కోపభావమునను:-కుంతెము; ౭ బ్రహ్మకోపమునను.—కకోపము; ౮. స్త్రీలకు పురుషులయెడఁగల కోపమునను.—మానము; ౯ కిఁ. కోపము నొందినది అనుటను.— ఆయస్తము, ఉచ్చండము, మత్సరము; అం. 2. చూ, సంచారీభావములు. ("తగుమాగు మెక్కుడిఁబోయెదవు. మేము రామభటులమని గొనుఉండగవో! ఈపరుగు యమపురంబునకే జోవిరా.")

రోషించు. సం. అ. క్రి: ఆగ్రహించు, కోపించు, క్రోధించు, గర్జించు. (తె).—అచ్చెలించు, అలుగు-అల్గు-అలువు, ఈరసించు, ఈసడించు, ఎఱ్ఱగొను, ఎఱ్ఱవాఱు, కటకటఁబడు, కనలు, కనారిలు, కసరు-కసురు, కాఁగు-క్రాఁగు, కింకిరిపడు, కినియు, కినుకపడు-కిన్వడు, కెరలు, కొఱకొఱలాడు, కోపగించు, కోపగిల్లు, గాసిలు-గాసిల్లు, చిటులు-చిట్లు, తివురు,

పదరు, పనుకు, పిసాళించే, రొప్పు, రోసించే. (స. క్రి). — కసరు, కోపగిల్లు.

రోసము. వై. వి.=రోషు: చూ, రోషము.

రోసించే. వై. అ. క్రి: చూ, రోషించే.

రోసిన్ని. వా అపే. సుంత. (కాసిన్నివంటిది.)

రోసుబడి. దే. విణ. రోఁతగొట్టు: చూ, రోఁతకాఁడు.

రోహణము. సం. వి. అ. న. 1. ఎక్కుట: చూ, ప్రాఁకుడు. 1; పుం. 2. ఒకకొండ: చూ, హిమాలయము (పర్వతము.)

రోహము. సం. వి. అ. పుం. 1: చూ, రోహణము. 1; 2. మొలక: చూ, మొక్క. 1.

రోహి. సం. వి. ఇ. న్. పుం. 1. మఱ్ఱి*: చూ, వటము. 3; 2: దాడిమపుష్పము, ప్లీహశత్రువు, రోహితకము-రోహితము. (తె).— ములుమోదుగు *; 3: చూ, రావి. *.

రోహిణము. సం. వి. అ. పుం. బాడిదము*: చూ, నారిదము. (1).

రోహిణి. సం. వి. ఈ. స్త్రీ. 1.=రోయిని. బండిరిక్క: చూ, రిక్క; 2. అంగిటిముల్లు: చూ, రోగము. 1—ర; 3. ఆవు: చూ, ధేనువు; 4. తొమ్మిదేండ్లకన్యక, గౌరి (చూ, యౌవనభేదములు); 5. బలరాముని తల్లి: చూ, సవతి. 1; 6. రూ-కటుకరోహిణి*: చూ, శకులాదని. 1; 7 తెల్లచేండ్రి*: చూ, వెలిచేండ్రి; అం. 8: చూ, ఘ్రితులు.

రోహిణీద్వయము. అం: కటుకరోహిణి, పీతరోహిణి *.(2) [చూ, హిమాంశువు.

రోహిణీశుఁడు. సం. వి. అ. పుం. చంద్రుఁడు:

రోహితకము. సం. వి. అ. పుం. 1: చూ, రోహి. 2.*; 2. కెంపు: చూ, రత్నములు.

రోహితము. సం. వి. అ. న. 1. చేక్కనియింద్రధనుస్సు: చూ, బాణము. 1; 2, కుంకుమపువ్వు: చూ, వహ్నిశిఖము; 3. నెత్తురు: చూ, రక్తము. 1; పుం. 4. ఎఱుపు: చూ, వర్ణము. 6; 5. ఎఱ్ఱచేఁప: చూ, మత్స్యము. 1; 6. కేసరిమృగము: చూ, సింహము; 7 ములుమోదుగు*: చూ, రోహి. 2; విణ. 8. ఎఱుపుఁగలది. చూ, వర్ణము. 6.



రోహితాశ్వుఁడు. సం వి. అ. పుం: చూ, రూ-రోహితాశ్వుఁడు. 2. (వాడుక).

రోహితాశ్వుఁడు. సం. వి. అ. పుం. 1. అగ్ని: చూ, వహ్ని. 1; వా. 2 హరిశ్చంద్రునికొమారుఁడు: రూ-లోహితాశ్వుఁడు-రోహితాశ్వుఁడు.

రోహిషము సం. వి. అ. పుం. రూ-రౌహిషము. కొండగొఱ్ఱె (రోహిషము దకారాది గాకొంటలు): చూ, హుడువు (మేషము. 1.)

## రౌ

రౌంధము. సం వి. అ. న. రుంజయనువాద్యము, రుంజ: చూ, వీణె.

రౌచికుఁడు. అం. మృదుమనుగముగఁగవితరచించువాఁడు: చూ, కృతికర్త.

రౌత. వై. వి = రాహుత్త: చూ, రూ-రవుతు. (రవుతు అను పదముకడ (అ. క్రి) కొట్టివేసి 'వి' అనివ్రాయుము.)

రౌతు. వై. వి.=—వై.—

రౌద్రము. సం వి. అ. పుం. 1. ఎండ: చూ, వెలుఁగు. 3; 2. దినముయొక్క మొదటి భాగము: చూ, వాసరము. (చూ, దినభాగములు); విణ. 3 భయంకరము: చూ, రౌరవము. 2; 4. తీక్ష్ణము: చూ, వేఁడిమి. 2; అం. 5: చూ, రసములు—రసదృష్టులు; 6: చూ, తానములు. 3 (రా—ఫ—హీనతానములు.) [శ్రుతులు.

రౌద్రి. అం. 1: చూ, సంవత్సరములు; 2: చూ,

రౌను. వా. వి. 1. గుంపరిన; 2. పరియాణము.

రౌప్యకము. సం. వి. అ. పుం. తగరము: చూ, లోహము. 1 [ము. 1-2-3.

రౌప్యము. సం. వి. అ. న: చూ. రూ-రూప్య

రౌమకము. సం. వి. అ. న. సంభరిదేశమునరుమ యనెడు గనియందుఁ బుట్టినయుప్పు: చూ, లవణము. 1.

రౌరవము. సం. వి. అ. పుం. 1.=రౌరవము, బిడ్డ: చూ, నరకములు; విశే. 2: ఆభీలము, ఉగ్రము, ఉదగ్రము, క్రూరగము, భయంకరము, భీకరము, రౌద్రము, భేరుండము. (తె).—అంకపొంకములు-అంకపొంకాలు-అంకాపొంకములు-అంకాపొంకాలు, ఒక్కుఱు, చెడగరము, చెడుగు, ప్రామిడి. తద్వి.—౧. రౌద్రరసమునకు.—ఉగ్రము, రౌద్రము; ౨. భయానకరసమునకు.—ఘోరము, దారుణము, ప్రతిభయము, భయంకరము, భయానకము, భీషణము, భీష్మము, భైరవము: చూ, రసములు; 3. భయంకరత్వమునకు.—(తె).—గోరగింత; ౪. భయమునొందినది అనుటకు.—(చూ, సాధ్వసము.); ౫. భయమునకు.—(చూ, సాధ్వసము.); అం. 3: చూ, ఆగమములు (చూ, ఉపవిద్యలు 416 పుట.)

రౌలు. దే. అ. క్రి: ఘూ-గగులు-గవులు, రాఁజు, అంటుకొను, తగులుకొను-తవులుకొను-తొలుకొను.(చూ, వెలుఁగు. 5.)

రౌలుకోలు. దే. వి: చూ, రూ-రవులుకోలు.

రౌలుచే. దే. క్రి: చూ, రూ-రవులుచే.

రౌహిణేయము. సం. వి. అ. పుం. 1. దినము యొక్క తొమ్మిదవభాగము: చూ, వాసరము (చూ, దినభాగములు); విశే. 2. ఆవునకుఁబుట్టినది (దూడ): చూ, సౌరభేయి (ధేనువు).

రౌహిణేయుఁడు. సం. వి. అ. పుం. 1. బలరాముఁడు: చూ, హలాయుధుఁడు. 1; 2. బుధుఁడు: చూ, రాహువు. ౨.

రౌహిషము. సం. వి. అ. న. కామంచి* (గొడుగుగడ్డి అనికొంగఱు): చూ, తృణము. 1; పుం. 2. కొండగొఱ్ఱె: చూ, రూ-రోహిషము.

# ఱ

ఱ. ౬౭కయక్షరము. (శకటరేఫము, బండిరేఫము) (౧. ద్విత్వముతోఁ గూడుకొనిన వర్ణియును వాని రూపాంతరములును శకటరేఫములే. ఉదా.—మిఱ్ఱు-మిఱుత, కొఱ్ఱు-కొఱుత, వఱ్ఱు-వఱుత, మొఱ్ఱు-మొఱ, అఱ్ఱు-అఱుత, చిఱ్ఱు-చిఱచిఱ, తొఱ్ఱ-తొఱట, బొఱ్ఱె-బొఱియ, పఱ్ఱె-పఱియ, మొఱ్ఱో-మొఱట, చేఱ్ఱు-చేఱచేఱు, కఱ్ఱు, కఱుకోల, ముఱ్ఱు-ముఱుగు, కుఱ్ఱ-కుఱుచెండ్రికలు, పఱ్ఱ-పఱకట, ఎఱ్ఱ-ఎఱుపు, గుఱ్ఱు-గుఱక, చొఱ్ఱ-చొఱచే, చిఱ్ఱెకూర—చిఱుతలబొడ్డుతీఁగ, అఱ్ఱు—అఱుగు, జేఱ్ఱు-జేఱజేఱ, పఱ్ఱు-పఱపఱ, బిఱ్ఱు-బిఱబిఱ, జొఱ్ఱు-జొఱజొఱ, గొఱ్ఱు—గొఱగొఱ, గుఱ్ఱు-గుఱగుఱ, జిఱ్ఱు-జిఱజిఱ, పుఱ్ఱె-పుఱియ, గొఱ్ఱె-గొఱియ, కఱ్ఱె—కఱియ, పఱ్ఱె-పఱియ, గిఱ్ఱు-గిఱగిఱ, కఱ్ఱు-కఱకఱ, గఱ్ఱు-గఱగఱ, ఎఱ్ఱు-ఎఱఎఱ, తఱ్ఱు-తఱతఱ, తుఱ్ఱు-తుఱతుఱ, బఱ్ఱు-బఱబఱ, బుఱ్ఱు-బుఱబుఱ, కిఱ్ఱు-కిఱకిఱ, మఱ్ఱి, ఇఱ్ఱి, జెఱ్ఱి, బఱ్ఱె, జొఱ్ఱ, నెఱ్ఱె, పఱ్ఱ, గుఱ్ఱలు, తొఱ్ఱపళ్లు, విఱ్ఱవీఁగి, జఱ్ఱునజాఱి, పఱ్ఱునఁబాఱి, చిఱ్ఱునఁజీఱి, నిఱ్ఱునీలిగి, ఉఱ్ఱంక, పుఱ్ఱె, కుఱ్ఱ, కఱ్ఱ, బూఱ్ఱ, బుఱ్ఱ, తిఱ్ఱె, తొఱ్ఱ, ఉఱ్ఱూటలు మొ; ౨. ఏవిఅన్యవర్ణములతో సంయుక్తములై యుండునో యవి రేఫములుగాని శకటరేఫములుకావు. ఉదా.—తనర్చె, పొనర్చె,

ఒనర్చి మొ; 2.శకటములుసంయుక్తములు కావు. ఉదా.—అఱచె, అఱిమి, అన్నుఱిగ, క్రిక్కిఱిసె, ఉఱికె,ఉఱిమె, ఎఱిగ, ఎఱగె, ఒఱగె, ఒఱలె, ఒఱసె, కఱచె, కెఱిపె, కొఱలె, కొఱికె, గొఱిగ, చేఱచె, చిఱిగ, చెఱచె, జఱిగ మొ;ర.అను,ఉను, ఉపు అంతమందుఁగల శబ్దములు శకటరేఫములు. ఉదా.—కొఱడు, కఱడు, పెఱడు, బెఱడు, ఒఱడు, మొఱడు,నఱుము,నుఱుము, ఉఱుము, మెఱుము, కఱుపు, చేఱుపు, వఱుపు, మఱుపు, ఒఱుపు, చెఱుపు,పఱుపు, మఱుపు, విఱుపు, నెఱుపు, అఱుపు, పలువుఱు, మఱు, పోఱడు, పోఱి మొ.) (ఉపన్యాసదర్పణము)

అంకాట. ద్వ. వి. 1: చూ, వ్యభిచారము. 2; వా. 2. ఒకరకము సీట్లాట.

అంకాడు. ద్వ. అ. క్రి: చూ, వ్యభిచరించు. 2.

అంకియ. దే. వి. రూ—అంకె-రంకె. అఱపు, ఎద్దుఅఱపు: చూ, స్వరము 2.

అంకు. నై. వి.=రంకు. 1: చూ, అంకాట. 1; వా. 2. తంటా. "అంకుతెచ్చిపెట్టితివి."

అంకుఁబోతు. ద్వ. వి. 1: చూ, విటుఁడు; 2: చూ, అంకులాఁడి.

అంకుటాలు. ద్వ వి (రూ—రంకుటాలి-రంకులాఁడి-అంకులాఁడి-అంకుఁబోతు—అంకెత) చూ, అంకులాఁడి.

అంకుతెవులు. ద్వ. వి. మేహరోగము: చూ, [రోగము.1.

అంకుమగఁడు. ద్వ. వి: చూ, విటుఁడు.

అంకులరాట్నము. నై.వి. బాలురెక్కుడు వలయాకారపుయంత్రము: చక్రిపోల.

అంకులాఁడి.ద్వ వి. రూ-రంకులాఁడి: చూ, స్వై [రిణి.

అంకులాఁడికొడుకు. ద్వ. వి; (సం).—అసతీసుతుఁడు,కొలటినేయుఁడు-కొలటేయుఁడు-కొలటేరుఁడు, బాంధకినేయుఁడు: చూ, సూనుఁడు. 1.

అంకిపోవు. ద్వ. అ. క్రి: చూ, అంకాడు.

అంకె. దే. వి. రూ-రంకె. 1. వృషభధ్వని: చూ, రూ-అంకియ; 2. ధ్వని: చూ, స్వనము. 2; 3. కేక: చూ, స్వరము. 2.

అంకెత. ద్వ. వి. రూ—రంకెత: చూ, అంకులాఁడి.

అంకెలిడుమెకము. ద్వ. వి. అచ్చొత్తెద్దు: చూ, [వృషభము. 1.

అండ. వా. వి. ముండ, లంజె: చూ, అంకెత.

అంతిలు. దే. అ. క్రి. రూ-అంతిల్లు.కలకల ధ్వనిచేయు: చూ, శబ్దించు.

అంతిల్లు. దే. అ. క్రి.—పై —

అంతు. దే. వి. 1. కలకలధ్వని. వసు. 2, ఆ. 142: చూ, స్వనము. 2; 2. రూ-అంపు-అంపె. అతిదారుణధ్వని. ఆం,భా. ప్ర.121: చూ, స్వరము. 2, 3: చూ, సంబరము; 4.=రతికేళి: చూ,రూ—రంతు. 4.

అంతె. దే. వి: చూ, అంతు. 2.

అంపకాఁడు. దే. వి. (అంపము + కాఁడు) అంపముతో పలకలులోనగునవి కోయువాఁడు: రూ-రంపకాఁడు-అంపకారి.

అంపకారి. వా. వి.—పై.—

అంపము. దే వి: రూ-రంపము. కరిగసము. (సం).—కదరము, క్రకచము. తద్వి.—తరఁగంపియ-తరగంపె.

అంపియ. దే. వి: చూ, రూ-అంపె.

అంపిలు. దే. అ. క్రి. రూ-అంపిల్లు. 1: చూ, వ్యాపించు; 2: చూ, పరిల్లు; 3: చూ,విజృంభించు; 4: చూ, సందడించు; వా. 5. కూయు.ఆం, భా. త్రి. 111: చూ,శబ్దించు.

అంపిల్లు. దే. అ. క్రి.—పై —(వ్యాపించుటకు.—అచ్చ. సుం, కాం. 3.)

అంపు దే. వి 1: చూ, అంతు. 2. ఆం, భా. ప్ర.121;2.అనుగుడు .ఆం, భా. ద్వి. 223: చూ,సమ్మర్దము; 3 (దూడలులోనగువానికిని, బాలారిష్టదోషము కలిగిన చేంటిబిడ్డలకును

నూదులంగాల్చి వేయు)ఱచ్చే: ఱచ్చే (చేఱ
క.). (సం).—రక్ష; 4. కలకలము: చూ,
స్వరము. 2.

ఱంపె. దే. వి. (రూ-ఱంపియ-రంపియ-రంపె.) 1. మాదిగవాఁడు తోలుకోసెడు సాధనము; 2. తాటాకులు మట్టగించి కోసెడు సాధనము; వా. 3: చూ, ఱంపు. 1.

ఱక్కు. దే. వి. 1. గీఱు, గీటు. రాజ. 2, ఆ. 116: చూ, రేఖ. 3; స. క్రి. 2: గివులు-గీఱు, గోఁకు, చీఱు, జీరు, బరకు-బరుకు-బఱకు-బఱుకు, బఱటు, మక్కు.

ఱచ్చే. వై. వి.=రక్ష: చూ, ఱంపు. 3.

ఱట్టడి. దే. వి. 1. దూఱు: చూ, సెగ్గింపు; విశ. 2: చూ, రూ—రట్టడి. 1; 3: చూ, రూ—రట్టడి. 2; వై. వి. 4: చూ, రూ—రట్టడి. 3. [హరి 5, ఆ. 117.)

ఱట్టు. దే. వి —పై.—(దూఱునకు.—ఉ,

ఱప్ప. దే. వి. చిన్నఱాయి: చూ, రత్నములు. ౧౨-(౫)

ఱయిక. దే. వి. కంచెల. (రూ-రయిక-రైక-ఱైక-రవిక-ఱవిక:) చూ, వస్త్రము.

ఱస. దే. వి. 1. వజ్రము: చూ, రత్నములు; 2. దూగర, తప్పుడుకలసినచిట్టు: చూ, శంబూకము. 3. [58: చూ, రోషము.

ఱవఱవ. దే. వి. చిఱచిఱ. అచ్చ. సుం, కాం.

ఱవటి. దే. వి: చూ, రూ-రవడి.

ఱవళి. దే. వి.—పై.—

ఱవిక. దే. వి: చూ, రూ—ఱయిక.

ఱవ్వ. దే. వి. నింద: చూ, సెగ్గింపు.

ఱవ్వాడు. దే. స. క్రి. నిందించు: చూ, సెగ్గించు.

## ఱా

ఱా. దే. వి. 1. ఱాయిశబ్దమునకు వృత్తియందు మీఁదివర్ణము లోపింపఁగామిగిలినరూపము. "ఱాపువ్వు" వెం; 2. రూ-ఱాయి—అప్ప—రా: చూ, రూ-ఱప్ప.

ఱాఁగ. వై. వి.1.ధూర్తస్త్రీ: చూ, స్త్రీ; 2. ధూర్తుఁడు: చూ, వ్యాధుఁడు. 2; 3 ఉద్ధతుఁడు: చూ, 'పోఁగంబుఁడు. 2; 4.=లంజ. జారిణి. సా. 2, ఆ. 84: చూ, స్వైరిణి. [తృణము. 1.

ఱాఁగతుంగ. ద్వ. వి. భద్రముస్తకము*: చూ,

ఱాకట్టు. ద్వ. వి. 1. రత్నస్థాపనము; 2: ఱాతికట్టు.

ఱాచు. దే. స. క్రి 1. రాపుడుచేయు: చెఱుము; అ. క్రి. 2. రూ-రాచు: చూ, రుద్దు.

ఱాతియుప్పు. దే. వి: చూ, రూ-రాతియుప్పు.

ఱాతికట్టు. వా. వి: చూ, ఱాకట్టు. 2

ఱాతిగానుగ. దే. వి: కలుగానుగ. (చూ, పరంజము. 1.)

ఱాతిగుండె. దే. వి. (ఱాయి + గుండె) కఠిన హృదయము: చూ, హృదయము. 2.

ఱాతినార. దే. వి.(ఱాయి + నార)ఱాతిపాఁచి: చూ, వృక్షము.

ఱాతిపనివాఁడు. దే. వి: కాసియ-కాసె-కాసీఁడు, కాసెవాఁడు, గ్రావకారుఁడు. (సం. ప).—కుట్టుఁడు-కూటుఁడు, పాషాణదారకుఁడు, శిలాకుట్టకుఁడు. ("చూ, శిలాకుట్టకుఁడు.")

ఱాతిపాఁచి. ద్వ. వి. (ఱాయి + పాఁచి) ఱాతినార: చూ, వృక్షము. [శైలేయము.

ఱాతిపూవు. ద్వ. వి. రూ-రాపువ్వు*: చూ,

ఱాతిబదనిక. దే. వి.శిలయందు:బుట్టినబదనిక*: చూ, వృక్షాదని. [లి:చూ, వృక్షాదనము. 1.

ఱాతియులి. ద్వ. వి. (ఱాయి+ఉలి) కాసెయు

ఱాతివాలు. ద్వ. వి. (ఱాయి + వాలు) వజ్రాయుధము. అచ్చ. యు, కాం. 457: చూ, బాణము. 1-౭౨.

ఱాపిడి. వా. వి. (రూ-రాపిడి-రాయిడి-రారా

పిడి-రారాపు-ఱాపు-ఱాయిడి.) అగుసుడు: చూ, సమ్మర్దము.

ఱాపు. వా. వి.—పై.—

ఱాపువ్వు. ద్వ. వి: చూ, రూ-ఱాతిపూవు.

ఱాయి. దే. వి రూ-రాయి. శిల: చూ, రత్నములు. ౧౨—(౫)

ఱాళ్లపన్ను. వా. వి: చూ. ఔపలము. 3.

## ఱి

ఱింగు. దే. వి. 1: చూ, రూ-ఱింగు. 1; వా. 2: చూ, రూ-ఱింగు. 4.

ఱికము. దే. అప. రూ-ఱికము.తనము.భావమునందువచ్చెడుప్రత్యయము. "పేదఱికము".

ఱిక్క. దే. వి. పశువులఁదోలునప్పుడు నాలుకను అంగిట నొక్కఁగావచ్చెడుధ్వని: చూ, స్వరము. 2.

ఱిక్కించు. దే. స. క్రి: నిక్కించు, బిక్కిరించు. (నై. 2, ఆ. 5)

ఱిచ్చ. వై. వి.=రిక్త. (దే. అని శ. ర) నిశ్చేష్టత: చూ, వెఱవెఱపాటు.

ఱిచ్చవడు. ద్వ. అ. క్రి: చూ, వెఱఁగుపడు. పర. 3, ఆ. 115.

ఱిచ్చవాటు. ద్వ. వి. ఱిచ్చవడుట. [కాం. 5.

ఱిప్పు. దే. వి: చూ, రూ-ఱివ్వు. అచ్చ. ఆర,

ఱిమ్ము. దే. స. క్రి. 1. చిమ్మనఁగ్రోపితో జలాదికముఁజిమ్ము; 2. వేయు: చూ, విసరు. 8.

ఱివ్వు. దే. వి. (రూ-ఱివ్వు-ఱిప్పు) 1. ఎగయుటయందగు ధ్వన్యనుకరణము. వసు. 4, ఆ. 59: చూ, హూహూ; 2. పక్షి ఱెక్కలచేప్పుడు: చూ, స్వరము. 2.

ఱివ్వన. దే. క్రి. ఝుడిత్యర్థకము: చూ, స్యదము.

## ఱు

ఱు. దే. అప. ఒకానొక బహువచన ప్రత్యయము. "ఉదా.—విలుకాఱు, వేఁటకాఱు.

ఱువ్వు. దే. స. క్రి: చూ, ఱువ్వు. 3.

ఱువ్వపులుఁగు. దే. వి: చూ, రూ-ఱువ్వపులుఁగు.

ఱువ్వు. దే. వి. 1. ఱెక్కలగాలిచేప్పుడు: చూ, స్వరము. 2; 2. వీచుటయందగు ధ్వన్యనుకరణము: చూ, హూహూ; స. క్రి. 3. రూ-ఱూవు. గిరాటువేయు: చూ, నైచు. 1.

## ఱూ

ఱూవు. దే. స. క్రి: చూ, రూ-ఱువ్వు 3.

## ఱె

ఱెక్క. దే. వి. 1. రూ-ఱెక్క-ఱేకు-ఱేకు. ఈఁక-ఈఁకె, ఎఱక, గఱి, గోటాపన, చేట్టుప-చెట్టుప, డాక, నెఱి, లాఁక. (సం. ప).—గరుత్తు, తూలి, తూలిక, పక్షము, పతత్త్రము, పత్త్రము. తద్విశేషములు.—౧. కొంగతల యీఁకకు.—కలికి; ౨. పక్షి ఱెక్కకు.—(సం) తనురుహము-తనూరుహము; 3. బాణము ఱెక్కకు.—గఱి; 2: ఱెక్క మొదలు, లవిటి, లావు. (సం. ప).—పక్షతి; 3. రూ-ఱెట్ట. ప్రక్క: చూ, సూరెలు (పార్శ్వము. 2.)

ఱెక్కచాపు. దే. వి. కొన్నిమూరలుగల ఱేకు: చూ, బారచాపు.

ఱెక్కపాయలు. దే. వి బ: చూ, ధాన్యము.

ఱెక్కమొదలు. వా. వి: చూ, ఱెక్క. 2.

ఱెట్ట. వా. వి: చూ, ఱెక్క. 3.

ఱెప్ప. దే వి. రూ-ఱెప్ప, కందెఱ, కనుపొట్ట, కను ఱెప్ప. (సం).—రశ్మి. తద్వి.—తొంగలి ఱెప్ప. (సం).— ఘనపక్ష్మము.

ఱెప్పపాటు. ద్వ. వి. 1: చూ, నిముసము; వా. 2: చూ, సెకను. (నిమిషము=60 సెకనులు)

ఱెప్పవేయని మెప్పు కేళాకూళి. ద్వ. వి. దేవగంగ. వేం, ఆం. 17: చూ, నది.

ఱెమ్మ. వా. వి. రూ-రెంబ. ఉపశాఖ: చూ, శాఖ. 1.

ఱెల్లు. దే. వి. రూ-రెల్లు. 1. శరము*: చూ, తృణము. 1; 2.కసపుపులు*: చూ, తృణము. 1.

ఱెల్లుమోలి. దే. వి. శరజన్ముఁడు, కుమారస్వామి: చూ, స్కందుఁడు.

ఱెల్లుదీవి. ద్వి. వి. కుశద్వీపము: చూ, లంక. (1).

## ఱే

ఱే. వా. వి. రూ-ఱేఁడు: చూ, రాజు 1.

ఱేఁగు. దే. వి: చూ, రూ-రేఁగు *.

ఱేఁగుపండు. దే వి: చూ, రూ-రేఁగుపండు.

ఱేఁచె. దే.వి. రూ-రేఁచె. రేసు. ఒకకుక్క! "ఱేఁచెంతె మొఱుగుచున్నాఁడు": చూ, శునకము.

ఱేఁడు. [సై. వి.=రాట్. (దే. అని శ. ర) 1. భర్త: చూ, సామి 2; 2. దొర, [అధిపతి: చూ, స్వామి. 1.

ఱేస. దే. వి: చూ, రూ-రేస. (పుష్పవిశేషము నకు.—సై. 6, ఆ. 22)

ఱేసుమడఁచేట. జా. కొట్టుట, అణఁగఁద్రొక్కుట. "వానితం డ్రెదురముం దెదిర్చినను ఱేసుమడంతును మాటలేటికిన్." (విజయవిలాసము.)

ఱేపు. దే. వి: చూ, రూ-రేపు. 1—2.

ఱేయి. దే. అ. క్రి. 1: చూ, సందడించు; 2 చూ, విజృంభించు.

ఱేల. దే. వి: చూ, సువర్ణకము*. (ఱేలచిగురు సుఖవిరేచనము చేయును.)

## ఱై

ఱైక. దే. వి: చూ, రూ-రైక.

## ఱొ

ఱొచ్చె. దే. వి. 1. సందడి: చూ, స్వరము. 2; 2: చూ, హేళనము; 3: చూ, రూ-రొచ్చె. 2; 4: చూ, సిగ్గింపు; వా 5: చూ, రొచ్చె. 5. [సవ్యము. 1.

ఱొడ్డ దే.విశే. ఎడమ. "ఱొడ్డచేయి": చూ,

ఱొడ్డు. దే. విశే. అధికము: చూ, హేరాళము.

ఱొమ్ము. సై. వి.=ఉరస్. రూ-రొమ్ము. అచ్చ. కిష్కిం, కాం. 46: చూ, వక్షము.

ఱొమ్మునొప్పి. ద్వ. వి: చూ, ఉరోబాధ.

## ఱో

ఱోఁత. వా. వి. నింద: చూ, రూ-రోఁత.

ఱోయి. వా. వి.—పై.—

ఱోలగుంట. వా. వి: చూ, రూ-ఱోలుగుంట.

ఱోలు. దే. వి. రూ-రోలు 1. ఉలూఖలము: చూ, స్థూలోచ్చయము. 1; అ. క్రి. 2: చూ, విలపించు; వా. 3. కొట్టు.

ఱోలుగుంట. దే. వి: రూ-ఱోలగుంట, కుందెన.

ఱోలుమ్రాను. దే. వి: రూ-రోలుమ్రాను, ఉతక-ఉతుక-ఉదక.

## ల

ల. ఒకయక్షరము. దే. అవ. 1. ద్వితీయాబహువచనమునందు వచ్చెడు ప్రత్యయము. "ఉదా.— రాములన్, వనితలన్, వనములన్.; 2. తృతీయాదిబహువచనము పరమగుచుండఁగా వచ్చెడు ఆగమము. "ఉదా.— రాములచేతన్. వనితలకొఱకున్, వనములకున్ మొ; అం 3: చూ, అంతస్థములు (చూ, లఘువులు); 4: చూ, దంత్యములు.

లంక. సం. వి. ఆ. స్త్రీ. 1 =లంక. నీటి నడిమి దిబ్బ: అంతరీపము, ద్వీపము, శల్మలి-

శాల్మలి.(తె).—గడ్డ, దీవి, నడిమిదిన్నె-నడు దిన్నె, నెట్టెము, లంక. తద్విశేషములు(చూ, ద్వీపములు.)-౧: జంబువు, కుమారి; ౨: ప్లక్షము.(తె) జొవ్విదీవి; ౩: కుశము. (తె) తెల్లుదీవి; ౪: క్రౌంచము. (తె) కొంచెదీవి. ౫: శాకము. (తె) టేంకుదీవి; ౬: శల్మలి-శాల్మలి; ౭: పుష్కరము. (తె) తమ్మిదీవి; ౮: మఘము; ౯: కటాహము; ౧౦: శ్వేతద్వీపము, శ్వేతము. (తె) తెల్లదీవి. ("చూ, శ్వేతద్వీపము. 2."); 2. రావణుని పట్టణము: చూ, సీమ (1) (దేశములు); 3. ఒకానొక రాక్షసి: చూ, సోఁకుడు (రాక్షసి. 1.); 4.=అాఁగ: చూ, అంకులాఁడి; 5.=లంకలు. కలాయము: చూ, సెనగలు; 6 =లంకె. లంగ. రెండు పసులఁ గలిపికట్టుట: చూ, లంగ. 2; దే.వి (1).=లంకా. దీవి: చూ, లంక. 1; (2). కంచియ: చూ, వివీతము; (3). తలవాకిటి ప్రక్కగది, ఉలంకు: చూ, సదనము. 1; వా. (4). పొగాకు పైరి లోనగునవి పండెడు భూమి: చూ, హరిప్రియ. 2 (భూమి. 1.); (5). ఇసుకతోఁగూడిన కరవాఁక: చూ, హరిప్రియ. 2 (చూ, భూమి. 1.); బ. (6).=లంక· చూ, లంక. 5.

లంకణము. వై. వి.=లంఘనమ్. రోగమున నుపవాసము: రూ-లంకనము, ఇల్లి, నంకు, పత్తు-పస్తు, పస్తిల్లి. (సం) —లంఘనము. తద్విశేషములు.-౧. వ్రతోపవాసమునకు.-ఉపాసము. (సం). —అనశనము, అభోజనము, ఉపవస్తము, ఉపవాసము, ఉపోషణము, ఔపవస్తము, ఔపవాస్యము; ౨. శుష్కోపవాసమునకు.—నిట్ట-నిట్టు-నిట్రి-- నిట్రిము — నిట్రి, నిట్టుపాసము-నిట్రిపాసము, నిప్పస్తు; 3: (సం). —ప్రాయము.

లంకనము. వై. వి.=—పై.—

లంకనముండు. వా. అ. క్రి: ఉపవసించు. (తె). —ఎడపడు, పస్తుండు.

లంకనవల్లు. వా. వి. బ. ఏఱువిడిచిన పొలము, కండిక: చూ, భూమి. 1-౪౯.

లంకపొలము. దే. వి.—పై.— [కోపిక*.

లంకాసిక. సం. వి. ఆ. స్త్రీ: చూ, రూ-లం

లంకాకు. వా. వి. లంకలలో పండిన పొగాకు. (పాటాకు అని మఱియొకటికలదు): చూ, పొగాకు.

లంకించు. వై. అ. క్రి. 1: కీలుకొను, తవులఁబడు, తగులు-తవులు-తొలు, దొరయు, పట్టు; స. క్రి. 2. పెనవేయు; 3. అవమానపెట్టు: చూ, హేళనముచేయు.

లంకింపు. వై. వి. చౌర్యము: చూ, హరణము. 1.

లంకిణి. వా. వి. ఒకరక్కసి: చూ, సోఁకుడు. 4 (రాక్షసి. 1.)

లంకియ. వై. వి.=లంకః. రూ-లంకె. 1. సంగమము: చూ, సంయోగము; 2. బంధము: చూ, లంకెపాటు; 3. రూ-లంకె. చిక్కు, జిలుగు, తాలిక, తిరిక, తిత్తె, పిరి, పురి, పుస్తెముడుపు, పెన, మెలి, మెలిక, మెలుసు; 4. లంకెవేసెడుపలుపు: చూ, సూత్రము. 1; 5. రెండుపశువులనుఁజేర్చి కట్టెడు బంధము; వా. 6. (ఆలుమగల) కౌఁగిలింత: చూ, సంశ్లేషము.

లంకె. వై. వి.=లంకః.—పై.—

లంకెపలుపు. వా. వి: చూ, లంకియ. 4.

లంకెపాటు. వై. వి: తగులుకోలు, తగులుడు, తగులుడల, తగులుపాటు, లంకియ-లంకె. (చూ, బంధము. 1.)

లంకెపేఁట వై. వి. పెనవేసెడి మ్రానిపలక.

లంకెమానిసి. వై. వి. దాసుఁడు: చూ, సేవకుఁడు.

లంకెవెట్టు. ద్వ. స. క్రి. 1. తగులుపఱచు; 2. పెనవేయు: చూ, వడివేయు.

లంకోపిక. సం. వి. ఆ. స్త్రీ: రూ-లంకాసిక-లంకోయిక. లంకోసిక, స్పృక్క*: చూ, రాజార్హము. 1—౩౭.

లంగ. నై. వి.=లంఘన. 1: చూ, లంఘు; 2.=లంకె: చూ, లంక. 6.

లంగగొను. ద్వ. స. క్రి: చూ, లంఘించు.

లంగము. సం. వి. అ. పుం. సంగము: చూ, సంయోగము.

లంగరు. నై. వి.=లాంగలమ్. జేను, ఓడనిలుపు ఇనుపసాధనము: చూ, లాంగలము. 6.

లంగరుకా(ఖా)నా. వా.వి. పనిచేయలేని బీదల అన్నసత్రము: చూ, సదనము. 1.

లంగా. వా. వి. అంగడట్టము: చూ, వస్త్రము.

లంగుఁడు. సం. వి. అ. పుం: చూ, విటుఁడు

లంగోటి. వా. వి: బలమిచ్చెడియొకానొక కౌపీనము. తద్వి.—౧: అల్లకము, కచ్చె, కచ్చెడము, గోఁచి, గోణము-గోణాము-గోపణము, తడుపు, పొట్టము-బొట్ట ము.(సం. ప.)—కక్ష-కచ్ఛటిక-కచ్ఛోటిక, కచ్ఛ-కచ్ఛము, కోణము, కౌపీనము, ఖండకము, చీరము, ఘటి; ౨: ఫట్టగోఁచి, పెద్దగోఁచి, పోటుముంజి; 3: ఓరగచ్చె, (పక్క—గోఁచి, వారగోఁచి. ("చూ, వారగోఁచి")

లంఘు. సం వి. ఆ. స్త్రీ=లంగ: అవతరణము, ఉత్తరణము, చంక్రమణము, తరణము, తరణి, తరము, నిస్తరణము, నిస్తారము, ప్లవము, లంఘనము. (అన్య).— అతి. (తె).-ఉంకింపు, కుప్పింపు, గంతు, చేవుకళింత-చౌకళింత, చెంగనలు-చెంగనాలు, జంగ, దాఁటు, దుముకు, పరిగెనము, పిల్లిమొగ్గలు,లంగ, లగువు, లాఁగు. తద్వి—(తె).-ఇట్టలు; దాఁటులు; పేరెములు. తద్వి.—౧ (తె) —చేవుపుటము-చౌపుటము; ౨. విణ. దాఁటఁబడినది.—అవతీర్ణము, ఉత్తీర్ణము, తీర్ణము; 3. విణ. దాఁటఁదగినది.—ఉత్తార్యము.

లంఘనము. సం. వి. అ. న. 1.=దాఁటు: చూ, లంఘు; 2: ఎగుడుదిగుడు, దూఁకుడు, లాఁగు. (చూ, అపంగతము. 2.); 3. గుఱ్ఱపుదూఁకుడు: చూ, హయము; 4.=లంకణము. రోగమందుపవాసము: చూ, లంకణము.

లంఘించు. సం. అ. క్రి. 1: ఉత్పతనముగు, ఉద్గమించు, నిస్తరించు. (తె. ప) —ఉంకు, ఉఱుకు, ఎగయు-ఎవయు-నెగయు-నెవయు, ఎగసిపడు, ఎగసిల్లు, ఎగురు, ఎగురులాడు, కుప్పిగంతుకొను, క్రొళ్లుదాఁటు, క్రొళ్లుఱుకు, క్రొళ్లువాఱు, గంతుకొను, గోరించు, జంగగొను, జెరుగు-జేరుగు, త్రుళ్లగించు, త్రుళ్లిపాఱు, త్రుళ్లు,దాఁటు, దాఁటుకొను, దుముకు, దుముకులాడు, దూఁకు, దూఁటుకొను, పల్లటీల్గొను, పల్లటీల్దాఁటు, పల్లటీలెత్తు, పుటమెగయు, మిట్టించు, మిట్టిపడు, మిట్టు, మిడియు, మిడిసిపడు, మిడుకు, మిడుకుమాలు, లంగగొను, లాగించు. తద్వి.—(తె) చేవుకళించు—చౌకళించు ("చూ, విలంఘించు"); స. క్రి. 2. దాఁటు (చూ, లంఘించు. 1.); తరించు, ఉత్తరించు. (తె. ప) —ఈఁదు, ఒడ్డు, కడచేను, కడచు, కడవెళ్లు, జంగగొను, తఱియు, దాఁటు. (ఇట్లు పరిలంఘించు, పరివిలంఘించు, విలంఘించు) ("చూ, విలంఘించు.")

లంచము. సం. వి. అ. పుం.=లంచేము: కార్యార్థము ఇచ్చుసొమ్ము: చూ, లంచేము.

లంచేగొండి. ద్వ. వి. (లంచేము + గొండి) లంచేముతీయువాఁడు: చూ, సుంకరి.

లంచేము. వై. వి.=లంచః: చూ, సూడిద.

లంజ. సం. వి. ఆ. స్త్రీ.=లంజియ—లంజె—లంజెత. 1: చూ, వేశ్య; 2: చూ, అంకులాఁడి.

లంజి. నై. వి =లంజికా.—పై.—

లంజిక. సం. వి. ఆ. స్త్రీ.=లంజి.—పై.—

లంజియ. నై. వి.=లంజికా—పై.—(వేశ్య

కు.—ఉ, హరి. 1, ఆ. 72.)

లంజె. వై. వి.=లంజికా. —పై.— (రూ-లంజియ.)

లంజెకాఁడు. ద్వ. వి: చూ, విటుఁడు.

లంజెకొడుకు. వా. వి. పలువిత్తు: చూ, నూనుఁడు. 1.

లంజెత. ద్వ. వి: చూ, లంజ. (వై. అని కొందఱు) (స్వార్థమున తప్రత్యయము.)

లంజె బేడిస. ద్వ. వి. ఒక చేఁప: చూ, మత్స్యము. 1.

లంజెతీకము. ద్వ. వి. వేశ్యాసంభోగము: చూ. సంయోగము.

లంజెసవరము. వై. వి. గొంతెమగోరు*: చూ, సారణ.

లంటఁడు. వా. వి. గుండువలెనుండువాఁడు.

లండి. దే. విశే. (రూ-లండీ-లండు-లండుఁబోతు) 1. కుత్సితుఁడు: చూ, వ్యాధుఁడు. 2; 2. కుత్సితురాలు, చెడుగు: చూ, స్త్రీ.

లండీ. దే. విశే.—పై —

లండు. దే. విశే.—పై.—

లండుఁబోతు. దే. విశే. —పై.—(స్వార్థమున పోతు)

లంద. దే. విశే: తొంద-తొందు, దొడ్డు, పెద్ద కడుపువాఁడు, పొట్టవాఁడు, పొసఁగ, బొంద, బొజ్జవాఁడు, బొఱ్ఱవాఁడు, బొసుక, వ్రేఁకటివాఁడు. (సం. ప).—ఉదరుఁడు, తుంది, తుందిభుఁడు, తుండిలుఁడు, తుందికుఁడు, పిచండిలుఁడు, బృహత్కుక్షి. ("చూ, వ్రేఁకటివాఁడు.")

లంపట. దే. వి. రూ-లంపటము. 1. అలసట: చూ, శ్రమము. 1; 2. ఆపద: చూ, విపత్తు; వా. 3. కలియఁబడుట, కొట్టుకొనుటకు సిద్ధపడుట.

లంపటము. దే. వి. —పై.—

లంపటపడు. ద్వ. అ. క్రి: చూ, వేసరు. 2.

లంపటుఁడు. సం. విశే. అత్యాసక్తుఁడు: చూ, లుబ్ధుఁడు. 2.

లంపతా. వై. వి.=లంపట. (దేశ్యమని శ. ర) దాసీపుత్రుఁడు: చూ, నూనుఁడు. 1.

లంపతావాఁడు. ద్వ. వి. —పై.—

లంపాకము. సం. వి. అ. పుం. .చూ, దేశములు. 73.

లంపు. దే. వి. 1: చూ, సమూహము; 2. దొంగమేఁత: చూ, సాదము. (1).

లంపులమారి. దే. విశే. దొంగమేఁత మేయునది.

లంబ. సం. వి. ఆ. స్త్రీ: చూ, పార్వతి.

లంబకర్ణము. సం. వి. అ. న. మేఁకపోతు: చూ, మేషము. 1.

లంబనము. సం. వి. అ. న. 1: చూ, వ్రేలుడు; 2.=లంబెస, లలంతిక, రూ-లంబమానము, మెడను వ్రేలెడు హారము: చూ, భూషణము. 2.

లంబమానము. సం. వి. అ. న. 1: చూ, లంబనము. 2; విశే. 2. వ్రేలాడునది: అవలగ్నము, లంబము.

లంబము. సం. వి. అ. పుం. 1: చూ, లంబనము. 1. విశే. 2. వ్రేలాడునది: లంబమానము. 2.

లంబాడి. వా. వి. ఒకానొక జాతి.

లంబాడీతండా. దే వి: చేనుప, బిడారు.

లంబి. దే. వి. రూ-లంబీ-లెంబి, కుటుంబము: చూ, సంసారము. 1.

లంబిడి. వా. వి. రూ-లంబి: చూ, రూ-లమిడి.

లంబిక. సం. వి. ఆ. స్త్రీ. కొండనాలుక: చూ, రసన. 1.

లంబితము. సం. విశే: చూ, వ్రేలుడు.

లంబీ. దే. వి: చూ, రూ-లంబి.

లంబు. వై. వి. 1.=లంబ. స్థౌల్యము: చూ, స్థూలము. 2; 2. గొప్పతనము: చూ, సన్మానము.

లంబుషము. సం. వి. అ. పుం. ఏడుపేటల ముత్యాలహారము: చూ, హాపణిక. 2. (భూషణము. 2.)

లంబెస. దే. వి. గొంతుకయందు వ్రేలుచున్న హారము. రూ-లొబ్బెస: చూ, భూషణము 2-౫౬. [యుకుఁడు. 1.

లంబోదరుఁడు. సం. వి. అ. పుం: చూ, వినా

లంఙ్డి. వా. విణ. :చూ. రూ-లంబిడి.

లంభనము. సం. వి. అ న. 1. తిట్టుట: చూ, శాపము. 1; 2. దూషించుట: చూ, సెగ్గింపు.

లంభించు. సం. స. క్రి. 1. తిట్టు: చూ, శపించు; 2. దూషించు: చూ, సెగ్గించు.

లంసాలబ్రాహ్మణులు. అం: చూ, నేపాళ దేశపు బ్రాహ్మణులు. [పుష్టాకులు.

లకలుకలు. వా. వి: చిక్కులు, మారాముల్లు,

లకుచము. సం. వి. అ. పుం: చూ, రూ-లికుచము.

లకుముకి. దే. వి. 1: (సం) —అందుకము, ఉత్క్రోశము, ఉత్పాదశయనము, కటుక్వణము-కటుక్వాణము, కురరము-కురలము, ఖరశబ్దము, టిట్టిభము. తద్వి. — ఆఁడులకుముకికి.—(సం) కురరి ("చూ, శకుంతి."); అం. 2: చూ, కూజితములు (లేక) పలుకులు

లకోటా. వా.వి.1. ఉత్తరమునుఉంచు కాకిదపు సంచి; 2. ఉత్తరమును అతికించుట.

లకోరి. దే. వి. 1. క్రూరబాణము: చూ, హేతి. 4 (బాణము. 1.); 2. శరము: చూ, బాణము. 1. [పావురము: చూ, సురఁటీ.

లకోరీ. దే. వి. 1: చూ, రూ-లకోరి. 1; 2.

లక్క. వై. వి.= లాక్షా: (సం. వ):— అనంగమాత, అలక్తకము- అలక్తము, కర్బురనుహృత్తు, కలమము, కార్పటము, కీటజ. కుసుంభము, కృమి, కృమిజ, క్రమిజ, క్రిమి, క్రిమిజ, క్షతఘ్నము, క్షతఘ్ని, ఖదిరిక, గంధమాదని, గరాధిక, గవాషిక, గుడదరువము, జతుకము-జతూకము, జతువు, ద్రవ్యము, దుర్మామయము, నిర్భర్త్సనము, యావముద్రైకర్తృగురౌ... వరవర్ణిని. తద్వి.-లాక్షారసము నకు:-



లత్తుక. (సం).- క్షతఘ్నము. (తేనెతోకలిపి యిచ్చిన రక్తవాంతి తగ్గును.) (లక్కపూసిన కొయ్యసామానులు (లక్కబొమ్మలు) లెక్కలేనన్ని కలవు.) [రోగము. 1.

లక్క తెవులు. ద్వ. వి. ఒకానొక చీడ: చూ,

లక్కనము. వై. వి.=లక్షణ. 1. చిహ్నము: చూ, లక్షణము. 1; 2.=లక్షణమ్, వ్యాకరణాదిశాస్త్రము: చూ, శాస్త్రములు.

లక్కపిడత. వా.వి. లక్కపూసిన కొయ్యపిడత.

లక్కపెట్టియ. వై. వి.=లాక్షాపేటీ. రూ-లక్కపెట్టె: చూ, సందుకా.

లక్కపెట్టె. వై. వి.= —పై.— [బ్రాలు.

లక్కపొడి. ద్వ. వి లక్కబియ్యము: చూ, సేసఁ

లక్కబియ్యము. ద్వ. వి. —పై.—

లక్కబొమ్మ. వా. వి. బ: చూ, లక్కసామాను.

లక్కమనుఁడు. వై. వి.=లక్ష్మణ. (రూ-లక్కుమనుఁడు- లక్కుముఁడు, లచ్చనుఁడు- లచ్చుముఁడు) లక్ష్మణుఁడు, రామానుజుఁడు: చూ, సౌమిత్రి.

లక్కసామాను. వా. వి: లక్కబొమ్మ.

లక్కాకు. ద్వ. వి. లక్కపూసిన చెవినగ: చూ, భూషణము. 2_౩౧.

లక్కి. వా. వి. పేచి:లిక్కి."లక్కియనినలిక్కి లిక్కియనిన లక్కియని పెట్టుచున్న పేచీల కంతులేదు." (అవునని కాదనియు కాదని అవుననియు.)

లక్కిమి. వై. వి.=లక్ష్మీ: చూ, లక్ష్మి. 1.

లక్కుమనుఁడు. వై. వి.= లక్ష్మణ: చూ, రూ-లక్కమనుఁడు.

లక్కుముఁడు. వై. వి.=—పై.—

లక్ష. సం. వి. ఆ. స్త్రీ, అ. పుం. నూఱువేలు, నియుతము:చూ, సంఖ్య. 1. [పెడి యర్థము.

లక్షకము. సం. వి. అ. పుం. లక్ష్యార్థమును తెలి

లక్షణ. సం. వి. ఆ. స్త్రీ. 1. ఒక శబ్దవృత్తి:

చూ, అభిద. (చూ, వృత్తి.); 2. రూ- లక్షణ, ఆఁడుబెగ్గురు: చూ, సారసము. 2

లక్షణజ్ఞుఁడు. సం. విణ: లాక్షణికుఁడు.

లక్షణము. సం. వి. అ. న.=లక్కనము-లచ్చెనము. 1. (పదార్థము దీనిచేతఁ జూడఁ బడును.): అంకము, అనీకస్థము, అభిజ్ఞానము, ఆకారము, ఈశ, కలంకము-కళంకము, కలనము, కాయము, కేతనము, కేతువు, గండకము, గండము, చిహ్నము, ధ్వజము, నిమిత్తము, పదము, పాళి, ప్రజ్ఞానము, లక్ష్మణము, లక్ష్మము, లలామము, లాంఛనము, లింగము, వ్యంజనము, శృంగము. (అవ్య.).— అను, అభి. (తె. ప.):—అంకనము, అంగమచ్చము, అడియాలము-అడియాళము, అపదేశము, ఆది, ఆనవాలు-ఆనాలు, ఇంకువ, ఎలుక, ఐమచ్చ, కతము, కలంక-కలంకు-కళంకు, గురుతు-గుర్తు-గుఱుతు-గుఱి, చేలివాలు, చిన్న, చిన్నియ-చిన్నె, డాగు, నెరసు, పులుగు, పొక్కు, మచ్చ-మచ్చము-మచ్చెము, మేపచ్చెన, లక్కనము-లచ్చెనము. తద్విశేషములు.- (ప్రతి విశేషము తుదను లక్షణము అను అక్షరములు చేర్చి చేసుకవలయును):— ౧. అత్తమామలఁజంపుదానికి.- ఉదరావర్తము, ఉదానము; ౨. అదృష్టస్త్రీకి.- అశ్వత్థ పత్రాభభగము; 3. అదృష్టశాలికి.- ఉన్నత బాహుమూలము; ౪. అపుత్రవిధవా.-ఖరపుంస్వరము; ౫. అవమాన.- (తె). గొమ్మ; ౬. అష్టపుత్రవతీ.— కలకంఠీ నినాద హంసస్వరము; ౭. ఉత్తమనారీ.- అల్పభోజనము; కపోలావర్తము; కుటిలకేశము; చుబుకావర్తము; ౮. ఉత్తమ స్త్రీపురుష.— అల్పనిద్ర; ౯. గండసంజ్ఞ.— అంగుష్ఠ తర్జనీ రేఖ; ౧౦. గర్భిణీస్త్రీ.- కందూరేఖలు. (తె).—చిట్టుములు; ౧౧. గోడ్రాలి.— ఊర్ధ్వజిహ్వా, చుబుకమచ్చము; ౧౨. చంద్రికళంక.— (తె) మచ్చ-మచ్చెము; ౧౩. చౌవు.— అశుభము, అరిష్టము. (తె) —కీడు, కీడుపాటు-కీడ్పాటు, చౌవు గుఱుతు; ౧౪. జారిణీ.—కటివామావర్తము; ౧౫. దారిద్ర్యవతీ.—కృష్ణతాలుని; చక్రవక్త్రము; జంఘావర్తము; ౧౬. దాసీ.— ఊర్ధ్వనఖము, ఊర్ధ్వనాసిక; ౧౭ దాస్య.- కృష్ణరేఖ; ౧౮. దీర్ఘశరీరము బలముగలవాని.- ఆజానుబాహువు; ౧౯ దీర్ఘాయువుగలవాని - అవిచ్ఛిన్నరేఖ; ఆయురేఖ; ఆయుర్లక్షణము; ౨౦. ధార్మిక.—కర్ణమచ్ఛము; ౨౧. నపుంసక.— కంఠమచ్ఛము; ౨౨. నాశ.—అతికృష్ణమచ్ఛము; అనలక్షణము; ఓష్ఠమచ్ఛము; ఘటోదరము; జంఘామచ్ఛము; (తె).— కొఱగామి; ౨౩. పతిహంత్రీ.— భ్రూమధ్యరోమాణి; ౨౪. పశుసంఖ్యా.—అంగుష్ఠపార్శ్వరేఖ; ౨౫. పాతివ్రత్య.— కటిప్రదక్షిణావర్తము; ౨౬ పాదచిహ్నము.— పదము. (తె) —జాడ; ౨౭ పుట్టుమచ్చ.— కాలకము, తిలకము, తిలకాలకము, జటులము-జడులము, పిప్పు. (తె).—పుట్టుమచ్చ, మచ్చ- మఱువు. తద్వి.—విష్ణువుయొక్క ఱొమ్మునందలి మచ్చకు.—శ్రీవత్సము, లాంఛనము; ౨౮. పుత్రనాశ —ఊరోమచ్ఛము; భ్రూమచ్ఛము; ౨౯. బిడ్డలుగలుగని పడఁతి.- చిత్రపాదము; 3౦. బిరుదు:—(తె) బొమ్మ; 3౧. భయ.—ధ; 3౨. భర్తృహంత్రీ (ఎనిమిది మనువులుపోవు మగువ).— ఘూకమార్జాలలోచనము; 33. భాగ్యవతీ.— కోమలపాణితలే (ద్వి.); 3౪. భాగ్యసూచకదేహ.-సాముద్రికము; 3౫. భ్రాతృసంఖ్యా.- అంగుష్ఠాదిరేఖ; 3౬. మహాపురుష.—ఊర్ణ; 3౭. యతిసంప్రదాయజ్ఞానార్థ.- ఆనందము; గిరి; 3౮. యతిసంప్రదాయభేదజ్ఞానార్థ.—

అరణ్యము; ఆశ్రమము; ౩౯. రాజచిహ్న.—కనుత్తు-కనుదము; ౪౦. రాజపత్నీ.—అష్టమీచంద్రనిటలము; గజహంసగతి; చక్రరేఖ; రక్తపాదతలము; ౪౧. రాజమాతృ.-అంకుశరేఖలు; ౪౨. రాజుభార్యయయ్యెడుమగువ.-త్రిరేఖాన్వితగ్రీవ; ౪౩. రాజ్య.— అకర్మకఠినకరము; ౪౪. విద్యా.-అనామికాదిరేఖ; ౪౫. విధవా.- అతిదీర్ఘాతిహ్రస్వాంగము; అతి స్థూలమహాకృశాంగము; ఊర్ధ్వకేశము; ఓష్ఠరోమాణి; జంఘపరికృష్ణరోమాణి; ౪౬. వృద్ధిప్రద.- కటిమచ్ఛము; ౪౭. శుభ.—కక్షమచ్ఛము; ౪౮. సంతానవృద్ధి స్త్రీ.— అంసదక్షిణావర్తము; ౪౯. సంపత్తు దీర్ఘాయుస్సు గలవాని.—ఆజానుబాహువు; ౫౦. సామాన్య.—(తె) కొండగుఱుతు; ౫౧. స్త్రీపూజ్య.—గంభీరనాభి; ౫౨. స్త్రీ సౌభాగ్యలక్షణము.—ఉన్నతబాహుమూలము; కంఠావర్తము, కపిలమచ్ఛము; కర్ణమూలావర్తము; ౫౩. ముండమోయుగుఱుతుకు:-వరోత్కమాణి. ఇత్యాది వివరంబు లపారంబుగ గలవు. ("చూ, సాముద్రికము. 1."); 2. గుఱి:చూ, లక్ష్యము. 1; 3. చోపు: చూ, సూచన. 4; 4. వ్యాకరణాది శాస్త్రము: చూ, శాస్త్రములు; 5. పేరు: చూ,సంకేతము. 1; పుం. 6. బెగ్గురు: చూ. సారసము. 2; అం. 7. పురాణమునకుఁగల పంచలక్షములు:చూ, పురాణము. 6.

**లక్షణములకుఁ గలిగెడు త్రిదోషములు.** అం: అతివ్యాప్తి, అవ్యాప్తి, అసంభవము (3): చూ, త్రిదోషములు.

**లక్షణమూలాధ్వని.** అం: అవివక్షితవాచ్యము, అర్థాంతరసంక్రమితవాచ్యము. (2).

**లక్షణాంగములు.** అం. (ఇవి పురుషలక్షణాంగములు ౫౮:—౧ పాదతలరేఖలు, ౨ పాదతలములు, ౩ పాదనఖములు, ౪ పాదాంగుళములు, ౫ ప్రపదములు, ౬ పార్ష్ణులు, ౭ గుల్ఫములు, ౮ గతి, ౯ జంఘలు, ౧౦ దేహరోమము (రోమము), ౧౧ జానువులు, ౧౨ ఊరులు, ౧౩ అండములు, ౧౪ లింగము, ౧౫ మూత్రము, ౧౬ శుక్లము, ౧౭ శోణితము, ౧౮ కటి, ౧౯ నాభి, ౨౦ కుక్షి, ౨౧ మధ్యము, ౨౨ వళులు, ౨౩ స్తనములు, ౨౪ చూచుకములు, ౨౫ వక్షము, ౨౬ జత్రులు, ౨౭ స్కంధములు, ౨౮ భుజములు, ౨౯ కక్షములు, ౩౦ మణిబంధములు, ౩౧ హస్తపృష్ఠములు, ౩౨ హస్తతలములు, ౩౩ హస్తాంగుళములు, ౩౪ హస్తనఖములు, ౩౫ హస్తరేఖలు, ౩౬ పృష్ఠము, ౩౭ కంఠము, ౩౮ ముఖము, ౩౯ చిబుకము, ౪౦ అధరోష్ఠము, ౪౧ దంతములు, ౪౨ తాలువులు, ౪౩ జిహ్వ, ౪౪ స్వరము, ౪౫ హసితము, ౪౬ ఉత్తరోష్ఠము, ౪౭ శ్మశ్రువులు, ౪౮ నాసికము, ౪౯ శ్వాస, ౫౦ కపోలములు, ౫౧ నేత్రములు, ౫౨ తారలు, ౫౩ భ్రువులు, ౫౪ కర్ణములు, ౫౫ లలాటము, ౫౬ శిరము, ౫౭ శిరోరుహములు, ౫౮ దేహము (శరీరము): చూ,లక్షణము. 1; సాముద్రికము. 1. (పూర్వము నారద, ప్రహ్లాద, సముద్ర, కాత్యాయన, వరాహమిహిర, వరరుచి, మున్నగువారిచేఁ జేయఁబడిన గ్రంథములను, బ్రహ్మాండపురాణ, బ్రహ్మపురాణ, స్కాంధపురాణాదులయందుఁ గొన్నిచోట్ల నీవిషయములను జెప్పఁబడియున్నవి. ఈశాస్త్రమందు స్త్రీపురుషులకుఁ గలుగు సుఖదుఃఖాద్యనుభవములఁ దెలియఁదగు చిహ్నములఁ దెలుపఁబడియె. పురుషునకు దక్షిణభాగ, స్త్రీకి వామభాగ లక్షణములు ప్రశస్తములు.): చూ, స్త్రీ లక్షణాంగములు.

పార్థివుఁడు, పార్థుఁడు, ఫల్గునుఁడు-ఫాల్గునుఁడు, బీభత్సుఁడు, వార్త్రఘ్నుఁడు, విజయుఁడు, శ్వేతవాహనుఁడు, సవ్యసాచి. (తె. వ) కత్తి, కవ్వడి, క్రీడి, గెలుపుపేరుగలాఁడు, గెలుపుబాస యొడయఁడు, మచ్చెవెన్నుఁడు, వివ్వచ్చుఁడు, వెన్నునంటు, వెన్నుమచ్చెదునీఁడు, వేగంటికొమరుఁడు. తద్వి.- ౧. జయుఁడు (చూ, యుధిష్ఠిరుఁడు); ౨: (చూ, పాండవులు.)

సుభారము. అం: చూ, నిస్సాణములు.

సుభాషితుఁడు. సం. వి.అ. పుం: చూ,బుద్ధుఁడు.

సుభిక్ష. సం. వి. ఆ. స్త్రీ. ఏలుజాజి*: అగ్నిజ్వాల, అఫల, కుంజర, కుముద, గుంజర, గుచ్ఛపుష్పి, ధాతకి, ధాతుపుష్పిక, పార్వతీయము, మధువాసిని, మధుహేతువు, యమళచ్ఛదము, రక్తపుష్పిక, శ్లక్ష్ణత్వక్కు, సీధుపుష్పి, సుపుష్పము. (తె) ఆడె, ఆరె, ఆరెపువ్వు, ఏలుజాజి *.

సుభిక్షము. సం. విణ. సులభభిక్షముగలది. (దుర్భిక్షము లేనిది యనుట.)

సుమ. వై. అవ్య.=స్మ. (రూ-సుమా-సుమి-సుమీ-సుమూ- సుమ్మీ- సుమ్మా-సుమ్మి-సుమ్మీ-సుమ్ము-సూ-సూవె.) చూడుమి.

సుమంగలి. సం. వి. ఈ. స్త్రీ. 1. ముత్తయిదువ: చూ, సువాసిని; అం. 2: చూ, వృత్తము. 1. ("స-జ-స-న-గురువులు. 8యతి. 13వ ఛందస్సు.)

సుమంగళ. సం. వి. ఆ. స్త్రీ. 1. పాలకూర*: ఉత్తమ, కర్పణి, కర్షణి-కర్షిణి, కాంచనక్షీరి, క్షీరకాకోలిక- క్షీరకాకోలి, క్షీరవిషాణిక, క్షీరశుక్ల, క్షీరాణి, క్షీరావి-క్షీరావిక, క్షీరి-క్షీరిణి, గర్భిణి, చక్షుష్య, జీవ, జీవంతి, జీవకాలిక, జీవని, జీవనీయ, దుగ్ధిక, పయస్య, పార్వతి, మధురస, మధువు, మధుస్రవ, మధుస్రవ, వలక్ష, విషాణి, శాకశ్రేష్ఠి, శుక్ల. (తె) చిలుపాల, తీఁగపాల-తీఁగపాల, పాలకూర, పిన్నపాల, మనుపాల*;. తద్విశేషములు.-౧. పాలచెట్టునకు.-కపీజ్యము, కపీష్టము, క్షీరవృక్షము, క్షీరిక, పయస్య, ఫలాధ్యక్షము, రాజాదనము, శీరవృక్షము. (తె) పాల; ౨. ఇప్పకు.-వలాసకము: చూ, వానప్రస్థము. 2; 3.నీరిప్పకు.-మధూలకము: చూ, వానప్రస్థము. 1-౧; ౪. కొలపాలకు.-అర్కపుష్పిక, చిత్రపత్రిక, పోటగళ, పయస్య-పయస్య, శృంగబేరి. (తె) కొలపాల*; 2. మంగళకరమైన యాఁడుది: చూ, స్త్రీ. [స్సు. 2.*.

సుమన. సం. వి. ఆ. స్త్రీ: చూ, రూ-సుమన

సుమనము. సం. వి. అ. పుం. గోదుమలు: చూ, స్తంబకరి (ధాన్యము.)

సుమనస్సు. సం. వి. స. స్త్రీ. 1. పువ్వు: చూ, సుమము; 2. జాజి*: కేతకి, గోకంటకము, జాతి, జీరణము, తిలభావిని, ప్రియంవద, మాలతి, స్థపుట*. తద్వి.—౧: (తె) తీఁగజాజి; ౨. జాజిపత్తిరికి.-జాతికము, స్థైర్యము.(తె) జాజిపత్తిరి-జాజిపత్రి, జాపత్తిరి-జాపత్రి; 3. జాజికాయకు.-కోశము-కోషము, సురభి. (తె) జాజికాయ; పుం. 3. దేవత: చూ, వేలుపు; 4. విద్వాంసుఁడు: చూ, సుధి.

సుమనోరజము. సం. వి. స. న: కింజల్కము, పరాగము, మధువు, మధూలిక. (తె) పుప్పొడి, బుక్కాము. తద్వి.— ఆసవము, కౌసుమము, క్షౌద్రము, పుష్పరసము, మకరందము, మరందము, మధువు, మధూళి, మాధ్వి, రజస్సు. (తె) కమ్మనీరు, పూఁదేనియ-పూఁదేనె-పూవుఁదేనియ. (చూ, సారఘము.)

సుమము. సం. వి. అ. న. పువ్వు: రూ-కుసుమ

మ్ము, ఆర్తవము, కుందము, పీలువు, పుష్పము, ప్రసవము-ప్రసూనము, లతాంతము, వనము, సూనము.(తె) అలరు, నన, పుప్పము, పువు-పువ్వు-పూ-పూవు, విరి. తద్వి.—౧: చూ, పూగుత్తి (చూ, స్తబకము); ౨. తాడి, కొబ్బరి, ఈఁత, వరిలోనగు ఏకబీజదళ వృక్షజాతిపూఁతకు -(తె) పువ్వార-పువ్వాగము; ౩. తాటిపూవును పట్టియుండెడు నూఁగుపూవునకు -(తె)బొందపువ్వు; ౪.లాంగలీ పుష్పమునకు.-లాంగలము; ౫.అరఁటిపువ్వునకు: శిలీంధము-శిలీంధ్రము, కదళీకుసుమము. (తె) అరఁటిపువ్వు (అంటిపువ్వు); ౬. పుష్పవిశేషములు.—(౧): రామబాణము; (౨): (తె) బాశెలు; (౩): (చూ, పాటలము); (౪) ఆవజాతిపువ్వునకు -(చూ, ఆవ. 8); (౫) గులాబీజాతిపువ్వునకు.-(చూ,గులాబీకుటుంబము); (౬). చిక్కుడుజాతి పువ్వునకు.—(చూ, చిక్కుడు కుటుంబము); (౭). తుమ్మజాతి పువ్వునకు.—(చూ, తుమ్మకుటుంబము); (౮): (చూ, సువర్ణము. 4)

సుమా. వై. అవ్య.=స్మ: చూ, రూ-సుమ.

సుమారు. వా. వి. 1. కొంచెము హెచ్చు. తద్వి.—హెచ్చుతగ్గునకు.— ఇంచుమించు, రమారమి-రవూరమి; 2. త్రాగిమత్తెక్కియుండుట. "వాఁడు సుమారు మీఁద నున్నాఁడు."

సుమాళము. దే. వి. 1. సుఖము: చూ, సంతోషము; 2. మూర్ఛ: చూ, సొమ్మ; 3. సంతోషాదులవలనఁ గలిగెడు పారవశ్యము: మసరు. (సం) ఆవేశనము, ఆవేశము.

సుమాళి. దే. విశే. (సుమాళము + ఇ) శౌండుఁడు, సుమాళముగలవాఁడు. ఉ, హరి. 3, ఆ. 113: చూ, సోమరి.

సుమాళించు. దే. అ క్రి. మత్తించు: చూ, పొంకరించు (మబ్బుకొను.)

సుమి. వై. అవ్య.=ష్మ: చూ, రూ-సుమ.

సుమిత్ర. సం. వి. ఆ. స్త్రీ. దశరథుని భార్య (లక్ష్మణుని తల్లి): చూ, భార్య.

సుమీ. వై. అవ్య.=1: చూ, రూ-సుమ; 2: నిశ్చయార్థకము. ఆం, భా. తృ. 68. రూ-సుమ్మీ, కాకున్న, సూ: చూ, సత్యము. 1.

సుము. వై. అవ్య.=ష్మ: చూ, రూ-సుమ. [డు.

సుముఖసువు. సం.వి.ఉ.పుం: చూ, సుధాహారుఁ

సుముఖి. అం. 1: చూ, గాంధారగ్రామగత మూర్ఛనలు; అం. 2: చూ, వృత్తము. 1. ("న-జ-జ-నగణములు. 7 యతి. 11వ ఛందస్సు.")

సుముఖుఁడు. సం. వి. అ. పుం. 1. గరుత్మంతుని కొడుకు: చూ, సూనుఁడు. 1; 2. ఒక నాగ కొమారుఁడు; చూ, నాగుఁడు. 1; 3: చూ, వినాయకుఁడు. 1; 4. పండితుఁడు: చూ, సుధి; విశే. 5. చక్కనిముఖముగలవాఁడు.

సుమేరువు. సం. వి. ఉ. పుం. బంగారుకొండ, రూ-మేరువు: చూ, పర్వతము. ౨౨.

సుమ్మ. వై. అవ్య=స్మ: చూ, రూ-సుమ.

సుమ్మా. వై. అవ్య.=—పై.—

సుమ్మి. వై. అవ్య.=—పై.—

సుమ్మీ. వై. అవ్య.=—పై.—

సుమ్ము. వై. అవ్య.=—పై.—

సుయామ. సం. వి. ఆ. స్త్రీ. అరఁటి*: చూ, సుకుమార (రంభ. 2.) [విష్ణువు. 1.

సుయామునుఁడు. సం. వి. అ. పుం: చూ,

సుయోధనుఁడు. సం. వి. అ. పుం. గాంధారేయుఁడు, దుర్యోధనుఁడు. (తె) రాజరాజు, రారాజు, రాజేఁడు.

సుర. సం. వి. ఆ. స్త్రీ. 1. రూ-సురి. మద్యపానపాత్రము: చూ, పాత్రము. 6-౪; 2.=

సారా: అరిష్టము, అలి, ఆసవము, ఇర, ఐరేయము, కత్తోయము, కపిశి-కపిశిక, కల్య-కల్యము, కశ్యము, కాదంబరి, కాపిశము, కాపిశాయనము, కాపిశాయిని, కామాలిక, కాలిక, కీకటము, గంధమాదని, గంధవతి, గంధోత్తము, చషకము, చింతాయన, తరళ, దైత్య, పరిస్రుత, పరిసన్న, మదిర, మద్యము, మధువు, మధూళి, మాధవకము, మాధవి-మాధ్వి, మార్ద్వీకము-మాధ్వీకము-మార్ద్వీకము, మాధురి, వీర, శీధువు, శుండ, హాలిప్రియ, హాల. (తె) కలు-కల్లు, కోపు, చొక్కు-నీరు, గోట్టు, మదురువు, వెఱ్ఱినీళ్లు, సారా-సారాయి, సీవిరి-సీవురు. తద్విశేషములు.— ౧ (తె) బరందు-బ్రాంది; ౨ ఆరెపువ్వులోనగువానితోఁ జేసినకల్లునకు.— మైరేయము; ౩. ఇప్పకల్లునకు.— మాధవకము-మార్ద్వీకము-మార్ద్వీకము; ౪. ద్రాక్షకల్లునకు-మాధవకము-మార్ద్వీకము, మార్ద్వీకము; ౫. తాలకి, తాలతి. (తె) తాటికల్లు; ౬. చెఱకుకల్లు: ఆసవము, కాదంబరము, మైరేయము, శీధువు; ౭. ఒకరకపుసారాయికి:-ఆసురి, గౌడి; ౮. మద్యపిష్టమునకు:-జగలము, మేదకము. (తె) పెల్లెము; ౯. సురాబీజమునకు.-కిణ్వము, నగ్నహువు; ౧౦: (తె) తేనెసారాయి; ౧౧. కడిమిపూలకల్లునకు.-కాదంబరము; ౧౨: (తె) కూటిసారా; ౧౩: (తె) కొబ్బరికల్లు; ౧౪: సురాగ్రము, సురామండము. (తె) కల్లుమీఁగడ; ౧౫. సున్నము కలిసిన కల్లునకు.-(తె) చేరు; ౧౬: కోహళము; ౧౭: చషకము; ౧౮: కడంగము; ౧౯: (తె) బీరు; ౨౦: కురసము; ౨౧. సురామండమునకు.—అభిషవము, ఆసవము, కారోత్తమము, సవము, సురామండము. (తె) కల్లుతేట. (చూ, సుర. 2-౧౪); ౨౨: వై

పుల్యము; పుం. 3: చూ, వేలుపు; అం 4: చూ, సముద్రములు; దే. వి. (1) గాలిసుడి: చూ, సుడి. ౨; (2) గాలి: చూ, వాయువు; విణ. 8. పెద్దది:-బృహులము, పృథువు, బృహతి, మహతి-మహితము. (తె) (వి) ఓరు, గొప్ప, (విణ) కంచి, కోర, గంగ, గండు, గండ్ర, గజే, గసప, గఱువ, జేగ-జేగా-జాగా-జేగ-జేగము, తారు, దండ, దొడ్డ-దొడ్డు, నాగ, పెఱ, పెడ, పెద-పెద్ద, పేరు, బలు-బలువు, బాన, బీఱ, బుఱ్ఱ, బొంత, బొద్ది, బోరు, మలచేము, హురుమత్తు-హుర్మత్తు. (చూ, సోగ). తద్విశేషములు.— ౧. విరివియైనది:-అపావృతము, ఆతతము, ఉచ్ఛ్రితము, ఉత్తాలము, ఉత్థితము, ఉపచితము, ఉపయుక్తము, ఉరువు, ఊరీకృతము, ఋద్ధము, ఓతప్రోతము, జృంభితము, ౯, తతము, పల్లవితము, పృథువు, ప్రవృద్ధము, మంథరము, రుంద్రము, వికట-వికటము, వితతము, విపులము, విశంకటము, విశాల-విశాలము, విసృతము-విస్తృతము, విస్తీర్ణము, వ్యూఢము. (తె) అచోటము, ఒడ్డు, ఒఱ్ఱు, పరపు, వింగడము, విరళి, విరి, వెంబ, వెడఁబ; ౨. ఎడముగలది:-బహువు, రుంద్రము; ౩. విస్తరింపఁజేయఁబడినది:-చిపిటము; ౪. చిమ్మఁబడినది:-కీర్ణము; ౫. పెద్దదనుట:-ఉరు; ౬. చక్కఁగావిరిసినది:- చూ, సంఫుల్లము; (విణ) వ్యాకోచము-వ్యాకోశము-వ్యాకోషము; (వి) వ్యాకోచి; ౭. విరివికి: చూ, హేరాళము; ౮: చూ, వృద్ధము. 2; ౯: (వి) చూ, సమృద్ధి.

సురంగ. సం. వి. అ. స్త్రీ. 1=సొరంగము: చూ, రంధ్రము. 1; దే. వి. (1) సొరంగము: చూ, రంధ్రము.1.

సురంగము. సం. వి. అ. పుం. 1=సొరంగము:

చూ, రూ-సురంగ. 1. 2. ఒకరకము పువ్వుల మొక్క*: చూ, వృక్షము.

సురంగాహి. సం.వి. ఇ.పుం: చూ, చోరకుఁడు 2.

సురఁటి. దే. వి. (సుర+అంటు) (కళా. 8, ఆ. 150). 1: రూ-సురఁటీ, వట్టియ-వట్టె, విసనకఱ్ఱ, వీవెన. (సం) ఉత్క్షేపణము, తాళవృంతము, వీజనము, వ్యజనము. తద్వి.—౧: కుంచియ-కుంచె, జేమిడవీచోపు, జల్లి, జల్లెడ, వింజామర-వింజామరము, వీచోపు, సవరము, సురఁటి-సురఁటీ. (పరి భా. 2, ఆ. 15). (సం):—అఘూయువు, అవచూలకము-అవచూ్ళలకము-అవచూ్ళలికము, ఔశీరము, కుంచము, కేశరము, చామర-చామరము-చామరి, భూలము, జలోదరి, ప్రకీర్ణకము, రోమగుచ్ఛము; ౨. జెండాను వ్రేలాడుకుచ్చునకు.—అవచూలకము-అవచూ్ళలకము-అవచూ్ళలికము; 3. ఏనుఁగుచెవివంటి యొకరకము విసనకఱ్ఱకు:-(సం) గజకర్ణము; ౪. యజ్ఞము నందలి విసనకఱ్ఱకు.—(సం) ధవిత్రము; ౫. చామరదండమునకు —(సం) బలి; ౬. వస్త్రముతోఁ గుండ్రముగాఁ జేసిన విసనకఱ్ఱకు.—ఆలవట్టము, వరివట్టము, సీవిరి-సీవురు, సూరెపాను-సూరెపాన్పు. (సం) ఆలావర్తము, వ్యజనము; 2. పారావతవిశేషము: చూ, రూ-సురఁటీ.1. [సాంబ. చే. 13.

సురఁటివీవనులఁబుట్టు. ద్వ. వి: చూ, వాయువు.

సురఁటీ. దే. వి. రూ-సుర్ఁటి. 1. పావురము: ఒడ్డిక, పారవము-పారువము-పారువాయ-పార్వము-పావురము-పావురాయి. (సం) కపోతము, కలకంఠము, కలధ్వని, కలరవము, కామి, కోకదేవము, ఖరప్రియము, గృహకపోతము, గృహనాశనము, చిత్రకంఠము, ఝుల్లకంఠము, పారావతము, మదోత్కటము. తద్వి.—౧. నీటిపావురమునకు.—(సం) కోపి; ౨. అడవిపావురమునకు.—(సం) కాపిని; 3. పావురముల గుంపునకు.—(సం) కాపోతము; ౪. పావురాయి భేదములు.—ఒడ్డి-ఒడ్డీడు; కూకీ; చేపల్లటీ; జెట్టి; దూరుబారు; నేలపల్లటీ; పల్లటీ; పేడగువ్వ; బకదారి; బుఱ్ఱపిట్ట; లకోరీ; సుర్ఁటీ. (సం) అర్ధపారావతము; ఘులఘులారవము; (మి): అంతరపల్లటీ; 2. వింజామరము: చూ, సుర్ఁటి. 1; 3: చూ, సుర్ఁటి. 1—౪.

సురకాని. ద్వ. వి. కానిలో నాల్గవభాగము. (బ్రిటీషునాణ్యపు కానికి నాలుగు దమ్మిడీలు అని కొన్నిచోట్లను, మూఁడుదమ్మిడీలు (మూఁడుపైసలు) అని కొన్నిచోట్లను హాలీనాణ్యమునకు నిజాంరాష్ట్రములో అణాకు ఆఱుపైసలనియు వాడుదురు. (చూ, రువ్వ. 1-2.) (ఇక్కడ సురశబ్దమునకు వ్యతిరేకలక్షణచే చిన్నయని యర్థము.)

సురకోలి. దే. వి. పెద్దపిరంగి (సుకోలి) చూ, బాణము. 1-౪౫.

సురక్రోవి. వా. వి. అగ్నిప్రసరణాయుధము. ఆం, భా. ద్వి. 218: చూ, బాణము. 1-౧ (దీనినే సురకోలిఅనికొందఱు.) [ణము. 1.

సురక్షారము. సం. వి. అ. న. సురుద్భు: చూ, లవ

సురగవి. సం. వి. ఈ. స్త్రీ. కామధేనువు, వేల్పుటావు: చూ, సౌరభేయి (ధేనువు. ౮.)

సురగాలి. దే. వి. సుడిగాలి (ఇట్లు సురకరువలి) జై. 5, ఆ 88: చూ, సుడి. ౨.

సురగి. వై. వి.=శిఖరిణి. రూ-సురిగి. మల్లె*: చూ, హాసంతి. 2. [చూ, సురాచార్యుఁడు.

సురగురువు. సం, వి. ఉ. పుం. బృహస్పతి:

సురజ్యేష్ఠుఁడు. సం. వి. అ. పుం. వేల్పుఁబెద్ద: చూ, బ్రహ్మ. 1.

సురటి. సం. వి. ఈ. స్త్రీ. ఒకానొక రాగము: చూ, స్వరము. 2. (చూ, సురఁటియనికొం ద ఱు.); వా. వి. (1) రూ - సురఁటి-సురటీ: చూ, రూ-సుర్ఁటి; (2) చూ, రూ-సుర్ఁటీ.

సురటీ. వా. వి: చూ, రూ-సుర్ఁటి. (సురఁటీ అనికొందఱు.)

సురతము. సం. వి. అ.న.రతి: చూ, సంయోగము.

సురతాణి. సై. వి. 1. ఇంద్రుఁడు: చూ, సహస్రాక్షుఁడు; 2: (సం): ఇంద్రాణి, ఇంద్రసతి.

సురతాణిలగ్గ. వా. వి: చూ, లగ్గ.

సురతుఁడు. సం. విణ. దయగలవాఁడు: అంతుమంతుఁడు, అభిపన్నుఁడు, ఉదాత్తుఁడు, ఉన్నుఁడు, కారుణికుఁడు, కృపాళువు, దక్షిణుఁడు, దాక్షిణ్యుఁడు, దయాపరుఁడు, దయాళువు, బీభత్సుఁడు, వరదుఁడు. (తె) అక్కఁటి. తద్వి.—కనికరింపఁదగిన వానికి.—తాత. [చూ, నది.

సురదీర్ఘిక. సం. వి. ఆ. స్త్రీ. ఆకాశగంగ:

సురదుమ్రివు. సం. వి. ఉ. పుం. చిల్ల*: చూ, సల్లకి.

సురద్విషుఁడు. సం. వి ష. పుం. (రూ-సురద్విట్టు) వేల్పుదాయ: చూ, రాక్షసుఁడు.1. (ఇట్లు సురారి.)

సురనిమ్నగ. సం. వి. ఆ స్త్రీ: చూ, సురదీర్ఘిక.

సురపతి. సం. వి. ఇ. పుం: చూ, సురతాణి. 1

సురపాడి. దే. వి: (సం) వృక్షము, సురపాలి, కాకాంగము*. (కాకిదొండ అని కొందఱు)

సురపాలి. సం. వి. ఈ. స్త్రీ —సై.—

సురపున్నాగము. సం. వి.అ.పుం=సురపొన్న*: కాంచనము, కాంభోజము, కుంభీకము, కేశరము-కేసరము, కేశరి-కేసరి, కేశవము, తుంగము, దేవవల్లభము, నమేరువు, నాగము, పున్నాగము, పురుషము, స్థిరచ్ఛాయము. (తె) పొన-పొన్న, సురపొన్న*. తద్వి.—౧. కోలపొన్నకు.—అంఘ్రిపర్ణి—అంఘ్రిపర్ణిక, కదళి-కదళము, కలశి-కలసి, కలశీక్లీతని, క్రోష్టుపుచ్ఛి-క్రోష్టుకపుచ్ఛిక-క్రోష్టుపుచ్ఛిక, క్రోష్టుకమేఖల, ఖగశత్రువు, గుహ, చిత్రపర్ణి, పృథక్పర్ణి, పృశ్నిపర్ణి, సింహపుచ్ఛి (తె) కోలపొన్న, నేలపొన్న, సొర్లుగాడి, గొఁకటిబండ.*; ౨. ఏడాకుల పొన్నకు.-అయుగ్మపర్ణము, గంధిపర్ణము, గుచ్ఛపత్రము, గుచ్ఛపుష్పము- గుత్సకపుష్పము, సప్తచ్ఛదము, సప్తపర్ణము, సువర్ణచ్ఛదము. (తె) ఏడాకులపొన్న*.

సురపొన్న. సై. వి =సురపున్నాగ*: చూ, సురపున్నాగము.

సురభి. సం. వి. ఈ. స్త్రీ. 1. కామధేనువు: చూ, సౌరభేయి (ధేనువు); 2. ఆవు: చూ, ధేనువు; 3. అందుగు*: చూ, సల్లకి; (చూ, రాజార్హము. 1-30); న. 4. బంగారు: చూ, లోహము. 1; 5. వాసనగల కలువ*: చూ, సహస్రపత్రము; పుం. 6. వసంతఋతువు: చూ, మాసద్వయము (ఋతువులు); 7. చైత్రము; చూ, మాసము. 1; 8: చూ, సంపెఁగ*; 9. జాజికాయ: చూ, సుమనస్సు.2; స్త్రీ. 10. ఘ్రాణతర్పణము: చూ, వాసన. 1; 11. వాసనమొలక: చూ, సమీరణము(రాజార్హము. 2_౯౩; చూ, సు-భి 8.); విణ. 12. మంచివాసనగలది: కషాయము, తిక్తము, సురభిళము: చూ, వాసన. 1_౧౯. (చూ, సురభి. 10); 13 మనోజ్ఞమయినది: చూ, హృద్యము.

సురభిపత్రి. సం. వి. ఆ. స్త్రీ. రాజజంబువు*. (కన్న-దొడ్డనేరళ): కోకిలేష్ట, జంబువు,

మహాజంబువు (బృహజ్జంబువు), మహాఫల, రాజజంబువు, సురస. (తె) అల్లోనేరడు-అల్లోనేరేడు-అల్లోనేరడు- అల్లోనేరేడు, పెద్దనేరేడు. తద్వి.—౧. నేరేడుకు.—జంబూ, జంబువు, జంబూలము. (తె) అల్లోనేరడు—అల్లోనేరేడు—అల్లోనేరడు- అల్లోనేరేడు, నేరడు—నేరేడు; ౨ నేల నేరేడుకు.—ఐరావతము, కాకజంబుక, కాకజంబువు, కాష్ఠజంబువు, క్షుద్రఫల, జంబూటము, నాదేయి, భూమిజంబుక, భూమిజంబువు, లకుచము, లికుచము. (తె) కాకినేరడు-కాకినేరేడు, గజేనిమ్మ, జేన్న, డహాలువు, నక్కనేరేడు, నేలనేరేడు, పిన్ననేరేడు; 3. నీరునేరేడుకు.-జలజంబువు, స్నిగ్ధపల్లవము. (తె) నీరునేరేడు; ౪: (తె) నాగనేరేడు; ౫. నేరేడుపండుకు.—జంబువు; ౬. మేరుపర్వతమునందలి నేరేడుకు.-సుదర్శనము.

సురభిసాయకుఁడు. సం. వి. అ. పుం: చూ, మన్మథుఁడు. [సురభి. 12.

సురభిళము. సం. విణ. మంచివాసనగలది: చూ,

సురభీకరించు. సం. స. క్రి. వాసనగల దానిని గాఁజేయు. [వర్ణము. 6.

సురమాయి. దే. విణ. మిక్కిలి నల్లనిది: చూ,

సురమాలి. దే. విణ. గాలినించినది (దిండు). నీలా. 3, ఆ. 90: చూ, లోడు. తద్వి. కీచే బిళ్ళకు.—సకిన.

సురయాళువు. ద్వ. వి: చూ, రూ—సురియాళువు.

సురర్షి. సం. వి. ఇ. పుం. నారదాది దేవర్షి: చూ, సన్యాసి.

సురలత. సం. వి. ఆ. స్త్రీ: చూ, శశివదన.

సురలి. సం. వి. ఈ. స్త్రీ. సురలితీఁగె*: రూ—సురలి, కాకశ్యామ, కుజపుట, కుబ్జపుష్ప, జంతుకారి, జతుక, మహాశ్యామ, స్నిగ్ధపుంత. తద్వి.—౧. కృష్ణమహ, కృష్ణవల్లి-కృష్ణవల్లిక. (తె) కమ్మెరాకుతీఁగె, నల్లతీఁగె; ౨: తాంబూలవల్లి-తాంబూలవల్లిక, తాంబూలి, నాగవల్లి; 3: (తె). ఆకు, తమలపాకు—తములపాకు. (ఈ ౧-౨-3 అనువవి ప్రత్యేకమైనవనియు సురలితీఁగెకు సంబంధించినవి కావు అనియు కొందఱు.)

సురలు. సం. వి.అ. పుం.బ. దేవతలు: చూ, సుర. 3.

సురలోకము. సం. వి. అ. పుం. వేల్పుఁబ్రోలు: చూ, స్వర్గము.

సురవర్త్మము. సం. వి. న్. పుం. ఆకాశము: అంగణము, అంతరిక్షము—అంతరీక్షము, అంబరము, అజము, అనంగము, అనంతము, అపవర్జనము, అభ్రము, అలీకము, ఆకాశము, ఆనందము, ఊకేశము, ఊమము, ఊర్ధ్వము, ఋ, ఏ, కంచుకము, (గగనము, తారాపథము, దివము, దివి) కార్బురము, ఖమ్-ఖంబు, గంగాధరము, ఘనాశ్రయము, ఘామము, జా, నభము, నాకము, నిరాకారము, నిరోత్రకము, నీరంధ్రము, పుష్కరము, బహుళము, భంబు, భువనము, మహాబిలము, మేఘద్వారము, తూలము, రోదసి, లేఖగము, వి, వియత్తు, విష్ణుపదము, విహాయము.విహాయసము—విహాయస్సు, వ్యోమము, శబ్దగుణము, సర్వతోముఖము. (తె) అప్పాతాత, ఆకసము, ఉప్పరము, ఉప్పరవీది, గాలితండ్రి, చేదలు, చుక్కలతెరువు, దివము—దివి, నింగి, బయలు.-బయిలు-బైలు, మబ్బుత్రోవ, మిను—మిన్ను, మొగులుదారి, వేలుపుఁదెరువు-వేల్పుఁదెరువు, సత్తిదొర వేనలి. తద్వి.—ఆకాశమండలమునకు.-ఖగోళము.

సురస. సం. వి. ఆ. స్త్రీ. 1: చూ, నాగమాత; 2: చూ, సర్పాక్షి*; 3. రాజజంబువు*: చూ,

సురభిపత్రి; 4. కృష్ణతులసి*: చూ, హరిప్రియ. 3.

సురసము. సం. వి. అ. పుం. 1. నల్లగగ్గెర*: చూ, సుగంధికము; విణ. 2. తియ్యనిది: మధురము, స్వాదువు. (తె) కమ్మ, తియ్య, తీయ, తీఁపి-తీఁపు. (వి) మాధుర్యము,రుచి, విపాకము. (తె) తీఁపి. [(సురభితీఁగె.)

సురలి. సం. వి. ఈ. స్త్రీ: చూ, రూ-సురలి.*

సురాకరము. సం. వి. అ. పుం. కల్లుకడలి: చూ, సముద్రము. [చూ, సుర. 2-౧౮.

సురాగ్రము. సం. వి. అ. న. కల్లుమీఁగడ:

సురార్ణవము. సం.వి.అ.పుం. చూ, సురాకరము.

సురాచార్యుఁడు. సం. వి. అ. పుం. 1. బృహస్పతి: అంగిరసుఁడు-ఆంగీరసుఁడు, ఇఱేనుఁడు, ఓ, కలశీసుతుఁడు, గీరథుఁడు, గీర్పతి-గీష్పతి, గురుఁడు--గురువు, చిత్రశిఖండిజుఁడు, జీవుఁడు, దీదివి, ధిషణుఁడు, ధీమంతుఁడు, బృహస్పతి, వచసాంపతి, వాక్పతి, వాగీశుఁడు, వాచస్పతి, వినాయకుఁడు, సురగురువు, సూరి. (తె) సుతుగుఱేఁడు, వేలుపుటొజ్జ. తద్వి—౧. ఉపాధ్యాయునకు.—బోధకుఁడు.(తె)టీచరు(మేస్త్రరు); ౨:వస్తాదు; ౩. గానవిద్యోపాధ్యాయునకు.-(తె) బయకాఁడు. (మిగతవానికి: చూ, పంతులు.1 ); 2. బృహస్పతి గ్రహము: గోరదుఁడు,గోవిందుఁడు, తథ్యానుజుఁడు, ద, బృహస్పతి: చూ, రాహువు. 2.

సురాజీవి. సం. వి. ఇ. పుం: ఆసుతీబలుఁడు_ఆసుతీవలుఁడు, ఇక్షుకుట్టకుఁడు, కల్యపాలుఁడు- కల్యాపాలుఁడు, ధ్వజముఁడు, మండహారకుఁడు, శౌండికుఁడు, సౌరికుఁడు. (తె) ఈడిగ, కబ్బిలి, కబ్బిలివాఁడు, గమళ్ళవాఁడు - గవుండ్లవాఁడు, గౌండవాఁడు-గౌండ్లవాఁడు, గవుఁడు_గౌఁడు, చిటిగాఁడు, మొలక్రాలి.

సురాటము. అం: చూ, విస్నాణములు.

సురాపానము. అం. 1: చూ, సప్తవ్యసనములు. 2: చూ, మహాపాతకములు.

సురామండము. సం. వి. అ. పుం. 1. కల్లుతేట: చూ, సుర 2-౨౧; 2. కల్లుమీఁగడ: చూ, సుర 2-౧౮.

సురారి. సం. వి. ఇ. పుం. రావణుఁడు: చూ, రాక్షసుఁడు. 1. తద్వి.—వలావాకుఁడు, వృత్రుఁడు, శార్దూలుఁడు, కుంభుఁడు: (చూ, రాక్షసుఁడు. 1.)

సురాలయము. సం. వి. అ. పుం. మేరువు: చూ, హిమాలయము (పర్వతము. ౨౨.)

సురాష్ట్రజము. సం. వి. అ. పుం. 1. తొగరి: చూ, ధాన్యము. ౨౭. (కందులకు.- (సం) వర్ణి. (తె) కంది.); 2. తొగరిమన్ను: అఢకి, కక్ష, కరవీరభుజ, కాక్షి, కాత్స్న, ఖల్వము, తాళకము, తువరి, మృత్తాలకము-మృత్తాలకము, మృత్తిక, మృత్సు, మృత్స్న, మృత్స్నా. (తె) తుప్సి-తుస్సె, తొగరి-తొవరి. (చూ, భూమి. 1-౭౬); 3. అడవి తొగరితీఁగె*: (చూ, ధాన్యము. ౨౭); తద్వి.—౧ పొట్టికందులకు: కాతువరిక. (తె) పొట్టికందులు; ౨: (తె) కొండకంది; 4 సురాష్ట్రజదేశము, సురాష్ట్రము(అనికొందఱు): చూ, దేశములు.

సురాసవము. అం: చూ, ఆసవములు.

సురాళము. దే. వి. 1. భూతావేశజనిత శిరోభ్రమణము: తద్వి.—దిగదుడుపు, బలాదూరు, మురాళము; 2. కోపావేశము.

సురాళించే. దే. స. క్రి: దిగఁదుడుచే, దిగఁదీయు, బడిదిప్పు, బలియు, మురాళించే.

సురాళింపు. దే. వి. దిగఁదుడుపు, బడిసివాటు.

సురి. వై. వి.=క్షుర-ఛురికా. (రూ-సురియ-సురె-సుర-సురికత్తి-సూరకత్తి- చేర-చేరి-చే

యు-సురె-చురకత్తి-చూరకత్తి - చూర-చూరి-చూరీ) చిన్నకత్తి: చూ, రూ-సురియ.

**సురిగ.** దే. వి. రూ-సురగె. చిన్నకొమ్మ: చూ, శాఖ. 1. [చూ, వసంతి. 2

**సురిగి** వై. వి.=శిఖరిణి. రూ-సురగి. మల్లె:

**సురిగె.** దే. వి: చూ, గిరా- సురిగ.

**సురియ.** వై. వి.=ఛురికా. చిన్నకత్తి, కటారము. కళా. 3, ఆ. 108; ఉ, హరి. 4, ఆ. 212: చూ, రిష్టి 2.

**సురియాళు.** ద్వ. వి: చూ, రూ-సురియాళువు.

**సురియాళువు.** ద్వ. వి. మాలవాఁడు: కడజాతి వాఁడు, గోసంగి, తోచే, తోటి, పాణసి, మాల-మాలఁడు, మాలవాఁడు, వెలివాడ వాఁడు, వెలి వాఁడు, సురయాళువు-సురియాళు-సురెయాళు. (సం) అంతావసాయి-అంతేవసాయి-అంతేవాసి, అంత్యజాతుఁడు, అంత్యుఁడు, కథాప్రసంగుఁడు, చండాలుఁడు-చాండాలుఁడు, జనంగముఁడు, దివాకీర్తి, నిషాదుఁడు, పంచముఁడు, పుక్కసుఁడు-పుల్కసుఁడు-పుల్కసుఁడు, ప్లవుఁడు, శ్వపచుఁడు. తద్విశేషములు.—౧. మాలది. (సం) చండాలి; ౨. అగడుగాఁడు, వెలివాఁడు, వెలివాడవాఁడు, చీవాట్లమారి, రోఁతలమారి. (సం.) అధరీణుఁడు, అపధ్వస్తుఁడు, అవగీతుఁడు, అవరీణుఁడు, చండాలుఁడు, ధిక్కృతుఁడు, నిందితుఁడు, పరిత్యక్తుఁడు, (భ్రష్ట(భ్రిష్టు)) భ్రిష్టుఁడు; 3: దూఱఁబడువాఁడు. (సం) నిందితుఁడు, బ్రహ్మబంధువు; ౪: ఉభయభ్రిష్టుఁడు. (తె) తోఁబ్రిచనంగొఱ.

**సురుఁగు.** దే. అ. క్రి. 1. అదృశ్యమగు, నష్టమగు: కనఁబడకపోవు, కాడుపడు-కాడ్పడు, చెడు, చేతవులు, లోటువోవు, వమ్మవోవు, పీటిఁబోవు. (చూ, లాఁచు. 2.) 2 పాఱు: చూ, వెళ్లు. 1; 3. జాడగాఁబోవు; 4. కదలు: చూ, సలించు; 5. స్లానమగు. ఆం, భా. త్ర. 107: చూ, స్రుక్కు. 14.

**సురుగు.** వా. వి. 1. చెందుకాపెట్టె: చూ, సందుకా; 2: చూ, సొరుగు (చూ, సందుకా.)

**సురుగుడు.** దే. వి. 1. ఒకానొక యొత్తుచేయు చెక్క; 2: (సం) అక్కలత, జాతఘాతకి*; వా. 3. సురుగుడుకాయ. [(చూ, బొప్పి.)

**సురుగుడుకాయ.** వా. వి: చూ, సురుగుడు. 3.

**సురుడు.** దే. వి. దివిటీకి మాఱుగా కాల్చెడు జొంజెము: చూ, జొంజెము.

**సురుప్పు.** వా. వి. సురత్షారము. ఆం, భా. ద్వి. 256: చూ, లవణము. 1-౧౨. [చోఁదు. 3)

**సురుమా.** వా. వి. ఒకరకము కాటుక. (చూ,

**సురుము.** దే. వి: ఉసి-నుసి, కసుకు-కస్కు, గుండ, గులగుల, చూరు, తురుము-తుఱుము, నగ్గు, నలి, నలుము, నుగ్గు, నులుము, నుసిం, నూచే-నూచేము, పరుము, పొడి-పొడుము-పొడ్మ (సం) క్షోదము, క్షోదితము, చూర్ణము. తద్వ.—౧: నూఱుట, పొడిసేయుట. (సం) అవచూర్ణనము, అవధ్వంసము, క్షోదము, పేషణము; ౨: గంధపుఁబొడి-గంధపొడి-గందవొడి, బుక్క-బుక్కా-బుక్కాము. (సం) చూర్ణము, పటవాసకము, పిష్టాతరము, వాసయోగము, శృంగారము; 3. పండ్లపొడికి.-పలుగఱ; ౪. ఆసుటాయిపొడికి.-రాపొడి; ౫: చూ, సున్నము; ౬: చూ, రేణువు. 1.

**సురుముచేయు.** దే. స. క్రి: నలుమాడు-నలుము, నులుమాడు-నులుము, నులుముచేయు, పప్పుచేయు (పిండిచేయు), పొడిసేయు.

**సురూపుఁడు.** సం. విశే. 1. చక్కనివాఁడు: చూ, సౌందర్యవంతుఁడు; 2. పండితుఁడు: సుధి.

**సురె.** వై. వి.=ఛురికా: చూ, రూ-సురి.

**సురెయాళు.** ద్వ. వి: చూ, రూ-సురియాళువు.

**సురేకారము.** ద్వ. వి. రూ-సూరేకారము. ఒక రకము తెల్లఉప్పు: చూ, లవణము. 1.

**సురోదము.** సం. వి. అ. పుం. కల్లుకడలి: చూ, సముద్రము.

**సుఱసుఱ.** దే.వి. (సుఱసుఱ). 1 స్రుక్కుటయందగుధ్వన్యనుకరణము. నిర్వ. 7, ఆ. 84: చూ, హూహూ; 2. ఆఁకలివేయుట యందగు ధ్వన్యనుకరణము: చూ, హూహూ; 3. మండుట యందగు ధ్వన్యనుకరణము: చూ, హూహూ.

**సులభము.** సం. విణ.=చేలకన-సులువు. సుఖముగా లభించేనది: లాఘవము, సుకర, సౌకర్యము. (తె) చేలకన, చెచ్చెర, (విణ) (వి) లగువు, లాగి, లేసు, సన్నసన, సలీసు, సులువు-సుళువు. తద్వి.— ౧. మిక్కిలిచేలుకనకు.-సునాయాసము, సౌకర్యము; ౨. పయిపయిగ-పైపైగ; 3: (చూ, లాఘవము. 1)

**సులువు.** వై. విణ.=సులభ. రూ—సుల్వు. 1.—వై.—; 2. శీఘ్రము: చూ, స్వాదము; 3: చూ, లాఘవము. 1; వా 4. ఆరోగ్యము.

**సులోచనము.** సం. వి. అ. న. కంటిజోడు: (తె) ముక్కద్దము.

**సుల్తాను.** వా. వి. తురుష్కప్రభువు. "ఢిల్లీసుల్తాను."

**సుల్వు.** వై. విణ: చూ, రూ-సులువు.

**సువర్చల.** సం. వి. ఆ. స్త్రీ. 1. రూ-సవర్చల*: చూ, సూర్యానువర్తిని; 2. సూర్యునిభార్య: చూ, భార్య. 1-౬౮.

**సువర్చలము.** సం. వి. అ. న: చూ, సుఖవర్చకము.

**సువర్ణకదళి.** సం. వి. ఈ. స్త్రీ. బంగారుఅరఁటి*: చూ, రంభ. 2. తద్వి.—౧. అరఁటికి.-లోచకము; ౨. ఏడాకులరఁటికి.- విశాలత్వక్కు, విషమచ్ఛదము, శారదము, శారది. (చూ, రంభ. 2.)

సువర్ణకము. సం. వి. అ. పుం. రేల*: అనీకస్థము, ఆరగ్వధము-ఆర్గ్వధము, ఆరివేరము, ఆరేవతము, కర్ణాభరణకము, కర్ణి, కర్ణికారము, కుష్ఠసూదనము, కృతమాలము, గోమయోద్భవము, చక్రవరివ్యాధము, చతురంగులము, రాజవృక్షము, రైవతకము, వ్యాధిఘాతము, శంపాకము-సంపాకము-శమ్యాకము. (తె) రేల-రేల.

సువర్ణచ్ఛదము. సం. వి. అ. పుం. ఏడాకులపొన్న*: చూ, సురపున్నాగము.

సువర్ణనాభము. అం: చూ, సప్తాధికరణములు (చూ, కామము 816 పుట)

సువర్ణపారేవతము. సం. వి. అ. పుం. పెద్దయీడ*: చూ, శర్కరాంకము.

సువర్ణభస్మము. అం: చూ, భస్మములు.

సువర్ణము. సం. వి. అ. పుం. 1. రూ-స్వర్ణము. బంగారు: చూ, లోహము. 1. (సువర్ణము=ఇరువది రూకల యెత్తుగల బంగారము. 80 గురిగింజల యెత్తు. ఫలము=ఎనుబది రూకల యెత్తు 320 గురిగింజెలయెత్తు.); 2. అరవరా: పిచువు, హిరణ్యము. (తె) మాడ, సొన్నము; సొన్నా; 3. ధనము: చూ, హిరణ్యము. 2; 4 ఒకరకముపువ్వు: చూ, సుమము. ౬-(౮); 5. నల్లఅగలు: చూ, రాజార్హము. 1-౧౫; విణ. 6. మంచివర్ణముగలది; అం. 7: చూ, దానములు.

సువర్ణాళి. సం. వి. ఈ. స్త్రీ: కర్ణ. *.

సువర్లోకము. అం: చూ, ఊర్ధ్వలోకములు.

సువల్లి. సం. వి. ఈ. స్త్రీ. కారుగచ్చె*: చూ, సోమరాజి.

సువహ. సం. వి. ఆ. స్త్రీ. 1. అందుగు*: చూ, సల్లకి; 2. కారేలకి*: చూ, సన్నరాష్ట్రము; 3: ఈక్షితప్రియము. ఉపవక్త్రము, కాంక్షితప్రియము, కాకాండము, గోధాపది, చర్మారము. (తె) చెప్పుటట్ట-చెప్పుతట్ట*; 4; న

ల్లవావిలి*: చూ, వావిలి. ౧. తద్వి.—వావిలికి.–సిందురము, సిందువారకము; 5: చూ, సశ్వాత్థి*; 6: చూ, వీణ; విణ. 7. సుఖముగ పోవఁదగినది. [నము. 6.

సువారంపుటిల్లు. వా. వి. అడసాల: చూ, సద

సువారంపువాఁడు. వా. వి. అడబాల: చూ, సూపకారుఁడు.

సువారము. వై. వి.=సూపకార. వంట. రామా. 7, ఆ. 107: చూ, సూపకారము

సువాల. ద్వ. వి. (రూ-సువ్వలాల-సువ్వాల-సువ్వి.) (సువ్వి + అలతి) సువ్వియను పదముతో ఆలాపముచేసి పెండ్లిండ్లయందు ఆఁడువారు పాడెడిపాట: చూ, స్వరము. 2; అం. 2. ఒకానొకవృత్తము: చూ, వృత్తము.1.

సువాసన. సం. వి. ఆ. స్త్రీ: చూ, వాసన. 1.

సువాసిని. సం. వి. ఈ. స్త్రీ. రూ-స్వవాసిని. 1. ముత్తయిదువ: చూ, స్త్రీ; 2. పుట్టినింట నుండెడి యాఁడుది: చూ, స్త్రీ.

సువిరేచని. సం. వి. ఈ. స్త్రీ. ఆకుజెముడు*: దళస్నుహి, పత్రిస్నుక్కు, పత్రిస్నుహి, వజ్రద్రువు, వజ్రి, శ్వానజిహ్వా. తద్వి.—చూ, స్నుహి *.

సువ్రత. సం. వి. ఆ. స్త్రీ. 1. సులభముగా పిదుకఁదగినయావు: చూ, సౌరభేయి (ధేనువు); విణ. 2. మంచివ్రతముగలది.

సువ్వలాల. ద్వ. వి. (సువ్వి + అలతి + అలతి): చూ, రూ-సువాల.

సువ్వాల. ద్వ. వి. (సువ్వి + అలతి)—పై.—

సువ్వానుఁడు. వా. వి. అడబాల. ఆం, పదా. వర. 24: చూ, సూపకారుఁడు.

సువ్వి. దే. వి. దంచేటయందగు ధ్వన్యనుకరణము: చూ, హూహూ.

సుశబ్దకి. అం: చూ, గుణములు.

సుశవి. సం. వి. ఈ. స్త్రీ: చూ, రూ-సుషవి.

సుశిమము. సం. వి. అ. న: చూ, రూ-సుషిమము.

సుశీతలాంశము. అం: చూ, షష్ట్యంశములు.

సుషమ. సం. వి. ఆ. పుం. 1. మిక్కిలిశోభ: చూ, శోభ. 4 (వెలుతురు. 1.); విణ. 2. సరిసమానమైనది: ఋజువు, తులితము, ప్రకాశము, ప్రగుణము, ప్రతీకాశము, భూతము, సంకాశము, సదృక్షము, సదృశము, సన్నిభము, సమ, సమ్మితము. (తె) చేదరము, బరాబరి, సరి; 3. మనోజ్ఞమైనది: చూ, హృద్యము. 2.

సుషవి. సం. వి. ఈ. స్త్రీ. రూ-సుశవి. 1. కాఁకర*: కందురము, కటిల్లకము-కఠిల్లకము-కఠిల్లము, కాండకటుకము, కారవల్లి, కారవేల్లకము-కారవేల్లము, విశాఖ. (తె) కాఁకర, పొట్ల*; తద్వి.—౧: కర్కటకి. (తె) గొడ్డుఁగాఁకర; ౨: కర్కోటకి, కర్కోటము, ఫలపూరకము, వాయసి, సుకందకము. (తె) పొట్టికాఁకర, మట్టుకాఁకర; 3. (తె) కొమ్ముకాఁకర; ౪: చిరాయువు, వాతాయువు. (తె) ఊరకాఁకర; ౫: మహాకారవేల్లము. (తె) పెద్దకాఁకర; ౬. అడవికాఁకరకు.-ఉత్పలపూరక, కంకణ్యము, కంకసి, కందఫల, కర్కోటకి, కుడుహుంచి, క్షుద్రకారలిక (క్షుద్రకారవేల్లము-క్షుద్రకారవేల్లి), వనకారవేల్లము, వాయసి. (తె) అడవికాఁకర, అఁగాఁకర; ౭: శకృద్వల్లిక. (తె) బుడ్డకాఁకర*; 2. జీలకఱ్ఱ: అజాజి, ఉత్తరాపథము, కటుక, కణ, కరము, కృష్ణ, కృష్ణసఖి, జరణము, జీరకము, జీరణ-జీరణము, జీరము. (తె) జిలకఱ-జిలకఱ్ఱ-జీలకఱ-జీలకఱ్ఱ; తద్వి.—౧. నల్లజీలకఱ్ఱకు.-ఉపకుంచి(భి)క, కారవి, కాల, కాలి-కాళి-కాలిక, కుంచిక-కుంజిక, కృష్ణ, కృష్ణజీరకము, క్షోణి, ఘోష, ఛత్రి, జీరణ-జీరణము-జీర

ము, పృథువు-పృథ్వీ, శూలఘ్న, శూలకుంచిక, శోథకుంచిక, సుశవి–సుషవి. (తె). నల్లజీలకఱ్ఱ–నల్లజీలకఱ్ఱ, సోఁపు; 2. సన్నజీలకఱ్ఱకు.—కణజీరకము, క్షుద్రజీరకము, క్షుద్రజీవము. (తె) సన్నజీలకఱ్ఱ; 3. తెల్లజీలకఱ్ఱకు.—కణజీరకము, కణాది, గౌరజీరకము, జరణము, శ్వేతజీరకము. (తె) తెల్లజీలకఱ్ఱ; 3: క్షుపాలువు, పానీయాలువు.* (ఒకరకము కంద అని కొందఱు.)

**సుషవికాఫల.** సం. వి. ఆ. స్త్రీ: పానీయవల్లి, రాజిరాజి. (తె) ఆరెతీఁగ. *.

**సుషి.** సం. వి. ఇ. స్త్రీ. (రూ–సుషిరము-సుశిరము) బెజ్జము: చూ, రంధ్రము. 1.

**సుషిర.** సం. వి. ఆ. స్త్రీ. రూ–సుశిర. గువ్వగుత్తిక*: చూ, రాజార్హము. 1-ఁ.

**సుషిరము.** సం. వి. అ. న. 1: చూ, రూ–సుషి; పుం. 2. కిక్కిస: చూ, హరిత. (తృణము. 1.); విణ. 3. బెజ్జముగలది; 4.(రూ-శుషిరము) పిల్లంగ్రోవిలోనగువాద్యము: చూ, వాద్యములు. (దీనినే అహికమని కొందఱు: చూ, వీణ. చూ, స్వరము. 2.) (చూ, సుషిరవాద్యములు)

**సుషిరవాద్యములు.** అం: పాలిక, కాహళి, వాసము, ముకులి, మధుకరి, వంశము, శంఖము, శుకి, శృంగము, సదుర్లపి. (10.)

**సుషుప్తి.** సం. వి. ఇ. స్త్రీ. 1. ఒళ్లెఱుంగని నిద్ర: చూ, స్వప్నము. 2; అం. 2: చూ, అవస్థలు.

**సుషుమ్న.** అం: చూ, నాడులు.

**సుషుమ్ననాడి.** అం.—వై.—

**సుషేణము.** సం. వి. అ. పుం. కలివి *: చూ, పొమ్లుపువ్వఫల. [చూ, సర్వానుభూతి.

**సుషేణిక.** సం. వి. ఆ. స్త్రీ. నల్లతెగడ *:

**సుష్ఠు.** సం. అవ్య. 1. మిక్కిలియనునర్థమందు. వర్తించును: చూ, బలవత్; వా. 2. మంచితనము.

**సుసారము.** సం. వి. అ. పుం. ఇంద్రనీలము: చూ, రత్నములు.

**సుస్తి.** వా. వి. 1. తెవులు: చూ, రోగము. 1; 2. సోమరితనము: చూ, స్త్యానము. (విలంబము. 1.); 3. అశ్రద్ధ.

**సుహృత్సమ్మితము.** అఁ. (పురాణము): చూ, కావ్యము 5 (శాస్త్రములు.)

**సుహృదుఁడు.** సం. వి. ద్. పుం. 1. చెలికాఁడు: చూ, స్నేహితుఁడు; 2: చూ, హృదయాళువు; అం. 3: చూ, సుహృదులు.

**సుహృదులు.** అం: చూ, రాజ్యాంగములు(చూ, సప్తాంగములు. అంగము. 9.)

**సుహోత్రుఁడు.** అం: చూ, మహారాజులు.

**సుహ్మ.** అం. ఒకానొక దేశము: చూ, సీమ. (1) (దేశములు.)

**సుళువు.** వై. విణ.=సులభ: చూ, రూ-సులువు.

**సుళ్లమారి.** దే. విణ. 1. సుడులుగలవాఁడు; 2. చేట్లబెట్టువాఁడు.

## సూ

**సూ.** వై. అవ్య. 1.=స్మ. చూసుమి: చూ, రూ-సుమ; 2. నిశ్చయార్థకము, సుమీ. ఆం, భా. త్రృ. 68: చూ, సత్యము. 1.

**సూకరము.** సం. వి. అ. పుం. పంది: ఆఖనికము, ఆఖువు, ఆరువు, ఆసురి, కమలాసనము, తాకరూటి, కిటి, కిరము, కిరి, కుందారము, కుఖనకము, కుముఖము, కోలము, క్రోడము, గృష్టి-ఘృష్టి, గ్రాహము, ఘోణి, చక్రముఖము, జలప్రియము, దంష్ట్రాయుధము, దంష్ట్రి, పోత్రి, రోమశము, స్తబ్ధరోమము, స్థూలనాసము. (తె) ఊటమెకము, ఏఁదుమెకము, ఒంటరి, ఒంటరికాఁడు, ఒంటికాఁడు, కొమ్మకాటు, కొమ్ముకాఁడు, గుర్గురిం

చేమెకము, గుర్గురింత, గూఁటి, చేర్పరించే మెకము, చేప్పరింత, జోగిలంబులమి_త్తి, పంది, పీఁటవెట్టుమెకము, ముట్టెమెకము, ముస్తెలమేపరి. తద్విశేషములు.— ౧: గ్రామసూకరము, విట్చరము. (తె) ఊరపంది; ౨. ఏదుపందికి.-శలలము-శలము, శలలి-శల్లకి, శలాక, శల్యకము-శల్యము, శ్వావిధము. (తె) ఏకు, ఏదుపంది, నెలపంది, ముండ్లపంది-ములుపంది, సలుగు-సలువు; ౩.నీరుపందికి -అలస్యము, కచ్ఛపసంస్థానము, కుటిచరము, ఘోషికము, శంకువు. (తె) నీరుపంది (చూ, జలసూకరము, జలరూపము; చూ, మత్స్యము. 1-3.); ౪. కచ్ఛ, వరాహి-వారాహి. (తె) ఆఁడుపంది; ౫. ఆడివరాహమునకు.-(తె) తొలుపంది-తొల్పంది; ౬: శల్యకము. (తె) ఆఘుగ-ఆఘువ, ఇబ్బంది; ౭. కొంకణదేశపు ఆఘువకు: కందాళువు, కాసకందము, కాసాలువు; ౮. కోడెవయసుగల పందికి.-(తె) చేల్లరము; ౯.అడవిపందికి.-ఏకచరము, ఏకలము, వనసూకరము, వాలమృగము. (తె) అడవిపంది, అడవిరాజో, ఏకలీఁడు, ఏతలము, బంటుమెకము, మొట్టిమెకము, మోటజోరుమెకము, మోటుమెకము, మోటువామెకము, రోబంటరి-లోబంటరి, వాలుమెకము, వేల్పులమి_త్తి; ౧౦: (చూ, వరహావతారము); ౧౧. పందికోఱచివరకు.-ఫలము; ౧౨. పందికోఱకు:-చూ, పల్లు 1-౨. ౧౩. పందిమూతికి.-పోత్రము.

సూకరీప్రసవన్యాయము. అం. ఒక న్యాయము.

సూ_క్తద్రష్టలు. అం: శతర్చులు, మధ్యములు, క్షుద్రసూ_క్తులు, మహాసూ_క్తులు. (4).

సూ_క్తములు. అం: నారాయణసూ_క్తము, పురుషసూ_క్తము, శ్రీసూ_క్తము, భూసూ_క్తము, నీళాసూ_క్తము (5).

సూ_క్తి. సం. వి. ఇ. స్త్రీ.=సుద్ది. వృత్తాంతము: చూ, సమాచారము. 2. [సూక్ష్మల.

సూక్ష్మ. సం. వి. ఆ. స్త్రీ. పత్రిల*: చూ,

సూక్ష్మఖండములు. సం. వి. అ. న. బ. తుత్తునియలు: చూ, శకలము. 4.

సూక్ష్మతండులములు. సం. వి. అ. న. బ: గసకము. (తె) గసగసలు-గసగసాలు.

సూక్ష్మదశాపరిమాణము. అం: చూ, విదశలకు సూక్ష్మదశలుకట్టుపద్ధతి.

సూక్ష్మదారువు. సం. వి. ఉ. పుం. దేవదారువు*: ఆమీవత్సము, ఉచ్ఛ్రితము, కాష్ఠదారువు, కిలింజము, కిలిమము, కృమిఘ్నము, దారువు, దేవకాష్ఠము, దేవదారువు, ద్రుకిలిమము, ద్రుమము, పారిజాతకము, పారిజాతము, పారిభద్రము, పీతదారువు, పూతికాష్ఠము, పూతిదారువు, భద్రదారువు, వరచందనము, శక్రపాదపము. (తె) దేవదారి. తద్వి.— బాడిదచెట్టుకు. - అంసరంగికము, కపికచ్ఛ్వము, నింబతరువు, పారిభద్రము (అనికొందఱు), రోహిణము, వారిజము. (తె): బాడిద- బాడిదము-బారిజేము-బారిదము-బారిసము- వారిజము-వారిదము. *.

సూక్ష్మపర్ణి. సం. వి. ఈ. స్త్రీ. రామదూతి అను ఒకరకము తొళసి*: చూ, హరిప్రియ.

సూక్ష్మఫల. సం. వి. ఆ. స్త్రీ. గుసుగు *: చూ, హస్తిని.

సూక్ష్మము. సం. వి. అ. న. 1. అధ్యాత్మము, బుద్ధి: చూ, హృల్లేఖము. 2; 2. కపటము: చూ, వ్యాజము. 1. తద్వి.—కపటప్రపంచనకు.—(తె) మెలక; పుం. 3. అణువు: చూ, స్వల్పము; విణ. 4. సన్నము, అలకన,

సయికము_సైకము: చూ, స్వల్పము; 5. పరమాత్మ: చూ, హంసుఁడు; అం. 6: చూ, అలంకారము. 3. ("ఇతరుల భావమెఱింగిన భావగర్భిత చేష్ట: ఉదా.—నేను గనుఁగొను పొండఁదనమాళిమణింగచము చేఁదప్పె"); అం. 7: చూ, శరీరములు; 8: చూ, లక్ష్యములు; 9: చూ, ఆగమములు (ఉపవిద్యలు)

సూక్ష్మైల. సం. వి. ఆ. స్త్రీ. సన్నయేలకి.* వయస్థ*: చూ, చిత్రిల

సూచకము. సం. వి. అ. పుం. 1: చూ, సూది; 2. నక్క: చూ, సృగాలము; 3. కుక్క: చూ, శునకము; 4. కాకి: చూ, సకృత్ప్రజము; 5. పిల్లి: చూ, మార్జాలము. తద్వి.—పూతిమార్జాలమునకు:–లోమశము, శాలి; 6. తెలియఁజేయుట: అభిధాయకము, ఆవేదనము, సూచన. (తె) ఎఱుక, తెలుపుడు-తెల్పుడు; 7. మొఱిగెడి కుక్క: చూ, శునకము.

సూచకుఁడు. సం. విణ. 1. కొండెము చెప్పువాఁడు: కర్ణేజపుఁడు, ద్విజిహ్వుఁడు, పిశునుఁడు. (తె) అంగుడుదుడిపి-అంగుడుదుడుపు, ఇల్లామల్లి, ఒరుదలకాఁడు, కొండగీఁడు, కొండియుఁడు-కొండీఁడు (కొండెకాఁడు)-కొండెగీఁడు, చాడీకోరు, చాడీగొట్టు, తంటలమారి-తంటాలమారి, తనకలి, బందులమారి; 2. బోధచేయువాఁడు: అనుశాసకుఁడు, ఉపదేశకుఁడు, ఉపదేష్ట, బోధకుఁడు. (తె) నేర్పువాఁడు; 3. వేఁచికోరు: చూ, లడాయిగాఁడు.

సూచన. సం. వి ఆ. స్త్రీ. 1: ఛాయ. (తె) ఆచోఁకి-ఆచోకి, ఇమ్ము-వ, ఈగడ, ఎచ్చెరిక-హెచ్చెరిక, కఁదువ, కన్ను, చాయ-చోచాయ, చొప్పు, జాడ, తాపి-తాపీ, దత్తా, పొరువ, పులుగు, పొలకువ, పోఁము, పోబడి-పోవడి, సంచు, సడి, సవ-సవడి_సవ్వడి, సౌవ. తద్వి.—౧. కాలిజాడకు.—వర్తని; 2. గుర్తుచేయుట; 3. తెలుపుట: చూ, సూచకము. 6; 4 చూపు: చూ, వీక్షణము.

సూచి. సం. వి. ఈ. స్త్రీ. 1. (రూ-సూచిక_సూచిని-సూచ) శూర్పిక: చూ, సూది; అం. 2: చూ, అసంయుత హస్తములు; 3: చూ, చరణక్రియలు; 4: చూ, అసంహతవ్యూహములు; 5: చూ, దరిభానవ్యూహములు; 6: చూ, దండవ్యూహములు; 7: చూ, కరణములు; 8: చూ, ఆకాశచారలు.

సూచించు. సం. స క్రి. 1. జాడగా తెలియఁజేయు: (తె) ఎగఁబోయు; 2. తెలియఁజేయు.

సూచిక. సం. వి. ఆ. స్త్రీ. 1.=సూచి: చూ, సూది; విణ. 2. తెలియఁజేయునది.

సూచితము. సం. విణ. 1. జాడగా తెలుపఁబడినది, ఉచితము: చూ, స్పష్టము; 2. తెలుపఁబడినది, ఉచితము: చూ, స్పష్టము.

సూచినుకు. వా. వి. అల్పధారావర్షము. ఆంభా. చరి 74: చూ, సోన (వాన. 1.)

సూచియానము. సం. వి. అ. న (రూ_సూచీనము - సూచీవయనము - సూచీవానము): చూ, సూయాణము. 2.

సూచీనము. సం. వి. అ. న.—పై.—

సూచీవయనము. సం. వి. అ. న.—పై—

సూచీవానము. సం. వి అ. న.—పై.—

సూచీకటాహన్యాయము. ఆ. ఒకపనివానికి గాబొకటియు, సూదొకటియు చేయుమనిఁ జెప్పఁ గొంతకాలమునకు సూదియిచ్చి గాబిమ్మనిఁ దొందరచేసినపుడు రెంటిలో నొకటి నిచ్చియుండ రెండవదానికి యింత తొందర యేల ననినరీతి.

సూచీపుష్పము. సం. వి. అ. పుం. వలీవకము*: చూ, మొగలి. తద్వి.—మొగలికి:— స్త్రీభూషణము:— (చూ, స్వర్ణకేతకి).

సూడుకొను. దే. అ. క్రి. 1. పగగొను. భో. 3. ఆ. 37: ఈరసించు, ఒడ్డారించు, కంట గించు, పగఁబట్టు, పగగొను, మచ్చరించు-మచ్చరికించు, మాడించు, సూడుపట్టు (సం) ద్వేషించు, విద్వేషించు, విరోధించు, వైరించు, వైరించు. (వి. అసూయకు:) (తె) ఈరసించు, కాంతాళపడు; వా. 3. చేలపట్టు, చేలుగాడుచు, చేలముకొను, చేల పోరు, మచ్చరించు-మచ్చరికించు (సం) అగ్రహించు; వా. 3. గర్భముధరించు (అని కొందఱు.) [8, ఆ 50: చూ, సూడుకొను.

సూడుపట్టు దే. స. క్రి. విరోధించు. వై

సూతకము. సం. వి. అ. న. 1. జాతాశౌచము. (తె) పురుడు; 2. మైల: చూ, మృతాశౌచము; పుం, న. 3: చూ, సూత్రము.

సూతపుత్రకుఁడు. సం. వి. అ. పుం: అంగరాజు, అంగాధిపుఁడు, అర్కనందనుఁడు, ఏకవీరుఁడు, కర్ణుఁడు, ఘటోత్కచాంతకుఁడు, చంపేశుఁడు, యువరాజు, రాధేయుఁడు, వసుషేణుఁడు. (తె) పొత్తిద్దుఁగొడుకు, పొత్తిద్దుఁబట్టు, పొత్తిద్దుకూన, పొత్తిద్దుమోలి. (సూత్రపుష్పుకుఁడు అని కొందఱు.)

సూతము. సం. వి. అ. పుం. పాదరసము: అమరము, అశోకము, చపలము, ఖేచరము, చతంగము, పారతము, పారదము, బలము, మహారసము, రసము, రసధాతువు, రసము, రాసము, సూత్రకక్షము, [illegible] [illegible]

సూతి. సం. వి. ఈ. స్త్రీ 1. కుట్టు: చూ, స్యూతి. 1; 2: ప్రసవము, ప్రసూతి, సూనము. (తె) కానుపు-కాన్పు, పెపవము. తద్వి —. ౦. పశ్వాదుల యీనికకు.—ప్రసవము. (తె) ఈనిక; ౩. గర్భసావ్రమునకు.-(తె) కట్టుక-కట్టుగ; 3. పశుగర్భస్రావమునకు.—(తె) కట్టుక-కట్టుగ; ౪. గోవు ప్రసవమునకు.—గువాకము _ గూవాకము-గువాకువు.

సూతిక. సం. వి. ఆ. స్త్రీ: జాతపత్య-జాతాపత్య, ప్రసూత, ప్రసూతి. (తె) పురుటాలు, పురిటికూన, బాలెంత-బాలెంత, బాలింతరాలు, బాలెంతరాలు, బిడ్డతల్లి (చూ, స్త్రీ.).

సూతికాగృహము. సం. వి. అ న (రూ-సూతికాగృహము) పురిటియిల్లు: చూ, సదనము. 1.

సూతిని. దే. వి. సూతిని యను దేశము. వీలా. 3, ఆ. 90: చూ, సీమ (1)-౨౯.

సూతుఁడు. సం. వి. అ పుం. 1. తేరుగడపువాఁడు: చూ, సారథి; 2. బట్టువాఁడు: స్తుతిపాఠకుఁడు, స్వస్తిముఖుఁడు: చూ, వంది; 3. వడ్లంగి: చూ, స్వర్ణకారుఁడు.

సూత్థానుఁడు. సం. విశ 1. నేర్పరి: చూ, సమర్థుఁడు; 2. శరీరముచేఁ జేనిబంటు: చూ, హంవీరుఁడు. 2. [భేదములు.

సూత్రగ్రాహకుఁడు. అం: చూ, హయపాలక

సూత్రతంతువు సం. వి. అ. పుం. పుస్తె, మంగళసూత్రము: చూ, భూషణము. 2.

సూత్రధారుఁడు. సం వి. అ. పుం.1. ఆటాడించువాఁడు: (తె) కీలుకాఁడు, జంత్రకాఁడు, తారి-దారి-దారిదారి; 2. నడిపించువాఁడు; 3. వడ్లంగి, సూతుఁడు: చూ, స్వర్ణకారుఁడు; 4. ఇంద్రుఁడు: చూ, సూత్రాత్ముఁడు; అం. 5 నాటకము నడిపించువాఁడు: చూ, నటి.

[illegible] పడు: చూ, సరిపడు. 2. [సూతపుత్రకుఁడు.

సూత్రపుష్పకుఁడు. సం. వి. అ. పుం: చూ,

సూత్రపుష్పము. సం. వి. అ. పుం. ప్రత్తి: చూ, సముద్రాంత. 3.

సూత్రము. సం. వి. అ. న. 1. నూలిపోఁగు: అల్పము, ఊర్ణ, త్రుల్లకము, త్రుల్లము, త

తువు, తనువు, దశ్రము, శ్లక్ష్ణము, సూక్ష్మము, స్తోకము. (తె) అలుపము, తంతువు, నూలు, పోఁగు-ప్రోఁగు-ప్రోవు, పోఁచె-ప్రోఁచె. తద్విశేషములు.—౧. బ్రహ్మసూత్రమునకు.—త్రిసూత్రము. (తె) మునున్నూలు-మూన్నూలు, ముప్పిరి, ముప్పేట; ౨. పట్టుపురుగు నేసెడు పట్టునూలునకు.—(తె) పొత్తినూలు, పొత్తు; ౩. పట్టునూలునకు.-పట్టము. (తె) పట్టు, దసిలీ, బురుసా, మొగ్గపట్టు; ౪. ఎఱ్ఱపట్టునకు.—(తె) బురుసా; ౫. నూలుతునుకకు.—పత్కృము; ౬. నూలిమొలతాడునకు.-ధటిని; ౭. నూలుపిడికి.—(తె) పాగడ, పిడి; ౮. దూరదూరముగా పోయు నూలిపోఁగునకు.—(తె) పాలు పోఁగు; ౯. ముప్పదియొనికెల నూలునకు.-(తె) పుంజెము; ౧౦: (తె) కండియు-కండె, నూలుకండె, ఫత్తెడ. సరిగ; ౧౧: పండెను తీసి చేట్టిన నూలుకు.-(తె) ఈరె; ౧౨. ఎఱ్ఱనూలుకు.-(తె) తోఁగరు; ౧౩. పొడుగుపోఁగునకు—(తె) ఓతము; ౧౪. గట్టినూలిపోఁచేలకు.-(తె) చెవికెలు; ౧౫. జందెమునకు.-(చూ, సూత్రము. 1-౧): ఉత్తరీయము. ఉపవీతము, పవిత్రము, బ్రహ్మసూత్రము, యజ్ఞసూత్రము, యజ్ఞోపవీతము, సప్తతంతువు, సూత్రము. (తె) జందియము-జందెము-జన్నిదము, పోఁచె-ప్రోఁచె; ౧౬. మెడను దండవలె వ్రేలెడు జందెమునకు.-కంఠలంబితము, నివీతము; ౧౭: (చూ, ప్రీతసూత్రము): భుజిష్యము. (తె) డోరము-దోరము; ౧౮. సందిటఁగట్టుకొనెడు తోరము:-(తె) దండచేరు; ౧౯. యోగులు జందెమువలె వేసికొనెడు పట్టులోనగువాని పట్టెకు.-పరికరము, పర్యంకము-పల్యంకము, పర్యస్తిక, యోగపట్టము. (తె) ఒడ్డాణము, జోగపట్టియు-జోగపట్టె-జోగిపట్టియ-జోగిపట్టె-యోగపట్టె; ౨౦. ఎద్దుమొదలైనవాని మెడను గట్టెడు పట్టెడకు.-(తె) పట్టెడ; ౨౧ ఎడ్లకొమ్ములకుఁగట్టెడు కుచ్చులతోలు త్రాడునకు.-(తె) తలత్రాడు, పగ్గము-ప్రగ్గము; ౨౨. మంచెపుపట్టెడకు.—(తె) నవారు, పట్టెడ; ౨౩. దూదిమేట్టకు - తూలనాసిక, తూలనాళిక, పంజిక-పింజిక. (తె) దూదిమేట్ట, ఏకు; ౨౪. త్రాడునకు-అభీషువు, కశ, ఛిదిరము, పాశము, రజ్జువు, రశ్మి, వటము, వటి, శుంభము. (తె) కంబరత్రాడు, కొబ్బరిత్రాడు, చేత్రాడు, చేరు-చేఱు, తాడు-త్రాడు, దాము, పగ్గము-ప్రగ్గము, బొందు, వడము; ౨౫. బట్టలారవేసికొనుటకుఁగట్టిన త్రాడునకు-దండిక. (తె) దండియ-దండియము-దండెము-దణ్ణెము; ౨౬. జెట్టియుపకరణమునకు:—(తె) జోలత్రాడు; ౨౭. మంచెముఅల్లెడు త్రాడుకు: (తె) నులక-నుల్క; ౨౮. కపిలెబొక్కెనతోఁకకు కట్టెడు త్రాడుకు.-తొండపుఁద్రాడు-తొండపుఁద్రాడు; ౨౯. జేనపనారతోనల్లినవల త్రాడుకు.— పవిత్రకము, శణసూత్రము; ౩౦. ఉరత్రాడుకు.-(తె) దామర; ౩౧. తంతువునకు (వీణెలోనగువానికి వేసెడు ఉక్కుతీఁగెలకును వర్తించును):—సుబ్రము, తంతువు. (తె) తంతి, తీఁగ-తీఁగియ-తీఁగె, తీవ-తీవియ-తీవె. (చూ, సారణి. 3.); ౩౨ మెడత్రాడుకు.- గ్రైవము-గ్రైవేయకము-గ్రైవేయము; ౩౩. నెమలియీకల దారముకు: (తె) నెట్టము - నెట్టియము - నెట్టెము; ౩౪. బొంగరపుత్రాడుకు:—(తె) జాలి-జాలియ-జాలె; ౩౫. పెద్దపెద్దదూలములు మోయుత్రాళ్ళకు.-(తె) (బ): జేడ్డికపుత్రాళ్లు; ౩౬. పెక్కుతిలలుగల నిడివిత్రాడుకు.—దా

ము. (తె) దామెన; ౩౭. పాలుపితుకునపుడు వెనుకటికాళ్లు కలిపికట్టు త్రాడుకు.- (తె) గుదిత్రాడు, బందము; ౩౮. చిలుకకాలిత్రాడుకు.-(తె) చిలుకత్రాడు-చిలుకత్రాడు; ౩౯. ఏనుఁగునడుమునఁ గట్టెడు తోలుమోకుకు.-కక్ష్య, కక్ష్యము, కక్ష్య, చూష, దూష్య, వరత్ర. (తె) నడికట్టుత్రాడు, పటకా; ౪౦. లావుత్రాడుకు.- వరాటకము. (తె) మోకు, వడము; ౪౧. కవ్వమును దిగిలించేటకై తరిగంబమునందుఁ గట్టెడుత్రాళ్లు.- (తె) ఆఁకత్రాళ్లు, చేల్లగుదులు, చేల్లత్రాళ్లు, తఁత్రాడు, త్రిప్పుత్రాడు, పగ్గము-పగ్గము; ౪౨. సిరియెక్కించిన త్రాడుకు.-(తె) జిఱ్ఱత్రాడు-జిఱ్ఱుత్రాడు; ౪౩. కర్ణాటకపు గుపాకుల చెవియందుంచి విప్పుముట్టించెడుత్రాడుకు - (తె) జోపకి, ౪౪. పక్షులనుబట్టెడుత్రాడుకు.- (తె) తిరుగుడుత్రాడు; ౪౫. శ్యేనరజ్జువునకు -(తె) తోరెము-దోరెము; ౪౬. ముంజెగడ్డి మొలత్రాడుకు.-క్షోణి-క్షోణీ, మౌంజి, (తె) ముంజి; ౪౭. వేనివేని కట్టియీడ్చెడి త్రాళ్లకు.-పంబుఁదాళ్లు; ౪౮. పట్టుత్రాడుకు - రాగసూత్రము; ౪౯. సాలెవాఁడు పడుగు నీడ్చికట్టెడు త్రాడుకు.-(తె) పగ్గము-పగ్గము; ౫౦. రథాదులను లాగెడు త్రాడుకు.- పరంపరావాహనము, వైనీతకము. (తె) పగ్గము-పగ్గము; ౫౧. మెట్టెలీవల రానీని త్రాడుకు —(తె) పేర్మించే; ౫౨. చెట్టెక్కువాని కాలిత్రాడుకు.— (తె) బందము, గుదిత్రాడు. ౫౩. ఆళ్లపనివారు దిండుపక్క కొయ్యలకుఁ గట్టెడి బిగిదారముకు.— (తె) మేఁకదారము; ౫౪. గోనెలులో పగునవికుట్టెడుత్రాడుకు.—(తె) సిరి-పురి; ౫౫. గడ్డిత్రాడుకు.—(తె) తొంట, పిరి-పురి, వెంటి; ౫౬. కుప్పనూర్పునందు ఎడ్ల వరుసకుఁ గట్టెడి పలుపునకు.-(తె) బంతికట్టు, బంతికట్టుపలుపు; ౫౭. కాళ్లకట్టుత్రాడుకు.-(తె) పుంజెము; ౫౮. ధాన్యముపట్టిన గోనెలుకుట్టెడి త్రాడుకు -(తె) పురి, పురికొస-పురికోస, ౫౯. పిట్టలఁదోలుచేరుకు.- (తె) పిట్టదిమ్మె; ౬౦. వేఁటత్రాడుకు.- (తె) పోఁగు-పోఁగు - పోఁగుఁదాడు; ౬౧. త్రాసు (లేక) తూనికకోలలత్రాడుకు.- ప్రగ్రహము- ప్రగ్రాహము, రాగసూత్రము; ౬౨. కట్టెలమోపుకట్టెడి త్రాడుకు.- (తె) బిగువాళ్లు; ౬౩. సాధము. (తె) ముకుఁదాడు-ముక్కుఁద్రాడు; ౬౪. పురుషుని కటిసూత్రమునకు.- అందుకము, కటిసూత్రము, శృంఖల-శృంఖలము, గోవమొలత్రాడు, మొలత్రాడు, మొలనూలు; ౬౫ పశుకంఠరజ్జువు -ఆబంధము, కుశము, నిదానము, యోక్త్రము, యోత్రము, వనువు, సందానము-సంధానము (తె) కన్నియ-కన్నె, కన్నెత్రాడు, తగులు, తలుగు-తల్గు, పలుపు-పలువు, లంకియ-లంకె, లంకెపలుపు, పల్లె; ౬౬. గుఱ్ఱములోఁ గువాని కళ్లెములో నగువానియందు తగిల్చియీడ్చబట్టెడు త్రాడుకు.-ప్రగ్రహము- ప్రగ్రాహము. (తె) పగ్గము-పగ్గము; ౬౭. గుఱ్ఱము మెడఁగట్టెడుత్రాడుకు.-(తె) పలుపు; ౬౮. గుఱ్ఱము కాళ్ళఁగట్టుత్రాళ్లకు -(తె) పాలసత్రాళ్లు-పాలాసత్రాళ్లు; ౬౯. త్రాళ్లసమూహమునకు.—గళ్య, గ్రామత, జనత, ధూమ్య, పాశ్య; ౭౦. చేఁపలగాలపు త్రాడుకు.- బరండము; ౭౧. చిలుకడత్రాడుకు.- మేఖల; ౭౨. పడవపెద్దమోకుకు.- (తె) సవాయి; ౭౩: సప్తతంతువు; ౭౪. మాలలుచేయుసన్నసూలుకు.-(తె) మాలనూలు; ౭౫. నాలుగు

(వేళ్లకుచుట్టితీసిన నూలుచుట్టకు.-(తె) విచ్చె; ౭౬. మృగములను పక్షులను బట్టెడు ఉరిత్రాడుకు.-వితంసము-వీతంసము; ౭౭. కుక్కపెడతాళ్ళకుక్క.-(తె) పడికియ-పడికియ్య-పడికె; [illegible]
[illegible]
(తె) సంజోక; ౮౦: చూ, అగ్గిబొద్ది; ౮౧: చూ, వాకెన. 1; ౮౨: చూ, వాకెన. 2; ౮3: చూ, వాకెన. 3; 2. శాస్త్రాది సూచకగ్రంథము: చూ, సంపుటము. 3; 3. జన్నిదము: చూ, సూత్రము. 1; 4. ఏర్పాటు: చూ, సత్యము. 1; అం. బ. 5: చూ, సూత్రములు.

సూత్రములు. అం: కల్పసూత్రములు, గృహ్యసూత్రములు, ధర్మసూత్రములు (3): చూ, కల్పసూత్రము.

సూత్రశాటకన్యాయము. అం. నూలుతో బట్టనేసెనఁగా నూలును బట్టగా నేసెనని యర్థము అను రీతి.

సూత్రాభిషేకము. అం: చూ, అభిషేకము.

సూత్రించు. సం. స. క్రి. సూత్రపఱచు.

సూదంటుతాయి. ద్వ. వి. అయస్కాంతము: చూ, రత్నములు. ౬.

సూదనము. సం. వి. అ. న. 1. చంపుట: చూ, హింస. 1; విణ. 2. చంపునది: చూ, హింస్ర. 2.

సూదము. సం. వి. అ. పుం. [illegible]: చూ, [illegible].

[illegible]
౧: కాగితములుకుట్టెడుపిడిగలపెద్దసూదికి.-కంటాణి-కంటాళము, కంతాణి; ౨. చేఁపలనుఁగుచ్చెడుసూదికి:-కోపు; ౩. గోనెలుకుట్టెడుసూదికి:-డబ్బడము-డబ్బనము; ౪: అనువుసూది, గుండుసూది; ౫. మాదిగచెప్పులుకుట్టుసూదికి.-ఆరె, ఎడార, కెంకియ-కెంక, చిలుకయారె. (సం) చర్మభేదిక; ౬. తాటాకులకు బెజ్జము వేసెడి పనిముట్టుకు.- (తె) కెంకి; ౭. మేఁకలకాలిగుట్టలలోని ముల్లుతీసెడు సూదికి.-(తె) ముచ్చెపల్లు; ౮. [illegible]
[illegible]
[illegible]

సూదిగొంటు. వై. వి. లతాపూగము: చూ, [illegible]. 1 (సూదిగొంటు వక్క-అని కొందఱు)

సూదితము. సం. విణ. చంపఁబడినది: జ్ఞపితము, నిబర్హితము, నిహతము, వ్యాపాదితము, సంజ్ఞపితము, సంస్థాపితము. తద్వి.—౧. (యజ్ఞమునందు) వధింపఁబడినది:—అపాకృతము, ఉపసంపన్నము, పరిమితము, ప్రోక్షితము; ౨. చంపునది:—చూ, హింస్ర. 2.

సూదిమల్లె. వై. వి. సన్నమల్లె*: చూ, హాసంతి. 2.

సూదిమొన. వా. వి. సూదియొక్క చివర: చూ, సితాగ్రము.

సూదిరాయి. ద్వ. వి: చూ, సూదంటుతాయి.

సూదుఁడు. సం. విణ. వంటవాఁడు: చూ, సూపకారుఁడు.

సూన. సం. వి. ఆ. స్త్రీ. 1. కూఁతురు: అంగజ, ఆత్మజ, ఆత్మభువు, ఉద్వహా, కన్య, కుమారి, కుమారిక, ఝుల-ఝూలి, తనయ, తనుజ, దుహిత, నందన, పుత్రిక, మాలిక, వశ, సుత, సూనువు. (తె. వ): అమ్మాయి, ఆఁడుపడుచు, ఆఁడుబిడ్డ, కన్నియ, కన్నె [illegible]
[illegible]
కొమారితె-కొమార్త-కొమాత్తె-కొమిరె, పట్టి, బిడ్డ-బిడ్డె, బుల్లి, బొట్టియ-బొట్టె, మేపుట్టువు. తద్విశేషములు.—౧. ఇతరుని వలన తన భార్యయందుపుట్టిన కన్య.-క్షేత్రజ; ౨. తల్లితోడఁబుట్టినదానికూఁతురు.—మాతృష్వసేయ-మాతృష్వస్రీయ; 3. ఇంద్రు

ని కూఁతురు:-జయంతి; ౪. కవేరరాజపుత్రిక:-కవేరజ; ౫. కుబేరునికూఁతురు:-కటమాలిని, మదిర; ౬. జనకమహారాజుకూఁతురు:-ఊర్మిళ; ౭. ద్రుపదరాజుకూఁతురు:-కాళిక, ద్రౌపది, పంచమి, పాంచాలి, పార్షతి. (తె) దోపద-దొప్పది; ౮. (నాట్యపరిభాషయందు) రాజుకూఁతురు:- భర్తృదారిక; ౯. బాణాసురునికూఁతురు.-అర్జుని, ఉష, బాణాత్మజ; ౧౦. విరటునికూఁతురు:-ఉత్తర; ౧౧. విష్ణుచిత్తునికూఁతురు:-గోద; ౧౨. మనుమరాలుకు.-(చూ, మనమరాలు); ౧౩. మనుమరాలు కూఁతురుకు.-ప్రపౌత్రిక. (తె) ఇనుమనుమరాలు, మునిమనుమరాలు-ముమ్మనుమరాలు; ౧౪. భాగ్యవతికూఁతురుకు.-సౌభాగినేయి; 2. కొండనాలుక:లంబిక, పట: చూ, రసన. 1; (చూ, రోగము. 1-౪); 3. వధస్థానము; అం. 4. పంచసూనములు:- కండని (రోలు), పేషణి (సన్నికల్లు), చుల్లి (పొయ్యి), ఉదకుంభి (నీళ్లకడవ), మార్జని(పొరక): చూ, స్థానము. 1.

**సూనగాఁడు.** మి. వా. విణ. చేంపువాఁడు:చూ, సూనరి. (కటికవాఁడు అని కొందఱు).

**సూనజీవి.** సం. వి. ఈ. స్త్రీ. (దీనివిత్తులుగర్భోత్పత్తి కలుగఁజేయును. శుక్లవృద్ధిచేయును); అతఃఫలము, అర్థసిద్ధి, కుమారజీవము, కృతబిజ్జము, గర్భండము, గర్భకరము, పుత్రంజీవకము, పుత్రజీవము, పుత్రజీవి*.

**సూనము.** సం. వి. అ. న. 1. ప్రసవము: చూ, సూతి. 2; 2. రూ-ప్రసూనము. పువ్వు:చూ, సుమము; 3. అంకుశము: చూ, సృణి. 4 (బాణము. 1-౨౧); విణ. 4: చూ, శూన్యము. 1.

**సూనరి.** వై. విణ.=సూనాకర. 1.చేంపువాఁడు: చూ, హింసకుఁడు; 2: పూలమ్మువాఁడు, పూలకరి-మాకరి. (సం) మాలకరుఁడు-మాలాకారుఁడు, మాలి, మ?నుఁడు, వనార్చకుఁడు. (చూ, మాలకరి. 1); 3. సున్నము పూయువాఁడు, ?: చూ, సూనరి.

**సూనాకరుఁడు.** సం. విణ.=సూనరి: చూ, సూనరి. 1-2.

**సూనుఁడు.** సం.వి.ఉ.పుం. 1 (సూనువు)కొడుకు: అంగజుఁడు,ఆత్మజుఁడు, ఆత్మనీనుఁడు,ఆత్మభువు, అనుబంధుఁడు (వు), ఉద్వహుఁడు, ఋక్థ్సు, కుమారకుఁడు-కుమారుఁడు, కులధారకుఁడు-కులాధారకుఁడు, జీవనుఁడు, జైవాతృకుఁడు, ?ృతి, ?, ?, తనయుఁడు, తనుజుఁడు-తనూజుఁడు, తనూభవుఁడు, దాయాదుఁడు, ద్వితీయుఁడు, నందనుఁడు, పుత్త్రుఁడు, భూతుఁడు, వర్ణుఁడు, సుతుఁడు. (తె. వ) అబ్బాయి, కన్నకొడుకు, కుఱ్ఱ-కుఱ్ఱఁడు, కొడుకఁడు-కొడుకు-కొడుకు, కొమరుఁడు-కొమారుఁడు, పట్టి, పీకఁడు, బిడ్డ-బిడ్డఁడు-బిడ్డె, బురకఁడు, బొట్టియ-బొట్టియఁడు-బొట్టె, మేపుట్టువు. తద్విశేషములు.-౧:-పండ్రెండుగురుపుత్రులకు:- చూ, పుత్రులు. 1; ౨. ఐదుగురుపుత్రులకు:- చూ, పుత్రులు. 2; 3. ధర్మపత్నిపుత్రునకు.-ఉరస్యుఁడు-ఔరసుఁడు-ఔరస్యుఁడు; ౪. తండ్రినిఁబోలిన కొడుకునకు.— మనోజవసుఁడు-మనోజవుఁడు; ౫. శూద్రవనితయందు బ్రాహ్మణుని వలనఁ బుట్టినకొడుకు:-పారశవుఁడు; ౬. శూద్రస్త్రీయందు క్షత్రియునకుఁ బుట్టినకొడుకు.—క్షత్త; ౭. దేవరాదిన్యాయము ననుసరించి భర్త మున్నగువారిచేత నియమింపఁబడిన భార్యయందు ఇతరుని

వలనఁబుట్టినకొడుకు- క్షేత్రజుఁడు; ౮. విధవకు అంకుమగనియందుఁ బుట్టిన కొడుకు.- గోలకుఁడు- గోళకుఁడు- గోలుఁడు; ౯. పరస్త్రీవలనఁ బుట్టినకొడుకు.— పారస్త్రైణేయుఁడు; ౧౦. భర్త యనుమతిలేక అంకుఁబోయికన్నకొడుకు.— గూఢజుఁడు, గూఢోత్పన్నుఁడు; ౧౧. చెడిపోయిన బ్రాహ్మణస్త్రీకొడుకు.— కుండకీటుఁడు; ౧౨. అవివాహితపుత్త్రుడు — కన్యకా జాతుఁడు, కానీనుఁడు; ౧౩ మగఁడుండఁగా అంకుమగనికిఁ బుట్టినకొడుకు.— కుండుఁడు, గూఢజుఁడు. (తనభార్యయందు కన్యాత్వమున రహస్యముగా నితరునికిఁబుట్టిన కొడుకు అని కొందఱు); ౧౪. తల్లిదండ్రులయొద్ద వెలకు కొన్న కొడుకు.— కాండపృష్ఠుఁడు, క్రైతిముఁడు, క్రీతసుఁడు, క్రీతుఁడు; ౧౫. దత్తపుత్త్రుడు.— దత్తకుఁడు, దత్తుఁడు; ౧౬: చూ, అంకులాఁడికొడుకు. బంధులుఁడు, (తె) లంజెకొడుకు, పలువిత్తు; ౧౭. భిక్షమెత్తెడి పతివ్రత కొడుకు.— కౌలటినేయుఁడు- కౌలటేయుఁడు- కౌలటేరుఁడు; ౧౮. ప్రసిద్ధికెక్కిన గోత్రముగలకొడుకు.— అముష్యాయణుఁడు; ౧౯. తల్లిదండ్రులు లోనగు పెద్దలననుసరించి నడచుకొనుకొడుకు.— అనుబంధుఁడు; ౨౦. మనుమనికొడుకు.— నప్త, నప్త్రి, పరంపరుఁడు, ప్రపౌత్రుఁడు. (తె) ఇనుమనుమఁడు, మునిమనుమఁడు; ౨౧. నాటకమందుపయోగించే కొడుకు.— కుమారుఁడు; ౨౨. ఒకతల్లికొక్కకొడుకు:— అర్జునుఁడు; ౨3. (నాట్యపరిభాషయందు) ఇతరరాజుకొడుకు.— గోస్వామి; ౨౪. తోడఁబుట్టినదానికొడుకు:- భగినీపుత్త్రుఁడు, భాగినేయుఁడు, భ్రాతృజుఁడు, భ్రాతృవ్యుఁడు, భ్రాత్రీయుఁడు. (తె) మేనల్లుఁడు; ౨౫. మనుమనికి కొడుకుకొడుకు — చూ, మనమఁడు. 1; ౨౬. కూఁతురు కొడుకు:— చూ, మనమఁడు. 2; ౨౭ పినతల్లి కొడుకు.— మాతృష్వసేయుఁడు- మాతృష్వస్రీయుఁడు; ౨౮. దాసీపుత్త్రుడు:— క్షత్త, దాసేయుఁడు, దాసేరుఁడు. (తె) లంపతా, లంపతావాఁడు; ౨౯. ఇంద్రుని కొడుకు.— ఇంద్రపుత్త్రుఁడు, ఐంద్రుఁడు, కాకాసురుఁడు, జయంతుఁడు, జయుఁడు, పాకశాసని; 3౦. కుబేరునికొడుకు:— నలకూబరుఁడు; 3౧. కుశునికొడుకు:- అతిథి; 3౨. కుంభకర్ణునికొడుకు.— నికుంభుఁడు; 33 గరుత్మంతునికొడుకు.— సుముఖుఁడు; 3౪. నాగకుమారుఁడు:— సుముఖుఁడు; 3౫. పరాశరునికొడుకు.— వ్యాసుఁడు; 3౬. భరతమహారాజుకొడుకు.— అంగదుఁడు; 3౭. యమునికొడుకు.— కుముదుఁడు; 3౮. పార్వతికొడుకు — కాలేయుఁడు; 3౯. ధృతరాష్ట్రునికొడుకు - ధార్తరాష్ట్రుఁడు; ౪౦. వరుణునికొడుకు.— పుష్కరుఁడు; ౪౧. వశిష్ఠుని కొడుకు. (తె) శక్తి; ౪౨ రుద్రపుత్త్రుఁడు:- భైరవుఁడు; ౪3. రావణునికొడుకు.— మేఘనాథుఁడు; ౪౪. విరాటునికొడుకు.— ఉత్తరుఁడు; ౪౫. శ్రీకృష్ణునిపుత్త్రుఁడు.— చారుగర్భుఁడు, చారుగుప్తుఁడు, చారుబాహువు, చారువిందువు; ౪౬. సుకేశుఁడను రాక్షసునికొడుకు.- మాలి; ౪౭. సూతుని కొడుకు.— కథకుఁడు; ౪౮. హిరణ్యకశిపుని కొడుకు.— ప్రహ్లాదుఁడు, హ్లాదుఁడు; ౪౯. చంద్రునికొడుకు.— వర్చస్సు; ౫౦: చూ, సహోదరుఁడు; ౫౧. ప్రహ్లాదుని కొడుకు:— విరోచనుఁడు; ౫౨. వసిష్ఠుని కొడుకు: చూ, విశ్వకేతువు;

౫౩. సవతితల్లికొడుకు:— వైమాత్రేయుఁడు; ౫౪. వశిష్ఠుని కొడుకు:— శక్తి. ౫౫. వ్యాసుని కొడుకు:— శుకుఁడు; ౫౬. శ్రీరాముని కొడుకులు.—౧. కుశుఁడు, ౨. లవుఁడు; ౫౭. భాగ్యవతి కొడుకు:— సౌభాగినేయుఁడు; 2. తమ్ముఁడు: చూ, సహోదరుఁడు; 3. రవి: చూ, సూర్యుఁడు.

సూనువు. సం. వి. ఊ. స్త్రీ. కూఁతురు: చూ, సూన. 1.

సూనృతము. సం. వి. అ. న. 1: చూ, సుఖము 1; విణ. 2. ప్రియమును సత్యమునైనది(మాట): చూ, శబ్దము. 2-౭౨.

సూన్మదుఁడు. సం. విణ. పిచ్చివాఁడు: చూ, వెఱ్ఱి. 3.

సూన్మాదుఁడు. సం. విణ. ఉన్మాదరోగవిశిష్టుఁడు.

సూన్యమధ్యము. సం. వి. అ. న. కిక్కసకసవు, విభీషణము*: చూ, తృణము. 1.

సూపకల్కము. సం. వి. అ. పుం. పలుచేనిపప్పు: చూ, సూపము. 3.

సూపకారము. సం. వి. అ. పుం.=సువారము. వంట: అరాధనము, పచ, పచనము, పాకము, విపాకము, సంస్కారము. (తె) ఉడుక, బానసము, వంట, సువారము. తద్వి.— (తె) ఉడుకాటము, ఉడుకుట.

సూపకారుఁడు. సం. వి. అ. పుం: అగంధసికుఁడు, ఆంధసికుఁడు, ఆరాళికుఁడు, ఔదనికుఁడు, గుణుఁడు, పాచకుఁడు, వర్ణవుఁడు, వల్లవుఁడు, సూదుఁడు, సూపుఁడు. (తె, అడబాల, కుంచకోకరి, బానసీఁడు, పూఁటకాఁడు, బొనసీఁడు, బోనకాఁడు, వంటపూఁటివాఁడు, వంటరి, వంటలవాఁడు, వంటవాఁడు, సువారంపువాఁడు. తద్వి.— ౧. హీనజాతులకు వంటచేయువాఁడు — (తె) కుకరివాఁడు; ౨. పిండివంటలు చేయువాఁడు.— అపూపికుఁడు, కాందవికుఁడు, కాంయుకుఁడు, భక్ష్యంకారుఁడు.-భక్ష్యకారుఁడు.

సూపతంత్రము. అం: చూ, తంత్రములు.

సూపధూపనము. సం. వి. అ. న. ఇంగువ: చూ, హింగువు.

సూపపదము. సం. వి. అ. న. లేశము: చూ, స్వల్పము.

సూపము. సం. వి.అ. పుం.వండినపప్పు: సూదము, కటాహము, కట్వాగము.(తె) పప్పు, బేడలు, ముద్దపప్పు. తద్వి.—౧ కొఱుక.(తె) పెసరపప్పు, ౨: పణ్యాన్నము.(తె) నానఁబప్పు, వడపప్పు; 3. సూపకల్కమునకు.-సూపకల్కము. (తె) పలుచేనిపప్పు; ౪. కందులులోనగువాని పప్పునకు.— విదళనము; ౫. పప్పుకట్టునకు.— సారము: చూ, యూషము; ౬:(తె) కడుగునీరు, లచ్చింపోరు.

సూపాంగము. సం. వి. అ. న: చూ, సూపధూపనము.

సూపుఁడు. సం. వి. అ. పుం. వంటవాఁడు: చూ, సూపకారుఁడు.

సూయవసము. సం. వి. అ. న.=సూయూణము. శత్రుభీకరదండయాత్ర: చూ, సూయూణము.

సూయానము. సం. వి. అ. న.=—పై.—

సూయూణము వై. వి. వైరభయంకర దండయాత్ర. భార. విరా. 2, ఆ. 320.(వావిళ్ల యందు.— సూయూణము =సూచీనమ్.-(సూచీవానమ్ - సూచియాన - సూచీవయాన,) లేసుఅల్లిక. సూదిలో దారముతో గుచ్చి బెజ్జములుగల అట్టపైఁగాని, ప్రత్యేకముగా అల్లికయందేప్పుడుట్లు పూల పాదిరూపములుఁజిత్రించి లేసుపనియందుఁ

జో పెను నిపుణత్వపు వస్త్రముగాని, కాలువ మొదలగువాని యంచులయందును మూలలయందును రచించిన లేసువంటి కుట్టుపని యందలి సొగసు రూపములు గాని గలిగియుండెడి కుట్టుపని )

సూరకత్తి. వా. వి. చేగకత్తి: చూ, రిష్టి. 2.

సూరణము. సం. వి. అ. పుం. కంద*: రూ-శూరణము, అర్శోఘ్నము, అర్శోఘ్ని, ఉల్లువు, ఓలము-ఓల్లము, కందూరము-కందూలము, కంద-కందము, కందలత, కందవర్ధనము, కందసూరణము, కందార్హము. కందూరము, చిత్రదండము, పీలుకము. (తె) ఇంజేటి-ఈఁజేటి, కంద, కందగడ్డ (కందదుంప).తద్వి.-౧. అడవికందకు.-దార్వి, మాలాకందము, మూలము, వనతువరి,సర్పనాశము.(తె)అడవికంద,కారుకంద-కాలుకంద; ౨: మధురకంద. (తె) తియ్యకంద, చిరగడము-చిరుగడము, చిరువడము; 3: అర్షము, ఘాఘసము, పిండాలువు. (తె) చోఁకంద; ౪:కందాఢ్యము,కందాలువు, ధరణీకందము. (తె) ఊరఁగంద, పాటికఁద; ౫:కరవీరకందసంజ్ఞ, తైలకందు; ౬: కనరుకందకు.—క్షీరకంద, మహాకందము. (తె) దురదకంద; ౭: కృష్ణాలువు, నీలాలువు. (తె) నల్లకంద; ౮.వారాహీకందకు.—కులినాశనము, క్రోడకన్య, మహావీర్యము, వారాహీకంద; ౯: (తె) పుల్లకంద; ౧౦: గంధనాకులి. *.

సూరసూతుఁడు. సం. వి. అ. పుం. గరుత్మంతునియన్న (సూర్యసారథియగు ననూరుఁడు): సూర్యసూతుఁడు, అరుణుఁడు, అనూరుఁడు, కాశ్యపి, గరుడాగ్రజుఁడు, తద్వి.—౧. తొడలులేనివానికి.— అంగవికలుఁడు, అనూరుఁడు-అనూరువు, అరుణుఁడు, అశ్మకుఁడు, కాకుఁడు, కారవుఁడు, కాశ్యపి-కాశ్యపుఁడు, ఖోడుఁడు-ఖోరుఁడు-ఖోలుఁడు,గరుడాగ్రజుఁడు,తార్క్ష్యుఁడు, ప్లవగుఁడు, రమణుఁడు, వైనతేయుఁడు, శ్లోణుఁడు, సూరసూతుఁడు. (తె. వ) కుంటు, పిచ్చికకుంటు-పిచ్చేకకుంటు-పిచ్చికుంటు-పిచ్చేకుంటు, లేవజాలనివాఁడు, ౨: చూ, వికలాంగుఁడు.

సూరి. సం. వి. ఇ. పుం.1.రవి: చూ,సూర్యుఁడు; 2 బృహస్పతి: చూ, సురాచార్యుఁడు; ౩. న్. పుం. ౩. పండితుఁడు: చూ, సుధి.

సూరీగుమ్మడి. వా. వి. పొట్టిగుమ్మడి *: చూ, సర్వతోభద్ర

సూరుఁడు. సం. వి. అ. పుం. 1. రూ-శూరుఁడు: చూ,సూర్యుఁడు; (1) వై. వి.=సూర్య :చూ, సూర్యుఁడు.

సూరె. వై. వి.=ఛురికా: చూ, రూ-సురియ.

సూరెగిలు. దే. అ. క్రి. పక్కకొదుగు. భో. 7, ఆ. 34: రూ-సూరెగిల్లు.

సూరెగిల్లు. దే.అ.క్రి.—పై.—నిర్వ.6,ఆ.103.

సూరెపాను. దే. వి. ఆలవట్టము. రూ-సూరెపాన్పు: చూ, సురఁటి.

సూరెపాన్పు. దే. వి.—పై —

సూరెపుటము.వై.వి.=సూర్యపట. మేల్మొగములు

సూరెలు. దే. వి. బ. వై పు: బాజో, పెట్టు, పెక్కు, (ఇం) సయిడ్డు-సైడ్డు: చూ, పార్శ్వము. 2. (చూ, ప్రక్క. 2.); 3. ఉభయపార్శ్వములు. ఆం, భా. తృ. 25: ఇరుకెలంకులు-ఇరుకెలఁకులు-ఇరుఁగెలఁకులు-ఇరుగడలు, ఇరుచేక్కయులు, ఇరుదెసలు, ఇరుపక్కయులు, ఇరుప్రక్కలు, ఇరుబగులు, ఇరుమయిలు-ఇరుమెయిలు, ఇరుమేరలు, ఇరువంకలు. (సం) అభితము.

సూరేకారము. ద్వ. వి: చూ,రూ. సురేకారము.

సూర్పము. సం. వి. అ.న:చూ, రూ-శూర్పము.

సూర్మి. సం. వి. ఇ, ఈ. స్త్రీ. లోహప్రతిమ. రూ-శూర్మి. తద్వి.-అయఃప్రతిమకు:-(చూ, పాత్రము. 6-౫౧): చూ, పారిణి.3.

సూర్యకాంతము. సం. వి. అ. పుం. సూర్యరశ్మి తగులుటచే నిప్పుకలిగెడు ఒకరాయి: చూ, స్థూలోచ్చయము (రత్నములు.)

సూర్యకాంత. సం. వి. ఆ. స్త్రీ: చూ, సూర్యానువర్తిని *.

సూర్యక్రాంతము. అం: చూ, తానములు.

సూర్యగణములు. అం: చూ, గణము. 4.

సూర్యగుమ్మడి. వా. మి. వి. సూరీగుమ్మడి*: చూ, సర్వతోభద్ర.

సూర్యగ్రహణము. అం: (తె) పొద్దుపట్టు. ఇది త్రివిధము.—పూర్ణగ్రహణము, ఖండగ్రహణము, కంకణగ్రహణము. (చూ, గ్రహణము)

సూర్యతనయ. సం. వి. ఆ. స్త్రీ. కాళింది, యమునానది: చూ, నది. 1583 పొంకట.

సూర్యపుటము. సం. వి. అ. పుం.=సూరెపుటము: చూ, సూరెపుటము. [వహ్నిశిఖము. 1.

సూర్యకర్తసంజ్ఞము. సం. వి. అ. న: చూ,

సూర్యవ్యాకరణము. అం: చూ, వ్యాకరణములు.

సూర్యశతకము. అం. (మయూరుఁడు వ్రాసెను): చూ, కావ్యనాటకములు.

సూర్యసావర్ణికమనువు. అం: చూ, మనువులు.

సూర్యస్వరేణువు. సం. వి. ఉ. స్త్రీ. సూర్యుని భార్య: చూ, భార్య. 1-౬౮.

సూర్యానువర్తిని. సం. వి. ఈ. స్త్రీ: ఆదిత్యభక్త, కపార్థము, కపోతపంక, కపోతవము, జామాత, పార్వతీయము, బ్రహ్మసువర్చల, రవిభక్త, సవర్చల-సువర్చల, సూర్యకాంత. (తె) తీఁగమెఱుఁగు, నింగిమిరి, పొద్దుతిరుగుడు*.

సూర్యుఁడు సం. వి. అ. పుం.= సూరుఁడు. (వ్యాపారములయందుఁ బ్రేరేపించువాఁడు): అంజిష్ఠుఁడు-అంజిష్ణుఁడు- అంజిష్ణువు, అండజుఁడు, అంబరీషుఁడు, అంశుధరుఁడు, అంశుమంతుఁడు, అంశుమాలి, అంశువు, అద్రి, అధ్వగుఁడు, అపరప్రియుఁడు, అబ్జబాంధవుఁడు, అబ్జుఁడు, అబ్ధిజుఁడు, అమిత్రుఁడు, అరిందముఁడు, అరుణుఁడు, అర్కుఁడు, అర్యముఁడు, అవి, అశ్వధిపుఁడు, అశితాంశుఁడు, అశ్వద్ధుఁడు, అసురుఁడు, అహఃపతి, అహమ్-అహర్పతి, అహఃకరుఁడు-అహస్కరుఁడు, ఆదిత్యుఁడు, ఆశిరుఁడు, ఇంద్రుఁడు, ఇనుఁడు, ఉదధి, ఉదరధి, ఉద్భటుఁడు, ఉష్ణరశ్మి (ఊష్మరశ్మి), ఋతువు, క, కంజపుఁడు-కంజారుఁడు, కపి, కపిలద్యుతి, కమలాప్తుఁడు, కమలాసనుఁడు, కర్మసాక్షి, కలాపుఁడు, కలిందుఁడు, కపాకుఁడు (వు), కాలకృత్తు, కాలి, కాశ్యపేయుఁడు, కిరణమాలి, కిశోరుఁడు, కీశుఁడు, కుంజరుఁడు, కుణాఁడు కుతప్రుఁడు, కుథాకువు, కుముదాంతుఁడు, కుహాకువు, కృతాంతజనకుఁడు, కోకబంధువు, క్షీదుర్గుఁడు, ఖ, ఖగుఁడు, ఖచరుఁడు, ఖజ్యోతి, ఖతిలకము (ఖతిలకుఁడు), ఖద్యోతుఁడు-ఖద్యోతుఁడు- ఖద్యోతనుఁడు, ఖమణి, ఖరకరుఁడు, ఖరాంశుఁడు (ఖరాంశువు), ఖలుఁడు, ఖేలి, గగనధ్వజుఁడు, గగనాధ్వగుఁడు, గభస్తి, గభస్తిమంతుఁడు, గభస్తిహస్తుఁడు, గరుత్తు-గరుత్మత్తు, గోపతి, గోవు, గ్రహపతి, గ్రహరాజు, చండాంశువు, చక్రబంధువు, చక్రబాంధవుఁడు, చరణుఁడు, చిత్రభానువు, చిత్రరథుఁడు, ఛాయాప్రియుఁడు, జగచ్చక్షువు, జలతస్కరుఁడు, జలదస్యుఁడు, జ్యోతి, తపనుఁడు-తపానుఁడు, తపువు, తపోవహుఁడు-తమోపహుఁడు, తమోనుత్తు-తమోనుదుఁడు, తమోఘ్నుఁడు, తరణి-తర్ణి, తర్దువు, తర్షుఁడు, త్రయీతనువు, త్విషాంపతి, దినకరుఁడు, దినప్రణి, దినమణి, దివాకరుఁడు, ద్వాదశాత్ముఁడు, ద్యుమణి, ధన్వంతరి, ధామనిధి,

నారాయణుఁడు, నిదాఘకరుఁడు, పతంగుఁడు, పద్మపాణి, పద్మబాంధవుఁడు, పద్మినీవల్లభుఁడు, పావకుఁడు, పీతువు, పీథువు, పూషుఁడు, ప్రతిదివుఁడు, ప్రద్యోతనుఁడు, ప్రభాకరుఁడు, బ్రధ్నుఁడు, భగుఁడు, భట్టారకుఁడు, భా, భాకోషుఁడు, భాతువు, భానుమంతుఁడు, భానువు, భానేయుఁడు, భాముఁడు, భానుఁడు, భాస్కరుఁడు, భాస్వంతుఁడు, భాస్వరుఁడు, మండలి, మంఘుఁడు, మిహిరుఁడు-మిహీరుఁడు, మార్తండుఁడు-మార్తాండుఁడు, మిత్రుఁడు, మృతండుఁడు-మృతాండుఁడు, రవి, లోకబాంధవుఁడు, వశిరుఁడు, వికర్తనుఁడు, విభాకరుఁడు, విభావసుఁడు, వియన్మణి, విరోచనుఁడు, వివస్వంతుఁడు, విశ్వకర్మ, వీతిహోత్రుఁడు, వృకుఁడు, వేదోదయుఁడు, శూరుఁడు-సూరుఁడు, సదాగతి, సప్తగప్తుఁడు, సప్తాశ్వుఁడు, సరోరుహాప్తుఁడు, సవిత-సవితృఁడు, సహస్రపాదుఁడు, సహస్రాంశువు, సూనుఁడు, సూరి, హంస, హంసుఁడు, హరి, హరిదశ్వుఁడు, హిరణ్యరేతుఁడు-హిరణ్యరేతసుఁడు, హేలి-హేళి. (తె. వ). ఇరులుగొంగ, ఇనముమేఁపరి, ఇనముసూఁడు, ఎండదొర, ఎండఱేఁడు, ఎఱ్ఱనివేలుపు. ఏడుగుఱ్ఱముల తేరెక్కుజోదు, కలఁజోవరులతెన్ను, కలువలదాయ, కాఁకవెలుఁగు, కెంపురా, గాములఱేఁడు, వేదలమానికము, చెలిదాయ, చాయపెనిమిటి (చాయమగఁడు), చీఁకటిగుండెదిగులు, చీఁకటిగొంగ-చీఁకటులగొంగ, చెయువులసాకిరి (చెయ్వుల సాకిరి), జక్కవలయింటు, జక్కవలఱేఁడు, జగముకన్ను, జగముచుట్టము, జమునతండ్రి, జమునయ్య, తమ్మిచెక్కిలిగింత, తమ్మిచుట్టము, తమ్మిదొర, తమ్ములవిందు, తమ్మివాల్గంటిమగఁడు, తామరచెలి, తొగకొమ్మతొలఁగుబావ, తొగసూఁడు, దుగపదిరూపుల దుండగీఁడు, నెలజోడు, పగటిజోతి, పగటివేలుపు-పగటివేల్పు, పగలింటిదొర, పగలుసేయువలంతి, పచ్చగుఱ్ఱముగలాఁడు, పచ్చవారువపుజోదు-పచ్చవార్వపుజోదు, పనులసాకిరి, పొద్దు-ప్రొద్దు, ప్రొఁజేమువుల పెట్టెఁడు, ప్రొఁబలుకుల టెంకి, ప్రొఁబల్కుసొమ్ము పెట్టె, బారిమేనుల పోడ్మి, బంగరూపుల వేలుపు, మింటితెఱువరి, మినుకులబరణి, మినుకుల యిక్క, ముబ్బాసవాల్గీము, మువ్వన్నెకాఁడు, మువ్వేలుపులయిక్క, మొక్కుసొక్కుసామి, మొదలిగాము, రేకంటు, రేవెల్గుజోదు, వినుకెంపు, వినురతనము, వెన్నునివలకన్ను, వెన్నునికలచూపు, వెలుఁగుఱేఁడు, వేఁడివెలుఁగు, వేఁడివేలుపు-వేఁడివేల్పు, వేయిచేతులదిట్ట, వేవెలుఁగు-వేవెల్గు, సతహాలమాదిణి, సయితుఁడు, సూరుఁడు, సెకవెలుఁగు. తద్వి.—౧. రాహుగ్రస్తుఁడైన సూర్యుఁడు.—ఔపగ్రస్తికుఁడు; ౨. పన్నిద్దఱు సూర్యులలో నొకఁడు.—అంశుఁడు; ౩:(చూ. గ్రహములదశాపరిమాణాదులు 1138 పొంట), ౪: చూ. అగ్నులు; ౫౦. 2: చూ. మూర్తులు; 3: చూ. గ్రహములు.

సూర్యేందుసంగమము. సం. వి. అ. పుం. (దీనియందు సూర్యచంద్రులకు సంగమము కలదు): అమ-అమా, అమావస-అమావసి-అమావాసి-అమావశ్య-అమావాస్య- అమి, ఇందుక్షయము, దర్శము, పంచదశి. (తె. వ) అమవస-అమాస. తద్వి.—౧. చంద్రుఁడు కానరాని యమవస.—కుహువు-కుహూవు; ౨. చంద్రుఁడు కానవచ్చెడి యమవస.—సినీవాలి.

(చూ, తిథులు): చూ, హరివాసరము;
2. తిథి: చూ, తిథులు: చూ, హరివాసరము;
3. పౌర్ణమి: చూ, పున్నమ.

సూర్యోదయము. సం. వి. అ. పుం. అరుణోదయము, ఉదయము, ఏ, స్త్రీఘోషము. (తె) ఎఱసంజె, తొలుసంజె (చూ, వేగుజాము.) [విష్ణుక్రాంత.

సూర్విక. సం. వి. ఆ. స్త్రీ. దింటెన *: చూ,

సూల. వై. వి= శూల. శూలము. కుట్టు. కుట్టుసూల, గర్భకువారమందుపోటు: చూ, హానువు. 4 (రోగము 1.)

సూఱచేకట్లు. దే. వి. ఒకరకము కంకణము: చూ, భూషణము. 2-౧౨-(౨౭).

సూవె. వై. అవ్య= స్మ; చూ, సూ-సూ-1.

సూసకతురాయి. వా. వి. స్త్రీలు తలను ధరించెడు తిరుగుడుబిళ్ల: చూ, భూషణము. 2. ౧౧-(౨౦.)

సూసకము. దే. వి.—పై—

సూసరి. దే. వి: గారకాఁడు, తాపివాఁడు-తాపీవాఁడు, సూసరి. (సం) ఖండపరశువు, పలగండుఁడు, లేపకుఁడు. తద్వి.—ఇటికలతో గోడపెట్టువానికి.-(సం) కుడ్యకారుఁడు. (మట్టిగోడ పెట్టువాఁడు=కుడ్యకారుఁడు.)

## సృ

సృక్వము. సం. వి. న్. న.= పెదవి. రూ-సృక్వి. పెదవిమూల: చూ, వాతెఱ.

సృక్వి. సం. వి. ఇ. న.—పై.—

సృక్విజములు. అం: చూ, శుభావర్తములు (అంగంతుకములు) (చూ, 653 పొరట.)

సృగము. సం. వి. అ. పుం. 1. భిందివాలము, పాఁగు: చూ, బాణము. 1-౬౧; అం. 2: చూ, ముప్పదిరెండాయుధములు.

సృగాలితము. అం: చూ, నాటికలు (ఒకటే యంకము, గానము, సంభాషణగలది.)

సృగాలము. సం. వి. అ. పుం.= స్రగ్గాలము (మాంసమును దినునది.): రూ-శృగాలము (శృకాలము), అఘోరము, కిటఖాదకము, క్రోష్ట-క్రోష్టువు, గోమాయువు, ఘోరము, ఘోరరాసనము, ఘోరరాసి, జంబుకము, జలధి, జలసూచి, నాకము--నాక్రము, నీలంగువు, ఫేరము, ఫేరువు, భీరువు, భూరిమాయము-భూరిమాయువు, మృగధూర్తకము, వంచకము, శయాలువు-శయాళువు, శివ, శాలామృగము, శాలావృకము - సాలావృకము, సూచకము. (తె-ప):—అలమెకము, ఊరమెకము, ఎండ్రిమెక్కుమెకము, ఎండ్రిమేకరి, కయ్యాలమెకము, నక్క, నరియఁడు, పిక్కుమెకము, బుద్ధిమెకము, వఱడు, సగ్గారి, సగ్గాలము. తద్వి.—౧: గృండీకము. (తె) పెద్దనక్క, వఱడు; ౨. గంధిలము. (తె) ముదినక్క, వఱడు; 3. కిఖి-కిఖీ-ఖిఖి, ఖింఖిరము. (తె) ఓడినక్క, కొంకనక్క, గుంటనక్క, పొట్టినక్క; ౪. ఆఁడునక్కకు.— క్రోష్ట్రి-క్రోష్ట్రి, ఖింఖిరి, వామి.

సృగాలవిన్న. సం. వి. అ. స్త్రీ. క్రోష్టువిన్న, ధావని, లాంగూలి, సింహపుచ్ఛి. (తె) నక్కతోఁకపొన్న*.

సృజన. సం. వి. ఆ. స్త్రీ. సృష్టి, సృజించుట: చూ, సర్గము. 7;

సృజించు. సం. స. క్రి. సృష్టిచేయు, లేనిది కలుగఁజేయు: ఆపాదించు, కల్పించు, నిర్మించు: నిర్ణయించు, నిశ్చయించు, నిష్కర్షించు, రచించు-రచియించు, విరచించు, విధించు. (తె. ప):-అచ్చుకట్టు, ఏర్చు, ఏర్పఱచు. కడగట్టు, కలిగించు, గడించు, గుణించు,

చేయు, చన్ను, పొలుపుచ్చు, సమకట్టు. తద్వి.—౧: చూ, సంభవించు; ౨. విశేషముగా రచించు:—విరచించు.

సృజ్యము. సం. విశే. సృజింపఁబడినది: అసృష్టము.

సృణి. సం. వి. ఈ. స్త్రీ. ఏనుఁగు కుంభస్థలము నందుఁ బొడిచెడి ఆయుధము: అంకుశము, ఆతోద్యము, ఆయానము, కంపరము, కుంభచ్ఛేదము, పటకము, విలోచనము, వేణుకము—వైణుకము, సూనము. (తె) అంకుసము, సిడి. (చూ, హేతి. 4. ౬). తద్వి.—హాస్తికర్ణ వేధనాస్త్రము:— కర్ణవేధని, కర్ణార, నీలి. (చూ, బాణము. 1.౨౧).

సృణిక. సం. వి. ఆ. స్త్రీ. రూ-సృణీక. చొంగ: చూ, స్యందిని.

సృణీక. సం. వి. ఆ స్త్రీ.—పై—

సృతి. సం. వి. ఇ. స్త్రీ. 1. త్రోవ: చూ, మార్గము. 1. తద్వి.—౧. మార్గమునకు.— రోడ్డు, వీవధము, సంసరణము, స్వస్తికము; ౨. మహాపథమునకు.—రాజమార్గము; 3. చెడ్డత్రోవకు.—వ్యధ్వము; ౪. చతుష్పథమునకు —(సం) సంస్థానము; ౫. నక్షత్రమార్గమునకు.—సత్పథము; 2. పోక, గమనము: చూ, సంచారము.

సృదాకువు. సం. వి. ఉ. పుం. అగ్ని: చూ, వహ్ని. 1.

సృమరము. సం. వి. ఉ. పుం. పెద్ద చమరమృగము: చూ, సెబరము.

సృష్టము. సం. విశే. 1.=చిట్టి. సృజింపఁబడినది: ఆపాదితము, ఉత్పాదితము. (చూ, విరచితము); 2. విడువఁబడినది: చూ, హీనము 8; 8. నిశ్చయింపఁబడినది: చూ, స్థితము. 3; 4. అధికమైనది: చూ, హెరాళము.

సృష్టి. సం. వి. ఇ. స్త్రీ. 1. సృజన, సృజించుట: చూ, సర్గము. 7; 2: చూ, స్వభావము; అం. 8. సృష్టిస్థితిలయములలో నొకటి.

సృష్టికరణము. వా. సం. వి. అ. పుం. లోకకృద్దైవ బ్రాహ్మణుఁడు: చూ, శిష్టకరణము.

సృష్టిభేదములు. అం: అండజములు, స్వేదజములు, ఉద్భిజ్జములు, జరాయుజములు (4).

సృష్టిసర్గములు. అం: మహత్సర్గము, అహంకారసర్గము, భూతసర్గము, ఇంద్రియసర్గము, దేవసర్గము, తమస్సర్గము, వనస్పత్యాదిసర్గము, తిర్యక్సర్గము, మనుష్యసర్గము.

## సె

సెంటు, వా. వి. 1. ఒకరకపుఅత్తరు; 2. 1/10 కుంచెడుభూమి, 1/100 ఎకరముభూమి (రూ-శెంటు) ("సెంటుమీటరు" మొ.)

సెంటెన్సు. వా. వి. శిక్షావిధి.

సెక. వై. వి.=శిఖా. రూ-సెగ-సెవ. 1. జ్వాల, మంట: చూ, వహ్ని. 1; 2. తాపము: చూ, సంతాపము; 3. ఉష్ణము: చూ, వేఁడిమి; వా. 4. సెకసంకటమను తెవులు. రూ-సెగ: చూ, రోగము. 1-౬.

సెకకంటి. ద్వ. వి. (సెక + కన్ను): చూ, శివుఁడు.

సెకను. వా. వి. 1: చూ, తెప్పపాటు; 2. 1/60 నిమిషము; 1/3600 గంట. [తత్క్షణము.

సెకనుసెకను. వా. వి: (సం) అనుక్షణము, ప్రతి-

సెకవెలుఁగు. ద్వ. వి. ఉష్ణరశ్మి. య. 1, ఆ. 45: చూ, సూర్యుఁడు.

సెగ. వై. వి.=శిఖ: చూ, రూ-సెక. 1-2-3-4.

సెగతోఁడు. ద్వ. వి. శిఖావంతుఁడు, అగ్ని: చూ, వహ్ని. 1.

సెగ్గము. దే. వి. (రూ-సెగ్గింపు-సెగ్గు-సెగ్గము). 1. రోఁత. హరి. ఉ. 7, ఆ. 198: చూ, సెగ్గింపు.

సెగ్గించు. దే. స. క్రి. రామా. భాగ. 3, స్కం. 981: అడిపోవికోవు, అడు, అడుకోవు

ఆరడిసేయు, ఈసడించు, ఎంచు, ఎగ్గాడు, ఎగ్గులాడు, ఎన్ను, ఏస, ఏసగించు, ఒదరు, కరాళించు, గోసడుచు, చెడనాడు, తిట్టు, తెగడు, దిసంతడుచు, దిసంతుకొట్టు-దిసంతులు కొట్టు, దూఱు, పదరు, పలుకు-పల్కు, పోనాడు, ప్రిబ్బు, రోయు, అవ్వాడు. (సం. వ) అధిక్షేపించు, ఆక్షేపించు, కుత్సించు, గర్హించు, దూషించు, నిందించు, లంభించు. (చూ, హేళనము చేయు.)

సెగ్గింపు. దే. వి. దూఱు: అంకము, అగడారు-అగడు-అవడు, అసడి, ఆట, ఆడిక, ఆడికోలు, ఆరడి-ఆఱడి, ఆవము, ఈసడము, ఈసడింపు, (బ) ఎగ్గులు, ఏవ-ఏవగింపు-ఏవము, ఓకర, ఓకరింత-ఓకిలి-ఓకిలింత, కళంకు, కింకిరి, కింకిరిపాటు, కొడిమె, గోరపన, గోరము, గోసు, డాబా, డొగరు, తిట్టు, తిట్టువాటు, తుట్టు, తెగడిక-తెగడు, దిసంతు, దూరు-దూఱు, నేవ, పగచోటు, పదరు, పలుకు-పల్కు, ప్రిబ్బు, ప్రియి, మాట, రట్టు, రొచ్చు, రొయి-రొయ్య, రోఁత, రోయి, అట్టడి-అట్టు, అవ్వ, లొచ్చు, లోఁత, లోయి, వట్టిమాట, వాజే, వాదు, వడి, సెగ్గము-సెగ్గు-సెగ్గెము. (సం. వ):-అఖిలము, అధిక్షేపము, అపనింద, అపవాదము-అవవాదము, అభియోగము, అభిశంసనము, అభిశస్తి, అర్తనము, అవగీతము, అవధ్వంసము, అవర్ణము, అవక్షేపము, అవాచ్యము, ఆక్షేపము, ఉపక్రోశము, ఋతీయ, ఏనము-ఏనస్సు, కలంకము-కళంకము, కుత్స, కుత్సనము, కౌలీనము, క్రీడ, క్షేపము, గర్హ, గర్హణము, ఘృణ, జన్యము, జుగుప్స, దూషణము, నింద, నిర్వాదము, పరివాదము-పరీవాదము, రంధ్రము, లంభనము, విద్రవము, వివరము, హ్రిణీయ. (అవ్య):—అ, కుమ్, ఋ-ఋూ, కిమ్, కు, వా. తద్వి.—౧. తిరస్కరింపఁబడినది: అనగణితము, అవమతము, అవమానితము, పరిభూతము, హేలనము-హేళనము. (చూ. ఓ. కు. 2); ౨. ఊరక మోపిన నిందకు.— అపదూఱు-అవదూఱు, అపనింద, అపనెపము, కానిమాట, నిరాపనింద. (సం): అభిశంసనము, అభిశాపము, అపవాదము, మిథ్యాభిశంసనము; 3. ఆరోపితమైన నిందకు-(తె) అగావు; ౪. చూ, వ్యాజము.

సెగ్గు దే వి.—పై.—

సెగ్గెము. దే. వి.—పై —అం, భా. ప్రి. 115.

సెజ్జ. వై. వి.=శయ్యా. 1. పడక. భో. 2, ఆ. 61: చూ, శయ్య. 1; 2. సంస్తరము, ప్రస్తరము. చిగుళ్లులోనగు వాని సెజ్జ. చూ, శయ్య. 1-౨.

సెట్టి. దే. వి.=శ్రేష్ఠి. 1. కోమట్లు లోనగువారి పట్టపుఁబేరు: చూ, వైశ్యుఁడు; 2. వర్తకుఁడు: చూ, సార్థవాహుఁడు. (శేరు అనియు వాడుక).

సెట్టిగ. వై. వి: చూ, సెట్టిబలిజె.

సెట్టిబలిజె. వై. వి: ఈండ్రి, ఈడిగ, సెట్టిగ (చూ, సురాజీవి)

సెట్టు. వా. వి. 1. కొన్ని వస్తువుల (పుస్తకముల) మొత్తము; స. కి. 2 దాఁచు, "నీసెట్టెలో సెట్టు"; 3. ఉంచు, "నీదగ్గఱ సెట్టు."; 4. సెట్టు. "బల్లమీఁదసెట్టు" 5. (రహస్యముగా) ఉంచు "ఈమాట నీమనస్సులోసెట్టు."

సెనగలు. వై. వి. [బ.=చణక. రూ-సనగలు. 1. (సం) ఆక్త్యకము, కంటి, చణకము, కృష్ణచంచుకము, హరిమంథకము-హరిమంథజము, తద్వి.—౧. గుండ్రిసెనగలకు:-కలాయము, లంక; ౨: కలాయము. (తె) బోడసెనగలు; 3. చిఱుసెనగలకు:—గభోలికము, గూఢపు

ష్ఫకము, మంగళ్యకము-మంగళ్యము, మసు
ర-మసూర. (తె) చిటిసెనగలు-చిఱుసెన
గలు; శం. 2: చూ, ధాన్యము.

సెనగపొట్టు. వా. వి: చూ, శింబ.

సెపించు. నై. స. క్రి.=శాప. రూ-సెపియిం
చు: చూ, శపించు

సెపియించు. వై. స. క్రి.=—పై.—

సెబాసు. వా. అవ్య. రూ-సబాసు. బళీ: చూ,
రూ-సేబాసు.

సెబ్బర. దే. వి. రూ-సెబ్రి. 1. చెడుగు: చూ,
కౌరవము. 2. విణ. 2. చెడ్డది.

సెబ్రి. దే. వి.—పై.—

సెమ్మె. నై. వి.=శమ్యా: దివియకంబము-దివెకం
బము-దివ్వియకంబము-దివ్వెకంబము- దీవి
యకంబము. (సం) కాముడిదుబ్రివు, దీపవృ
క్షము, దీపస్తంభము, శమ్యా, శిఖాతరువు.
(చూ, స్తంభము 1.) [చూ, వెలుతురు. 1.

సెర. దే. వి. 1. నేత్రమునందలిరేఖ; 2. కాంతి:

సెరగు. దే. వి. ఆపద. భార. ఆది.8, ఆ. 119:
చూ, విపత్తు.

సెరభము. నై. వి.=శరభ: ఆడిసపు మెకము,
ఎనిమిదడుగుల మెకము, ఏనుఁగులగొంగనూ
డు, కటిక మెకము, చేవుగంటి-చౌగంటి,
దచ్చికాళ్ల మెకము, దచ్చియడుగుల మెకము,
మీఁగండ్ల మెకము, సింగపుఁగొంగ. (సం. ప):
అష్టపాత్తు-అష్టాపదము, ఉత్పాదకము, ఉ
త్పాత్తు, ఊర్ధ్వపాదము, ఊర్ధ్వలోచనము,
కుంజరారాతి, ఖడ్గము, ఖడ్గి, గండకము,
గండము, గంధర్వము, గజారి, గవయము,
డింగరము, నగౌకసము, వనోత్సాహము, వా
ర్ధ్రాణసము-వార్ధ్రీణము, శరభము, శశము,
సృమరము. తద్వి.—పటుప్రవయును పెద్దక
డుపునుగల మృగమునకు.—గంధర్వము.

సెరవంజి. వా. వి: చూ, సరవెంద.*.

సెల. వై. వి.=శిలా. 1. అంబుజన్మదేశము. ఆం,
భా. ద్వి. 30; 2.=శిలా. శిలావది. కొండ
కాలువ. (సం) శిల: చూ, సెలయేఱు; 3. ఉ
పశాఖ. ఆం, భా. ద్వి. 46: చూ, శాఖ. 1;
4.=శల్య: చూ, బాణము. 1. (పంచ. వేం.
3, ఆ. 194); 5. బాణముమొలికి; 6.=శల.
ఏదుపందిముల్లు; (చూ, సితాగ్రము. 2.):
7.=శల్య. మునికోల మొదలగు వాని
చివర యందుండు ఇనుపముల్లు:
చూ, సితాగ్రము; 8. వర్ణమునందు చీము
వెడలెడు రంధ్రము. పా. 2, ఆ. 87; ఉ.
హరి. 4, ఆ. 212. 9. నీరుపుట్టుతావు: సెల.

సెలకట్టియ. వై. వి. గా-సెలకట్టె=శల్యకాష్ఠ.
ఉ, హరి. 4, ఆ. 218: చూ, బాణము. 1;
2 బాణమువలె వేగముగాఁబాఱునట్టి శ్యేన
ము. స్వా. 4, ఆ. 57; జేలకట్టె (అనికొం
దఱు): చూ, శ్యేనము; ఆం. 8: చూ, ము
ప్పదిరెండాయుధములు.

సెలకట్టె వై. వి.=—పై —

సెలగ. దే. వి. 1. ఉపశాఖ: చూ, శాఖ. 1;
వా. 2: (రూ-పలగ-సలగపాలు) పాలుచి
ప్ప; 3: చూ, సలుగ. 1-2-3-4.

సెలగత్తి. ద్వి. వి. (సెలగు + కత్తి.) కల్లుగీఁచు
వాని కత్తి. అచ్చ. యు, కాం. 284: చూ,
పేంతి 4 (టిప్ప. 2.)

సెలగు. దే. స. క్రి: రూ-చెలగు-సెలవు, అఱ
పఱసేయు, ఉత్తరించు, కనుపుగొట్టు, కసిమ
సగు, కోరాడు, క్రోడాడు, గండ్రించు,
చేక్కఁడచు, చేక్కాఁడు, చేకుఁజేయు, చోఁ
గఱగొను, చించు, చిందఱ వందఱచేయు,
చిదుము, చీరు-చీఱు, చెండాడు, చెండు
బెండాడు, చెలగు, చెల్లు, తఱుగు-తఱువు,
తీసివేయు, తుండించు, తునుమాడు-తున్మా

-డు, తునుము-తున్ము, తెగఁగొట్టు, తెగవేయు, త్రివు-త్రివ్వు, త్రివ్వటించు, దున్ము రేఁచు, నఱకు-నఱుకు, నుగ్గాడు, పరిమారుచు-పరిమార్చు, పాలాడు, పార్చు, మురికొను, మొత్తు, రేయు, వందఱలాడు, విగ్గవిఱుగు, వేయు-వ్రేయు, వ్రక్కలించు. (సం) ఖండించు, ఛేదించు, దళించు. (చూ, వ్రక్కవాఱు.) తద్వి.—మిక్కిలిఖండించుటకు.—(సం) విదళించు. [శాఖ: చూ, శాఖ. 1.

సెలగొమ్ము. దే. వి. (సెలగ + కొమ్ము) ఉప

సెలగోల. ద్వ. వి. గొల్లవాఁడు పసులమేపెడు (దోలెడు) కోల. హరి. పూ. 5, ఆ, 255: చూ, సిల్లు

సెలపంది. ద్వ. వి. ఏదుపంది, ముండ్లపంది: చూ, సూకరము.

సెలపు. దే. వి: చూ, రూ-సెలవు. ఆం, భా. ద్వి. 192.

సెలపుండు. ద్వ. వి. నారికుఱుపు: చూ, వ్రణము.

సెలయు. దే. అ. క్రి. 1: చూ, విజృంభించు. పాండు. 1, ఆ. 201; స. క్రి. 2: ఏయు, కులుకు, చిదుము, చిమ్ము, చెలయు, తీయు, వయిచు-వైచు, విసరు, వేయు. (సం) ప్రయోగించు. (చూ, వైచు 1.)

సెలయూట ద్వ. వి. (సెల + ఊట): కొండయూట. (సం) ఉత్సము, ప్రస్రవణము. తద్వి.—ఊట, జెల, బుగ్గ, మెగ్గ.

సెలయేఱు. ద్వ. వి. పర్వతమునుండి పాఱెడు నది. పా. 2, ఆ. 87; స్వా. 4, ఆ. 37: చూ, నది (గ).

సెలవడు. వై. అ. క్రి. సెలవేయు: రూ-సెలవాఱు.

సెలవాఱు. ద్వ. అ. క్రి.—పై.—స్వా. 3, ఆ. 40.

సెలవి. వై. వి.=సృక్వి-స్రిక్వి, ఓష్ఠాంత్య భాగము. పెదవిమూల. స్వా. 2, ఆ. 7: చూ, వాతెఱ.

సెలవిచ్చు. దే. స. క్రి. (సెలవు + ఇచ్చు) ఆజ్ఞాపించు. జై. 8, ఆ. 4: అంచు-అంపించు, అంపు, అనుచు (అను), అనుపు, ఆనతిచ్చు-ఆనతియిచ్చు, కట్టుపాటుచేయు, నేమించు, పంచు, పంతగించు, పంపించు-పంపు, పంపువెట్టు, పనిగొను, పనిపంచు, పనుచు, పరమాయించు, పుచ్చు, పురెత్తించు, పురిపించు, పురమాయించు, పురికొలుపు, మందలించు, మొదలవెట్టు, వలయు, సాగవేయు. (సం) ఆజ్ఞాపించు, ఆదేశించు, కథించు, నియమించు, విధించు, శాసించు.

సెలవిల్లు. దే. వి. సెలసుబద్దలవిల్లు: రూ-సెలసువిల్లు.

సెలవు. దే. వి. 1. ఆజ్ఞ: అప్పణ-అప్పన, ఆఁక, ఆన, ఆనతి, ఉత్తరువు, కట్టడ, తోడు, దురా-దురాయి, పంపు, పని, పనుపు-పన్పు, పర్మానా, బరాతము, మొదల, రజా, హద్దు. (ఇం) ఆర్డరు, వారంటు. (హిం) హుకుం. (సం) అను, అనుజ్ఞ, అనుజ్ఞానము, అనుశాసనము, అపవాదము-అప వాదము, అభ్యనుజ్ఞ, అజ్ఞ, అజ్ఞప్తి, అజ్ఞాపనము, ఆదేశము, ఉమ, నిదేశము, నియమము, నియోగము, నియోజనము, నిర్దేశము, విధానము, విధాయకము, విస్రంభము, శాసనము, శాస్త్రము, శిష్టి, సంప్రేషము, సమయము, సమ్మతి, హవము, (అవ్య) అజ్, ఖలు, చ; 2. ఉపయోగము. భార. విరా. 1, ఆ. 239: చూ, వెరవు. 1; 3: చూ, అట విడుపు. 2; స. క్రి. 4: చూ, రూ-సెలగు. హరి. 2, ఆ. 161. [4, ఆ. 522

సెలసు. దే. వి. ఒకరకముచెట్టు. పంచ. వేం.

సెలసువిల్లు. దే. వి: చూ, రూ-సెలవిల్లు.

సెలుకాలుది. వా. వి. ఒకరకముపుంజు. తద్వి.—కోడికి.—(సం) విష్కిరము, శిఖండి: చూ, పుంజు.

సెల్లా. వై. వి.=చేల. అంచుకమ్ములులేని తెల్లనిబట్ట: చూ, వస్త్రము. [ఆది. 7, ఆ. 203

సెల్లుఁడు. వై. వి.=శల్య. శల్యుఁడు. భార.

**సెవ.** వై. వి.=శిఖ: చూ, రూ-సెగ.

## సే

**సేకము.** సం. వి. అ. పుం. 1. చేల్లుట: చూ, సంప్రోక్షణము. 1; 2. తడుపుట: చూ, స్తేమము; వై. వి.=శిఖ. (1) తాపము: చూ, సంతాపము; (2) ఉష్ణము. కంద. వేం. 1, అ. 688: చూ, వేఁడిమి.

**సేకరము.** వై. వి.=స్వీకార. సంగ్రహము: చూ, స్వీకారము. 2.

**సేకరించు.** దే. అ. క్రి. 1. అపాయమునుండి తేలు. స్వా. 4, అ. 115: తెప్పిఱిలు_తెప్పి ఱిల్లు-తెప్పిఱు-తెప్పిర్లు-తేలు, సంబడించు-సంబళించు; వై. స. క్రి. 2.=సంగ్రహ. కూడఁబెట్టు.సంగ్రహించు: చూ, సంధించు 3.

**సేగి.** దే. వి. 1. అశుభము: చూ, హాని. 2; 2.దుఃఖము: చూ,శోకము; 3.ఆపద. రామా. 3, అ. 144: చూ, విపత్తు; 4. నష్టి. హరి. పూ. 5, అ. 233: తుట్టు, దండుగ-దండువ-దండుగు-దండువు, పాలి, పోకు, బొత్త, లుగసాను-లుగ్గాను, వడునుడి, వారడి. (సం) దండము, నష్టి. తద్వి.—౧. రెట్టింపు దండుగకు:-(సం)ద్విపాద్యము; ౨. నాశము పొందినది:— అంతరితము, ఉపహతము, నష్టము, శుచి; 3. నాశము చేయఁబడినది.-ధ్వంసితము; ర. (వి) నాశమునకు:-చూ, సంస్థ. 3.

**సేచకము.** సం. వి. అ. పుం. 1. మబ్బు: చూ, మేఘము. 1; 2. చేల్లునది. తద్వి.-౧. చేల్లఁదగినది:—పరికీర్యము; ౨. చేల్లఁబడినది:-అవకీర్ణము; 3. తడుపునది. తద్వి.—తడిసినది:—చూ, స్తిమితము.

**సేచనము.** సం. వి. అ. న. 1. చేల్లుట: చూ, సంప్రోక్షణము. 1; 2. తడుపుట: చూ, స్తేమము; 3. ఓడలోఁజొచ్చిన నీళ్లు వెలికిఁ-బాఱఁజిమ్మెడుబొక్కెన: చూ, పాత్రము. 6.

**సేదుకట్టు.** దే. వి. సాలెవానిసాధనము: చూ, సరి. 2 (మగ్గము.)

**సేతుబంధనము.** అం: చూ, అష్టవర్గము.

**సేతువు.** సం. వి. ఉ. పుం. 1. నీటికట్ట: అలి-ఆలి, బధ్యము, దుర్గసంచరము, వరణము-వారధి, సంక్రమము. (తె) అడ్డకట్ట, అన-అనకట్ట-ఆనకట్ట, కట్ట, కట్టుఁగొమ్మ, పొర్లుకట్ట, పారువ. తద్వి.—౧. మడికి వేసినగట్టు.—(తె) ఎక్కము, కరగ, కురిమిడి, కురిమిడిగట్టు, గట్టు, గనిమ-గనిమె, నడవ, వరుజో; ౨. కత్తవతో వేసినగట్టు.—కత్తువ-కత్తువ,కట్ట,గట్టు (ఇరుకైన చెఱువులో నగువానిగట్టు); 3. నీళ్లుపాఱుటకుఁ గట్టిన అనకట్ట:-ఖేయము; ర: చూ, లాకు; ౫. వంతెనకు.—పిండిలము, వరణము, వారధి. (తె) అట్టెడ, వంతెన; 2. ఉలిమిరి*: చూ, శ్వేతపుష్పము. [క్రమము.

**సేద.** వై. వి.=స్వేద. శ్రాంతి, బడలిక: చూ.

**సేదగొను.** ద్వ. అ. క్రి. బడలు. అచ్చ. అ. కాం. 40: చూ, వేసరు. 2.

**సేదదేరు.** వా. అ. క్రి. బడలికతీర్చుకొను: కుదురు, కోలుకొను-కోల్కొను, తెమ్మవడు, తేఱు, తేఱుకొను, నిమ్మళించు, రక్కొను-రెక్కొను.

**సేద్యకాఁడు.** ద్వ. వి. పైరుపెట్టువాఁడు: ఆరకాఁడు, కమతకాఁడు- కమతీఁడు-కమ్మతీఁడు, పంటకాఁపు, రయితు_రైతు. (సం) కర్షకుఁడు-కార్షకుఁడు- కార్షికుఁడు-కార్షుఁడు, కీనాశుఁడు, కుటుంబి, కృషకుఁడు-కృషికుఁడు, కృషాణుఁడు, కృషిబలుఁడు-కృషీవలుఁడు, క్రిష్ట, క్షేత్రాజీవుఁడు, వ్యవసాయి, సైరికుఁడు, హలాయుధుఁడు, హలి, హాలికుఁడు-హాలికుఁడు.

తద్వి.— విత్తెడువానికి.—వత్త. (తె) విత్తెడువాఁడు.

సేద్యము. వై. వి. పైరుపెట్టుట: కమతము-కమ్మతము, కరిసనము-కరిసెనము-కరిసెము- కర్షనము-కరిసె, కిసుక, తెగుబడి, దుక్కి, పంట, సాగు, సాగుబడి. (సం) అన్వృతము, కర్షణము, కృషి, కృష్టి, క్లేశము, ప్రమృతము, మహాధనము, వ్యవసాయము. తద్వి.— ౧. తేలికదుక్కికి.- ఒరచోలుదుక్కి— ఒలచోలుదుక్కి; ౨. నీరాసరాపంటకు.—పల్లపుఁబంట; ౩. యజ్ఞార్థమైన దుక్కికి.— (సం) కర్షువు; ౪: రొంపిదుక్కి, కుదప; ౫: జలిదుక్కి; ౬: పంట, మహసూలు-మహస్సూలు; ౭. దున్ని సిద్ధము చేసిన పొలము: (తె) సేవ్యము.

సేన. సం. వి. ఆ. స్త్రీ. 1: అనీకము, అనీకిని, ఉత్థానము, కటకము, చక్రము, చమువు-చమూవు, తంత్రము, దండము, దళము, ధట్టి, ధాటి, ధ్వజిని, పటలము, పతాకిని, పరివారము-పరీవారము, పృతన, బలము, వరూధిని, వాహిని, సాధనము, సైన్యము, స్కంధావారము. (తె) ఎట్టపోగు, కూటువ, చేపలము, చేరువ, తాణా, తత్తబడ, తుటము (తుట్టియు-తుట్టె-తుట్టియ-తుట్టె,తుడుము), తోయము, దండము, దండు, దడము, దణా, దళము, దాఁటు, దాడి, దుమారు, పటాలము, పరి, పాళియము-పాళెము,-పొట్లము, పవుఁజో-ఫౌఁజో, బలువిడి-బల్విడి, మూఁక, మొన, రాణువ, లష్కరు, వాఁగు, వీడు, వెల్లువ, సంగడము, సవరణ-సవరణము, సిబ్బంది. తద్వి.—౧. సేనావిశేషములు-అక్షౌహిణి; అనీకిని; గణము; గుల్మము; చమువు; పత్తి; పృతన; వాహిని; సేనాముఖము. (చూ, సేనాలక్షణము) (వీని వివరములాయాపదములకడఁ జూడనగు); ౨. సేనాముఖమునకు.—ఇర, చమూముఖము, తలతంత్రము, నాసీరము, శిరము, సేనాగ్రము, సేనాముఖము. (తె) పడవలము, మునుము-మున్ను, మొన; ౩. దండులోని అల్లరిజనమునకు.—(తె) పెండారిమూఁక; ౪. పితికిబలమునకు.—(తె) కూటువమూఁక; ౫. యుద్ధసన్నద్ధసేనకు — ప్రచక్రము.(తె) కూరుమొన; ౬. చతురంగబలసేనకు.— (తె) పరి, పరిగమి (చూ, చతురంగములు, చతురంగము.); ౭. సేనవెనుక దండుకు.—కూలము, సన్నయము-పమున్నయము; ౮. మునుదటనుండి రక్షించెడు సేనకు.-పార్ష్ణిత్రము; ౯. కలఁతపాటిన సేనకు.—పింజలము; ౧౦. సేనాగ్రమునకు:—శిరము, సేనాగ్రము;౧౧. సేన వెనుకటిదిక్కునకు:—ప్రతిపరము;౧౨. సేన యొడ్డుటకు —చూ, వ్యూహము; వా. విశ. (1) బహుకాలప్రమాణము. "వాఁడువచ్చి సేనసేపైనది"; (2) ఎక్కువ, చాల. "వాఁడు సేనఅన్నము తిన్నాఁడు" "వాఁడు సేనమంచివాఁడు." (సేనా=చాలా.)

సేనము. దే. వి. రూ—చీనము-చీనాము. చిన్నయులి. బంగారునకు కడియులి (అనికొందఱు): చూ, సుత్తియ (వృక్షాదనము. 1.)

సేనాంగములు. అం: రథ, గజ, తురగ, పదాతి చతుష్టయము: చూ, అంగము. ౪ (చూ, నాలుగంకములు.)

సేనాగ్రము.సం.వి.అ.న.శిరము: చూ, సేన.1-౧౦.

సేనాని. సం. వి. ఇ, ఈ. పుం. 1. కుమారస్వామి: చూ, స్కందుఁడు; 2. సేనాధిపతి, మహాసేనుఁడు: చూ, సైనికుఁడు.

సేనాముఖము. సం. వి. అ న. 1. పడవలము: చూ, సేన.-1-౧-౨; మూఁడురథములు, మూఁడేనుఁగులు, తొమ్మిదిగుఱ్ఱములు, పదునేవురు కాల్బంటులుగల సైన్యము: చూ, సేనాలక్షణము

సేనాలక్షణము. అం. పత్తి మొదలక్షౌహిణిపర్యంతమైన సేవకుఁగలరథగజాశ్వపదాతి సంఖ్యా వివరము.

శ్లో. అక్షౌహిణ్యా మిత్యధికై । స్సప్తత్యా చాష్టభిశ్శతైః । సంయుక్తాని సహస్రాణి । రథానా మేకవింశతిః ।ఏవ మేవగజానాంతు । సంఖ్యాసంకీర్తితంబుధైః । పంచషష్టిసహస్రాణి । షట్ఛతానిదశైవతు । సంఖ్యాతాస్తురగాస్తజ్ఞై । ర్వినారథ్యై స్తురంగమైః ॥ నృణాంశత సహస్రంతు । సహస్రాణినవైవతు । శతానిత్రీణిచాన్యాని । పంచాశత్తుపదాతయః॥"ఇత్యక్షౌహిణీలక్షణముచ్యతే॥

| | సేనపేరు | గజములు | రథములు | అశ్వములు | కాలిబంట్లు |
|---|---|---|---|---|---|
| 1 | పత్తి | ౧ | ౧ | ౩ | ౫ |
| 2 | సేనాముఖము | ౩ | ౩ | ౯ | ౧౫ |
| 3 | గుల్మము | ౯ | ౯ | ౨౭ | ౪౫ |
| 4 | గణము | ౨౭ | ౨౭ | ౮౧ | ౧౩౫ |
| 5 | వాహిని | ౮౧ | ౮౧ | ౨౪౩ | ౪౦౫ |
| 6 | పృతన | ౨౪౩ | ౨౪౩ | ౭౨౯ | ౧౨౧౫ |
| 7 | చమువు | ౭౨౯ | ౭౨౯ | ౨౧౮౭ | ౩౬౪౫ |
| 8 | అనీకిని | ౨౧౮౭ | ౨౧౮౭ | ౬౫౬౧ | ౧౦౯౩౫ |
| 9 | అక్షౌహిణి | ౨౧౮౭౦ | ౨౧౮౭౦ | ౬౫౬౧౦ | ౧౦౯౩౫౦ |

సేపు. వా. వి. కాలము: చూ, సమయము. 1. (అంత, ఇంత, ఎంత, కొంత, ఇంకొక, చాల, గంట మున్నగుపదములు సేపుతోఁజేరి కాలనిర్ణయమును సూచించుచున్నవి.)

సేబాసు. దే. అవ్య. ప్రశంసనార్థకము. "క. సేబాసు బళానినున్." కృష్ణా. 3, ఆ: రూ-సెబాసు-సబాసు- శాబాసు, అజ్జ, అజ్జిరె- అజ్జిరే- అజ్జారె-అజ్జారే, (మి) అఝ్ఝా-అఝ్ఝారె-అఝ్ఝారే; అద్దిటి-అద్దిటియ్య, అద్దిఱి, అరె-అరే-ఆరె, అహాను-హసాను, ఎ-ఏ, ఓహో-ఓహోహో, ఓహోరె-ఓహోరే, ఔ, చేంగుబళి, చేఁగు-చేఁగురె-చేఁగురే, పురె-పురే, బలా-బలారా-బలారె-బలారే, బలే, బళా-బళారె-బళారే, బళి-బళిర-బళిరయ్య-బళిరా-బళిరె-బళిరే- బళీ-బళీరె-బళీరే-బాపు-బాపురె-బాపురే, మజే-మజో-మజ్జి-మజ్జిరె-మజ్జిరే-మజ్జా-మజ్జారె-మజ్జారే, (మి) మఝ్ఝా; మమ్మ-మమ్మరె-మమ్మరే-

మమ్మా-సుమ్మారె-మమ్మారే, మా, మాయా, మాయారె-మాయారే, మెర, మేల్-మేలు, రె-రే. (సం) తావత్, భల్లారె-భల్లారే, భళిరె-భళిరే. తద్వి:—చూ, ప్రశంసార్థకములు.

సేమంతి. సం. వి. ఈ. స్త్రీ. 1.=చేమంతి*: రూ-సేమంతిక, సేవంతి, శతపత్రిక. (తె) చేమంతి-సేమంతి; వై. వి. (1)=సేవంతి*: చూ, సేమంతి. 1; తద్వి.—౧. రక్తసేవంతిక. (తె) ఎఱ్ఱచేమంతి; ౨. కురంటకము. (తె) పచ్చచేమంతి. *.

సేమంతిక. సం. వి. అ. స్త్రీ.=చేమంతి.-వై.-

సేమము. వై. వి.=క్షేమమ్. 1. బాగు: చూ, శుభము. 1; 2. ఉన్నది చెడకుండుట.

సేరి. దే. వి. 1. హెచ్చువరిమితిగల సాగుబడి: రూ-సేరీ; 2. ఈనామకాని పొలము (శ. ర.): రూ-సేరీ

సేరీ. వా. వి.—వై.—

సేరు. దే. వి. 80 తులముల యెత్తుపడి: కుడుపము, పవల, మాన-మానిక-మానికె, మంత. (సం) అంజలి, కుటపము, కుడపము-కుడవము, మానము. తద్వి.-కుడపపరిమాణము.—మానెడు. (వీసెకు సేర్లు 5. సేరుకు పలములు 8. పలమునకు తులములు 3; సేరు=80 డబ్బుల వడియెత్తు; కుంచేము=4 సేర్లు అనికొందఱు.)

సేల. వై. వి.=చేల: చూ, వస్త్రము. యు. 2, అ. 98.

సేలు. దే. వి: చూ, రూ-సాలు. 1-2-3; అం. 4: చూ, సేలము. 4.

సేవ. సం. వి. అ. స్త్రీ. కొలువు: అన్వాసనము, అలోకము, ఉపచారము, ఉపస్థానము, ఉపాసన-ఉపాసనము, ఉపాస్తి, చాటూక్తి, పరిచర్య, పరిచారము, పరీష్టి, శుశ్రూష, శ్లాఘ, సేవనము. (తె) ఉడిగము-ఊడిగము-ఊడియము-ఊడెము, కొనియాట, కొట్నము, కొలువు-కొల్వు, చాకిరి, సినువరకము. తద్వి.—౧. కైంకర్యమునకు:-(సం) భక్తి, భజన-భజనము; ౨. మిక్కిలి సేవకు:-పింజలము-సముత్పింజలము; 3: శ్వవృత్తి. (తె) నవుకరి (నౌకరి-నవుఖరి-నౌఖరి.); ౪: భిక్ష-భిక్షము; అం. 2: చూ, వృత్తులు (మనుజ వృత్తులు); వై. వి. (1) సినువరకము. అం, భా. ద్వి. 178: చూ, సేవ. 1; (2): చూ, సంబగము; (3)=సేవికా: చూ, సేవిక. అం, భా. ద్వి. 255.

సేవంతి. సం. వి. ఈ. స్త్రీ.=చేమంతి*: చూ, రూ-సేమంతి. (సేవంతిక అని కొందఱు.)

సేవకము. సం. వి. అ. పుం. వీణకరివె, పరిసేవకము: చూ, స్వరము 2. (చూ, వీణాదండము; వీణ. ౭౨.)

సేవకుఁడు. సం. వి. అ. పుం: అనుజీవకుఁడు, అనుజీవి, అర్థి, ఉపాసకుఁడు, కర్మకరుఁడు, కర్మి, కింకరుఁడు, కుర్వంతుఁడు, కుర్వాణుఁడు, ఖరుఁడు, గుప్తి, గోప్యకుఁడు, గోప్యుఁడు, చేడకుఁడు, చేడుఁడు, చేలుకుఁడు, జీవకుఁడు, దాసుఁడు, నియోజ్యుఁడు, నిర్వాణుఁడు, పరిచారకుఁడు, ప్రేష్యుఁడు, భటుఁడు, భృత్యుఁడు, వంశుఁడు, సేవి. (తె. ప): —అడియరి, అలెగాఁడు, ఊడిగీఁడు, కొలువుకాఁడు-కొలువుడుకాఁడు-కొల్వుడుకాఁడు, గుండఁడు, గులాము, జీతగాఁడు, డింగరీఁడు (డింగరుఁడు), నవుకరు, (నవుఖరు-నౌకరు-నౌఖరు), పనివాఁడు, పాత్రిఁత, బంటు, బంటోత్రుతు, (బంటొత్రుతు), బానిసీకుఁడు-బానిసీఁడు, బోడిక, లెంక-లేఁక, వరవు, వరవుఁడు. తద్వి.—౧. పాదసేవకునకు.—(తె) బానసీకుఁడు-బానసీఁడు; ౨. కుత్సితసేవకుఁడు:—కసేవకుఁడు; 3. కుదువయుంచిన బానసీకుఁడు:—అడత్తుఁడు. (తె) లంకమానిసి; ౪. సంకరికొండిబంటు: (తె) కొలుకాఁ

డు; ౫. వంచేసుకొనియుండు సేవకుఁడు: (తె) వడిగాపు; ౬. పెంపుడుబంటు.— పరజాతుఁడు-పరాచితుఁడు, పరిస్కందుఁడు, పరైధికుఁడు; ౭. పూజచేయువానికి:— చూ, పూజారి. 1; ౮. విష్ణుపూజచేయువానికి:— చూ, పూజారి. 2; ౯. శివార్చకునకు:— చూ, పూజారి. 3; ౧౦. పోలీసు బంట్రౌతునకు.— దండపాశికుఁడు. (తె) పోలీసు; ౧౧: చూ, విధేయుఁడు; ౧౨. చిల్లరపనులు చేయు బంటుకు:— (తె) మేటి; విశే. 2. కొలుచువాఁడు.

సేవకురాలు. మి. వి. దాసి, బోటి: చూ, పరిచారిక. (చూ, స్త్రీ) (చూ, దాసి.)

సేవధి. సం. వి. ఇ. పుం. రూ—శేవధి: చూ, నిధి. 2.

సేవనము. సం. వి. అ. న: 1. కొలువు: చూ, సేవ. 1; 2. (సీవనము అనికొందఱు.) బట్ట కుట్టుట: చూ, స్యూతి.

సేవన్యావర్తి. అం: చూ, అనుభావర్తములు.

సేవి. సం. వి. న్. పుం. కొలువుడుకాఁడు: చూ, సేవకుఁడు.

సేవించు. సం. స. క్రి: ఉపచరించు, ఉపాసించు, పరిచరించు, భజించు, సంభజించు, సంభవించు. (తె) ఓలగించు, కొలుచు.

సేవిక. సం వి. ఆ. స్త్రీ.=సేవియ. నై. 6, ఆ. 20: చూ, భృత్యము.

సేవితము. సం. విశే. సేవింపఁబడినది (కొలువఁబడినది): జుష్టము, వనిత, నిషేవితము. తద్వి.— సేవించునది:- భజమానము.

సేవితుఁడు. సం. విశే. సేవింపఁబడినవాఁడు: ఉపచరితుఁడు, ఉపాసితుఁడు, వరివసితుఁడు-వరివస్యితుఁడు-వరివస్సితుఁడు, శ్రితుఁడు

సేవియ. వై. వి. రూ—సేవి=సేవికా. వై. 8, ఆ. 204: చూ, సేవిక.

సేవ. వై. వి.=:చూ, సేవియ, య. 2, ఆ. 83.

సేవ్యము. సం. వి. అ. న.=చవ్య. 1. వట్టివేరు*: అభయము, అమృణాళకము - అమృణాళము., అవదాహము, ఇష్టకాపథము, ఉశీరము-ఔశీరము, కంభువు, నలదము, మృణాలము, లఘులయము, లయము, లాజము, లామజ్జకము, సీతోసీరము. (తె) వటివేరు-వట్టివేరు, అవురుగంటివేరు. తద్వి.—౧. తెల్లవట్టివేరునకు:- జలాశయము, లామజ్జకము. (అని కొందఱు): (తె) తెల్లవట్టివేరు; ౨. నీరు వట్టివేరునకు: అమృణాళకము_అమృణాళము, అవదాహము, ఇష్టకాపథము, జలాశయము, లఘులయము, లయము, లామజ్జకము, శీఘ్రము, సేవ్యము (దీని తెల్ల వట్టివేరు అని కొందఱు.); 2. చవ్యకము*: చూ, కరికణావల్లి; విశే.3. సేవింపఁదగినది: జుష్యము, భజనీయము; దే. వి. (1) దున్ని సిద్ధముచేసిన పొలము: సేద్యము.

సేవ్యుఁడు. సం. విశే. ఉపాసింపఁదగినవాఁడు: ఉపాస్యుఁడు. తద్వి.—పరిచర్య చేయువాఁడు:- పరిచార్యుఁడు.

సేస. వై. వి.బ.1. అక్షతలు. వసు. 6, ఆ. 28. చూ, సేసఁబ్రాలు; 2. అక్షతలను ధాన్యము: చూ, స్తంబకరి(ధాన్యము); వై. వి 3. కేశవీధి, పాపట. (సం) కేశపద్ధతి, సీమంతము.

సేసఁబ్రాలు. ద్వ. వి. తలఁబ్రాలు. (చూ, బియ్యము.) తద్వి—౧. పీనుఁగుమీఁదవేసెడు బియ్యము:- వాతిబియ్యము; ౨. అనుగ్రహించియిచ్చిన అక్షతలులోనగునవి:—(సం) శేష; 3. ఎసటిపోఁతలుగాదంచిన బియ్యము:— సడింపులు; ౪. పొట్టువీడిపీసనిబియ్యము:- మెతికలు-మెటుకులు; ౫: లక్కపాడి, లక్కబియ్యము; ౬: సగ్గుబియ్యము.

సేసకొప్పు. న్య. వి. కొండెసిగ: చూ, సిక.

సీసలు. వై. వి. బ.=శీష: చూ, సీస. 1-2.

సీశము. దే. వి. శారంభి, పేంకణము*: చూ, పన్నకద్రువు.

## సై

సై. వై. ఉప. రూ-సయి.=సహ. సహార్థకము. "సైదోడు" మొ. (చూ, సైకము)

సైంధవము. సం. వి. అ. పుం, న. 1. ఇందుప్పు: చూ, లవణము. 1; పుం. 2. గుఱ్ఱము: చూ, హయము; విశే. 3. సింధువునఁ బుట్టినది; అం. 4: చూ, టక్కజభాషలు.

సైంధవలడ్డు. జా. అడ్డము. (పానకములోని పుడకవంటిది.)

సైంధవలవణము. సం. వి. అ. పుం. 1: చూ, సైంధవము. 1; అం. 2: చూ, క్షారములు.

సైంధవవరాటి. అం: చూ, వరాట్యుపాంగములు (అంగము. 9.)

సైంధవి. అం. 1: చూ, పంచమజభాషలు; 2: చూ, మాళవకైశికజభాషలు; 3: చూ, భిన్నషడ్జకజభాషలు.

సైంహికేయుఁడు. అం: రాహుగ్రహము: చూ, [రాహువు. 1.

సైఁచు. వై. అ. క్రి, స. క్రి.=సహన. రూ-సయిచు. 1. ఓర్చుకొను: చూ, సహించు; 2. రుచించు; చూ, సంధించు. 2; స. క్రి. 3.=సహన. ఓర్పు: చూ, శాంతించు.

సైఁదము. దే. వి. గోదుమపిండి: రూ-సయిఁదము. [చూ, సహనము. 1.

సైఁపు. వై. వి. ఓర్పు. శాంతము, రూ-సయిఁపు:

సైఁపుడు. వై. వి. —సై.—(రూ-సయిఁపుడు.)

సైకతము. సం. వి. అ. న. 1. ఇసుకదిబ్బ: చూ, భూమి. 1; 2. ఇసుకనేల: చూ, భూమి. 1. [(తె) ఇసుకదారి.

సైకతశాకము. సం. వి. అ. న. ఒకానొకకూర:

సైకము. దే. వి. 1. రూ-సయికము. విజ. 2, ఆ. 48: చూ, స్వల్పము; విశే. 2. సూక్ష్మమైనది: (సం) అగురువు, కనిష్ఠము. (తె) చిన్నది; తద్వి:-౧. సన్నమైనది :- పలుచ; ౨. (విశే.) పలుచనైనది:- పలచ-పలుచ, బద్ద.

సైకిలు. వా. వి. రూ-సయికిలు, బయిసికిలు-బైసికిలు (చూ, బండి.)(ట్రయిసికిలు=మూఁడుచక్రములబండి)

సైగ. వై. వి.=సంజ్ఞ. 1: రూ-సయిగ, బాస, మంతనము. (సం) సంకేతము, సంజ్ఞ (కంటితోను చేతితోను, తలతోను, ఒకవిధమైన స్వరముతోను చూపెడి తెలుపులు సైగలనఁబడును.) తద్వి.—౧. చేసన్న, సన్న. (సం) సన్య-సన్య; ౨. కనుసైగకు.—కన్నసన్న, జాడ; 2: చూ, రహస్యము. తద్వి. ౧.—రహస్యమునకు. (సం) వృత్తాంతము, సమయము; రహస్యార్థమందు :-(వి) అస్పష్టత, అవ్యక్తము, ఉపహ్వరము; (విశే) అస్పష్టము, అస్ఫుటము; (అవ్య) ఉపాంశు. (చూ, రహస్యము.)

సైడ్డు. వా. వి. రూ-సయిడ్డు: చూ. నూరెలు. 1.

సైతము. వై. అవ్య.=సహిత. రూ-సయితము. (క్రి) ఒకట-ఒక్కట-ఒకొట - ఒక్కొట, కూడ, తో-తోడ - తోడుత - తోడుతో, తోడుతోడ- తోడ్తో- తోడ్తోడ, మొదలగునవి. (సం) సు, సహ-సహా, సహితము, సాంవ్రితము. [దునది: చూ, నది.

సైతవాహిని. సం. వి. ఈ. స్త్రీ. బాహుదయను

సైతాను. వా. వి. రూ-సయితాను. 1. పిశాచములకుఅధిపతి; 2. వెంటనంటి వదలనివాఁడు. [సహాయుఁడు. 1.

సైదోడు. ద్వ. వి. రూ-సయిదోడు: చూ,

సైద్ధాంతికుఁడు. సం. విశే. సిద్ధాంతము తెలిసినవాఁడు: చూ, సాంవత్సరుఁడు.

సైనికుఁడు. సం. వి. అ. వ. 1: ఖడ్గికుఁడు.

దండనాయకుఁడు, దళపతి, ధ్వజి, వాహినీ పతి, సేనాధిపతి. (తె) గమికాఁడు, చేకువకాఁడు, దణాయుఁడు, దణి-దణియ-దణె, దళవరి-దళవాయి-దళ్వాయి, దొర, పడవాలు - పడాలు, మొనకాఁడు, మోటుకాఁడు, సోల్జరు. తద్వి.-౧. గొప్పసేనగలవాఁడు.- మహాసేనుఁడు; ౨. విష్ణుసేనాధిపతికి.-విష్వక్సేనుఁడు; ౩. చిన్నసేనకు అధిపతికి - (తె) జెంగిలి, జెంగిలిగమికాఁడు; విశే. 2. సేనతోఁ జేరినవాఁడు.

సైను. వా. వి. రూ-సయిను: చూ, వస్త్రము.

సైన్సు. వా. విశే-రసాయనశాస్త్రసంబంధమైనది.

సైన్యము. సం.వి.అ. న రూ-సైనికము. 1. సేనతోఁగూడియుండుబలము (అనికొందఱు): చూ, సేన. 1; పుం. 2. కృష్ణుని తేరిగుఱ్ఱములలో నొకటి: చూ, హయము; అం. 3: చూ, రథ్యములు; విశే. 4. సేనతోఁగూడినది

సైమంతికము. సం. వి. అ. న. కుంకుమపువ్వు: చూ, వహ్నిశిఖము. 1.

సైరంధ్రి. సం. వి. ఈ. స్త్రీ. 1: చూ, గట్టివాలు; 2. అంతఃపురకావలికత్తె: చూ, స్త్రీ; 3. సంకరజాతిఆఁడుది: చూ, స్త్రీ.

సైరణ. వై. వి.=సహన. రూ-సయిరణ: చూ, సహనము. 1. [నిర్వ. 3, అ, 78.

సైరించే. వై. అ. క్రి: చూ, రూ-సయిరించే.

సైరికము. సం. వి. అ. పుం. 1. దుక్కిటెద్దు: చూ, (చూ, హాలికము. వృషభము. 1-౭౯); విశే. 2. సీరసంబంధమైనది (సీరము=నాఁగలి). [చూ, సేద్యకాఁడు.

సైరికుఁడు. సం. వి. అ. పుం. హాలికుఁడు:

సైరిభము. సం. వి. అ. పుం. దున్నపోతు: కటాగ్దము, లాలికము, వీరస్కంధము. తద్వి: ౧. గవలమువకు.-సైరిభము (అనికొందఱు), కాసరము. (తె) కారుపోతు-కాఱుపోతు-కాఱ్పోతు. కాఱెనుఁబోతు, కాఱుదున్న: (చూ, మహిషము.1-౨); ౨. అడవిదున్నకు.-వనమహిషము. (తె) అడవిదున్న: (చూ, మహిషము); 3. నాకము: చూ, స్వర్గము.

సైరేయకము. సం. వి. అ. పుం. తెల్లగోరంట*: చూ, సహా. 2; 2. ములుగోరంట*: చూ, సహా. 2.

సైలరు. వా. వి. ఓడమీఁదపనిచేయువాఁడు.

## సొ

సొంటి. వై. వి.=శుంఠి. ఎండినఅల్లము, పక్వముచేసి యెండించిన అల్లము: (సం) ఊషణము-ఊషణము, కటభంగము-కటుభంగము-కటుభద్రము, కటూత్కటకము-కటూత్కము, కఫారి, జగాన్ధవము, నాగరము, మహౌషధము-మహౌషధి, విశ్వభేషజము, విశ్వము, శుంఠి, శొంఠి. తద్వి.—చూ, శృంగబేరము.

సొంటిపిక్క. వా. వి. పిక్క తొడలోనగు చోట్లను వ్రేళ్లతో నొక్కి కదుముగట్టునటుల చేయుట: తొడపాశ(సె)ము.

సొంటు. వై. వి.=శుంఠ. తప్పు: అయిపు-వివు, అవగడము, ఆగడము, ఎగ్గు, ఒప్పమి, కల్ల, కీడు, గొడవ, జోలము, డొగరు, తప్పితము-తప్పిదము, తప్పు, తీఁపురము, దబ్బఱ, దుండగము, దుండతకము, దుడుకు, దోసము, నెపము-నెవము-నేవము, నెరను, నేరమి-నేరము, వంక, సొడ్డు. (సం):—అంకము, అతికర్ణము, అత్యయము, అనయము, అపరాధము, అవకటము, అగము, ఏనము-ఏనస్సు, కిల్బిషము, ఛిద్రము, జఘునము, దంభము, దోషము, మంతువు. తద్వి.—౧. పరిమాణముచేసి తప్పుచెప్పిననేరము.—(సం) అపరి

మాణము; 3. పెద్దలయెడలచేసినతప్పు:— (సం) అపచారము. [సాతంతరము

సాంతము. వై. విశే.=స్వతంత్రి: చూ, రూ-

సాంపిలు. దే. అ. క్రి. రూ-సాంపిల్లు. అందగించు, సొంపగు: చూ, రమ్యమగు.

సాంపిల్లు. దే. అ. క్రి.—పై.—

సొంపు. దే. వి. 1. పరిపన్నత: చూ, సమీచీనము. 2; 2. కాంతి. ఆం, భా. వ. 80: చూ, వెలుతురు. 1; 3. ఆనందము: చూ, సంతోషము. రామా. 4, ఆ. 8: 4. సుఖము: చూ, సంతోషము. రామా. 5, ఆ. 182; 5: చూ, సౌందర్యము; 6: చూ, సమృద్ధి. మార్క. 8, ఆ. 207. [చూ, సొగటు.

సొక్కు. వై. వి.=సుఖ. ఇంచుక విపరీతస్మృతి:

సొగటము. ద్వ. వి. బ. పగడాలపాల: చూ, వ్యవహారము. 4-?-౬. [—పై—

సొగటాలు. ద్వ. వి. బ. (సొగపు + ఆటలు)

సొగటు. దే. వి. (అవి. 3, ఆ. 122): సొక్కు— చొక్కు, వాడు. (సం) క్లమథము, క్లమము, మ్లాని. (ఇవి స్మృతియందును వర్తించును.) [ఆ. 149: చూ, విస్మృతి.

సొగపు. వై. వి.=సుఖ. పారవశ్యము వై. 3,

సొగయిక. వై. వి.=సుఖ.—పై.—

సొగయు. వై. అ. క్రి.=సుఖ. రూ-సొగియు. 1. చొక్కు. పరవశత్వమునొందు. భార. ఉద్యో. 4, ఆ. 329: చూ, విస్మృతినొందు; 2 మూర్ఛిల్లు. మార్క. 6, ఆ. 203: చూ, సొమ్మసిల్లు.

సొగసు. వై. వి. 1. యౌవనాదుల వలనఁగలుగు గర్వచేష్ట: ఆం, భా. వ. 133: చూ, విలాసము. 2; 2: చూ, సౌందర్యము; 3: చూ, సొగపు.

సొగసుఁగాంచు. వా. అ. క్రి: ఇంపొలయు.

సొగసుకత్తె. వై. వి. 1. విటకత్తె: చూ, స్వైరిణి; విశే. 2. అందకత్తె, అందకత్తియ, రూపరి, రూపసి: చూ, స్త్రీ.



సొగసుకాఁడు. ద్వ. వి. 1. విటకాఁడు: చూ, విటుఁడు; విశే. 2. అందగాఁడు: చూ, సౌందర్యవంతుఁడు. [లక్ష్మి, 1. ఆ.

సొగియించు. వై. అ. క్రి: చూ, సుఖించు.

సొగియు. వై. అ. క్రి.=సుఖ. 1. ఇంపగు: నచ్చు; 2 స్లానమగు, వాడు. ఆం, భా. కృ. 107: చూ, మురుక్కు. 14.

సొచ్చెము. వై. వి. పెచ్చు: చూ, హెచ్చు. 1; 2=స్వచ్ఛ-చోక్ష. నిర్మలము, గరగర: చూ, సమీచీనము. 2; 3.=చోచ. మిగులు: చూ, శేషము. 1; విశే. 4. మిగిలినది: చూ, శేషము. 1. [స్నము: చూ, సాదము. (1).

సొజ్జె దే. వి. బియ్యము వేఁచిపండిన యా

సొజ్జెబూరె. ద్వ. వి: చూ, భక్ష్యము. కళా. 7, ఆ. 81. [హరి. 2 (వింత).

సొజ్జెము. వై. వి.=చోద్య. సోద్దము: చూ,

సొటసొట. దే. వి: నకనకలు, పలపలన-పల్పలన.

సొటసొటలాడు. వా. అ. క్రి: చూ, సొటసొటపోవు.

సొటసొటపోవు. దే. అ. క్రి ఎండు: రూ-సొటసొటలుపోవు, అడుగంటు, అఱు, ఇంకు, ఇగురు-ఇవురు, ఇనుకు-ఇముకు-ఈఁకు, ఈచు, ఉజ్జిగిలు (ఉజ్జిగిల్లు), ఎండు, కాటువోవు, కొల్లపడు, చెండు, డిందు, డొంకు, డొందు, తడితీయు, దయ్యు, నవయు, నీరింకు, బక్కటిలు-బక్కటిల్లు, ముడుకు, ముక్కు, వక్కు, వట్టు, వడియు. (సం) శోషించు-శోషిల్లు, హరించు; తద్వ:— గ. చిక్కు అనుటకు.—ఉడుగు, ఉఁచేపడు, ఊచఁపోవు, ఊసరిల్లు, ఒరుదుకలుచు, క్రియ్యు, క్రియ్యఁబాఱు, క్రియ్యు, చిక్కుడయ్యు, తీయు, తొరుపడు, నకనకఁబడు, నకనకలాడు, నకనకలుగుడుచు-నకనకల్గుడుచు, నవయు, పీఁకువాఱు, బక్కటిలు-బక్కటిల్లు, వక్కు, వట్టు, వడియు, సన్నవాఱు,

సొటసొటవోవు- సొటసొటలువోవు. (సం) క్షీణించు; ఇ. కొంచెపడుఅనుటకు.—ఇతియు, కొంచెపడు, మందగించు, వలియు, సన్నగిలు-సన్నగిల్లు, సన్నవాఱు.(సం) కృశించు, మందీభవించు.(ఎండు—చిక్కు-కొంచెపడు వీటి పర్యాయములు గూడదీనికిఁజెంద వచ్చునని కొందఱు). [ఔ, ఆ. 62.

సొటసొటలువోవు. దే. అ. క్రి.—పై.— విజ.

సొట్ట. దే. వి: రూ-చొట్ట కుంటి-కుంటు.

సొట్టపడు. దే. అ. క్రి: కుంటుపడు.

సొడ్డు. దే. వి. 1. న్యూనత. సా. 2, ఆ. 108: అచ్చిక-అచ్చికము, అరవాయి, అఱ—అఱగొఱ, ఒచ్చెము, ఒట్టు, కడమ, కీడుపాటు—కీడ్పాటు, కీఱ, కుందకము, కుందు, కొంచియము-కొంచెము, కొఱ- కొఱవ, కొఱుక, కొఱ, కొఱఁత, కొఱఁతపాటు, గఱగొఱ, గుఱికొండి, చేవుక-చొక, డిందు, డిగు-డిగ్గు-డిగుడు-డిగ్గుడు—దిగుడు—దిగ్గుడు-దిగువాయి, తక్కు, తక్కువ, తక్కువపాటు, తగ్గు, తగ్గుపల, నిమురళా, నులుసు, పొచ్చెము, బెరికి, మట్టము, మట్టు, ములుచే-ముల్చు, మొఱక, లులి, లొచ్చు, లొజ్జ, లొసుకు, లోఁకుప (లొక్కు), లోటు, విన్నన, వెలితి-వెల్తి. (సం):—అపకర్షము, అపచయము, అపచితి, అపహారము, ఇతరము, క్షయము, క్షియ, లుక్కు, లులి, లోపము, హైన్యము. (విణ) నీచము, న్యూనము. (అవ్య) ఉప. తద్వి. ౧: తొట్రిరిద్వ, పీసర-పీసరము, పలితి-పిల్తి, వా. 2. ముందుగతినువాఁడుపందెగానితో నను డుమాట. "నీమీఁద నేను సొడ్డు వేసితిని"; వై. వి. 3=శౌంత్య: శుంఠత్వము, మూఢత్వము: చూ, శొంత్యము; 4=శౌఁత్య తత్వ: చూ, సొంటు

సొంతంత్రము. వై. వి.=స్వతంత్రి. 1: చూ, స్వతంత్రము; 2 లత్త్యములేమి, నిర్లత్త్యము

సొత్తు. వై. వి.=స్వత్వము. 1. హక్కు: చూ, స్వతంత్రము; 2.=సత్వమ్. సొమ్ము: చూ, హిరణ్యము. 3.

సొద. వై. వి.=చితా. పీనుఁగును గాల్చుటకుఁ జేర్చిన కట్టెలులోనగువాని పోగు: చూ, శ్మశానము.

సొన. దే. వి. 1. గుడ్డులోని జిన: రూ-జిన-జెన; 2. బెండలోనగువానిమీఁది నూఁగు. స్వా. 6, ఆ. 27: చూ, సితాగ్రము; 3. ఊట కాలువ: చూ, ప్రదిని (నది. (౧౧).); విణ. 4.=స్రవణ. స్రవించునది.

సొనచిక్కుడు. దే. వి. ఉలవకాయలవలెకాసెడి ఒకానొకచిక్కుడు. (గూ, చిక్కుడుకుటుంబము )

సొనాయి. వా. వి: చూ, గూ-సొన్నాయి.

సొన్న. వై. వి.=స్వర్ణమ్. (రూ-సొన్నా-సొన్నము.పొన్ను.) 1. బంగారము: చూ, లోహము. 1; 2. అర్ధదీనారము, మాడ. విజ. 2, ఆ. 8: చూ, సువర్ణము. 2.

సొన్నము. వై. వి.=—పై.— (బంగారుకు-విజ. 2, ఆ. 83; మాడకు -జై. 8, ఆ 194.)

సొన్నా. వై. వి.=—పై.—(వృత్తియందు ముపర్ణలోపమును అంత్యవర్ణమునకు దీర్ఘంబును నగు. ("సొన్నాటంకము.")

సొన్నాపట్టెరుమాలు. వా. వి. ఒక రకము రుమాలు: చూ, రుమాలు. [చూ, వీణ. ౫౧.

సొన్నాయి. వా. వి: రూ-సనాయి-సొనాయి:

సొన్నారి. వై. వి. (సొన్నము+అరి)=స్వర్ణకార. అగసాలెవాఁడు: చూ, స్వర్ణకారుఁడు (ద్వ. అవి. శ. ర). (వైకృత దీపికలో వై. అని శ. ర.).

సొపాదాబ్రాహ్మణులు. అం: చూ, మహారాష్ట్రులు. (సామవేదులు, ద్రావిడ్యాయణసూత్రీయులు, తాటిచెట్ల పైరును బెట్టెదరు. ఇతర బ్రాహ్మణులు వీరితో సహపంక్తి

భోజనాదులను చేయకుగాని నీళ్లుమాత్రము త్రాగుమురు.) [2: చూ, హృద్యము.

సొబగు. వై. వి. 1.=శుభగ: చూ, సౌందర్యము;

సొబగుఁడు. వై. వి. 1: చూ, విటుఁడు; 2.=శుభగ. భార. అర. 6, ఆ. 160: చూ, సౌందర్యవంతుఁడు.

సొబను. దే. వి: బడబమోలు.

సొమక. వై. వి.=భ్రమ: చూ, సొమ్మ.

సొమ్మ. వై. వి.=భ్రమ-మూర్ఛ: (చూ, గోగము. 1-౨౨) అరసొవు, ఒల్లము- కల-కళ, కళబుట్టుట, చొక్కు, బవిళి-బావిళి, బ్రమరి, మెయిమఱుపు-మేమఱు(పు)పు, మమాశము, సొమక, సొరగు-సొరుగు, సొలగు-సొలపు, సొలిమిడి. (సం): కశ్మలము, నిర్వేశము, ప్రతిఘము, ప్రలయము, మూర్ఛ, మోహనము, మోహము. తద్వి.—౧. కాకితీపు, కాకిసొమ్మ; ౨. మిక్కిలి మూర్ఛనొందుటకు.—(సం) సమ్మూర్ఛనము. (చూ, విస్మృతి.) [అచ్చ. యు, కాం. 190.

సొమ్మగొను. ద్వ. అ. క్రి: చూ, సొమ్మసిల్లు.

సొమ్మలఁబోవు. ద్వ. అ. క్రి.—వై.—ఆం, భా. ద్వి. 109. [6, ఆ. 153.

సొమ్మవోవు. ద్వ. అ. క్రి.—వై.—హరి. పూ.

సొమ్మలవోవు. ద్వ. అ. క్రి.—వై.—ఉ, హరి. 4, ఆ. 242.

సొమ్మసిలు. వై. అ. క్రి: రూ—సొమ్మసిల్లు, ఎడఁజెందు, ఒల్లఁబోవు, కళఁబుట్టు, కొఱవోవు, చొలయు, తాళితాఁకు, బాహిరపోవు, బిమ్మటివోవు, మైమఱచు, సొగయు, సొమ్మగొను, సొమ్మలవోవు-సొమ్మవోవు, సొరుగు, సొలయు, స్రుక్కు. (సం) మూర్ఛిల్లు.

సొమ్మసిలినవాఁడు. ద్వ. వి: అంగవికలుఁడు, అపస్మారి, మూర్ఛాలుఁడు, మూర్ఛితుఁడు, మూర్తుఁడు.

సొమ్ము. వై. వి. 1: చూ, భూషణము. 1; 2.=స్వమ్. ధనము: చూ, హిరణ్యము. 3; 3. గోధనము. అచ్చ. బాల, కాం. 18: చూ, హిరణ్యము. 3; 4. అధీనవస్తువు. హరి. ఉ. 6, ఆ. 125: చూ, స్వతంత్రము.

సొమ్ముదాఁచుట. అం: చూ, వివాదములు.

సొమ్మువినియోగించుట. అం: చూ, సప్తవ్యసనములు. [సౌద. ఆం, భా. ద్వి. 225.

సొర. దే. వి 1: చూ, రూ-సొఱ*; 2: చూ,

సొరంగ. వై. వి.=సురంగా.(రూ-సొరంగము): వానము, సొరి, సొరియ: చూ, రంధ్రము. 1.

సొరంగము వై. వి.=—పై—

సొరకాయ. వా. వి (పై పెంకు కండకాయ.): ఆనపకాయ (ఆనబకాయ), తిపిరి, సొరు: చూ, సొఱ. [చి గొప్పగా చెప్పుట.

సొరకాయకోఁతలు. వా. వి. అబద్ధములు కల్పిం

సొరగు. దే. వి. 1. మూర్ఛ: చూ, సొమ్మ; అ. క్రి. 2. లీనమగు. లక్ష్మీ. 2, ఆ. 75.

సొరదోఁకి. దే. వి. దురాచారుఁడు: చూ, వ్యాధుఁడు. 2.

సొరపు. దే. విశే. బక్కటల్లినది. ఉ, రా. 5, ఆ. 100: ఊరపరము, ఎముకలవట్టు, గిటగిటన, బకేడా, బక్క, బడుగు-బడుపు, వక్కి. (సం) కృశము, శాతము.

సొరము. వై. వి =స్వర. 1. కంఠధ్వని: చూ, స్వరము. 2; 2. షడ్జాది: చూ, స్వరము. 3.

సొరి. వై. వి =సురంగా: చూ, సొరంగ (చూ, రంధ్రము. 1.)

సొరిది. దే. వి. 1. వరుస: చూ, శ్రేణి. 1; 2. రీతి: చూ, విధము. 1; 3: చూ, అనుక్రమణిక.

సొరియ. వై. వి.=సురంగా: చూ, సొరంగ (చూ, రంధ్రము. 1.)

సొరుగాకు. వా. వి. ఎండాకు, చొక్కాకు, చొరుగు-చొరువు-సొగుసు. (సం) శుష్కపత్రము. (చూ, పర్ణము. 1-౭.) తద్వి.—ఆకునకు.—(సం) బభ్రము: చూ, వర్ణము. 1.

**సొరుగు.** వా. వి. 1.—పై.—; 2. పెట్టెలోని అఱ: రూ—సొఱుగు - చొఱుగు-సురుగు. (చూ, సందుకా); దే. వి. 3. మూర్ఛ: చూ, సొమ్మ: అ. క్రి. 4. వడలు. ఆం, భా. తృ. 107: చూ, సొగియు. 2; 5. మూర్ఛిల్లు. ఉ, రా. 6, ఆ. 275: చూ, సొమ్మసిల్లు.

**సొర.** దే. వి. 1: రూ-సోర-సొఱ్ఱ, అనప—(అనబ), అనుగ-అనుగము, అనుగు. (సం) అలాబువు. అలాబువు, అలుక, తుంబి-తుంబిక, పిండి, పుష్పఫల*. తద్వ.—ం: చేఁదయానగు, చేఁదిసొర, చేఁదుసొర, చేఁదు అనుగు, పదరు. (సం) అర్జుని, ఇక్ష్వాకువు, ఉప, కటుతిక్తిక, కటుతుంబి, కటుకాలాబువు, కుంజరాలుకము, కంభతుంబి, కూర్చకర్మ, తిక్తాలాబువు, పిండఫల, 2 పెద్ద చేఁదు అనుగు:—క్షుత్రిఘ్నము, తిక్తబీజ. (ఇది నాగసొరపుకాయ అనికొందఱు); 3: పాలానుగు. (సం) దుగ్ధతుంబి; 4. కూర అనపకు.—(తె): చూ, సొరకాయ; 2. సొఱయను చేఁప: చూ, మత్స్యము. 1;

**సొఱచేఁప.** వా. వి: చూ, సొఱ. 2.

**సొఱుగు.** వా. వి. రూ-చొఱుగు: చూ, రూ—సొరుగు. 2.

**సొఱ్ఱ.** దే. వి: చూ, రూ-సొఱ. 1—3 (తుంబికి.—పంచ. వేం. 1, ఆ. 467.)

**సొలఁగు.** వా. వి. రూ-సొలపు. మూర్ఛ: చూ, సొమ్మ.

**సొలపు.** దే. వి. 1. పంక్తి. ఆం, భా. ద్వి. 33: చూ, శ్రేణి. 1; 2. మూర్ఛ: చూ, సొమ్మ, 3. పారవశ్యము: చూ, సొగపు; 4. వైముఖ్యము. విజ. 3, ఆ. 13: చూ, పదనము. 2-ఉ. 6, ఆ 225.

**సొలయిక.** దే. వి: చూ, సొలపు. 4. కళా.

**సొలయు.** దే. అ. క్రి: చూ, రూ—చొలయు (మూర్ఛపోవు.—పారి, ఉ. 1, ఆ. 135; వెనుదీయు.—"సొలయుట విపదే" (సాంజోపాఖ్యానము); వైముఖ్యమునొందు.—పురజనములయందు సొలయు. భాగ. అను. 4, ఆ; వైరస్యమునొందు.—లక్ష్మీ. 5, ఆ. 142.)

సొళిమిడి. దే. వి. మూర్ఛ: చూ, సొమ్మ.

సొ(చొ)ల్లుకబుర్లు. వా. వి. పనికిరాని మాటలు.

సొవ. దే. వి. రూ-సవ, జాడ: చూ, సూచన.

సొసాయించు. దే. స. క్రి 1: చూ, హెచ్చరించు; నా. 2. సవరణచేయు.

సొసామణి వా. వి. సవరణ. "వానికార్యము సొసామణి అయినది."

## సో

సో. సం. వి. ఓ. స్త్రీ. దుర్గ: చూ, పార్వతి.

సోఁకు. దే. వి. 1. గాలి. ఆం, పదా. సుర. 35: చూ, వాయువు; 2. పిశాచము: చూ, సోఁకుఁడు. 1; 3. సోఁకుడు: చూ, స్పర్శము. 1; అ. క్రి 4 ఆవేశించు, (గ్రహము) ఆవేశించు: ఈఁగు, ఎలయు, ఒలయు, కూరుకొను-కూర్కొను, చొచ్చిలు-చొచ్చిల్లు-చొచ్చు, చొత్తెంచు, చొరఁబడు, చొఱఁబాఱు, తూకొను, తూఱఁబడు, తూఱు, దూఱయు, దూఱు, నడుచొచ్చు, పొలయు, లోఁగు-లోఁవు. (సం) ఆవేశించు, ప్రవేశించు, సంక్రమించు; 5. తగులు: చూ, లంకించు. 1.

సోఁకుఁజోక్కు. ద్వి. వి. మూల: చూ, రెక్కు.

సోఁకుటొజ్జి. ద్వి. వి. (సోఁకు + ఒజ్జి): చూ, శుక్రుఁడు 1.

సోఁకుడు. వా. వి: చూ, సోఁకు. 3.

సోఁకుఁడు. దే వి: (చూ, సోఁకుఁడు 2715పొరట).

సోఁకుడుముడుఁగు. దే. వి. ఒకానొక ఓషధి, అత్తపత్తి*. (సహస్రవత్రము 2వ అర్థము కడప న్యాయములు దీనికివర్తించును.): చూ, సహస్రవత్రము. 2.

సోఁకుపయ్యము. ద్వి. వి. స్పర్శనము: చూ, వాయువు.

**సోఁకుమూఁకలగొంగ.** ద్వ.వి. విష్ణుఁడు: చూ, విష్ణువు. 1. ఆంధ్రి సం. దే. 7.

**సోఁకుమూఁకల దణి.** ద్వ. వి. నైరృతి, ఆంధ్రి. సం. దే. 20: చూ, సోఁకుల ఱేఁడు.

**సోఁకుల ఱేఁడు.** దే. వి: కోన ఱేఁడు, నల్లగ్రోలునట్టి ఱెంకి, నల్ల దాఁపువాఁడు, పొలను దిండి (పొలదిండి), మూలయేలు నేర్పరి, మూల ఱేఁడు, రక్కసి, రక్కసుఁడు, రాతిరి తిరుగు మేటి, రేదిమ్మరీఁడు, సోఁకు మూఁకలదణి. (సం.) అంశుమంతుఁడు, అశ్రపుఁడు–అసృపుఁడు, అసిధరుఁడు, ఆశరుఁడు–ఆసురుఁడు, కర్బురుఁడు–కర్బూరుఁడు–కర్వూరుఁడు, కాలాభుఁడు, కీకసాత్మజుఁడు, కోణపుఁడు–కౌణపుఁడు, జలగోపితుఁడు, నికషాత్మజుఁడు, నిర్ఋతి–నైర్ఋతి–నైరృతుఁడు, నీలాంబరుఁడు, పలంకషుఁడు, పుణ్యజనుఁడు, యాతుధానుఁడు, రక్తపుఁడు, రక్షస్సు, రాక్షసుఁడు. రాత్రించరుఁడు–రాత్రిచరుఁడు: (చూ, రాక్షసుఁడు. 1.)

**సోఁకుఁడు.** దే. వి. (రసి. 4, ఆ 48) 1. దయ్యము: ఎత్తు, కాలియ, కొఱవి తాల్పు, గాము, గాలి, డగర–డగ్గర–డగిర, దయ్యము, దెయ్యము, దెత్తి, నెగడి, పిసాచము–పిసాసి, పీనుఁగుఁదిండి, బూంచేము, బూచి, బూచివాఁడు, బూఁజేము, బూతము, మరులు, సోఁకు. (సం):–కపిశాపుత్రుఁడు, కాపిశేయుఁడు(యము), గ్రహము, ఘదైవము, పిండకము, పిశాచము, బేతాళము, భూతము; తద్వి.–గ: కొఱవి దయ్యము. (సం) వ్యాసృతి; 2. పిశాచభేదములు:–(సం) కూష్మాండము, ఖేటము, ధూమకేతుఁడు, ప్రేతము; 3. అంతగపిశాచమునకు–(సం) గంధర్వము; 4. బాలురకుసోఁకు గ్రహమునకు.– (సం) ఖాటి, 5. పిశాచపల్లభునకు.–మరులు ఱేఁడు; 6. ఆఁడు దయ్యమునకు.–పిసాసి, సత్తి. (సం) ఝా, ఢాకిని, పిశాచి, రక్తప, శక్తి, శాకిని, హసంతి; 7. పిశాచాది:–సత్వము; 2. గ్రహావేశము. విజ. 3, ఆ. 35: (సం) ఆవేశనము–ఆవేశము; 3. అంటు: చూ, స్పర్శము. 1; 4. రక్కసుఁడు. అచ్చ. బాల, కాం 104: చూ, రాక్షసుఁడు. 1; తద్వి.–గ. రాక్షసస్త్రీలలో భేదములకు.–చూ, రాక్షసి; వి: లంక, లంకిణి. అచ్చ, యు, కాం. 261.

**సోఁగు.** వై. వి.=సిగ్. సరము. కాశీ. 1, ఆ. 138 చూ, భూషణము-2–6. (36.)

**సోఁపు.** దే. వి. నల్లజీలకఱ్ఱ. ఆం, భా. ద్వి. 219: చూ, సుషవి. 2.

**సోఁపుఁబిండి.** ద్వ.వి చమసి. చూ, సాదము (1).

**సోగ.** దే. వి. 1. ఉపశాఖ (ఆం భా. ద్వి. 37): చూ, శాఖ. 1; 2. దైర్ఘ్యము. భార. విరా. 2, ఆ. 83: ఎత్తు, కొపురు, కొప్పరము, కోల, కోలన, కోళ్లు, తెగ, నిక్క, నిక్కుడు, నిట్ట, నిడివి, నిడుద. నిడుపు, పొడగుపొడవు–పొడుగు–పొడువు, పొగరు–పొవరు, వాసి, వీఁక, వ్రేఁకు. (సం) అమ్, ఆనాహము, ఆయతి, ఆయామము, ఆరోహము, ఉచ్ఛ్రయము–ఉచ్ఛ్రాయము, ఉత్సర్గము, ఉత్సర్జనము, ఉత్సేధము, ఉదయము, ఉద్దంతురము, ఉన్నతి, ఉపచయము, విరళము. తద్వి.–గ. మిక్కిలి పొడుగుకు.–(సం) సముచ్ఛ్రయము–సముచ్ఛ్రాయము; వి: ఉన్నతత్వము, ఔన్నత్యము; విశ. 3. పొడుగైనది.–ఉత్తాణి, ఎగుడు, ఎగువ, ఎత్తరము, ఎత్తగ(రు)వు, ఎత్తు, జేంపు, తనరుపు–తనర్పు, నిడివి, నిడుద, నిడుపు, పెద–పెద్ద, పొడగు-పొడుగు–పొడవు–పొడువు, మిట్ట, మిడి, మిఱ్ఱు, మూర. (సం) ఆయతము, ఆరోహము, ఉచ్ఛ్రితము, ఉత్తాలము, ఉత్తుంగము, ఉదగ్రము, ఉద్దండము, ఉద్ఘాతము, ఉద్ఘాటము, ఉన్నతము, ఊర్ధ్వము, తుంగము, దీర్ఘము, ప్రభూ

తము, పాంకువు, మూసరము, వ్యాయత
ము. తద్వి.-మిక్కిలి పొడవైనది. (సం)
సముచ్ఛ్రితము. [అని కొండలు)
సోజేరు. వా. వి: చూ, సైనికుఁడు. (సోల్జరు
సోటిక. వా. వి. న్యాయము: చూ, సత్యము. 1.
సోడా. వా. వి. ఒకరకము ఉప్పు: చూ, పా
వర్చలము (లవణము-1.) [సోడావాటరు.
సోడానీరు వా. వి. ఒకరకము త్రాగడినీరు.
సోడావాటరు. వా. వి. —పై.—[కాణము.
సోడాసాపు. వా. వి. సోడానీరు అమ్మెడు దు
సోడు. దే. వి: రూ—చోడు, ఉచ్చి, అవుదల-
ఔడల, నడినెత్తి, నడుగుంట, నుచ్చెన,
మాడపట్టు. (సం) బ్రహ్మరంధ్రము: (చూ,
శిరము. 1.)
సోడుమట్టు. దే. స. క్రి. అంతట వ్యాపించు.
అం, భా. తృ. 133: చూ, వ్యాపించు.
సోఢ. సం. విశే. 1. ఓపువాఁడు: చూ, సమ
ర్థుఁడు; 2. ఓర్పరి: చూ, సహనుఁడు.
సోఢము. సం. విశే. 1. ఓర్వఁబడినది. (అపరా
ధములోనగునది): చూ, సహనము. 2.
సోణము. దే. వి. నాసామూలము.
సోత్ప్రాసము. సం. వి. అ. న. 1: ఎత్తిపొడు
పు, దెప్పు-దెప్పుడు; 2. పరిహాసముతోఁగూ
డినమాట: అమ్మరితకము, సోల్లుంఠనము:
చూ, హాస్యము. 1.
సోద. దే. వి: కంకరి, కళాసగందపడి, బెండడి,
రేసోద, లెవ్వము. (సం) లేవము. (చూ, స
మాలంభము. 1.)
సోదకులు. అం: చూ, జ్ఞాతులు.
సోదన. వై. వి.=శోధనా. 1. గాలింపు: చూ,
శోధనము; 2. శకునార్థము రామాయణము
మొదలైన గ్రంథములయందు దారమువేసి
శోధించుట. [చూ, సహోదరి.
సోదరి. సం. వి. ఈ. స్త్రీ. తోడఁబుట్టినది:
సోదరుఁడు. సం. వి. అ. పుం. 1. తోడఁబుట్టిన
వాఁడు: చూ, సహోదరుఁడు; అం. 2: చూ,
స్త్రీగతుకులు.
సోదర్యుఁడు. సం. వి. అ. పుం.—పై.—
సోదా. నా. వి. వెదుకుట (సెర్చి). శోధన.
సోదించు. వై. స. క్రి. శోధనచేయు: ఊండఁ
జూచు, ఒరయు, జల్లించు. (సం) పరీక్షిం
చు, పరిశీలించు, శోధించు. (చూ, విమర్శించు. 1.)
సోదికత్తియ. వై. వి: రూ—సోదకత్తియ-సో
దెకత్తె, ఎఱికెతి-ఎఱుకత, ఎఱుకసాని,
కొరవంజి, జోగిణి, పటిది, వేలుపుసాని-
వేల్పులసాని(వేల్పుసాని). (సం) ఈక్షణి
క, దైవజ్ఞ, రమాగిని, విప్రశ్నిక: (చూ, స్త్రీ.)
సోదియ. వై. వి.=చోద్యమ్. రాగల మేలు
కీడులనుగూర్చి చేయుప్రశ్న: రూ-సోద,
ఎఱుక, గద్దియ-గద్దె, తల, రంగము, సవా
లు. (సం). స్మృతి.
సోద వై. వి.=—పై.—ప్రభా. 5, ఆ.120.
సోదెకత్తె. వై. వి: చూ, రూ—సోదకత్తియ.
సోదము. వై. వి.=చోద్య. రూ-సోద్దము.
1. ఆశ్చర్యము, చిత్రము: చూ, వింత. 1;
విశే. 2 ఆశ్చర్యకరమైనది, చిత్రమైనది:
చూ, వింత. 1.
సోద్దము. వై. వి, విశే.=—పై.—
సోధ్రికము. సం. వి. అ. పుం: (తె) బిళ్లు. *
సోన దే. వి. 1. వర్షము, వృష్టి: చూ, వాన.
1; తద్వి.—అల్పధారావర్షమునకు.—మూచి
నుకు: చూ, వాన. 1; 2. అల్పవర్షము:
చూ, వాన. 1.
సోనంగి. దే. వి. రూ—డోనంగి. శునకజాతి:
చూ, శునకము. 1. [తిర్య. 8.
సోనబల్లి. వా. వి: చూ, సాలెపురుగు. సాంబ.
సోన్మదుఁడు. సం. విశే. మత్తెక్కి మేనెఱుఁ
గనివాఁడు: రూ—సోన్మాదుఁడు.
సోన్మాదుఁడు. సం. విశే.—పై.—
సోపనము. వై. వి.=సోపానమ్: చూ, సోపానము,

సోపప్లవుఁడు. సం. వి. అ. పుం. రాహువుచేత పట్టఁబడిన వాఁడు (చంద్రుఁడు లేక సూర్యుఁడు.)(చూ, గ్రహణము.)

సోపానము. సం. వి. అ. న.=సోపనము. రూ-సోపానము, ఆరోహణము, పట్టభంగము. (తె) చీడి, తంతియు-తంతె, తావ, తాపరము, తుతె, పడికట్లు, పావంచే, పావటి, మెటిక-మెటికె-మెట్టిక-మెట్టు, మేలుకట్టు, సరకట్టు, సోపనము. (ఇవి అన్నియు వీణ మెట్టునందును వర్తించును.)

సోపు. వై. వి.=సోఫ. పొడ, వాపు, రూ-సోబు, సోబియు-సోబె: చూ, శోఫ.

సోపుదారికేక. వా.వి.జాగ్రత్త కొఱకు వేయుకేక.

సోపుదారివాఁడు. వా. వి. జాగ్రత్త కొఱకు కావలియుండువాఁడు.

సోబ. వై. వి.=శోఫ: చూ, శోఫ.

సోబతు. వా. వి. తోడుగానుండుట: చూ, సహవాసము. 1. (స్తోమతు అనియు)

సోబనము. వై. వి.=శోభన. మంగళము: చూ, శుభము. 1.

సోబాన. వై. వి.=శోభన.ఒకానొక పెండ్లిపాట.

సోబియు. వై .వి.=శోభ.రూ—సోబె: చూ, శోఫ.

సోబు. వై. వి.= — పై.—

సోబె. వై. వి.=—పై.—

సోబెవాఁడు. వా. వి: చూ, సిధ్మలుఁడు.

సోమ. వై. వి.=శ్రమ. 1: చూ, శ్రమము.1; 2.=స్తోమ. పరాక్రమము: చూ, శౌర్యము.

సోమకర్కటి. సం. వి. ఈ. స్త్రీ: (తె) కరపుచ్చె, కరబూజా—కర్బూజా. (చేలవనిచ్చెడు ఒకానొక దోస.)

సోమగర్భుఁడు. సం. వి.అ.పుం: చూ, విష్ణువు.1.

సోమజుఁడు. సం. వి. అ. పుం. బుధుఁడు: చూ, రాహువు. 2.

సోమధార. సం. వి. అ. స్త్రీ. ఆకాశగంగ: చూ, హ్రాదిని. 2.(నది). [గ్రంథములు.

సోమనాథీయము. అం: చూ, భరతశాస్త్ర

సోమపానము. సం. వి. అ. న. పుల్లతీఁగెరసము పిండుట: అభిషవము, నిషేవణము, సవనము, సుత్య.

సోమపీతి. సం. వి. న్. పుం. (రూ-సోమపీథి-సోమపీవి.) యజ్ఞమునందు సోమపానము చేయువాఁడు: చూ, సోమయాజి.

సోమపీథి. సం. వి. న్. పుం.— పై.—

సోమపీవి. సం. వి. న్. పుం.— పై —

సోమపుఁడు. సం. వి. అ. పుం.— పై.—

సోమము. సం. వి. అ. పుం. 1. తిప్పతీఁగ*: చూ, సోమవల్లి; 2. జలము: చూ, సలిలము; 3. కర్పూరము: చూ, సిరము; 4. దినముయొక్క పదునొకండవభాగము: చూ, వాసరము (దినభాగములు); అం. 5: చూ, తానములు (రి—హీనతానములు); 6: చూ, తానములు (గహీనతానములు); వై. వి. (1)=స్తోమ: చూ, సోమ. 2.

సోమయజ్ఞములు. అం: (చూ, యజ్ఞము, చూ, మహాయజ్ఞములు) అగ్నిష్టోమము, అత్యగ్నిష్టోమము, అతిరాత్రము, అప్తోర్యామము, వాజపేయము (5).

సోమయాజి. సం. వి. న్. పుం. 1.=సోమాసి. యజ్ఞము చేసినవాఁడు: ధర్మ్యుఁడు, యజ్వ, సోమపీతి—సోమపీథి—సోమపీవి. (తె) సోమాసి; 2: చూ, సురాజీవి; అం. 3: చూ, మూర్తులు.

సోమరాజము. సం. వి.అ.పుం: చూ, సోమరాజి*.

సోమరాజి. సం. వి. ఈ. స్త్రీ. కారుగచ్చ*: అవల్గుజము, కాంతిద, కాలమేషి, కుష్ఠనాశిని, కృష్ణ, కృష్ణఫల, కృష్ణఫలి, క్రిమిఘ్ని, చంద్రరేఖ, ఛేలువు, పూతిఫలి (పూతీఫలి), వాకూచి-వాకోచి- వాగుజి- వ్యాకోచి, శ్యామ, సువల్లి, రూ-సోమరజము—సోమ

స్త్రీ కేసరము. వా. వి: చూ, అంకకోశము. 3.
స్త్రీ ఘోషము. సం. వి. అ. పుం. వేకువ: చూ, సూర్యోదయము (వేగుజాము.)
స్త్రీ జాతులు. అం. (పద్మిని, చిత్రిణి, శంఖిని, హస్తిని) : చూ, స్త్రీ 248. [స్త్రీ·
స్త్రీత్వము. సం. వి. ఆఁడుతనము, ఆఁటు: చూ,
స్త్రీధనములు. అం: అధ్యగ్నికృతము, అధ్యావాహనికము, ప్రీతిదత్తము, భ్రాతృసౌదాయకము, మాతృసౌదాయకము, పితృసౌదాయకము. (6).
స్త్రీధర్మిణి. సం. వి. ఈ స్త్రీ 1. ముట్టుది: చూ, స్త్రీ; అం. 2. స్త్రీమదము: చూ, మదములు.
స్త్రీపర్వము. అం: చూ, పర్వములు.
స్త్రీ పుంసయోగము. అం: చూ, వ్యవహారపదములు.
స్త్రీప్రజావంధ్య. అం: చూ, వంధ్యలు.
స్త్రీబాలరాజు. అం: చూ, తంత్రములు.
స్త్రీభాషి సం.వి.ఈ. స్త్రీ: చూ, ఆఁడంగి. 2.
స్త్రీభూషణము. సం. వి. అ. న. మొంగలి*: చూ, సూచీపుష్పము (మొగలి.)
స్త్రీమదము. అం: చూ, మదములు(స్త్రీధర్మిణి 2.)
స్త్రీరక్షకులు. అం: తండ్రి, కొడుకు, సోదరుఁడు, పినతండ్రి, పెదతండ్రి, మేనమామ(6)
స్త్రీరాగములు. అం: (చూ, రాగాంగములు, చూ, స్వరము. 2, చూ, పురుషరాగములు): దేశాక్షి, ఘూర్జరి, దేశి, తోడి, దేవక్రియ, ఆందోళి, దేవగాంధారి, గౌళ, గుండక్రియ, ఆహరి, లలిత, బిలహరి, కురంజి, ధన్యాసి, పూర్వగౌళ, వరాళి, నాట, భల్లాతకి, మలహరి, సారంగ, రామక్రియ, కన్నడ, మంగళకౌశిక, నారాయణి. (24)
స్త్రీలంగోరుట. అం: చూ, వ్యసనములు.
స్త్రీలక్షణము. అం: చూ, కళలు.
స్త్రీలక్షణాంగములు. అం. (స్త్రీలకు సుఖదుఃఖాద్యనుభవములఁ దెలియఁజేయు పాదమస్తకపర్యంతముగల లక్షణాంగములు. ఇవి: 1. పాదరేఖలు, 2. పాదతలములు, 3. పాదనఖములు, 4. పాదాంగుళములు, 5. ప్రపదము, 6. పార్ష్ణులు, 7. గుల్ఫములు, 8. గతి, 9. జంఘలు, 10. రోమము, 11. జానువులు, 12. ఊరువులు, 13. భగము, 14 కటి, 15. స్ఫిక్కులు, 16. జఘనము, 17. నాభి, 18. కుక్షి, 19. పార్శ్వములు, 20. మధ్యము, 21. వళులు, 22. రోమావళి, 23. వక్షము, 24. స్తనములు, 25. జత్రులు, 26. స్కంధములు, 27. భుజములు, 28. కక్షములు, 29. మణిబంధములు, 30. కరపృష్ఠములు, 31. కరతలములు, 32. కరాంగుళులు, 33. కరాంగుళనఖములు, 34. హస్తరేఖలు, 35. పృష్ఠము, 36. కంఠము, 37. ముఖము, 38. చిబుకము, 39. అధరము, 40. దంతములు, 41. స్వరము, 42. జిహ్వ, 43. తాలువులు, 44. ఉత్తరోష్ఠము, 45. హనువులు, 46. కపోలములు, 47. హసితము, 48. నాసికము, 49. నేత్రములు, 50. తారములు, 51. భ్రువులు, 52. కర్ణములు, 53. లలాటము, 54. శిరము, 55. శిరోరుహములు, 56. అంగము, 57. దేహవర్ణము, 58. దేహగంధము (58) (వీనిలక్షణాదులులాయా పదములకడఁ జూడనగు.)
స్త్రీలింగము. అం: చూ, లింగములు. [స్త్రీ·
స్త్రీలు. అం.బ: ఆఁడంగులు, ఆఁడువారు.(చూ, ములు; 2: చూ, వివాహములు.
స్త్రీసంగమము. అం: చూ, ప్రకాశింపఁజేయఁగూడనివి.
స్త్రీసంగ్రహణము. అం. 1: చూ, వ్యవహారపద
స్త్రీసల్లాపసమయము. అం. (భోగముఫలము): చూ, గ్రహసమయములు.

స్త్రీసాముద్రికము. అం: చూ, స్త్రీలక్షణాంగములు. [తము

స్త్రీస్థానకములు. అం. అశ్వకాంతము, అరయు

## స్త్రై

స్త్రైణము. సం. వి. అ. న. 1. స్త్రీస్వభావము: చూ, స్వభావము; విణ. 2. స్త్రీసంబంధమైనది.

## స్థ

స్థండిలము. సం. వి. అ. న. 1. వ్రతముపూనినవాఁడు పండుకొనుటకు దర్భాదులచేత సంస్కరింపఁబడిన భూమి: చూ, భూమి. 1; 2. అగ్నిహోత్రమునుంచుటకై సంస్కరించినచోటు: చూ, భూమి. 1; వా. 3. సొత్తు.

స్థండిలశాయి. సం. వి. న్. పుం: చూ, రూ-స్థండిలుఁడు.

స్థగనము. సం. వి. అ. న. కప్పు: అంతరిము, అంతర్థ-అంతర్థి, అంతర్థానము, అపవారణము, అపిధానము, అవగుంఠనము, అవగ్రహణనము-అవగ్రహము, అవరోధము, అవచ్ఛదము-అవచ్ఛాదము, అచ్ఛాదనము, ఆవరణము, గడము, ఛదనము, తిరోధానము, పిధానము, పరిచ్ఛదము, పరిచ్ఛాదనము, యవనిక, లోపము, వర్ణము, వస్త్రాచ్ఛాదనము, విరింగిణి, వ్యవధ, వ్యవధానము, వ్యవాయము, (అవ్య) అపి, అప్. (తె) అడ్డపాటు, అడ్డము, అడ్డి, అట్టాఁక, ఇఱుము, ఎడరు, ఓలము, ఓలిమి, కనుమరువు, కప్పు-కప్పడు, చేఱుపు, చోటు, తెర-తెఱ, తెరపి-తెఱపి, పొదుగుడు-పొదువు, బందు, మఱుఁగు-మఱువు, మాటు, మాయి, మునుకు, మునుఁగు-మునుఁగుడు, మునుపు, మూఁత, మూయి, మూయుట తద్వి.— 1. తిరోభావము; 2: (చూ, స్థాపనము.)

స్థగనముచేయు. ని. స. క్రి, కప్పు: (సం) ఆచ్ఛాదించు, పరిచ్ఛాదించు. (తె) అంటగొను, అప్పళించు, కపించు-కదియించు, కప్పు, కమ్మరించు, దబ్బుపెట్టు, పొదుగు-పొదువు, పాతిము, మూయు. తద్వి.— (తె) పొఁతు, పూడుచు-పూడ్చు. (సం) నిక్షేపించు.

స్థగితము. సం.విణ. కప్పఁబడినది: అపావృతము, అచితము, ఆచ్ఛాదితము, చిత, ఛన్నము, ఛాదితము, పిహితము, పూర్తము, ప్రచ్ఛన్నము, పరిచ్ఛాదితము, మీలితము, వర్ధితము.

స్థపతి. సం. వి. ఇ. పుం. 1. శిల్పివిశేషము; 2. బృహస్పతి సవనముచేత యజించినవాఁడు; 3. అంతఃపురకావలివాఁడు: చూ, సౌవిదల్లుఁడు; విణ. 4: చూ, శ్రేష్ఠుఁడు.

స్థపుట. సం. వి. ఆ. స్త్రీ. జోడి* : చూ, సుమనస్సు. 2. [న్నతమునైనది.

స్థపుటము. సం. విణ. మధ్యానతము పార్శ్వో

స్థలపద్మిని. సం. వి. ఈ. స్త్రీ. మెట్టతామర*: చూ, సహస్రపత్రము.

స్థలము. సం. వి. అ. న.=తలము, రూ-స్థలి. మెట్టనేల: చూ, భూమి. 1; 2. చోటు: చూ, స్థానము. 1.

స్థలి. సం. వి. ఈ. స్త్రీ.—పై.—

స్థవిరుఁడు. సం. విణ. ముసలివాఁడు: జరంతుఁడు, జరుఁడు, జినుఁడు-జీనుఁడు, జీర్ణుఁడు, జ్యాయుఁడు, జ్యేష్ఠుఁడు, దశమిస్థుఁడు, దీర్ఘాయువు, దీర్ఘాయుష్మంతుఁడు, ప్రవయుఁడు, వర్షీయుఁడు, వృద్ధు-వృద్ధుఁడు, (తె): అరగడము, డొక్క-డొక్కు, పక్కు, పన్న, పెద-పెద్ద, పెద్దవాఁడు, పెరుఁగు-పెరువు-పెర్వు, ముదుక-ముదుక-ముదుకఁడు, ముత్త, ముది, ముదిమివాఁడు. ముది

వాఁడు, ముదిసినవాఁడు, ముదుకు, ముదుసరి-ముదుసలి_ముసలి, ముసలివాఁడు. తద్వి.—మిక్కిలివృద్ధుఁడు:—ఆయుష్మంతుఁడు, చిరజీవి, జైవాతృకుఁడు, దశమి, దీర్ఘాయువు, దీర్ఘాయుష్మంతుఁడు, పూర్ణాయుర్దాయవంతుఁడు, శతానీకుఁడు.

స్థవిష్ఠము. సం. విణ. మిక్కిలిస్థూలము, గరిష్ఠము, బలిష్ఠము, బలీయము: చూ, స్థూలము. 4.

స్థవీయము. సం. విణ. (న. ఈ. న) రెంటికంటె మిక్కిలిస్థూలము: చూ, స్థూలము. 4.

## స్థా

స్థాండిలుఁడు. సం. వి అ. పుం. 1. వ్రతముచేత భూమిమీఁదఁబరుండువాఁడు: రూ_స్థండిలశాయి. (చూ, వ్రతి. 2): అం. 2: చూ, గతిభేదములు. [క్రాంత*.

స్థాణుకర్ణిక. సం. వి. ఆ. (స్త్రీ): చూ, విష్ణు

స్థాణుప్రకీర్ణ. అం: చూ, అశ్వసంచారమార్గములు.

స్థాణువు. సం. వి. ఉ. పుం. 1. మేకు: చూ, శూలము. 4; 2: చూ, శివుఁడు; పుం. న. 3. కొమ్మలులేని చెట్టు, మోడు: చూ, వృక్షము; విణ. 4. స్థిరమైనది: చూ, శాశ్వతము; అం. 5: చూ, ఆసనములు.

స్థాణ్వాసనము. అం: చూ, స్థాణువు. 5.

స్థాత. సం. విణ. (ఋ. ఈ. ఋ): వర్తిష్ణువు, వర్తనుఁడు. (తె) ఉండువాఁడు.

స్థాతవ్యము. సం.విణ. ఉండఁదగినది: ఆలస్యము.

స్థానకములు. (అం: చూ, పుంస్థానకములు. 6. చూ, స్త్రీ స్థానకము 3.)

స్థాననిఘంటువు. అం. లగ్నము_తను, ద్వితీయము-మారకము, తృ-త్రిము, చతు_మాతృ, పం-తనయః, ష-శత్రు, స-కళత్ర, అ-ఆయుః, నవ-భాగ్య, దశ-రాజ్య, ఏకా-లాభ, ద్వాదశము-వ్యయస్థానము. [ములు.

స్థానపాలకుఁడు. అం: చూ, హయపాలకభేద

స్థానబలము. అం: చూ, షడ్బలములు. (1. ఉచ్చ, 2. స్వక్షేత్ర, 3. మూలత్రికోణ, 4. మిత్రక్షేత్ర, 5. స్వనవాంశ, 6. తన ద్రేక్కాణ, 7. తన ద్వాదశాంశ, 8. తన త్రింశాంశ, 9. తన షోడశాంశలయందున్నట్టియు గ్రహములు స్థానబలముకలవారు.)

స్థానము. సం. వి. అ. న. 1—ఠాణా-ఠావము. ఠావు. చోటు: అంకము, అధివాసము, అవదేశము, అవస్థానము, ఆ, శ్రయము: ఆశ్రయము, ఆసనము, ఆస్పదము, ఓకము-ఓకస్సు, కాష్ఠ, క్షేత్ర, కులాయము, క్షి, క్షితి, క్షేత్రము, ఖిలము, గాధము, తటము, తటి, ధామము, ధిష్ణ్యము, నిష్ఠ, నీడము, పదము, పాళి, ప్రతిష్ఠ, ప్రదేశము, భువి_భూమి, వసతి, వసనము, వసి, వాసము, సంస్థ, సత్త్ర, స్థలము, స్థలి, స్థానము, స్థితి. (తె.ప):—ఇక్క, ఇక్కవ, ఇక్కు, ఇరవు-ఇరవు, ఉనికి, ఉనుకువ, ఎడ-ఎడము, కంగవ, కందువ, కట్టు, కడ, కలఁకు, కలను, కలిమి-కల్మి, గరిడి, చేకట్టి, చేక్కి, చేపట్టు, చో, చోటు, జాగా, టెంకి-తెంకి, ఠాణా, ఠాణి-ఠాణియము_ఠాణె, టావు-ఠావు, ఠావు, తల, తలము, తానకము-తానము, తావలము, నట్టి, నిట్టి, నిలుకడ-నిల్కడ, నెట్టు, నెవ్వు, నెల, నెలకువ, (నెలఁకువ), నెలవు, నేల, పట్టు, పాలము, బస, పట్టు మనికి-మన్కి, మనికిపట్టు, మనుకువ, వలతి, సీమ. తద్విశేషములు.—1: ఉత్థానము. (తె) :—ఇంకటము-ఇంకాటము-ఇంకటము-ఇంకాటము, ఇంకు; 2 మంచితావుకు.— ఓక్యము, సంస్థితి; 3. నదిమొదలగువాని సమీపప్రదేశము.— కచ్ఛము; 4. పనులగట్టుచోటు.—(తె)

కట్టుముట్టు; ౫. ఉనికితావు.— కట్టుముట్టు; ౬. నీటికియొక్క యూటగలతావు.— జలబిల్వము. (తె) కసిరుము; ౭. ఏనుఁగును కట్టుచోటు.— గజబంధని; ౮. జెట్టుసాధన చేయుచోటు— అక్షవాటము; ౯. నాలుగు కాలువలు కలియుచోటు.— జలగుల్మము; ౧౦. గోవులు తిరుగుచోటు.— గోష్పదము; ౧౧. కష్టమును గలిగించుతావు.— కష్టస్థానము, వారకము; ౧౨. పోఁగూడనితావు.— డ, (కలిలము, కష్టము, గహనము, దుర్గము); ౧౩. మేఁకలనుగోయుతావు:— కటి; ౧౪. కాఁపురమునకు.— (చూ, విడిముట్టు); ౧౫. ఆలుబిడ్డలతోడి యునికికి.— (చూ, సంసారము. 1); ౧౬. పుట్టినచోటు:— (తె) పుట్టు; ౧౭. ఇంటి వెనుకటిచోటు:— ద్రోణి, పృష్ఠము. (తె) దొడ్డి, పెడలు, పెరడు-పెళ్లు; ౧౮. తెలివికి మొదటి చోటు:— ప్రభవము; ౧౯. ఓడలు చేసెడు చోటు: (తె) జొది; ౨౦. కొండలోనగు వాని మీఁది ఉబ్బు అగుచోటు.— (తె) చోటు; ౨౧. దుర్గము స్థలము.— (చూ, మాన్యము. 2); ౨౨. నడిమిచోటు:— (తె) ముంగిలి; ౨౩. మూఁడుప్రదేశములు — (తె) ముచ్చెట్లు; ౨౪: మూఁడు ఎల్లలు కలియుచోటు: (తె) ముయ్యేలగుట్ట; తద్య:- మూఁడుదారులు కలియు చోటునకు:— ముయ్యేలగుట్ట (చూ, మార్గము. 1.); ౨౫. నుంకముతీయుచోటు:-(తె) మెట్టు; ౨౬. బోగమువాండ్రి ఆటతావు: (తె) మేజోవాణి; ౨౭: వధస్థానము, ఆఘాతనము-ఆఘాతము, నూన. (తె) చేంపుడుగట్టు; ౨౮. ఏకాంతస్థలము:— వీకాశము; ౨౯. రాజోల ఏకాంతస్థలము.— శుద్ధాంతము; ౩౦. నీచస్థానము.— గభీరము; ౩౧. పుడమికి.— చూ, భూమి.1; ౩౨. పరదేశమండలియునికికి — వనము; ౩౩. కారణములేనియునికి.— విలక్షణము, ౩౪: (తె) కందువ, బస, మలుంగు, మలుఁగుచోటు, అంకరువు, అంకస్తు, ఓలము; ౩౫. యజ్ఞములయందు బ్రాహ్మణులు వేదబుక్కులు చెప్పెడుచోటు —సంస్థానము: (చూ, సదనము 1; చూ, భూమి. 1); 2. ఇల్లు (చూ, సదనము. 1); 3. క్షయ-స్థాన-వృద్ధులు మూఁడింటిలోనొకటి: (చూ, వర్గములు. 1); 4. విలుకాని యుద్ధమువ్వటి నిలుపు (ఇది పంచవిధము.— ప్రత్యాలీఢము, ఆలీఢము, సమపదము, విశాఖము, మండలము); 5. పోలిక: (చూ, సమానము. 2); 6. కర్తృవిభాగము; అం. 7: (చూ, శుకూర్పులు, 8: చూ, ఉదయాస్తమయము; 9: చూ, వింశతివిగ్రహములు; 10: చూ, వర్గములు (చూ, స్థానము 8)

స్థానాపతి. సం.వి.ఇ.పుం: మధ్యవర్తి.(తద్య:— దూత, దూతుఁడు. (తె) రాయబారి, కాలరి).

స్థానాపత్యప్రయోగము. అం: చూ, తంత్రములు.

స్థాని. సం. విశ. (న్. ఈ. న్) స్థానముకలది.

స్థానికుఁడు. సం. వి. అ. పుం. 1 స్థానమునకధ్యక్షుఁడు; 2. గుడిపారుపత్తెగాఁడు: చూ, స్వామి. 3.

స్థానీయము. సం. వి. అ. న, పట్టణము, పోలిమః చూ, సీమ (1)-౧. (దేశములు)

స్థానోపసంవ్యానము. అం: చూ, పరిషేయములు.

స్థాపకుఁడు. సం. విశ. స్థాపించువాఁడు.

స్థాపత్యుఁడు. సం. వి. అ. పుం. హెగ్గడి: చూ, సావిదల్లుఁడు.

స్థాపనము సం. వి. అ. న. 1 =తాత్ర. స్థాపించుట: ఆధానము, ఉట్టంకణము, ఉపాధానము. (తె) కవ్వుట. (చూ, స్థగనము.) 2: చూ, సమాధి. 1; 3: పుంసవనము.

స్థాపని. సం. వి. ఈ. స్త్రీ. చిఱుబొద్దిః చూ, విద్ధకర్ణి.

**స్థాపించు.** సం. స.క్రి. స్థాపనము చేయు: తాచు, తాపించు, నిలుపు. తద్వి.—చక్కఁగా స్థాపనము చేయు.—ప్రస్థాపించు.

**స్థాపితము.** సం. విణ. 1. నిలుపఁబడినది: ఉట్టంకితము, పోషితము. తద్వి.—౧. బుఱుము; ౨: ప్రస్థాపితము; 2. నిశ్చయింపఁబడినది: కేవలము, క్లృప్తము, నిశ్చితము, నిరూపాము, నిర్ణీతము, రూఢము, వ్యవసితము, స్పష్టము, స్థితము. (తె) అచ్చేము. [శక్తి. 1.

**స్థామము.** సం. వి. న్. న, శరీరబలము: చూ,

**స్థాయి.** సం. విణ. (న్. ఈ. న్) =తాయి. 1.ఉండునది, కదలనిది: చూ, స్థిరము; అం. 2: మధ్యము, మందము, తానము. (3).

**స్థాయిక్రమము.** అం: చూ, వర్ణ చతుష్కము.

**స్థాయీభావము.** అం. రసస్థితస్వాదుత: చూ, భావములు ("ఈ సముద్రమందెన్ని నదులు కలిసినను వానివలనఁచి సముద్రమే కాన్పించినట్లు సంచారిభావములు మొదలగునవి మధ్యమధ్య నెన్ని వచ్చినను వానివలనఁచి తానే కాన్పించునది.")

**స్థాయీభావములు.** అం: చూ, భావములు, (రస స్థాయీభావములు) [కారము. 3.

**స్థాయీవర్ణగతాలంకారములు.** అం: చూ, అలం

**స్థాయుకుఁడు.** సం. వి. అ. పుం. ఒక గ్రామమున కధికారి: చూ, స్వామి. 3.

**స్థాలము.** సం. వి. అ. న =తలియ. కంచము. భోజనపాత్రము: చూ, పాత్రము. 6.

**స్థాలి.** సం. వి.ఈ.స్త్రీ.1 =తెలిగ తలి, వంటకుండ, లోవి: చూ, భాండము. 3; 2. కలిగొట్టు*. అంబువాసిని, అమోఘ, కర్బుర, కాచస్థాలి, కామదూతి, కామవృంత, కాల, కాలవృంత, కాలస్థాలి, కాష్ఠకుంభి, కుంజర, కుంభి, కుబేరాక్షి, క్షయతరువు, క్షిరి, గజపాదపము, గద, పాటలి, పావని, ఫలేరుహ, సప్తల. (తె) కలిగొట్టు, పాదిరి-పాదిలి-పాదలి, పాల. తద్వి.—౧. తెల్లకలిగొట్టుకు;—కాష్ఠపాటల-కాష్ఠపాటలి, శుక్లపాటల, శ్వేత, సితపాటల. (తె) తెల్లకలిగొట్టు: ౨: నేలకలిగొట్టుకు.—కుంభి, భూపాటలి, (తె) నేలకలిగొట్టు; 3 కలిగొట్టుపువ్వువవు – పాటలము.

**స్థాలిక.** సం. వి. అ. స్త్రీ: చూ, స్థాలము.

**స్థాలీపాకము.** అం: చూ, పాకయజ్ఞములు.

**స్థాలీపులాకన్యాయము.** అం. ఉడుకుచున్న కుండఁదుఅన్నమునకుఒక మెతుకును పట్టిచూచుట అను రీతి.

**స్థావరము.** సం. వి. అ. న. 1. వింటినారి: అకర్షము, గవ్య-గవ్యము, గుణము, జీవ, జ్యా, ప్రతికాయము, వ్యధ్యము, భార్గవము, మౌర్వి, లోచనము, శింజిని, హస్నము. (తె) అరి, అల్లియ-అల్లె, ఎక్కు-ఎక్కుడు, గొనము-గొనయము, తెగ, నారి, మోపు, వల్లియ-వల్లె. తద్వి —౧.మౌర్వీ మధ్యతంతుబంధము.—(తె) అరితోసి-అరిపోసి, కూర్పరి; ౨. వింటినారిని చెవిదాఁక తిగుచుట.—పూర్ణము; 3. తోలునారికి.—(తె) తరటు; ౪: చూ, (తె) కురువేరుదంటినారి; ౫:(తె)చిగురుటల్లె, ౬: చూ,(తె)వెన్నెలనారి; పుం. 2. కొండ: చూ, పర్వతము; విణ.3.=తావరము. కదలనిది: చూ, స్థిరము.

**స్థావిరము.** సం. వి. అ. న. వృద్ధత్వము; జర, జర్ఝరికము, జాని, జ్యాని, వార్ధకము, వార్ధక్యము. (తె) కారు, పెత్తనము-పెద్దతనము, పెద్దతికము, ముది, ముదితనము, ముదిమి, ముదురు, ముదుసరితనము, ముప్పు, ముసలితనము. (చూ, స్థవిరుఁడు.)

**స్థాసకము.** సం. వి. అ. పుం. 1. చేతనిడినకుంకుమలోనగునది; 2. కుంకుమలోనగు వాని

పూఁత: చూ, సమాలంభము. 3. నీరులో నగువారియందలిబుగ్గ: చూ, స్ఫోటకము. 1.

**స్థాస్నువు.** సం. విణ. (ఉ. బహుకాలము ఉండునది): చూ, స్థిరము.

## స్థి

**స్థితకరణము** అం. (లలనారత్నముకూర్చున్నప్పుడు పురుషునిపైకొనికూడుట): చూ, రతిబంధములు.

**స్థితకరణబంధములు.** అం: యుగ్మపదము, వితర్థితము, మార్కటకము, ఘట్టితము, సమ్ముఖీకరణము. పరిష్వటము, ఉద్గీరవము, జాఘనము. (8) (చూ, రతిబంధములు.)

**స్థితము.** సం. విణ. 1. ఉన్నది; 2. నిలుచున్నది; 3. నిశ్చయింపఁబడినది: చూ, స్థాపితము. 2; 4. ప్రతిజ్ఞచేయఁబడినది; అం.5. చూ, రతులు.

**స్థితి.** సం. వి. ఇ. (స్త్రీ). 1. ఉనికి: చూ, స్థానము. 1; 2. కూర్చుండుట: ఆసన-ఆసనము, ఆసిక, ఆసితము, ఆస్య, ఉపవేశము. (తె) కూరుచుండుట, ఉనికి, నిలుకడ; 3: ధారణ, మర్యాద, సంస్థ, స్థైర్యము. (తె) ఉనికి, నిలకడ-నిలుకడ-నిల్కడ, నిలువు-నిల్వు, పదిలము, పొలుపు-పొల్పు; 4. మేర. మర్యాద: చూ, సన్మానము; 5. బ్రతుకు: అనుధారణము, ఆజీవము, ఉచ్ఛ్వాసము; ఉజ్జీవనము, కాయకము. జీవనము, జీవము, జీవవృత్తి, జీవాతువు, జీవిక, నిర్వాహము, పిండము, పరివర్తనము, పరివృత్తి, వర్తనము, వార్త, వృత్తము, వృత్తి. (తె):— జేరుగుబడి, జేరుగుబాటు, బ్రతుకు-బ్రదుకు, బ్రదిమి-బ్రిమిది, బ్రదుకుఁదెరువు, మనికి-మన్కి, మనుగడ, మనువు, మన్కి, మెలఁకువ, సాగుపాటు, సాగుబడి. తద్వి.— ధాన్యాదికము ఏటుంకొని బ్రదుకుట.— ఉంఛము, ఋతము. (తె) లేకిబ్రదుకు; 2. పతిగఏటుంకొనువృత్తి — (తె) పతిగబ్రదుకు; 3. అఁడుదాని బ్రదుకు:— వర్ణాటము; 4. బ్రదుకుఁదెరువునకు.— పిండము (చూ, స్థితి. 5); 5. జీవనోపాయమునకు— (చూ, వృత్తి. 2.) (తె) తెరవు-తెరువు; అం. 6. సృష్టిస్థితిలయములయందొకటి.

**స్థిర.** సం. వి ఆ (స్త్రీ) 1. నేల: చూ, భూమి 1; 2 మామ్యాకుపొన్న*: చూ, సాలపర్ణి.

**స్థిరచక్రుఁడు** సం. వి అ పుం. బ్రహ్మ్యైన విశేషము: చూ, బుద్ధుఁడు.

**స్థిరచిత్తుఁడు.** సం. వి. అ న. అనన్యవృత్తి, ఏకతానుఁడు, ఏకసర్గుఁడు, ఏకాగ్రుఁడు, ఏకాగ్ర్యుఁడు, ఏకాయనగతుఁడు, ఏకాయనుఁడు, ఐకాగ్ర్యుఁడు.

**స్థిరచ్ఛాయము.** సం. వి. అ. పుం. నమేరువు*: చూ, సురపున్నాగము.

**స్థిరపడు.** మి. అ. క్రి: (తె) ఇరవారు, ఇరవుకొను, ఇరవుపడు, కుదురు, కుదురుపడు-కుదర్పడు, జీతపడు, జీతించు, డెక్కొను, తావుకొను, తిరపడు, నాటు-నాటుకొను, నెక్కొను, నెట్టుకొను, నెలకొను-నెలవుకొను, పట్టుకొను, పదిలపడు, పాదుకొను, పొందుకొను, పొలుచు-పొల్చు. తద్వి.— చూ, మట్టుపడు.

**స్థిరపఱచు.** మి. స. క్రి: (తె) పదిలించు.

**స్థిరము.** సం. వి. అ. పుం. 1. కొండ: చూ, పర్వతము; 2. చెట్టు: చూ, వృక్షము; 3: చూ, మోక్షము. 1; విణ. 4.=తిరము నిలుకడైనది (చూ, శాశ్వతము. 1-గ, 223.): అచలము, అచ్యుతము, ఉత్థము, ఉద్ధురము, దృఢము, ధ్రువము, నిష్ప్రపము, స్థాయి, స్థావరము, స్థిరము. (తె) ఇట్టలము, ఇరవు-ఇరువు, ఉక్కు, ఉతవి, కొదము, చేగ-చేవ. జీతము,

తిరము, దిట్ట, పొలుపు-పొల్పు, బటువు, పదాటు, సిసలు. (చూ, స్థైర్యము. 1).
తద్వి:—౧: చూ, సిద్ధాంతము; ౨: నైయాత్యము; 3: చూ, స్థావరము. 8; ౪. బహుకాలముఉండునది:— స్థాస్నువు; 5. ఏకాగ్రమైనది: చూ, సంకేతము. 2.

స్థిరములు. అం. "పరుషసరళేతర హల్లులు" (చూ, ఊష్మములు)

స్థిరవారము. అం. శనివారము, మందవారము: చూ, వారములు.

స్థిరుఁడు. సం. వి. అ. పుం. 1. శనిగ్రహము: రాహువు. 2; 2. చపలత్వము లేనివాఁడు: అచపలుఁడు; 3: అచలుఁడు. (తె) కట్టుపకాను; 4: చూ, శాశ్వతుఁడు. తద్వి.— స్థేయుఁడు.

## స్థూ

స్థూణ. సం. వి. ఆ. స్త్రీ 1: చూ, స్తంభము. 1; 2. ఇనుపప్రతిమ: చూ, అయఃప్రతిమ.

స్థూణాకర్ణము. అం: చూ, దండవ్యూహములు.

స్థూణానిఖనన్యాయము. అం. స్తంభ మొకచోటఁ బాఁతి దిట్టముగానున్నదో లేదోయని మేకొటకై యూఁపెడురీతి.

స్థూరి. సం. వి. న. పుం. బరువుమోసెడు గుఱ్ఱము: చూ, హయము.

స్థూలకంటకము. సం. వి. అ. పుం. ములుగోరిమిడి, తూలకంటకము*: చూ, మొంగబీర.

స్థూలచ్ఛేదము. సం. వి. అ. పుం. అమ్ము: చూ, బాణము. 1. [సూకరము.

స్థూలనాసము. సం. వి. అ. పుం. పంది: చూ,

స్థూలపుష్పము. సం. వి. అ. పుం: (తె) బూరెవ*.

స్థూలపుష్పి. సం. వి. ఈ. స్త్రీ. వల్లెరంటెన*: విష్ణుక్రాంత.

స్థూలఫలము. సం. వి. అ. పుం. పెద్దమ్రింగ*: చూ, శ్వసనము. 3. [ధాన్యము.

స్థూలమధ్య. సం. వి. ఆ. స్త్రీ. యవలు: చూ,

స్థూలమధ్యము. సం వి. ఆ? స్త్రీ.—వై.—

స్థూలము. సం. వి. అ. న. 1. గుడారము: చూ, సదనము. 1; తద్వి.—మహావటగృహమునకు:- స్థూలము (అని కొందఱు); విణ. 2.=తోరము. బలిసినది: చూ, స్థూలము. 4; 8. తెలివిలేనిది: ముగ్ధ; 4. లావైనది, బలిసినది: ఉచ్ఛ్రితము, ఉత్ఫుల్లము, ఉదూఢము, కుంటకము, గరిష్ఠము, దృఢము, బలిష్ఠము, బలీయము, స్థవిష్ఠము, సబీయము. (తె) ఉటిది, ఒమ్మ, కడిఁది, కరకటి, గడితము, గమకము, గాత్రము, తొట్ట, తోరము, పొతక, పొత్తర-పొత్రి, బంబ, బలితము, బలువిడి, బల్లిదము, బూర, బెరను, బొనుక, మందము, ముదుక—ముదుక—ముదుగు, మొద్దు, ఱంబు, లావు, వలము, వలుద—వల్ద, హొమ్మ. (వి):—గడితము; అం. 5. చూ, శరీరములు.

స్థూలలక్షుఁడు. సం. విణ. మిక్కిలి యీవికాఁడు: సత్రి: చూ, వదాన్యుఁడు.

స్థూలశాటకము. సం. వి. అ. న. 1. దుప్పటి: చూ, వస్త్రము; 2. ముదుగుకోఁక: చూ, వస్త్రము. తద్వి.—౧. సన్నపుబట్టకు.— పాతి; ౨: (తె) వెన్నుముదుగు.

స్థూలహస్తము. అం:=తొరహస్తము.

స్థూలారుంధతీన్యాయము అం. అరుంధతీనక్షత్రము చిన్నదగావున దానిఁజూపుటకై పెద్దనక్షత్రము నొకదానినిఁ జూపించి దానిసమీపమున నున్నదని చూపునట్టిరీతి.

స్థూలావర్తి. అం: చూ, అశుభావర్తములు.

స్థూలించే. సం. అ. క్రి. లక్త్యముపెట్టు, బలియుఁ: ఉబ్బు, ఒళ్లుపెట్టు, కండపట్టు, పొదలుకొను, బలియు, వలముగు.

**స్థాలోచ్ఛ్రయము.** సం వి.అ. పుం.1. పెద్దఱాయి: చూ, రత్నములు (౫౯.) తద్విశేషములు.- ౧. రత్నమునకు.—వసువు; ౨. (తె) రుబ్బు గుంట,రుబ్బురోలు; 3: (తె) రుబ్బుగుండు, రుబ్బుపాత్రము; ౪: ఉదూఖలము,ఉలూఖలము,కండని. (తె)రోలు-ఱోలు; ౫.కెంపునకు.—లోహితకము, శోణరత్నము; ౬. వజ్రమునకు.—లోహజిత్తు; ౭. చెకుముకిఱాయికి:—శిఖిముఖి; ౮. తలమానికమునకు.- శిరోరత్నము; ౯. ముత్యమునకు.—శౌక్తికేయము; ౧౦. సూర్యకాంతము; ౧౧. పగడమునకు.—వల్లికము; ౧౨. పటికమునకు.— (తె) లెంటు; ౧౩: (తె) వంటరాయి; ౧౪. కెంపుదోషమునకు.-లశునము; తద్వి. రత్నదోషమునకు.— విచ్ఛాయము. (తె) విచ్ఛాయ; ౧౫. శిలావిశేషమునకు.—శిఖరము; ౧౬. ఇటికకు.—సుధ; ౧౭: (తె) వాటురాటు. (చూ, రత్నములు.); 2. బొటిమ: అవగండము, కచ్ఛపి, యువగండము, వదనక్షుర్జువు, వరండకము, వరండము. (తె) బొటిమ-మొటిమ-మొటిమె. (చూ, మొటిమ. 1); 3. పీనుఁగునడితరవునడ: చూ, హాస్తి; 4 అసాకల్యము.

# స్థే

**స్థేకము.** సం. వి. అ పుం: ఛేకము, దీపకము. (తె) జెలగంటె, దీమము_దీము, వేఁటపిట్ట.

**స్థేమము.** సం వి. న్. న. శరీరబలము: చూ, శక్తి. 1.

**స్థేయుఁడు.** సం. వి. అ. పుం. 1: కులవిప్రుఁడు, గురువు, చక్రి, పురోధ, పురోధసుఁడు, పురోహితుఁడు-పౌరోహితుఁడు,బ్రహ్మ.(తె) ఒజ్జీ. తద్వి.—ఆధర్వణుఁడు, యాజకుఁడు, యాజ్ఞికుఁడు. (తె) ఒజ్జ; 2. తీర్పరి: చూ, స్వామి. 3; విశే. 3. మిక్కిలిస్థిరుఁడు.

# స్థై

**స్థైర్యము.** సం. వి. అ. న. 1. స్థిరత్వము: అత్త్ర, ఊర్జితము, దార్ఢ్యము, దృఢము, ధృతి, ధైర్యము. (తె. వి):—ఇట్టలము, ఉక్కు, ఉదిరి, ఉదుట, ఉజేది, ఒఱపు, కటికి, గట్టి, గడుసు, చిక్కన, చిట్టప. తరుపు, తాలిమి-తాల్మి, తేఁకువ, దిటము-దిటవు, దిమాకు, దీమసము-దీవసము, నేటు, పట్టు, పదిలము, బరవసము-బరువసము, బిగి, బిగితము, బిగువు, బిట్టు, బిఱ్ఱు, బెట్టిదము, మున్నుఱక, మెఱవడి, మొక్కలము_మొగ్గలము, రటము, సదాటు. (చూ, స్థిరము). తద్వి.— మిక్కిలి పదిలమునకు.—సాధిష్ఠము, పుం. 2. జోవత్రి: చూ, సుమనస్సు. 2–౨; విశే. 3. నిలుకడ: చూ, స్థితి. 3.

# స్థౌ

**స్థౌణేయము.** సం. వి. అ పుం. 1.గండివనము*: చూ, రాజార్హము. 1-౩౯; 2.మాచిపత్రి*: కాకపుష్పము, కుక్కురము, పుష్పము, బర్హపుష్పము-బర్హిపుష్పము, బర్హము. (తె) మాచి, మాచిపత్తిరి-మాచిపత్రి.

**స్థౌరము.** సం. వి. అ.న. గుఱ్ఱమువీఁపునమోపెడి బరువు: చూ, హయము.

**స్థౌరి.** సం. వి. న్. పుం. రూ-స్థూరి. బరువు మోసెడి గుఱ్ఱము: చూ, హయము.

**స్థౌల్యము.** సం. వి. అ. న. 1. బలము: చూ, శక్తి. 1; 2. స్థూలభావము: చూ, శక్తి. 1.

తద్వి.— ౧. బలముగలది:—పూర్ణము; ౨.మిక్కిలిబలముగలది:—ప్రబలము, బలవంతము, బలిష్ఠము. బలీయము, (తె) జోగము, బలితము, బల్లిదము.(చూ, శక్తి. 1.)

స్ఫారి. సం. వి. ఈ. పుం: చూ, రూ-స్ఫారి.

## స్న

స్నపనము. సం. వి. అ. న. మునుక: చూ, స్నానము.

స్నపితము. సం. విణ. స్నానముచేసినది.

స్నవము. సం. వి. అ. పుం. రూ-ప్రసవము-ప్రావము, కాఱుట: చూ, స్రవము.

స్నస. సం. వి.ఆ.స్త్రీ. పన్నుపునరము: చూ, సిర.

## స్నా

స్నాతకము. సం. వి. అ. న.వివాహాత్పూర్వము బ్రహ్మచారి చేసికొను ఒకవ్రతము.

స్నాతకుఁడు. సం. వి. అ. పుం. 1. స్నానవ్రతశీలుఁడు: ఆప్లుతుఁడు (చూ, వ్రతి. 2);అం. 2: వ్రతభేదము: (చూ, వ్రతి. 2); 3: చూ, గతిభేదములు

స్నాతకులు. అం: వీరుతొమ్మండ్రు —౧.సంతానార్థియై పెండ్లిచేసికొనఁదలఁచి తదర్థమయి ధనమునభిలషించువాఁడు;౨. తనకున్న ద్రవ్యమంతయు యజ్ఞమునందు బ్రాహ్మణులకొసంగి దరిద్రుఁడయి ధనమునుకోరువాఁడు; ౩. యజ్ఞార్థమయి ధనము నపేక్షించువాఁడు; ౪. గురుదక్షిణార్థమయి ధనము కోరువాఁడు;౫-౬. పితృమాతృసంరక్షణార్థము ధనము నపేక్షించువాఁడు; ౭. బాటసారి; ౮. రోగి; ౯ వేదపఠనార్థము వలయు సౌకర్యమునభిలషించువాఁడు )

స్నాతుఁడు. సం. విణ. స్నానముచేసినవాఁడు: ఆప్లుతుఁడు. (తె) మునిఁగినవాఁడు, మునుఁగువాఁడు.

స్నానమాడు. మి. అ. క్రి: తీర్థమాడు. (సం) అవగాహించు, విగాహించు. (తె) ఆడు, ఓలలాడు-ఓలాడు, క్రుంకు, తేలు, తోఁగు, నీరాడు, నీరుపోసికొను, నీళ్లాడు, బోరుకాడు-బోర్లాడు, బ్రుంగు, మునుఁగు-మున్గు, తేలు-వ్రేలు. (ప్రే. ఓలలార్చు) తద్వి.—(తె) వసుపాడు.

స్నానము. సం. వి. అ. న. 1.=తానము. మునుక: అభిషవము, అభిషేకము, అవగాహనము, అవగాహము, ఆప్లవము(ఆప్లావము), ఉపస్పర్శనము- ఉపస్పర్శము, గాహనము. గాహము, నిమజ్జనము, విగాహనము, విగాహము, సవనము, సుత్య, స్నపనము. (తె) క్రుంకు, జలకము, తలమునుక-తలమున్క, తానము, తీర్థమాట, నీరాట-నీరాటము, బుడక-బుడుక, మజ్జనము, మునక-మునుక. తద్భేదములు. ౧: (మి) తిరుమజ్జనము; ౨:కంఠస్నానము; ౩: అవగాధము, పాత్రస్నానము. (తె) వేడుకతానము; ౪: అపస్నానము, మృతస్నానము; ౫: (తె) ముట్టునీళ్లు; ౬: (తె) మాఱునీళ్లు; ౭: మంగళస్నానము; ౮: అంగసంస్కారము, అంగసంస్కృతి, అంగసంస్క్రియ, అభిషిక్తము, అభ్యంగనము, అభ్యంజనము, పరికర్మము, మ్లాంతుణము. (తె) తలగడుగు, తలంటు-తలయంటు; ౯. మునిఁగినది:—గాహితము, విగాహితము, విగాధము, మగ్నము. (తె) బ్రుంగుడు; 2. స్నానీయము, నలుఁగుపిండి: (చూ, సాదము 1-౪౭); అం. 3: చూ, ఉపచారములు. 4: చూ, భోగములు. (అష్టభోగములు.) [జ్ఞానదాయకములు.

స్నానసంధ్యాజపహోమములు. అం: చూ, నూ

స్నానసమయము. అం. (ఫలము, స్థైర్యము): చూ, గ్రహసమయములు.

స్నానీయము. సం. వి. అ. న: చూ, స్నానము. 2.

స్నాయువు. సం. వి. ఉ. పుం, స్త్రీ: చూ, స్నస. (చూ, కండరములు.)

## స్ని

స్నిగ్ధపల్లవము. సం. వి. అ. పుం. నీరునేరేడు*; చూ, సురభిపత్రి 3.

స్నిగ్ధము. సం. విణ. 1. స్నేహముగలది; (తె) నిద్దము; 2.=నిద్దము. నునుపుగలది, సాపు: చిక్కణము, మసృణము. (తె) నయము, నిద్దము-నిద్దా, నునుపరి, నునువు, నున్న; 3. చిక్కనగలది: మసృణము (తె) చిక్కన, జిగట, జిగురు, జిడ్డు, జిగిలి, నయము, నిద్దము, నునుపు, నున్న, నున్ననిది, మిసిమి, మిహి. (చూ, స్నిగ్ధము. 2); అం. 4: చూ, దృష్టులు; 5: చూ, ఆగమములు.

స్నిగ్ధవృంత. సం. వి. అ. స్త్రీ. కమ్మరాకుతీఁగె*: చూ, మురలి.

స్నిగ్ధవృక్షము. సం. వి. అ. పుం. నల్లమామిడి*: చూ, మామిడి. ౨.

స్నిగ్ధుఁడు. సం. వి. అ. పుం: చూ, స్నేహితుఁడు.

## స్ను

స్నుక్కు. సం. వి. హ్. స్త్రీ. జెముడు*: చూ, స్నుహి.

స్నుతము. సం. విణ. కాఱినది, రిణము: చూ, స్రవము. [చూ, పర్వతము.

స్నువు. సం. వి. ఉ. పుం: కొండపెత్తము:

స్నుష. సం. వి. అ. స్త్రీ: వధువు, వధూటి. (తె) కోడలు, పెండ్లికూఁతురు. తద్వి.— మేనకోడలుకు.— స్వస్రీయ.

స్నుపాత్యము. సం. విణ: చూ, కోటరము. (1)

స్నుహ. సం. వి. ఆ: స్త్రీ: చూ, రూ- స్నుహి.*.

స్నుహి. సం. వి. ఈ. స్త్రీ: రూ-స్నుహా, కృష్ణసారకము, గండీరము, గుల, మహావృక్షము, వజ్రితుండము, సమంతదుగ్ధ, సింహుండము, స్నుక్కు, సుధ. (తె) చెముడు-జెముడు, (జెముడు). తద్వి.—౧. యామళకంటకము, వజ్రము. (తె) కోలజెముడు; ౨: దళస్నుహి, పత్రస్నుక్కు, వ్యాసజిహ్వ, సువిరేచని. (తె) ఆకుజెముడు; 3: (తె) బొంతజెముడు; ౪: వజ్రకంటక, సింహుండము. (తె) బొమ్మజెముడు; ౫: అలంబుసము, త్రికంటకము, వజ్రిక. (తె) ములుజెముడు*.

## స్నే

స్నేహము. సం. వి. అ. పుం. 1.=నెమ్మి-నేయమి-నేస్తము: అజర్యము, అనురక్తి, అనురాగము, అపహ్నవము, అభిగమనము, అభిగమము, అభిమానము, ఆనుకూల్యము, ఆనుగుణ్యము, ఆప్తి, ఆబంధము, ఆయత్తి, ఇష్టము, ఉపగ్రహము, ఉపధానము, ఉపలబ్ధి, ఏకకంఠత్వము, ఏకీభావము, ఐకకంఠ్యము, ఐకమత్యము, ఐక్యము, కామగుణము, గృధ్నుత, గ్రహణము, ఛ, పరిచయము, ప్రణయము, ప్రతియత్నము, ప్రియత, ప్రియము, ప్రీతి, ప్రేమ-ప్రేమము, మమకారము, మమత, మైత్రి, మైత్ర్యము, రక్తి, రతి, రసము, రాగము, విస్తారము, విస్రంభము, సంగతము, సఖ్యము, సహవాసము, సౌహార్దము-సౌహార్ద్యము, సౌహృదము-సౌహృదయము-సౌహృద్యము, స్నైగ్ధ్యము, హార్దము, హితము;

(విశే.) అనుకూలము, అనుగలము, ప్రతీకము, పరిసర్యము. (తె. ప): — అంటు, అనుఁగుఁదనము, అరితి, అర్మిలి, అల్లిబిల్లిక, అల్లిబిల్లి, ఆపము, ఆదట, ఆదటము, ఇచ్చేకము, ఇతము, ఇతవు-హితవు, ఇమిడిక, ఇమ్మ, ఇరవు-ఇరువు, ఎనయిక, ఎమ్మిక, ఎలమి, ఎలసము, ఒంటు, ఒండొరులమిక, ఒందిక-ఒద్దిక, ఒనరిక, ఒనరు, ఒమ్మిక, ఒరిమ-ఒరిమి-ఒరిమిక, ఒలిమె, కాయువు-కాయ్వు, కూరిమి-కూర్మి, కెలవు, గాదిలి, గారము-గారవము, గారవింపు, గారాబము-గారాము-గారాబు, చేనవు-చేమువు, చేట్టుటికము, చెలికారము, చెలిమి-చెల్మి, తమకము, తరితీపు, తియ్యము-తీయము, నంటు, ననుపు, నయగారము, నెనరు, నెమ్మి-నెమ్మిక, నెయ్యమి-నెయ్యము-నేయము, నేస్తము, పల్లాయనము, పెరమ-పెరిమ-పేరిమి-పేరిమె-పేర్మి, పొంకము, పొంతము, పొందిక, పొందు, పొత్తు, పొనరు, పొసఁగుడు, పోరామి, ప్రావ, ప్రేముడి, బాఁతి-బ్రాఁతి, బాళి, మంచమేలము, మక్కువ, మచ్చిక-మచ్చిక-మచ్చిగ, మతకము, మనుకువ, మయివడి-మెయివడి-మైవడి, మాలిమి, ముద్దు, మెచ్చు, మెప్పు, మేలు, రమణ-రవణ-రాణ, రహి, లలి, లియ్యము, లొల్లాపొత్తు, వంటు, వలఁతి, వలను, వల్ల, వీలు, సంగడము-సంగడి, సంగాతము, సమేలము-సమేళము, సగబడి, సరాగము. (ఇందు వి. విశే. పదములు కలిసి యున్నవి.). తద్వి.—౧. తీరని పేరిమకు.—(తె) మరులు; ౨. హితమైనది:—సమర్థము, హితము. (తె) చెలిమి; ౩: చూ, వాత్సల్యము; 2. నూనెనెయ్యిలోనగునది: (తె) చేమురు, మెఱుఁగు. తద్విశేషములు.—౧. నూనెను.—తైలము. (తె) అంటునూనియ-అంటునూనె, నూనియ-నూనె, మంచినూనె; ౨ నెయ్యికిని నెయ్యికి సంబంధించినవానికిని:—చూ, హవిస్సు. 1; ౩:తిల్యము.(తె) నూనియ-నూనె, నువ్వులనూనె; ౪: (తె) చేలిదిమూట, చిట్టాముదము; ౫: కర్పూరతైలము, కర్పూరస్నేహము. (తె) కప్పురపునూనె; ౬: (తె) కజ్జనూనె; ౭: (తె) చేఁపనూనె; ౮: కరపణ్ణము, రక్తైరండము. (తె) పేరాముదము; ౯: క్షారతైలము. ౧౦: (తె) కొవ్వు; ౧౧: (తె) చేందినీ అత్తరు; ౧౨: అవబోధము, పరిబోధనము. (తె) అత్తరు-అత్తరువు, తావినూనె; ౧౩. సంపెంగనూనెకు.—(తె) పూనూనె; ౧౪. సంపెంగ మొదలగువానిఁజేర్చి చేసిన తైలము.—(తె) కస్మ్రనూనియ-కస్మ్రనూనె, తేఁ చేమురు; ౧౫. వెన్న కాఁచిన మడ్డికి.—కల్కము, సుకము, ఖలము, గళకము, బంధురము. (తె) గసి, మడ్డి, పుచ్చు; ౧౬: (తె) గోఁకుడు, గోదారి; ౧౭: సర్జరసము నూనె.—కరాళము; ౧౮: (తె) మెఱుఁగుడు నూనె-మెఱుఁగునూను, వార్నిషు; ౧౯: (తె) వంటచేమురు; ౨౦: ఈనంజి, కిరసనాయిలు-కిరసనాయిలు, మట్టినూనె (చూ, కిరసనాయిలునీల్లు.); ౨౧: ఏరండతైలము. (తె) ఆమిదము-ఆముదము-దివ్వెచేమురు; ౨౨:అస్థిస్నేహము, మజ్జ, సారము. (తె) ఊప, ఎమ్ముత్రుట, చెక్కయము-చెక్కము, నెవడు, మూలగ; ౨౩. తైలములు:-శరపుంఖారి, లక్ష్మీనారాయణ, లాక్షారి, ధన్వంతరి, పంచార్కం, పార్ప్యత్క నింబ, విషముష్టి, కేతకి, స్నేహార్కం, వాతాంతక, పూతిక, భూనాగ, భృంగామలక, కర్పూర, మట్టి, మైనము ఇత్యాది.

స్నేహాశము. సం. వి. అ. పుం. దీపము: కజ్జలధ్వజము, గృహమణి, జటాజ్వాలము, దశాకర్షి, దశేంధనము, దీపకము, దీపము, దీపిక,

-దోషాతిలకము, స్నేహదీపము. (తె) జిగటాలు, జ్యోతి, తిర్లిక, తిర్యలిక, దిబ్బెము, దివియ-దివె-దివ్వియ-దివ్వె-దివ్వ-దీవియ - దీవె, పంజా. తద్విశేషములు:—౧: ఆకాశదీపము; ౨: కరదీపిక, తమోనుత్తు. (తె) అగ్గిబోడి; ౩: ఇంగిలాయి, ఇలాయి-ఇలాయి; కరదివియ-కరదివ్వియ-కరదివ్వె; ౪: కాగడ-కాగడా; ౫: కాలుదివియ, పడదివియ; ౬: కోలదివియ-కోలదివ్వె; ౭: చేదివియ, చేవెలుగు; ౮: జగతీజ్యోతులు, మోబత్తులు; ౯. జొంజెము-జొంజోము; ౧౦: తూటకట్టు; ౧౧: దివటి-దివటీ-దివిటి-దివిటీ-దివియదివె-దివ్య-దివ్వటి- దివ్వటీ- దివ్విటి-దివ్విటీ-దివ్వెటి-దీటి-దీవటి-దీవిటి; ౧౨: నిచ్చెనదివ్వెపంజా-నిచ్చెనపంజా; ౧౩: పంజాయి-పంజా-పముజా; ౧౪: పగలొత్తులు; ౧౫: పెనుపంజె; ౧౬: మసాలు; ౧౭: మహాజ్యోతులు. మఱియు (లాంపు, లైటు, లాంతరు, విద్యుద్దీపములు మున్నగునవి కలవు.) (చూ, విద్యుత్తు)

స్నేహార్ద్ర_తైలము. అం: చూ, తైలములు.

స్నేహించు. సం. అ. క్రి: పరిచయించు. (తె) నను పువడు, నెయ్యమాడు, పొత్తుసేయు, మచ్చికపడు, మరగు.

స్నేహితుఁడు. సం. వి. అ. పుం.=నెయ్యుఁడు, నేస్తు: ఆక్రందుఁడు, ఆప్తుఁడు, ఇష్టుఁడు, పక్షము, ప్రత్యయితుఁడు, ప్రియుఁడు, ప్రేయసుఁడు, బంధువు, మిత్రుఁడు, వయస్యుఁడు, సఖి, సఖుఁడు, సగంధుఁడు, సచివుఁడు, సవయస్కుఁడు, సహచరుఁడు-సహృదుఁడు, సహాయుఁడు, స్నిగ్ధుఁడు, (తె.ప):-అంటుపంటు, అంటుకాఁడు-పంటుకాఁడు, అనుఁగు, ఉద్దికాఁడు-ఉద్దీఁడు, కలవాఁడు, చేనవరి, చేట్ల-చేట్లము, చెలి, చెలికాఁడు, చెలిమరి, చెలివుఁడు, నచ్చినవాఁడు, నమ్మకకాఁడు-నమ్ముకాఁడు, నమ్మినవాఁడు, నమ్మువాఁడు, నెచ్చెలి, నెయ్యరి, నెయ్యుఁడు-నేయుఁడు, నేస్తకాఁడు, నేస్తి-నేస్తుం పల్లాయుసంబువాఁడు- పల్లాయునమువాఁడు, పక్కము, పొందు, పొందుకాఁడు, పొత్తుకాఁడు, బోటిగాఁడు, మిత్త, సంగడికాఁడు-సంగడీఁడు-సంగాడి, సంగాతకాఁడు-సంగాతి, సకుఁడు. తద్వి.—౧. క్రొత్తస్నేహితుఁడు:—వయస్యుఁడు; ౨. అంతరంగిక స్నేహితుఁడు.— అంతరంగుఁడు, ఆప్తుఁడు; 3. హితముచెప్పువాఁడు:—క్షముఁడు, హితవుఁడు-హితుఁడు. (తె) ఇతవరి-హితవరి, ఇతవుఁడు; వి౹౹. 2. చెలిమిగలవాఁడు.

స్నేహితురాలు. మి. వి. సఖి: చూ, స్త్రీ.

## స్నై

స్నైగ్ధ్యము. సం. వి. అ. న. స్నిగ్ధభావము: చూ, స్నేహము. 1.

## స్ప

స్పందము. సం. వి. అ. పుం. ఇంచుక కంపము: చూ, సలనము.

స్పరిశము. సం వి. అ. పుం: చూ, స్పర్శము.

స్పర్థ. సం. వి. ఆ. స్త్రీ. 1. పోటి: కక్ష, ఘృష్టి, ప్రతిస్పర్థ, సంఘర్షము. (అన్య) పోమ్. (తె) పంతము, పద్దు, పోటి, పోరితము, మచ్చరికము; 2. పోలిక: చూ, సమానము. తె. 3. క్రిమసమున్నతి; 4.=పంతము: అభినివేశము, కక్ష, కటము, క్రియాకారము, నియమము,

ప్రతిజ్ఞ, ప్రతినివేశము, బాధము, భాష, సంగరము, సంధ, సంధ్య, సంవిత్తు, సమయము, హాతము. (తె) పంతము—పంతు, పట్టు, పట్టుడు, పట్టుదల, పద్దు, పూనిక—పూనికి—పూన్కి, ప్రతిన, బాస, బిరుదు, రవరవ, వంతు, వాశి. తద్వి:—బయిసుక—బైసుక.

స్పర్ధించే. సం. అ. క్రి: ప్రతిస్పర్ధించే. (తె) పోటీచేయు.

స్పర్ధాళువు. సం. విశ. (ఉ). స్పర్ధగలవాఁడు.

స్పర్శనము. సం. వి. అ.న.1. తాఁకుడు: చూ, రూ—స్పర్శము; 2. ఈవి: చూ, రూ—స్పర్శము. 3; పుం. 3. గాలి: చూ, వాయువు.

స్పర్శనాడులు. అం: చూ, నాడులు.

స్పర్శము. సం. వి. అ. పుం. 1. రూ—స్పర్శనము—స్పరిశము, ఆలంభము, ఉపస్పర్శనము, ఉపస్పర్శము, ఛువము, స్పృక్తి, స్పృష్టి, సంస్పర్శము, స్పృక్కు, స్పృష్టి. (తె) అంటు చెనకు, తాఁకు—తాఁకుడు, తోట్టు, ముట్టు, సోఁకు—సోఁకుడు; విశ. 2. తాఁకినది; వి. 3. ఈవి: అంహతి, అతిసర్జనము, అపవర్జనము, అపవర్గము, అవసర్జనము, ఇజ్య, ఇష్టి, ఉత్సర్గము, ఉత్సర్జనము, చ్యుతి, త్యాగము, దత్తము, దానము, దాయము, ధార, న, నిర్యాతనము, నిర్వపణము—నిర్వాపణము, నిసర్గము, ప్రణయము, ప్రతిపాదనము, ప్రాదేశనము, వర్జనము, వితరణము, వితీర్ణి, విగళము — విరాళము, విలంభము, విశ్రాణనము, విసర్గము, విసర్జనము, విహాపితము, సాతి, స్పర్శనము (అవ్య) అప, అజ్. (తె) ఈగి—ఈవి, ఒసఁగు, చేగము, తెగువ, తేగము, దార, పుడికిరింత పుణికిరింత—పుడుకరింత, పుడిగ—పుడుకు—పుడుగ—పుణుకు, పుస్నెము, పెట్టు—పెట్టుడు, విడువు—విడుపు. తద్వి.— ౧. ధనదానమునకు.— (తె) రోయావి; ౨: పోఁతోషికము. (తె) పసదనము; ౩: పేర్కొనియీకి.—సంకల్పదానము; ౪. ఎడతెగనియీవికి.— ప్రదానము; సత్రము. ౫. ఋణదానమునకు— సాధనము; ౬. ఫలమునుగోరిచేయు దానమునకు.— కామ్యదానము, ప్రవారణము; 4. తపింపఁజేయువ్యాధి: చూ, రోగము. 1—5; అ. 5: చూ, కవర్గము; అం. 6: చూ, ఇంద్రియవిషయములు; 7: చూ, ప్రకృతులు.

స్పర్శములు. అం. (క—చ—ట—త—ప వర్గముల ని ఐదు భేదములు): చూ, కవర్గము.

స్పర్శవేధి. సం. వి. న్. పుం =పరసవేది—పరుసవేది: చూ, పరుసవేది.

స్పశము. సం. వి. అ. పుం. పోరు: చూ, యుద్ధము.

స్పశుఁడు. సం. వి. అ. పుం. 1. వేగులవాఁడు: చూ, సందేశహారుఁడు; 2. పులితోడనుఏనుఁగుతోడనుపోట్లాడెడువాఁడు: స్పృశుఁడు.

స్పష్టకాలింగనము. అం: చూ, ఆలింగనములు.

స్పష్టత. సం. వి. అ. న: చూ, అచ్ఛత.

స్పష్టము. సం. విశ.=చేట్టము. వెల్లడియైనది: అక్షము, అవగతము, అవసితము, అవస్థితము, ఉపలబ్ధము, ఉన్మీలనము, కలితము, క్లిప్తి, గతము, గోచరము, జ్ఞాతము, పరిగణితము, పరివ్యాప్తము, ప్రచురము, ప్రతిపన్నము, ప్రతీతము, ప్రత్యక్షము, ప్రవ్యక్తము, బాహ్యము, బుధితము, బుద్ధము, మనితము, మితము, విత్తము, విదితము, విన్నము, విశదము, వీక్షితము, వ్యక్తము, సాక్షాత్కారము, స్ఫుటము. (వి) కలన. (ఇవి పరస్పరసంబంధముగలపదములు). (తె) ఇమ్ము, చిట్ట, తెల్ల, తెల్లమి—తెల్లము, తేట, నత్తెచ్చేము, బాహాటము—బాహోటము, బాహిరము— బాహ్యము, వెలి, వెల్లడి, వెల్లాటకము, (వి) ఎఱుఁగుట. (చూ, సంభావం. 3). తద్విశేషములు.— ౧. మిక్కిలిస్పష్టము:- (తె) తేటతెల్ల; ౨. కనఁబడినది, చూడఁబడినది:—ఆలోకి

శము, గోచరము, దృష్టము, నిరీక్షితము, ప్రదర్శితము, ప్రేక్షితము, వీక్షితము; 3. చూడఁబడినది:—ఆదర్శితము, దర్శితము; 4. బాగుగాఁ జూడఁబడినది:—ప్రదర్శితము; 5. చూడఁదగినది:—దర్శనీయము, దృశ్యము, ప్రేక్షణీయము, వీక్ష్యము; 6. చక్షురాదీంద్రియ గోచరమైనది:—అధ్యక్షము, అభివ్యక్తము, ఉపాత్తము, ఉచితము, ఐంద్రియకము, వ్యక్తము, సూచితము; 7. జాడగా తెలుపఁబడినది: సూచితము; 8. తెలియఁదగినది:— జ్ఞాతవ్యము, జ్ఞేయము, వేద్యము.

స్పష్టీకరించు. సం. స. క్రి. తెలియఁజెప్పు: ప్రతిపాదించు.

# స్పృ

స్పృక్కా. సం. వి. ఆ. స్త్రీ.—వృక్కా—పిక్కా రూ—వృక్కా*: లఘువు, వధువు: చూ, రాజార్హము. 1-32. [స్పర్శము. 1.

స్పృక్కు. సం. వి. స్. స్త్రీ. తాఁకుడు: చూ,

స్పృశము. సం. విణ. స్పృశింపఁదగినది.

స్పృశి. సం. వి. ఈ. స్త్రీ. వాఁకుడు*: కంటకశ్రేణి, కంటకారి-కంటకారిక, కంటతనువు, కట్వ్య, కచ్ఛుర, కురువు, కులి, క్రాంతి, క్రోడకర్ణి, క్షుద్రి, క్షుద్రకంటకి, గోజాకరికము—గోజాగరికము, దుస్పర్శ, నిదిగ్ధిక, ప్రచోదని, బహుపుత్రిక, బృహతి, రాష్ట్రిక, వంగము, వ్యాఘ్రిము, వ్యాఘ్రి. (తె) వాఁకుడు. వ్రేఁకుడు. తద్వి.—1. తెల్లవాఁకుడుకు—కటువార్తాకి, కపటేశ్వరి, క్షుద్రదూతి, క్షుద్రఫల, క్షుద్రవార్తాకి, క్షుద్రహింగులిక, క్షేత్రిజ, క్షేత్రదూతి, గర్దభి, దుర్భర. (తె) తెల్లవాఁకుడు; 2. నేలములకను:—రాములుక: చూ, హింగులి. 3.

స్పృశించు. సం. స. క్రి: సంస్పృశించు. (తె) అంటు, అరుకు—అదుకు, అర్పృశించు. చెనకు, చెనయు, తగులు—తవులు—తాలు, తలకడు, తాఁకు, తొట్టు, దసుకు-దసుక్కు, ముట్టు. తద్వి.—1. శరుద్రవ్యాసుదాఁకు.—(తె) ముట్టు; 2. మర్మముదాఁకు.—(తె) ముట్టు.

స్పృశుఁడు. సం. వి. అ. పుం. 1. వేగులవాఁడు. రూ—స్పర్శుఁడు—స్పశుఁడు: చూ, సందేశహారుఁడు; 2: చూ, స్పశుఁడు. 2.

స్పృష్టకాండుఁడు. సం. వి. అ. పుం: చూ, శస్త్రజీవుఁడు.

స్పృష్టకము. అం: చూ, అజాతస్మరాలింగనములు.

స్పృష్టము. సం. విణ. స్పృశింపఁబడినది: ఉపస్పృష్టము. [కుఁడు: చూ, స్పర్శము.

స్పృష్టి. సం. వి. ఇ. స్త్రీ. (రూ—వృష్టి) తాఁ

స్పృహ. సం. వి. ఆ. స్త్రీ. ఇచ్ఛ: చూ, వాంఛ.

స్పృహణీయము. సం. విణ. కోరఁదగినది: స్పృహ్యము.

స్పృహ్యము. సం. వి.అ.పుం. 1. మాదిఫలము*: చూ, సుపూరము; విణ. 2. కోరఁదగినది: స్పృహణీయము.

# స్ప్రి

స్ప్రిష్ట. సం వి. ఋ. పుం. రూ—స్పృష్ట. తపించఁజేయు రోగము, ఉపతప్త: చూ, రోగము. 1-4.

# స్ఫ

స్ఫట. సం. వి.ఆ. స్త్రీ.—పటము—పడిగె. రూ—స్ఫటము, స్ఫోట, దర్వి, ఫణి. (తె) పటము, పడగ-పడిగ—పడిగె: చూ, సర్పము.

స్ఫటము. సం. వి. అ. పుం. —పై.—

స్ఫటి. సం. వి. స్. పుం. పాము: చూ, సర్పము.

స్ఫటికము. సం. వి. అ. పుం. =పటిక. రూ—స్ఫాటికము. పటికపుఱాయి: చూ, స్థూలోచ్ఛ్రయము (రత్నములు. 12-(8).

## స్ఫా

స్ఫాటికము. సం. వి. అ. పుం.=పటికము (పూస), పలుగు (ఱాయి). మెఱయునది.

స్ఫాతి. సం. వి. ఇ. స్త్రీ. వృద్ధి: చూ, హెచ్చు. 2.

స్ఫారము. సం. వి. అ. పుం. 1. చలనము, వీచి, వేపనము: చూ, లోలము. 1. తద్వి.—౧. కదలించుటకు.— విధువనము— విధూవనము— విధుసము— విధువనము— విధూన్యము— విధూతి— విధూయనము— విధవ్యము— విధావ్యము. (చూ, లోలము. 1); ౨. చలించినది:—(చూ, చలితము) వేపితము; 3. మిక్కిలి చలించినది: ఘూర్ణము వ్యాలోలము; 2. బంగారు లోనగువాని చీలిక: చూ, శకలము. 4; విశే. 8. అధికమైనది: చూ, పోరతము.

## స్ఫి

స్ఫిక్కు. సం. వి. చ్. జ్. స్త్రీ. రూ. స్ఫిచము-స్ఫిజము. 1. పిఱుదులయున్నతి: చూ, శ్రోణి; అం. 2: చూ, స్త్రీలక్షణాంగములు.

స్ఫిగావర్తి. అం: చూ, అనుభావర్తములు.

స్ఫితము. సం. విశే. రూ-స్ఫిరము. స్ఫీతము, అధికమైనది: చూ, స్ఫారము. 3.

స్ఫిరము. సం. విశే.—పై.—

## స్ఫీ

స్ఫీతము. సం. విశే: చూ, రూ-స్ఫితము.

## స్ఫు

స్ఫుటత. అం: చూ, నఖక్షతములు. తద్విశేషములు —౧. కుచనఖక్షతములు:—(తె) నెమలియడుగు; ౨. కంఠనఖక్షతములు:—(తె) మొగలిరేకు; 3. నఖక్షతములు:—శారిక; 4. పరిగండనఖక్షతములు: (తె) సందువంకలు; 5. నఖక్షతవిశేషమునకు.—వ్యాఘ్రినఖము [స్ఫోటము. 1.

స్ఫుటనము. సం. వి. అ. న. భేదించుట: చూ,

స్ఫుటము. సం. విశే. 1. స్పష్టమయినది: చూ, స్పష్టము; 2 వికసించినది: చూ, సంఫుల్లము.

స్ఫుటి. సం వి. ఈ. స్త్రీ. పగిలిన దోసకాయ: చూ, హరివాలుకము.

స్ఫుటితము. అం: చూ, చుంబనములు. ('స్ఫురితము' అని కొందఱు)

స్ఫురణము. సం. వి. అ న. 1. రూ—స్ఫురణము, స్ఫూర్తి. అదురుట; 2: ఉపస్థితి, స్ఫూర్తి. (తె) తోఁచుట, పస.

స్ఫురించు. సం. అ. క్రి. 1 అదురు, చలించు: చూ, చలించు; 2: అవపాఱు, తోఁచు, పొలుపోవు.

స్ఫురితము. సం. విశే. 1. అదిరినది; 2. తోఁచినది; అం. 3 చూ, చుబుకక్రియలు; 4: చూ, గణకములు; 5: చూ, చుంబనములు. 6: చూ, భ్రామమండలములు; 7: చూ, రతిబంధములు.

స్ఫులింగము. సం. వి. అ. పుం. అగ్నికణము: చూ, వహ్ని. 1.

స్ఫులింగలక్ష్మి. అం: చూ, తంత్రములు.

## స్ఫూ

స్ఫూర్జకము. సం. వి. అ. పుం. నల్లతుమ్మికి: అంజనము, అతిముక్తకము, అతిముక్తము,

కాకతిందుకము, కాకపీలుకము, కాకస్ఫూర్జము, కాకాండము, కాకేందువు, కులకము, ప్లవము. (తె) కాకితుమ్మికి, చిట్టితుమికి, నల్లతుమికి, పిన్నతుమికి; తద్వి —౧. కోఁతితుమికికి.—పారావతము; ౨. నీరు తుమికి.—కాకపక్షము, దీర్ఘపత్రికము. (తె) నీరుతుమికి; 3. పెద్దతుమ్మికి.— కాంజికురుంబ — కురుంబిక, కాండిన్యము, క్షుపపత్రి, గౌతమము, చిత్రాక్షుపము, తీక్ష్ణగంధము, మహాద్రోణము. (తె) ఏనుఁగు తుమ్మి, పెద్దతుమ్మి: (ఇది దేవ తుమ్మి అని కొందఱు.); ౪. తుమ్మికి.— అధిచ్ఛత్రము, ఇందువు, కాలస్కంధము, కురంటక, కురండకము, కుంభయోని, కుటజము, కుతుంబకము, కుపీలువు, కేందువు, తిందుకము, తుంబి, ద్రోణము, రావణము, శితసారకము, ము (తె) తుమికి-తుమికి-తుమ్మి-తుమ్మికి-తుమ్మికి*.

స్ఫూర్జథువు. సం. వి. ఉ. పుం. వజ్రధ్వని: చూ, స్వరము. 2.

స్ఫూర్తి. సం. వి. ఇ. స్త్రీ. 1. అదరుట: చూ, స్ఫురణము. 1; 2. తోఁచుట. చూ, స్ఫురణము. 2.

## స్ఫే

స్ఫేష్ఠము. సం. విణ. మిక్కిలిఅధికమైనది: చూ, ఫారాళము.

## స్ఫో

స్ఫోటకము. సం. వి. అ. పుం.=పాటకము-పోటకము-పోదకము, బొబ్బరోగము, మసూచి-మసూచిక-మసూచిక-మసూరిక, మహామసూరి-మరి. (తె) పాటకము - పోటకము-పోదకము. తద్వి. —౧. (తె) అట్లమ్మ, పొంగు, పొంగులమ్మ; ౨: చూ, విషూచిక.

స్ఫోటము. సం. వి. అ. పుం. 1. భేదించుట: అవదారణము, ఖననము, దళనము, దారణము, పరిస్ఫోటనము, పాటనము, ప్రదరము, ప్రభేదనము, భిద, భేదనము, భేదము. వర్ధనము, విదరము, విదారణము, వ్రశ్చనము, స్ఫుటనము. (తె) చీల్చుట, వల్లీకు-వల్లె, విఱుగు-విర్గు, వెంపక, వ్రక్కలింత, వ్రయ్యుట; తద్వి:—౧: (తె) గీఱుపు, పగులు, పేఁటు, బీఱ, బీఁట, బీఁటిక, వంగుడు, వదులుడి. ౨:-(చూ, హతి); 3:-(చూ, శకలము 4.); 2: అంబుస్ఫోటము, కబుద్బుదము, గండము, బుద్బుదము, స్థాసకము. (తె) నీరుకాయ, నీరుబుగడ, నీరుబుగ్గ, నీరుబుడ్డ, పుక్క-బుగ్గ, బుడ్డ. తద్వి.—పర్వతాదులపై కుబుసు నీటిబుగ్గ.—(తె) పుక్క.

స్ఫోటశోఫ. సం వి. ఆ. స్త్రీ. జీడి*: అగ్ని, అగ్నిముఖము, అగ్నిముఖి, అరుష్కరము, అరుష్కరము, అస్ఫోహితము, కృమిఘ్నము, క్షయకరము, తపనము, దహనము, భల్లాతకి, రక్షోఘ్నము. (తె) జీడి. నల్లజీడి (అని కొందఱు). తద్వి.—౧. ఎలుకజీడికి — ఉపచిత్రి, ఉసరి, బుషికర్వ, కపికచ్ఛువు, కలభము, క్రిమికంటకము, చిత్రి, చుంచువు, చుంచురము, ద్రవంతి, న్యగ్రోధి, పత్రశ్రేణి, ప్రత్యక్శ్రేణి, మూసలి, మూషకపర్ణి-మూషకపర్ణి, రండ, రుండి, రుష, వంతి, వృష, శంబరి-సంబరి, శ్రావణి, సుతశ్రేణి. (తె) ఎలుకచెవి, ఎలుకచెవిపల్లిక, ఎలుకజీడి, ఎలుకజీడిపల్లిక, ఎలుకమొక్క; ౨: వృషాంకము. (తె) నల్లజీడి.

స్ఫోటించు. సం. స. క్రి. పగులు: :ఆస్ఫోటించు, భేదించు, నిర్భేదించు, భేదిల్లు, (మి) ఖండితమగు. (తె):— అగలించు, అగలు-అగులు, అవియు, అవిసిపోవు. ఇండేవాయు, ఇడియు, ఊడు, ఎడలు, కుంటుపడు, చిటులు-చిట్లు, చినుగు-చిరుగు, చీలు, తునియు, తునుగు, తూటకట్టు, తెగు-తెగు, తెగిచ్చు, పగులబాఱు, పగులు-పవులు-సాఱు, పగుల్లువాఱు, పతియువాఱు, పాఱువడు, పికులు-పిగులు, పిక్కటిలు-పిక్కటిల్లు, పీరు పీలు, పెకలు, పెఱుగు, బీటగిలు-బీటగిల్లు, బీటలువాఱు, బీటలువోవు, విచ్చు, విరవాయు-విరియబాఱు, విరియు-విఱియు, విసరు, వీగు :(చూ, సెలగు); (చూ, వ్రక్కవాఱు ); (చూ, వేఱుపడు.). తదితశేషములు:—౧ పెల్లగించు:— అభ్యుద్ధరించు, ఉత్పాటించు, ఉత్పాదించు, ఉద్ధరించు, పరిస్ఫోటించు, భేదించు, విదారించు. (మి.) ఉన్మూలితమగు, విదారితమగు. (తె):-అగలు,చిందఱసేయు-చిందఱలుసేయు, చిట్టుముట్టాడు; ౨: (తె)— పీకు, పుచ్చు, పెకలు, పెఱుకు-పెరుక్కు, పెఱుకు, పెల్లగిలు-పెల్లగిల్లు, పెండగిల్లు, మెఱుకు, ముండిగించు, ౩. పక్షులు గోళ్లతో కల్లగించు:—ఉన్మూలించు.(తె) కలకు,కల్లగించు, కొక్కరించు, గీఱు, గుద్దలించు, తోడు, నుఱుము, ౪.వస్త్రాదికము భేదించు— (తె) ఉత్తరించు, కత్తిరించు-కతిరించు, చించు, చింపు, చిదుము, చీలుచు-చీల్చు, తుంచు, ౫.నొవ్వనాటు:-స్ఫోటించు. (తె) ఊటు, ఘుమ్ము, దూటు, పాడుచు, మీటు, మెఱుము.

## స్మ

స్మ. సం. అవ్య.=చేమి-సుమ్మి-సుము-సుమ్మా, చూమమి.

స్మయము. సం వి. అ. పుం. 1. గర్వము: చూ, హంకారము; 2. ఆశ్చర్యము: చూ, వింత. 1.

స్మరకూపము. సం. వి. అ. పుం, న. ఆడుగుతి: చూ, భగము. 12. [లు.

స్మరచక్రము. అం: చూ, ఉత్తానకరణబంధము

స్మరణము. సం. వి. అ. న. 1. తలఁపు: చూ, స్మృతి. 1; 2. జ్ఞప్తి, తెలివి: చూ, హ్మాల్లేఖము. 2; అం. 3: చూ, భక్తిలక్షణములు.

స్మరవ్యాకరణము. అం: చూ, వ్యాకరణములు.

స్మరహరుఁడు. సం. వి. అ. పుం: చూ, శివుఁడు.

స్మరాంకుశము. సం. వి. అ. పుం. పెంచిదిద్దిన గోరు. (చూ, నఖము. 1.)

స్మరాంగారము. సం. వి. అ, పుం, న. ఆఁడుగుతి: చూ, భగము. 12. తద్వి —౧ ఉపస్థలోని లింగనాడికి.—(తె) లింగనాడి; ౨. మొగ్గవాలిన యుపస్థకు -దళితకోశము.

స్మరించు. సం. స. క్రి. స్మరణముచేయు: (తె) తలఁచు-తలఁచు.

స్మరుఁడు. సం. వి. అ. పుం =మరుఁడు: చూ, మన్మథుఁడు.

స్మర్త. సం. విశే. (ఋ. ఈ. ఋ.) స్మరించువాఁడు: తలఁచువాఁడు.

## స్మా

స్మారితుఁడు. సం. విశే. 1. తలఁపుసాకిరి: చూ, సాక్షి; అం. 2: చూ, కృతసాక్షులు, 3: చూ, సాక్షులు.

స్మార్తము. సం. వి. అ. న. 1. స్మృత్యుక్తకర్మము; విశే. 2. స్మృతిసంబంధమైనది.

## స్మి

స్మితము. సం. వి. అ. న., అం. 1. అధరమునందు మాత్రము ప్రకాశించెడు చిఱునవ్వు (ఇది యుత్తమము): చూ, హాస్యములు; సం. విణ. 1: చూ, సంఫుల్లము.

స్మితి. సం. వి. ఇ. స్త్రీ.—పై.—

## స్మృ

స్మృతము. సం. విణ. తలఁపఁబడినది: అభిప్రేతము, ఇతము.

స్మృతి. సం. వి. ఇ. స్త్రీ. తలఁపు: అభిప్రాయము, అంతర్గతము, ఆకూతము-ఆకూతి, అధ్యానము, ఆశయము, ఆళి, ఇంగము, ఉద్దేశము, ఉద్బోధము, గమనము, కూతము, ఛందము, చింత, జ్ఞప్తి, తాత్పర్యము, ధ్యానము, భావము, మతము, మతి, విషయము, స్మరణము, గోచరము(అని కొందఱు). (అవ్య).—అని, అవ, ఆ, అమ్, ఏ, ఓ, కిల, తు (తె) ఎడాటము, గుఱి, తలఁపు, దేనము, వెంట. తద్వి.— 1. వ్యాపాదనము-వ్యాపాదము: ౨: అహోపురుషిక-అహోపౌరుషిక-అహోపురుషిక-అహోపౌరుషిక; 2: చూ, ధర్మశాస్త్రము (చూ, స్మృతులు); 3. బుద్ధి: చూ, వ్యాల్లేఖము. 2; 4. ఎఱుక: చూ, సోఁకు; అం. 5: చూ, అలంకారము. 3 (స్మృతిమత్తు అని కొందఱు) ("ఒక వస్తువును జూచినప్పుడు ప్రియమైన పూర్వవస్తు వట్టిదేయని జ్ఞాపకము వచ్చుట ఉదా.— పద్మమును జూడఁగానే కాంత మొగము పొడకట్టినట్టయినది"); 6: చూ, సంచారి భావములు. ("అల్లనాఁడు గోదావరీ పరిసరంబున మన మిరువురము నొక రేఁటికొదమతో జేరిచిన యాటలు నా హృదయంబున నాటుకొని యుండెనని రామునికెఱిఁగింపుము.")

స్మృతికర్తలు. అం: కశ్యపుఁడు-అత్రి-భరద్వాజుఁడు-విశ్వామిత్రుఁడు-గౌతముఁడు-జమదగ్ని-వశిష్ఠుఁడు అను ఏడుగురు ఋషులును, అంగిరసుఁడు-ఉశనసుఁడు-ప్రజాపతి-విష్ణువు-యముఁడు-బృహస్పతి-సంవర్తుఁడు-దేవలుఁడు-నారదుఁడు-ముద్గలుఁడు-పరాశరుఁడు-మనువును పండ్రెండుగురును ఋగ్వేదసూత్రప్రవర్తులు- యాజ్ఞవల్క్యుఁడు శుక్లయజుస్సుతో సంబంధము గలవాఁడు. హారీతుఁడు-శంఖుఁడు-లిఖితుఁడు-వ్యాసుఁడు-పులస్త్యుఁడు-శాతాతపుఁడు-దక్షుఁడు మొదలగు వారు పురాణేతిహాసములకు సంబంధులు. ఆపస్తంబుఁడు-ఆశ్వలాయనుఁడు-బోధాయనుఁడు-గోబిలుఁడు-సత్యాయనుఁడు ననువారు సూత్రకర్తలలోనివారు. ఇంకను కొందఱు స్మృతికర్తలు కలరు. వీరందఱిపేరను స్మృతులున్నవి. (చూ, మూలస్మృతులు, స్మృతులు. (చూ, ఋత్విజుఁడు.)

స్మృతులు. అం: చూ, మూలస్మృతులు. (వీనినే వేఱొకవిధమున.—మను, అత్రి, విష్ణు, హారీత, యాజ్ఞవల్క్య, ఉశన, అంగిరస, యమ, ఆపస్తంబ, సంవర్త, కాత్యాయన, బృహస్పతి, పరాశర, వ్యాస, శంఖలిఖిత, దక్ష, గౌతమ, శాతాతప స్మృతులు. (18.)

## స్మే

స్మేరము. సం. విణ. 1. కొంచెము నవ్వినది; 2. వికసించినది: చూ, సంఫుల్లము.

## స్య

స్యందనము. సం. వి. అ. న. 1. కాఱుట: చూ, స్రవము; 2. నీరు: చూ, సలిలము; పుం-

3. తినాసము*: అతిముక్తకము, అతిముక్తము, కాముకము, కుబ్జకము, చిత్రికృత్తు, తినిశము, నేమి, రథదుమ్రు, వంజులము, శకటము, సర్వసాధకము. (తె) తినాసము, నెమ్మి; పుం, స. 4. శతాంగము యుద్ధరథము (అనికొందఱు): చూ, శకటము. 1.

స్యందనారోహుఁడు. సం. విశే. రథమునెక్కువాఁడు; రథమునెక్కి యుద్ధముచేయువాఁడు (అనికొందఱు): వ్రతి, రథి, రథికుఁడు, రథిరుఁడు. (తె) జెగిలెకాఁడు, తేరుకాఁడు.

స్యందము. సం.వి.అ.పుం.కాఱుట:చూ, స్రవము.

స్యంది. సం. విశే. (న్. ఈ. న్) స్రవించునది: చూ, స్రవము.

స్యందిని. సం. వి. ఈ. స్త్రీ: సృణిక-సృణీక. (తె) చొంగ, జొల్లు, లాలతన్నీ:-౧ చూ, ఖ్రిఃగ్మబిందువు; ౨. పాముయొక్కజొల్లు:- పిచ్ఛ.

స్యదము. సం. వి. అ. పుం. వేగిరము:అంజస్సు, ఓకము, కాకోదరము, కుంతలము, గమకారిత్వము, జవనము, జవము, జూ, తరము-తరస్సు, ప్రసరము, రంహస్సు, రభసము, వేగము, సహము. (విశే):-అరము, అవిలంబనము, అవిలంబితము, ఆశువు, ఉచ్చండము, క్షిప్రము, చపలము, చాపలము, జవనము-జవము, తీవ్రము, తూర్ణము, త్వరితము, నుశ్రితము, యవాని, రంహస్సు, లఘువు, వాజము, శీఘ్రము. సత్వరము, సహము (క్రి.విశే.):—అగము, అవిలంబనము—అవిలంబితము, ఆశువు, క్షిప్రము, చపలము- చాపలము, జవనము, జవము, తూర్ణము, త్వరితము, ద్రుతము, లఘువు, శీఘ్రము, సత్వరము (తె) చెచ్చెర- చెరచెర, తుఱుతు, దడదడ, దఱుసు, వరిగె, వే, వేళము, వయిళము -వైళము - వైడము. (అవ్య) అంజస, అచిరాత్, అహ్నాయము, అంతచనము, ఝటితి-ఝడితి, ద్రాక్, మంక్షు, సపది, స్రాక్కు. (అవ్య)(తె):— జిజిగి, బిట్టు, బిట్టుబిట్టు. (అవ్య.క్రి.విశే)(తె): తురితము, తురితు, నింకిత్, హుసహుస. (వి) (తె):—అంకపొంకములు- అంకపొంకాలు- అంకాపొంకములు-అంకాపొంకాలు, అవచిపాటు, అవ్వళము, ఉద్దవడి-ఉద్దవిడి, గొరగొర, చేఱుకు, జరుగుడు-జరువురు-జరూకు-జర్గుకు, జిఱజిఱ, తరమిడి, తరవు, తివుట, తివురు, తీవరము, తుఱుతు-తుఱ్ఱు, తొర, దడదడ, దురము, నెప్పరము, నెప్పళము, పఱపు, బిరబిర, రవరవ, రింగు, రివ్వు, వడి, వెస, వేఁడి, వేగ-వేగము, వేగిరము, వేగము, వేలము, సరగు. (తె) (అవ్య):—ఏకాయెకి; (దృ):—క్రించేర, క్రుక్కున, క్రిచ్చేఱ, క్రిన్న-క్రిన్నన, గుప్పున-గుబ్బ (బ్బు)న-గొబ్బున, గ్రక్కున-గ్రుక్కున, గ్రద్దన, గ్రమ్మన - గ్రమ్మురన, చేట్టన, చేయ్యన, చివ్వున, చెచ్చెర, చెరచెర, జిరీన, జరీలున, జెఱ్ఱున, జిఱ్ఱున, జివ్వున, డిగ్గన, తటాన- తటాలున, తటుకున - తటుక్కున- తడుకున, తుకీన, తెప్పదెరలఁగ, తెప్పున, దబ్బున, దారున, దిగ్గన-దిగ్గున, దురదుర, దెబ్బున, బిరబిర-బిఱబిఱ, బిరాన-బిఱాన, బీఱీన-బీఱీలున, బొరన, రివ్వున-ఱివ్వున, వెస, వేగ; తద్వి.—౧ వాయువేగమునకు.—అవరాజయ, వాయుఘాటి. ౨ మిక్కిలివడికి —(విశే) క్షేపిష్ఠము, క్షేపీయము, రయము. (తె) ఉరవడి-ఉరువడి-ఉఱవడి, నెవ్వడి, హుటాహుటి; విశే. 3. వేగముగలది: తూర్ణము, త్వరితము, ద్రుతము. (తె) ఉగ్గడువు, తులఁచే, తొర, నులువు-నుల్వు, హుటాహుటి; ౪. మిక్కిలి శీఘ్రముగ.-(తె) సరపర. ౫. నిజముగా తేలినడికి:- (తె) దడదడ;

౬. వేగముగాఁబోవుటకు:—జూతి; ౭: చూ, సంభ్రమము.

స్యన్నము. సం. విణ. కాఱినది, స్రుతము: చూ, స్రవము.

## స్యా

స్యాలకుఁడు. సం. వి. అ. పుం: చూ, రూ-శ్యాలకుఁడు.

స్యాలిక. సం. వి. ఆ. స్త్రీ: చూ, రూ-శ్యాలిక.

స్యాలుఁడు. సం. వి. అ. పుం: చూ, రూ-శ్యాలకుఁడు.

## స్యూ

స్యూతము. సం. వి. అ. పుం. 1. రూ—స్యూనము—స్యోతము. పల్లిక, దాఁగర: చూ, సజ్జె. 1, విణ. ౨. కుట్టఁబడినది: ఉతము - ఊతము, ఘటితము.

స్యూతి. సం. వి. ఇ. స్త్రీ: రూ—సూతి, ఊతి, వానము. (తె) కుట్టు, కుట్టుడు, చిమ్మ్ర, పోడుచేట, పోడుపు. తద్వి.—౧. మడుపు కుట్టునకు.—(తె) చీనీకుట్టు; ౨: (తె) తిబ్బి, డిబ్బి (అనికొందఱు); ౩. బట్టకుట్టుటకు.—సీవనము, సేవనము. (తె) సీవనము; ౪: చూ, సంతతి. 1.

స్యూనము. సం. వి. అ. పుం: చూ, స్యూతము. 1.

## స్యో

స్యోతము. సం. వి. అ. పుం: చూ, స్యూతము. 1.

స్యోనము. సం. వి. అ. పుం—పై.—

స్యోనాకము. సం. వి. అ. పుం. రూ—శ్యోనాకము*: చూ, శోణకము.

## స్ర

స్రంసనము. సం. వి. అ. న. క్రిందఁ బడుట.

స్రంసి. సం. వి. న్. న. పోఁక*: శృంగారి. (చూ, పోఁక.). ౧. తోఁటపోఁకకు.—లఘుకము. ౨. లతాపూగము.—రోజనము. (తె) నూదిగొంటు; ౩. నిమ్మపండొడి మగల పోఁకకు.—రామపూగము; ౪. పోఁక చెక్కకు-పూగఖండము, వల్కము. (తె) లీయె-వీయె, వక్క; ౫: వరాగ్రము.(చూ, పోఁక *); పుం. ౭. గొనుగు*: చూ, ప్యాదు మజ్జాఫలము (వరగోఁగు); విణ. ౮. క్రిందఁ బడునది.

స్రగ్గు. దే. అ క్రి: చూ, రూ-సగ్గు.

స్రగ్ధర. అం: చూ, వృత్తము. 1. ("మ-ర-భ-న-య-య-యగణములు. 8-15 యతులు. 21 ఛందస్సు.") [గలవాఁడు.

స్రగ్వి. సం. విణ. (న్. ఈ. న్) పూదండ

స్రగ్విణి. అం: చూ, వృత్తము. 1. ("నాలుగు రగణములు. 7 యతి. 12 ఛందస్సు")

స్రజము. సం. వి. జ్. స్త్రీ. పూలదండ. హారము: చూ, హావళిక. ౨. (చూ, భూషణము. 2-32).

స్రవ. సం. వి. ఆ. స్త్రీ. చాఁగ* రూ-స్రువ, కటంభర, కర్మకరి, కలమము, కిశోరము, కుచండిక, గోకర్ణి, గోవల్లి, గౌరశాకము, ఘనరసము, ధనశ్రేణి, పాటల, బహువల్కము. మధురస, మధుశ్రేణి, మధూలిక, మూర్వ, మోరట, వసంతదూతి, సుధ. (తె) చాఁగ, చేగ, దేవి. తద్వి.—చారకము, చారము, వనగుప్తము, వనప్రియము. (తె) చాలు, జీడిమామిడి, మొక్కమామిడి.

స్రవంతి. సం వి. ఈ. స్త్రీ. 1. తరంగిణి, ఏఱు: చూ, నది; ౨: అపంక్రియు, రుదంతి*.

**స్రవణము.** సం. వి. అ.న.=సా.న. కాఱుట: చూ, స్రవము.

**స్రవద్గర్భ.** సం. వి. ఆ. స్త్రీ. 1. అవతోఁక: చూ, ధేనువు; ఆం. 2: చూ, వంధ్యలు.

**స్రవము.** సం. వి. అ. పుం. కాఱుట: రూ-స్రావము-స్రవణము, ప్రఘారము-ప్రాఘారము, విద్రవము, శ్చ్యోతము, స్నవము, స్యందనము, స్యందము, స్రుతి. (తె) కాఱుట. తద్వి.—౧. కాఱినది.—రీణము, స్నుతము, స్యన్నము, స్రుతము; ౨. స్రవించునది.—స్యంది; 3. కాఱునది: స్రావకము; ౪. మిక్కిలి కాఱుటకు.—అభిష్యందము.

**స్రవించు.** సం. అ. క్రి. రూ-స్రవియించు. (తె) ఉట్టు, ఉరలు, ఊడు, ఒలుకు, ఓడిగిల్లు, కరఁగు, కరఁగుపడు, కయివ్రాలు-కైవ్రాలు, కాఱు, గీలు, చినుకు, జేల్లించు, జాఱు, జొబ్బిలు-జొబ్బిల్లు, తొంగలించు, తొట్టు, తొరఁగు-తొరుఁగు, దిగువాఱు, వడియు, వారు. తద్వి.—౧. స్రవియించు, ద్రవించు. (తె):—ఊరు, నీరూరు; ౨. పాలుద్రవించు, స్రవియించు, ద్రించు. (తె) చేఁపు.

**స్రవియించు.** సం. అ. క్రి.—పై.—

**స్రష్ట.** సం. వి. ఋ. పుం. సలువ: చూ, బ్రహ్మ. 1.

**స్రస్తము.** సం. విణ. జాఱినది: గళితము, చ్యుతము, ధ్వస్తము, భ్రష్టము, స్కన్నము, స్ఖలితము. తద్వి.—విగళితము.

## స్రా

**స్రాక్కు.** సం. అవ్య.=సరగ. శీఘ్రము: చూ, స్యదము.

**స్రావకము.** సం. విణ. కాఱునది: చూ, స్రవము.

**స్రావణము.** దే. వి. అగసాలెవాని కొలముట్టు: రూ-సవాణము: చూ, సుత్తియ.

**స్రావము.** సం. వి. అ. పుం. 1. కాఱుట; చూ, రూ-స్రవము; 2.—కోవ. నూకలగంజి: చూ, పాదము. (1)-౫3.

**స్రావి.** దే. వి: చూ, రూ-సరవి. 2.

## స్రు

**స్రుక్కఁబడు.** ద్వ. అ. క్రి. దుఃఖించు: చూ, శోకించు. (వ్యాఘ్రమునబడు).

**స్రుక్కు.** సం. వి. చ. స్త్రీ. 1. మిల్లివంటి యజ్ఞోపకరణము, జుహువు: చూ, పాత్రము.6; దే.వి. (1) దుఃఖము: చూ, శోకము; (2) ఏడుపు: చూ, శోకము; (3) చికమక, చిక్కు, మాసిక, వరఁకు, వేళాకోళము; అ. క్రి. (4) ఉపశమించు - ఉపశమిల్లు, క్షయించు, క్షీణించు, విశ్రమించు, శమించు, (తె):—అక్కళించు, అడఁగారు-అణఁగారు, అడఁగు-అణఁగు, అత్తమిల్లు, అఁగు, ఆఱు, ఇందు, ఇముడు, ఇఱికికొను, ఊటడిల్లు, ఊటడు, ఓరుచు-ఓర్చు, కుందు, కుదియు, కుంగఁబడు-కుంగిలు-క్రుంగు, గోడుపడు, చెల్లారు, డయ్యు (దయ్యు), డిందు, డిందుపడు, డొంకు, తగ్గు, తమాయించు, తాఱు, తీలగు, తీలుపడు, తూలు, తేఱు, పొలిపోవు, మట్టుపడు, మడుఁగు-మడ్గు, మఱుఁగు-మఱువు, మలుగు, మునుగు, మున్గు, ముప్పటిలు-ముప్పటిల్లు, మ్రొగ్గు, లోఁగు-లోవు, వారు, సగ్గించు, సగ్గు-స్రగ్గు, సమయు. తద్వి.—౧: చూ, వంగు; ౨: (తె) ఇఱుకు; (5) దుఃఖించు: చూ, శోకించు; (6): (మి) అధైర్యపడు, భయపడు, (సం) ఉద్వేగిల్లు, శంకించు, భీతిల్లు. (తె) అంజు, అడలు, అదరు- అదలు, అరవాయిగొను, ఉలుకు-ఉల్కు, అళుకు-అళ్కు, ఉలుకు,

ఎసవడు, ఓడు, కొంకు, కొఁచెవాఁలు, గుబ్బుమను, గ్రక్కిల్లు, జంకు, జడియు, తలఁకు, దద్దఱిల్లు-దద్దఱు-దద్దిర్లు, దంచోడించు-దంచోళించు, • పిచ్చలించు, పిఱువడు, పుల్లగిలు-పుల్లగిల్లు, పొక్కు, బీతుకొను, బెంబేలువడు, బెగడు, బెగడువడు, బెగ్గడిలు-బెగ్గడిల్లు-బెగ్గడు, బెగ్గలించు-బెగ్గిలు-బెగ్గిల్లు, బెదరు, బెదరువడు, వెఱచేఱుచు, వెఱచు, వెలివిరియు-వెల్లివిరియు. తద్వి.—మిక్కిలి భయపడు.—నివ్వెఱపడు; (7): చూ, వెనుదీయు. 1. నిర్వ. 5, ఆ. 122: ముకుళించు, ముకుళీభవించు, (8): సంపుటించు. (తె) కొరగించు, ముడుఁగు, ముడుఁచు, ముడుఁగఁబాఱు, ముడుచు (9)తగ్గు, తగ్గించు. (భో. 1, ఆ 101.):ఉపశమించు-ఉపశమిల్లు, లోపించు, హరించు. (మి) అనర్థకము. (తె) అడఁగు, అణఁగు, అఱు, అఱుగు-అఱుగువడు, ఊరఁబోవు, ఎత్తువోవు, ఓరుచు, ఓర్చు, కడఁబడు, కడమపడు, కీడుపడు-కీడ్పడు, కుంటుపడు, కుందు, కుదియు, కుఱుచపడు, కొంచెపడు, డిగు-డిగ్గు, డిగ్గుపడు, డుఁకు, తక్కువపడు, తగ్గు, తఱుఁగు-తఱువు, తీయు, తొనుగుపడు, పొనుపడు-పొన్పడు, పొలువడు-పొల్లవడు-పొల్లువడు, పొల్లవోవు, పిదులు, మందటిలు-(మందటిల్లు), మాను, ముడుఁగు; వట్రిపడు, వ్రాలు, సగ్గు-స్రగ్గు; (10): పొడుతపడు; (11) (మి):—అనుతాపపడు, పశ్చాత్తాపపడు. (తె):—అలమటపడు, అలమటించు, అలమరించు-అలమరు, తలపోయు, తలరు, నొచ్చుకొను, బెగ్గిలు-బెగ్గిల్లు, వగచు. (సం) చింతించు-చింతిల్లు: చూ, శోకించు; (12). మూర్ఛిల్లు: చూ; సొమ్మసిల్లు; (13): చూ, సంకోచించు; (14): మ్లానమగు. (తె) వడలు, వాడఁబాఱు, వాడు, సురుఁగు, సొగియు, సొగుగు; (15) చుట్టుకొను: చూ, వేష్టించు.

స్రుక్కులు. దే. వి.బ. కడుపుమీఁదిముడతలు: చూ, వళి. 1.

స్రుచావృక్షము. సం.వి.అ.పుం. ములువెలఁగ*: రూ-స్రువావృక్షము: చూ, వెలఁగ. 3.

స్రుతము. సం. విశే. రూ-స్నుతము. కాఱినది: చూ, స్రవము,

స్రుతి. సం. వి. ఇ. స్త్రీ. కాఱుట: చూ, స్రవము.

స్రువ. సం. వి. ఇ. స్త్రీ. 1. అందుగు*: చూ, సల్లకి; 2. చేఁగ*: చూ, రూ-స్రివ.

స్రువము. సం. వి. అ. పుం. స్రుగ్భేదము, జుహువు: చూ, పాత్రము. 6.

స్రువావృక్షము. సం. వి. అ. పుం: చూ, స్రుచావృక్షము*. (ఇది ములువెలఁగ, పుల్లవెలఁగ అనురెంటికిని జెందును.)

## స్రో

స్రోతఘ్ని. సం. వి. ఈ. స్త్రీ: చూ, సజ్జోకారము.

స్రోతస్విని. సం. వి. ఈ. స్త్రీ. నిమ్నగ, ఏఱు: చూ, నది.

స్రోతస్సు. సం. వి. స్. న. 1.జలప్రవాహము: చూ, వెల్లువ; 2: చూ, స్రోతస్విని; 3. నీరువచ్చెడితూము: చూ, వాహసము. 2; 4.ఇంద్రియము;5.తొండముచివర: చూ, హస్తి.

స్రోతోంజనము. సం. వి అ. న. నీలాంజనము: చూ, సౌవీరము.

స్రోతోనిమ్నన్యాయము అం. నీరుపల్లమెఱుఁగును. నిజము దేవుఁడెఱుఁగును అనురీతి.

స్రోతోవహము. అం: చూ, యతిప్రాణములు.

## స్లే

స్లేంటింగు. వా. వి. ఏటవాలు.
స్లేటు. వా. వి. రాతిపలక.

## స్వ

స్వకము. సం. విణ: స్వకీయము, స్వము: చూ, స్వతంత్రము.

స్వకీయము సం. విణ.—పై.—

స్వక్షేత్రము. అం: చూ, గ్రహముల దశావరిమాణములు. [చూ, హిమాంశువు.

స్వచమనుఁడు. సం. వి. అ. పుం. చంద్రుఁడు:

స్వచ్ఛందము. సం. విణ: చూ, స్వతంత్రము.

స్వచ్ఛందుఁడు సం. విణ: అపావృతుఁడు, అప్రాకృతుఁడు, ఉద్దాముఁడు, ధీరుఁడు, నిరవగ్రహుఁడు, భుజిష్యుఁడు, స్వతంత్రుఁడు, స్వైరి–స్వైరుఁడు. (తె) అడ్డపాటులేనివాఁడు, అడ్డములేనివాఁడు, ఇచ్ఛనుండువాఁడు

స్వచ్ఛము. సం. వి. అ. పుం. 1. తెలుపు: చూ, వర్ణము. 6; విణ. 2. తెల్లనిది: చూ, వర్ణము. 6; 3=చొక్కము-సొచ్ఛెము. స్వచ్ఛమైనది: చూ, హృద్యము. 2: (చూ, సమీచీనము. 2)

స్వజనుఁడు. సం వి. అ. పుం. జ్ఞాతి, సగోత్రుఁడు: చూ, సగంధుఁడు. 2

స్వతంత్రత. సం. వి. అ. న. ఛత్రభంగము: చూ, స్వతంత్రము.

స్వతంత్రము. సం. విణ. 1=సొంతము: అప్రావృతము, ఆత్మీయము, నైజము, వ్యక్తౌనము, స్వకము, స్వకీయము, స్వచ్ఛందము, స్వము, స్వత్వము, స్వరుపు, స్వాతంత్ర్యము, స్వామ్యము. (అన్య) అంతరము. (తె) అనాయత్తము, సొంతము. తద్వి.—స్వతంత్రభావమునకు.—ఛత్రభంగము, స్వతంత్రత. (తె) ఇస్తువు, విచ్చేలవిడి, సయాతిము, సొత్తు, సొమ్ము, సొంతంతరము;. అం. 2: చూ, ద్వైదీభావద్వయము. [తానుగావీర్పడు.:

స్వతంత్రించు. సం. అ. క్రి ఒకరియనుమతిలేక

స్వతంత్రుఁడు. సం. విణ: చూ, స్వచ్ఛందుఁడు.

స్వత్వము. సం. వి. అ. న.=సొత్తు. 1: చూ, స్వతంత్రము; 2. సొమ్ము: చూ, హిరణ్యము. 8.

స్వదీపచుంబనన్యాయము. అం. తనదీపమును ముద్దుఁబెట్టుకొనఁగా మీసములు తెగఁగాలినవి అనెడురీతి.

స్వదూకపాపిని. సం. వి. ఈ. స్త్రీ. బుద్ధుని భార్య, అనంత( చూ, భార్య. 1-౮౧.)

స్వధర్మ. సం. వి. ఆ. స్త్రీ. రూ–సుధర్మ: చూ, సభ. 2-౯.

స్వధర్మపరత. అం: చూ, మోక్షానదాయకములు.

స్వధర్మము. సం. వి. అ. పుం: చూ, స్వభావము.

స్వధితి. సం. వి. ఇ. పుం. గండ్రగొడ్డలి, పరశువు: చూ, ముద్గరము. 1_3.

స్వనము. సం. వి. అ. పుం. రూ-స్వానము-మ్రోఁత: చూ, స్వగము. 2

స్వనితము. సం. వి. అ. న. 1. ఉఱుము: చూ, స్తనితము; విణ. 2. మ్రోసినది: రణితము.

స్వపతిమువారు. అం: (వీరుఏడుగురు:—చూ, అహిభయము.)

స్వపనము. సం.వి.అ.పుం: చూ, రూ-స్వప్నము.

స్వప్నకుఁడు. సం. విణ. నిద్రించినవాఁడు: చూ, శయితుఁడు.

స్వప్నక్కు. సం. విణ. (జ్)—పై.—

స్వప్నభాషణము. సం. వి. అ. న. నిద్రయందలిపలువరింత: చూ, శబ్దము. 2-౫౯.

స్వప్నము. సం వి. అ. పుం. (రూ-స్వపనము-స్వాపనము-స్వాపము) 1. కల: అదర్శనము, దర్శనము. (తె) కల, కలవరము, కలవరింత—

కలవరింపు—కలువరింత-కలువరింపు, కలవలము. తద్వి.—౧ దుస్స్వప్నమునకు.—కు; ౨. కన్నకలకు.—(తె) నిక్కులు; 3 కునికిపాటునకు.—అవస్కందము, కౌసీద్యము, ప్రమీలనము, తంద్రి-తంద్రి-తంద్రిక, ప్రమీల. (తె) కునికిపాటు, తందర, తూగు, మాచ్చికపాటు; ౪. త్ర్యవస్థలలోనొకటి.-చూ, అవస్థలు: ౫: చూ, సుషుప్తి; ౬. ఒకరకమునిద్రకు.—కుంచితము; ౭. నిద్రయందలి వధకు:-సుప్తి; ౮. స్వప్నభాషణమునకు.—పలవరము: చూ, శబ్దము. 2, 2. నిదుర: (స్వపనము- స్వాపనము- స్వాపము.) సంవేశము, సుప్తి, నిద్ర. (తె) కురుక (కురుకు)-కూరుకు-కూర్కు, కూరుకుపాటు-కూర్కుపాటు, గురుక, తందర, తూగు, నిదుర-నిద్దుర. తద్విశేషములకు.- చూ, స్వప్నము. 1; 3. చూపు: చూ, వీక్షణము; అం. 4: చూ, అవస్థలు.

స్వభాను. అం: చూ, సంవత్సరములు.

స్వభావక్రియ. అం: చూ, క్రియాంగములు (అంగము. 9.)

స్వభావము. సం. వి. అ. పుం.=సబాము: అంతము, అనూకము, అభ్యసనము, అభ్యాసము, అయనము, ఆమ్నాయము, ఉచ్చట, ఉపచారము, ఉపపత్తి, కాయము, గుణము, జీవము, తత్త్వము, ధర్మము, నిజము, నిసర్గము, నైజము, పరిణామము, ప్రకృతి, భావము, రూపము, వర్ణము, శీలము, క్రమము, సంసిద్ధి, సత్త్వము, సర్గము, సహజము, సాధనము, సిద్ధి, సృష్టి, స్వధర్మము, స్వరూపము. (అవ్య) అజ్. (తె):—అభ్యాసము, అలవడుట, అలవాటు, గొనబు, నిజము, పాడి, మామూలు, వాడుక, వాడుదల, సబాము, సాజము, సాదన. తద్వి.—౧. శరాభ్యాసమునకు.—సాధనము. (తె) సాదన; ౨. రూపునకు: చూ, స్వరూపము; 3. స్త్రీస్వభావమునకు—స్త్రైణము; ౪. స్వభావముచేతఁగలిగినది:—స్వాభావికము. (తె) నైజము.

స్వభావసాత్త్వము. అం: చూ, ప్రేమపంచకము

స్వభావోక్తి. అం: చూ, అలంకారము 3. ("జాత్యుచితవేషభాషల వర్ణించుట. ఉదా.—లేళ్లు చెవులు నిక్కించి క్రేళ్లుదాఁటుచు మేజంచకత్తులఁజూచెడు.")

స్వభువు. సం. వి. ఉ. పుం. 1. వెన్నుఁడు: చూ, విష్ణువు. 1; 2. ముక్కంటి: చూ, శివుఁడు; 3 నలువ: చూ, బ్రహ్మ. 1.

స్వము. సం. వి. అ. పుం, న. 1=సొమ్ము. ధనము: చూ, హిరణ్యము. 3; 2: తాను; విణ. 3. తనది, స్వకీయము, స్వీయ: చూ, స్వతంత్రము.

స్వయమ్. అం: చూ, దూతీచతుష్టయము.

స్వయంకృషి. అం: చూ, అష్టకష్టములు.

స్వయంగ్రాహము. అం: చూ, దానపంచకము.

స్వయంత్ర్తుఁడు. సం. వి. అ. పుం: చూ, పుత్రులు. 1—౧౨.

స్వయంపాకము. సం. వి. అ. న. 1. ఒకపూఁట బత్తెము; 2. వ్రతాదులయందు బ్రాహ్మణులకొసంగు వంటపదార్థము; 3. నియమస్థులగు బ్రాహ్మణులకొసంగు వంటపదార్థము.

స్వయంభువు. సం. వి. ఉ. పుం. (రూ—స్వభువు-స్వర్భువు.) 1: చూ, బ్రహ్మ. 1; 2: చూ, విష్ణువు; 3: చూ, శివుఁడు; 4: చూ, మన్మథుఁడు; 5. ఒకానొక బుద్ధశిష్యుఁడు: చూ, బుద్ధుఁడు.

స్వయంవర. సం. వి ఆ. స్త్రీ. పతింవర, వర్యా: చూ, స్త్రీ.

స్వయంవరము. సం. వి. అం. పుం. తనంతట మగని వరించుట.

స్వరజతులు. అం. (సర్వజితులు): చూ, స్వరము. 2.

స్వరనేత్రాంగవికారము. అం: చూ, భక్తులు.
స్వరవర్తనము. అం. సామవేదము: చూ, సామము.
స్వరము. సం. వి. అ. పుం. = సారము. (ఉచ్చరింపఁబడునది). 1. అకారాది హకారాంతము దనుక యేఁబదిరెండక్షరములును స్వరములగు సంబంధులు అనఁబడును; 2. స్వరము వెలువడఁగానె ధ్వని (శబ్దము) పుట్టును. ధ్వని=స్వరము (అని కొందఱు). (రెంటికిని అవినాభావసంబంధము.): అభిలావము, ఆరభటము - ఆర్భటము - (ఆర్భాటము), ఆరభటి - ఆర్భటి, ఆరవము - ఆరావము, కాహళము, కుణిందము, కుహరితము, కుప్రిష్టము, క్ష్వేడము, గరుత్తు, ఘు, ఘోష, జ, ఝు, ట, త, థ, ణ, ధ్వని, ధ్వానము, న, నదము - నాదము, నినదము - నినాదము, నిర్ఘోషము, నిర్హ్రాదము - నిర్హ్రాదము, నిస్వనము - నిస్వానము, పదము, పరిఘోషము, పాటకము, మృదంగము, రణనము, రణము, రణితము, రవము, రసితము, రాసము, వాద్యము, విరావము, విశ్వకద్రువు, శబ్దము, సంరావము, స్వనము - స్వానము. (తె. వి): — అలికిడి - అలుకుడు - అల్కుడు, (అళుకుడు), ఆర్భాటము, ఉరవలి, ఉలి, ఉలివు - ఉలివుడు - ఉలుకుడు, ఓఱు, కరిందు, గందరగోళము - గండ్రగోళము, గలిబిలి, గొలగొల, చేప్పుడు (చేప్డు), చిమ్మటబుఱ్ఱు, నాదు, మ్రియి, మెడిదము, మొరవము, మొరయిక, మ్రోఁగుడు, మ్రోఁత, రంతు, రవడి - రవలి - రవళి - రవాళి - అవళి, రొద, రొదాళము, రంకె - అంకియ - అంకె, వాఁగుడు, సద్దు, సడి, సలి, వాజ్జెము - వాయిదము - వాద్దెము, వాపు, వాయింపు. తద్విశేషములు. - ౧. వేదస్వరములు: — ఉదాత్త - అనుదాత్త - స్వరితములు; ౨. గాయకదోషములులేని పాటయొక్క ఆఱువిధములున్ను. — (౧) ఘనము, (౨) రాగాలాపము, (౩) మధ్యమకాలము, (౪) పంచాగ్రియొత్తు, (౫) పల్లవి, (౬) పదకీర్తన; వర్ణములు, స్వరజతులు, రాగమాలికలు; 3. షడ్జాది. — స - రి - గ - మ - ప - ధ - ని (గ్రామము): చూ, సప్తస్వరములు; (౧) షడ్జము = షట్. నాశిక, కంఠ, వక్షః, తాలు, జిహ్వా, దంతములను నీయాఱుస్థానములందు, జము = పుట్టినది; (స) (తె) నెమిలిసారము; (౨) ఋషభము = ఋషించినది. ఎద్దుస్వరముతో సామ్యముఁబొందునది. (రి); (3) గాంధారము = గాంధారదేశములో రంజకమై పుట్టినది. (గ); (౪) మధ్యమము. క్రౌంచేసారము. క్రిందిమూఁడు శ్రుతులకు మీఁదిమూఁడు శ్రుతులకు నడిమిది. (మ); (౫) పంచమము = నాభి సముద్గతుఁడై హృత్కంఠమూర్ధ్నములందుఁ దిరిగెడు వాయువు పంచమ స్వరస్థానప్రాప్తిచేత పంచముఁడనిపించుకొనెను; దానియందుఁ బుట్టిన స్వరము పంచమము (ప); (౬) ధైవతము = ధీమంతుల సంబంధిగనుక ధైవతము. (తె) గుఱ్ఱపుసారము (ధ); (౭) నిషాదము = మనస్సు దీనయుంచు నిషాదించును. (కూయుచుండును). (ని); (మిగిలిన నీస్వరలక్షణములెల్ల మిగత విశేషాంశములయందుఁ జూడందగు); ౪: చూ, వీణ; ౫. వీణాదివాదనమునకు. — కోణము, క్వణనము - క్వణము - క్వాణము - నిక్వణము - నిక్వాణము; ౬. వీణాతంత్రులవలనఁ బుట్టెడి స్వరక్రియాభేదము: — ఉష్ణి, కుబ్జిక, కూర్మిక; ౭. సరిగమాది వర్ణసందర్భము: — అలంకారము; ౮. షడ్జస్వరములనుబలుకు రెండవది: (రెండవసారణి) అనుసారణి; ౯. సంగీతములోనిమూర్ఛాభేదము: — కాకలీయుత - కాకల్యంతరయుక్త; ౧౦. ధ్రువాదిభేదబద్ధ సంగీతమునకు. - గీతము; ౧౧. స్వరజాతులకు - షడ్జకైశిక, షడ్జోదీచ్యవ, షడ్జమధ్యమ, గాంధారోదీచ్యవ, రక్తగాంధారి, కైశికి, మధ్యమోదీచ్యవ, కర్మా

రవి, గాంధారపంచమి, ఆంధ్రి, నందయంతి; ౧౨. సప్తస్వరముల కాలపరిమాణము:— అమ్ (చూ, షడ్జము); ౧౩.- సంగీతశ్రుతి జాతివిశేషము:— ఆయత; ౧౪. సంగీతగమక భేదమునకు.— ఉత్ఫుల్లము; ౧౫. సామగానమునకు.— ఉద్గీథము; ౧౬. సంగీతవాద్యముల ధ్వనులకు.— తిక, ధిమి, కిట, ఝుణము; ౧౭. సంగీతమునకు.— కీర్తన, గమ్, గ, గంధర్వము–గాంధర్వము, గాథ, గానము, గీతము, గీతి, గేయము, చారము, రాగము, వర్ణాటము, సంగీతము. (తె) పాట; తద్వి.— అల్లోనేరెడు-అల్లోనేరెడు–అల్లోనేరెడు-అల్లోనేరేడు; ౧౮. నోటితో పాడెడు సంగీతమునకు.— అనిబద్ధవంతము; ౧౯. సంగీత సప్తస్వరసమూహమునకు.— కపాయము. (తె) పాటరవళి; ౨౦. రాగాదియుక్తముగ స్వరస్థానములయందు మెట్లుకుదుర్చుట.- మేళము; ౨౧. నృత్తగీతవాద్యముల విలంబ ద్రుతమధ్యమానములు.— ఓఘము, ఘనము, తత్వము; ౨౨. నృత్తగీతవాద్యములయందు చౌకపుకాలము:— లయప్రాణము, విలంబితము; ౨౩. క్షణమాత్రస్థాయికి:— క్షణికము; ౨౪. ఎడమచేతి తంతిమీటుకు.— తలము; ౨౫. వీణాదిస్వరమునకు.— పరిక్వణము–పరిక్వాణము. (తె) పలుకు-పల్కు; ౨౬. వెనుకటిచరణములయందలి యుద్ధము ననుసరించి సంగీతము మొదటచెప్పెడు వాద్యము.- పల్లవము; ౨౭. స్వరస్థాయి: (తె) తాయము–తాయి; ౨౮. వీణాదిచతుర్విధ వాద్యధ్వని.— వాదనము. (తె) వాదు; ౨౯. నృత్తగీతవాద్యములు సమముగానుండుటకు.— లయ; ౩౦. తానశబ్దపూర్వకమగు రాగాలాపమునకు:— తానము. (తె) తందనము. (చూ, తానములు); ౩౧. వాద్యచతుష్టయము.— తతము, ఆనద్ధము, సుషిరము, ఘనము (ఆతోద్యము=ఘనము); ౩౨. అయిదుస్వరములతోఁగూడినరాగము:- ఔడవము–ఔదవము; ౩౩. గంధర్వగానమునకు.— ఋజిగానము, గాంధర్వము; ౩౪. అనుదాత్తస్వరవిశేషమునకు.— నిహతము, ప్రచయము (చూ స్వరము ౨-౧); ౩౫. గాననాట్యయోగ్యశబ్దసంతతికి.— (తె) జతి; ౩౬ స్వరవిన్యాసభేదము.— గమకము; ౩౭. వీణకంఠము వీనియందలి ధ్వనివిశేషము.— అనేకపస్వరము. (తె) ఏనుఁగుసారము; ౩౮: చూ, స్త్రీ రాగములు; ౩౯: పురుషరాగములు:— భైరవి, మాళవి, బంగాళ, హిందోళ, రాగమంజరి, శ్రీరాగము, గౌళ, భూపాళ. (8); ౪౦. స్వరస్థానము తప్పఁజెప్పినస్వరము:- అపస్వరము; ౪౧. పల్లవివెంబడి చరణమునకు.— అనుపల్లవము, అనుపల్లవి; ౪౨. తాళమానలఘు చతుష్టయకాలము.— నిశ్శబ్దము; ౪౩. పదునాలుగు అక్షరములుగలతాళవిశేషము.- ధ్రువము; ౪౪. కొన్నిరకములతాళములు:- (చూ, రాగములు; చూ, తానములు; చూ, తాళము. 2) ఆనందభైరవి, ఆరభటి, ఆరభి, ఋషభము, కకుభము, ఘురటి, కల్యాణి, కాంభోజి, దర్బారు, ధవళము, నాట, పంచాలి–పాంచాలి. (తె) పంచే-పంజేళము, మలహరి, మోహన, వషట్కర్త, వసంతము, శంకరాభరణము, శ్రీరాగము (శ్రీ), సౌరాష్ట్రము, హిందోళము; (తె). జోవడి-జోవళి; ఇత్యాది. తద్విశేషములు.— హిందుస్థానీరాగ తాళవివరములు:— (ఇవి శీర్షికాపదములుగ చేర్పలేదు) పురుషరాగములు ౬. వీట్లలో నొక్కొక్కదానికి ఆఱుగురు భార్యలచొప్పున ౩౬. స్త్రీరాగములు పుట్టినవి. ఇందువలన "ఛేరాగ్ ఛత్తీస్

"రాగ్ని" అని చెప్పెదరు. కడమరాగములు వీటిబిడ్డలు: పురుషరాగముల పేర్లు. ౧ మేఘ్, ౨ సిరి, ౩ దీపక్, ౪ హిండోల్, ౫ మాల్ కౌస్, ౬ భైరో. తక్కిన ౩౬ రాగ్నులు వీటి భార్యలు. తక్కినవన్నియు బిడ్డలు.

— *సప్తస్వరముల పేరులు *—

| ఖరజ్ | రిగవ్ | గంధార్ | మద్ధం | పంచం | ధైవత్ | నిఖార్ |
|---|---|---|---|---|---|---|
| స | రి | గ | మ | ప | ధ | ని |
| రి | గ | మ | ప | ధ | ని | ధ |
| గ | మ | ప | ధ | ని | ధ | ప |
| మ | ప | ధ | ని | ధ | ప | మ |
| ప | ధ | ని | ధ | ప | మ | గ |
| ధ | ని | ధ | ప | మ | గ | రి |
| ని | ద | ప | మ | గ | రి | స |

ఈ స్వరములకు ఎక్కువ తక్కువలనుబట్టి వికృతమేర్పడును. ఇత్యాది — రాగకాలములు, రాగములు.—ఉదయము మొదటి జాముననపాడవలసిన రాగములు:—

బిలావల్, అలయాబిలావత్. అలయ్యా, గౌడబిడావల్, సుద్ బిలావల్, నట్ బిలావల్, సువాబిలావల్, సుగరైబిలావల్, సువా, సుగరై, కోకబ్ బిలావల్, నట్ నారాయన్, సురట్ బిలావల్, బిరారా.

రెండవజామున:—

బరారాతోడి, తోడి, హుసాతోడి, దేస్ తోడి, సింధుతోడి, సావరి, అసావరి, బరహన్స్, బరహన్స్ సారంగ్.

మూడవజామున:—

సారంగ్, సురట్ సారంగ్, జల్ సారంగ్, బన్సీసారంగ్, మద్ మావద్, గౌడ్ సారంగ్, బిందాబ్రిబన్ సారంగ్, నట్ సారంగ్.

నాలుగవజామున:—

నట్, పరకీనట్, మళలానట్, ఛయ్యా నట్, మేఘునట్, భీంపలాస్, ధనాసరీ, పూర్బి, పూర్బా, పూర్వీ, మారో, గౌడ్, గౌరి, గౌరా.

అయిదవజామున:—

సిరి, జయత్ సిరి, మార్వీ, మాల్ సిరి, గౌడ్ సిరి, సిరిపంత్, భాకా, మోహనకల్యాన్, కల్యాన్, శ్యామ్ కల్యాన్, అమీర్ కల్యాన్, అమీగ్ నట్, యమున్ కల్యాన్, యమున్, యమున్నా. దీపక్, దీపక్ కల్యాన్, కామూద్, జామూద్, కామూద్, కల్యాన్, జామూద్ కల్యాన్, కోకబ్ కల్యాన్, భూపాలీ, భూపాలీ కల్యాన్, భూప్ కల్యాన్, జంఝూటి, మేఘ జంఝూటి.

ఆఱవజామున:—

శంకర్, కాటంగడా, బహారానంద్, కాపీ, మాల్ శాసికాపీ, బేహాగ్, శంకర బేహాగ్, దూద్ బచన్ బేహాగ్, జజావంతి, ఖంమాజ్, ఖుద్ ఖంమాజ్, నాయకీ, నాయకా, పీలో, చట్ మంజరీ, కానడా, జోగీ కానడా, బూంది కానడా, జిద్దీ కానడా, మియ్యాకానడా, బాకేసిరీకానడా, బాగేశ్వరి, దర్బార్, రాష్టా, షహానా, అఢానా, కేధార్.

ఏడవజామున:—పరజ్, సోహని, లలిత్, బసంత్, మాధో, బంగాలీ, మంగల్, హిండోల్, మాల్ కౌస్, కంధార్, గంధార్.

ఎనిమిదవజామున:—

దేవ గాంధార్, దేవగిరీ, కోజరీ, రాంకలీ,

మన్ కల్లీ, పూర్ కల్లీ, నైరో, పీకరింభైరో, బేబాస్, భూపాల్, బోహార్, వేహావ్, దేవగిరి. తిరుగ నుదయాదిగా నీరాగములను పైఁజెప్పిన ప్రకారము పాడవలయును. ఇత్యాది వివరములకు సంగీతశాస్త్రమే ఆధారము; ౪౫. వ్యంగ్యప్రధానమగుశబ్దము:— ధ్వని; ౪౬. ధ్వనులభేదములు:—(౧): విష్ణుకీర్తనము, శకీర్తనము; (౨) వివాహప్రయుక్తమంగళవాద్య ధ్వని.— ప్రియవాదిక; (౩) జయజయయను ధ్వనికి — డ, ఢ, జయభేరి. (తె) జేజే; (౪) హేల. (తె) ఏల, ఏలపాట; జంపాలు, జోలపాట, జోల, జోవ; సువ్వలాల-సువ్వాల; (౫) రథము పోవునప్పటి మ్రోఁత:—(తె) తిమిమ్మి; (౬) ఊణి; (౭) ఝుంఝు; (౮): (తె) నపీరు; (౯): హుంకారము, హుంకృతి; (౧౦) గోపకుఁ ధ్వనికి:-(తె) ఈల; (౧౧) తస్కరసంకేతధ్వనికి.—(తె) ఈల, ఊల-ఊళ; (౧౨): కంఠధ్వని, కంఠము, కఠము, కుహరము, రవము, రావము, శారీరము. (తె) అఱపు-అఱుపు-అఱుపు, ఎలుఁగు-ఎల్గు-ఎలువు, కూఁత, గొంతు-గొంతుక, రవము, సారము; (౧౩) ఆర్తకంఠధ్వని, ఉత్క్రోశము, ఉద్ఘోషము, క్రందనము. (తె వ.) అఱపు-అఱుపు-అరుపు-అఱుపు-అర్పు, ఏడుపు-ఏడ్పు-ఏలుపు, కుయి-కుయ్యి-కూయి, కూఁక, కూఁత, మొఱ-మొఱ్ఱ-మొఱపు, మొఱుఁగు-మొఱువు, వంత, వాపోక; (౧౪): ప్రణాదము. (తె) అరుపు-అఱుపు-అర్పు-అఱ్ఱాపు, బొబ్బ, బొబ్బరింత, బొబ్బాటము, బొబ్బట్టు; (౧౫) అవ్యక్త మధురధ్వనికి.—ఆరజము, కందళము, కలకంఠము, కల-కళ, కలము, కలధ్వని, కాకలి, కాహళము, గుంజ, గుండకము, రాసము; (౧౬): విపరీతధ్వని:— (తె) ఆలగోడు-గాలగోడు, పెడబొబ్బ, మొత్తుకోళ్లు; (౧౭) పెద్దకూఁతకు.—ఉన్నాదము. (తె) అరపు-అఱపు-అఱుపు-అఱుపు, కేక, ఱంకె; (౧౮): అవ్యక్తనిస్వనము, మర్మరము. (తె) మొఱమొఱ; (౧౯): సల్లాపము. (తె) గుసగుస; (౨౦) మరణసమయపుకేక.—(తె) కడకేక; (౨౧): గద్గదస్వరము, గద్గదిక (గాద్గద్యము). (తె) ఈరెలుఁగు, క్కీఁచే, కుఱుచే, గగ్గు, గువ్వకుత్తిక, డగ్గుత్తిక, తీఁగయెలుఁగు-(తీఁగెయెలుఁగు); (౨౨): ఆలప్తి-ఆలాప్తి, ఆలాత్రి, ఆలాపనము-ఆలాపము. (తె) ఆలతి-ఆలత్తి, ఆళరి, ఓడము; (౨౩): గుంపునపుట్టిన పెద్దమ్రోఁతకు.—ఆరజము, కలకలము-కళకళము, కోలాహలము, సంరావము. (తె) అఁబలము-అలబలము, ఎలగోలు, కోలకోల, గొలకు-గొలగొల-గొల్లు, రచ్చ, రొద, రొదాళము, ఱంతు, ఱంపు, వాళావళి; (౨౪) వనికిరాని కేక.—(తె) గాలికేక; (౨౫) పొలిమేరకేక:—(తె) పొలికేక; (౨౬) అనురాగపుకేక:—ప్రణాదము; (౨౭) ధ్వనియుక్తరోదనము:—క్రందనము, క్రందితము, క్రుష్టము; (౨౮): తలలోనుండి రాఁబడిన మ్రోఁతకు:—తారము; (౨౯) యుద్ధమందలి భటులమ్రోఁత:—ఆడంబరము, క్రందనము. (తె) పెడబొబ్బ; (౩౦) సైన్యముచెదరినప్పటి శబ్దము:—ఆకులము, ఖంజము; (౩౧) యుద్ధారంభవాద్యధ్వని:—అర్ధతూరము, పటహము; (౩౨) గోపకులగీతము:—గీణి; (౩౩): అశరీరవాక్కు, అశరీరవాణి, అశరీరి, ఆకాశవాణి; (౩౪) గునగునధ్వని.—గుంజనము, గుంజితము; (౩౫) ఇంపుకంఠముచేయుడు:—(తె) చీమచిటుకు; (౩౬) గద్గదకంఠసాధుధ్వని:—(తె) గొణుగు; (౩౭) నిద్రయందలి ధ్వని:—(తె) గుఱక-గుఱుక-

గుఱు-గుఱ్ఱు; (38) ఓర్వలేనితనమున ఆడి పోనుకొనుటకు.—అఘోషణము. (తె) ఉష్పత, గుపారు, గోరవ, రంతు, రట్టడి, రట్టు, రద్ది, రద్దు, రవ-రవ్వ, సడి; (39); (తె) కన్రిందు, గజిబిజి, గలిబిలి, గసిబిసి, దొందడి, దొమ్మి, రాటము, రాటు, అొచ్చో, సందడి; (40): (తె) కొండపలుకు; (41) వింటినారి మ్రోఁతకు.—అస్యాకరణము, కింజ, గుణధ్వని, టంకారము, ధనుష్టంకారము, విష్ఫారము-విస్ఫారము, శింజ; (42) (తె) లాలి, లాలిపాట; (43); చెక్కలగాఁచేప్పుడు:—(తె) రింగు-టింగు, ఉవ్వు; (44) నడిమి వ్రేలిని పెద్ద వ్రేలితోఁ గూర్చి ధ్వనింపఁజేయుట:—(తె) చిటిక-చిటికె, చిటికరింత, నెటిక-నెట్టిక, వ్రేల్నుడి; (45) క్ష్విత, త్పటము, తృటి. (తె) చిటిక-చిటికె, చిటికరింత, నెటిక-నెట్టిక, వ్రేల్నుడి; (46) కళావిహీనముగ చేప్పుడు:—(తె) డిబ్బు; (47) బాజోలధ్వనికి—(తె) బాజోలు; (48): (తె) సంతగోల; (49) పీడాధ్వనికి.—కుంథనము. (తె) ములుగు-మూలుగు-మూల్గు; (50) అచేతనవస్తువులొకదానితో నొకటి తాఁకుటచే కలుగుధ్వని:—(తె) చేప్పుడు-చేప్పు; (51) వానచేప్పుడు:—ఘర్ఘరము. (తె) ఓలు; (52) గర్భము మ్రోఁత:—ఘర్ఘరము; (53) వాద్యముల చేప్పుడు:—ఝుంకృతము, తూర్యము; (54) జలవిహృత సముద్ధ్వని:—(తె) ఓల; (55): కిలకిల, హర్షస్వనము; (56) తనధ్వనికి.—ఆత్మఘోషము; (57): వీరహుంకారము. (తె) ఊటుము; (58): గాలివిసరుట వలన గలిగినధ్వనికి.-ఝూత్కృతము; (59): పశుపక్ష్యాదుల అక్కఱచేప్పుడు:— ఛ, (తె): రివ్వు-తివ్వు; (60) నివ్వలమంట మ్రోఁతకు.—ఛటితము. (తె) చిటచిట; (61) (వీణ) మ్రోగినది:—రణితము; (62) కీళ్లు విఱుగుటచేఁ గలుగు ధ్వనికి.—(తె) మెటికె; (63) ఆకులు లోనగువాని మ్రోఁతకు:—మర్మరము. (తె) మొఱమొఱ; (64) చెడుగుడు ఆటకూఁతకు:—(తె) బిల్లి (అల్లి బిల్లి చెంగలనాత్); (65) అలంకరణములధ్వనికి.—ఆఘ్రాతము, జీన, భూషణధ్వని, శింజితము; (తె) నగలచేప్పుడు; (66) అందెలచేప్పుడుకు.—ఝుంకృతము, శింజ; (67) గొలుసులధ్వనికి:—ఖణత్కృతము; (68) ఆయుధధ్వనికి —ఖణత్కృతము; (69): (తె) గొనబుపాట, సంచేపాట; (70) భూగర్జనము:—గాతువు; (71) శబ్దమాత్రమునకు.—కాహళము; (72) పాముఱోఁ క్కికి.—కాహళము; (73) చెడ్డపినధ్వనికి:—కాగ్రస్వరము; (74) బిడ్డలు నిద్ర లేచేనప్పటి మూలుగు:—(తె) కిదుకు; (75) బిడ్డలమూలుగు:—(తె) కిదుకు; (76) ఘంటచేప్పుడుకు.—ణ; (77) ఘంట అను రాగమునకు—ఘంట; (78) మద్దల లోనగువాని మ్రోఁతకు—ఆతంకము, ఆనకము, గుండిలము, గుందలము. (తె) అరపు-అఱపు-అఱుపు-ఆఱుపు; (79) మురజధ్వనికి:—మార్జన; (80) కొమ్ము వాద్యమునకు:—(తె) సింగినాదము; (81) చర్మాచ్ఛాదితమర్దలాది వాద్యమునకు.-అవనద్ధము; (చూ, వీణె ౫౦); (82) సుషిరవాద్యమునకు.—ఆహికము, సుషిరము. (తె) తార; (83) మృదంగరవము:—(తె) దిందిం-దిమిదిమి-దిముకు; (84) డిండిమధ్వనికి.—డిండి; (85) పిల్లనఁగ్రోవిలోనగువాని ధ్వనికి.— జమ్, జంజని, త; (86) తిప్పెట ధ్వనికి.—టింటి; (87) ఢక్కాధ్వనికి.—టట్టరి; (88) లంపావాద్యమునకు.—టట్టరి; (89) మృగపక్ష్యాదులధ్వనికి.—రుతము, రుతి, వాశితము-వాసితము; (90) కంచుమ్రోఁ

తకు.—(తె) కంగు; (91) మృదంగాదివాద్యమునకు.—వాద్యము. (తె) వాఁజైము—వాద్దెము, వాపు, వాయింపు, వాయిదము (చూ, స్వరము. 2-౭౮); (92) శంబనాదమునకు.—పణవము, పాఁగణము; (93) అతిదారుణధ్వనికి.—కఁందు, గోల, రంపి, రంపు—అంపు-అంతు-అంతె, రద్ది; (94) మాఱుమోఁతకు.—ప్రతిధ్వానము, ప్రతిశ్రుతి. (తె) మఱుమోఁత—మాఱుమోఁత; (95): (తె) పెళపెళ; (96) ప్లుతస్వరమునకు —ప్లవము, ప్లుతము; (97) ధ్వన్యనుకరణములకు: చూ, హూహూ; (98): మంద్రము; (99) అవ్యక్తవాక్యము:—కాహళము; (100): చూ, తానములు; (101) డిండిమధ్వని:—గురుమర్దలము; (102) తుపాకి పిరంగిలోనగువాని ధ్వనికి.—(తె) ఆగాదు; (103) కుండమీఁది వాద్యమునకు.-కమఠము; కరతాళధ్వనులకు:-(104): కరతాళము, కరతాళి, కర్ది, కలంకప, కులక్కము, తాలమర్దలము; (105) శంఖధ్వనికి.-కాంబవకము, ఖమ్, డ, శంప-సంప; (106) ఝర్ఝరమను ధ్వనికి.—ఝ; (107) చూ, జన్యతాళములు; (108) చెడ్డఝిల్లీరవమునకు:-కఝిల్లీరవము; (109) కటంబధ్వనికి — కటంబము; (110): (తె) గొబ్బిళ్లు; (111) దుఃఖభయాదులచేతగలుగు ధ్వని వికారమునకు.—కాకువు; (112) స్వరములలోని భేదములు—కల్లత్వము, ఘర్ఘరి; (113); పక్షిధ్వనికి.—కూజితము. (తె) పలుకు-పల్కు; (114): గంభీరము; (115): సింహగర్జనము, సింహనాదము, క్ష్వేడ, క్ష్వేడితము, క్ష్వేళ, క్ష్వేళితము, గర్జ, చుక్కారము. (తె) బొబ్బ, సింగరవళి-సింగావళి; (116) ఏనుఁగు ధ్వనికి.—కరిగర్జితము, గర్జ, గర్జము-గర్జితము, ఘీంకారము—ఘీంకృతము-ఘీంకృతి, బృంహితము. (తె) కీఁక-గీఁక; (117) ఏనుఁగు చెడ్డకూఁతకు.— కాఫీట్కారము; (118) వ్యాఘ్రిధ్వనికి.—గర్జ. (తె) కోటరింపు, బిబ్బరింత; (119) నక్కకూఁతకు.—(తె) ఊల-ఊళ; (120) కుక్కకూఁతకు.—బుక్కనము, భషణము. (తె) బొంయి—బొయ్యి, మొఱఁగు-మొఱుఁగు-మొఱుఁగుడు-మొఱువు; (121): (తె) మేఁకసారము; (122) పందికూఁతకు:—ఘుర్ఘురము. (తె) గుటగుట, గురగర; (123): వీణ, కంఠము పీని యందుఁబుట్టిన ధ్వనికి —అనేకపస్వరము. (తె) ఆఁబోతుసారము, ఏనుఁగు సారము; (124): ఆవులు లోనగువాని ధ్వనికి.—అంభ, చిత్కృతము. (తె) అంబా-అంబే—ఉంబ; (125) కోతిధ్వనికి.—(తె) ఉఱ్ఱు; (126): ఉత్పాలము, కాకధ్వని. (తె) కాకిహూఁత, కావు; (127) నెమలికూఁతకు — కకూజితము, కేక. (తె) కిప, కీక, కేకిప, కేప; (128) హంసధ్వనికి.—కేఁకృతము; (129) కొంగధ్వనికి.—కేఁకృతము; (130) కోకిలధ్వనికి.—కుహూరితము - కూహూరితము, కుహువు - కుహూవు, కోకిలము, మణితము-మాణితము; (131) గుడ్లగూబధ్వనికి.—(తె) గూండ్రి; (132) తుమ్మెద ధ్వని:—ఝర్ఝక, గుంజనము, గుంజితము, ఝుంకారము-ఝుంకృతి; (133) ఈలపురుగు ధ్వనికి:—ఝిల్లి-ఝిల్లిక. (తె) ఈల, చివ్వటబుఱ్ఱు, జీఱ్ఱు; (134) రతికాలమునందలి గళరవము:—కుహూరితము, కూజితము, మణితము—మాణితము, రతికూజితము. (అవ్య) అనో. (తె) కూకిపలుకు, గిలుకుపలుకు, పావురపుఁబల్కు - పావురాఁబల్కు, మెలిఁగుక్క, రవపలుకు, లోఁగుక్క, వెలిగుక్క. తద్వి —౧ పూ(ప్రూ)త్కృతి: శ్వసితము. (చూ, రతిధ్వనులు); (135) పక్షికంఠరవమునకు.— అరపు-అఱపు-అఱపు—

అఱుపు, రంకె-ఱంకియ-ఱంకె; (136) గుఱ్ఱపుకూఁతకు.— హేష. (తె) సకిలింత-సకిలింత-సకిలిఁపు; (137) గాడిదకూఁతకు.— ఈ. (తె) ఓండ్రు; (138) సప్తస్వరముల యొక్క ఆరోహణావరోహణములు :-మూర్ఛన; (139) సంగీతమునందలి గీత:-వర్ణము; (140) పంచమస్వరధ్వని:-వసంతదూతము; (141) నాదములు.—(౧) ప్రీణననాదము; (౨): (చూ, అట. 3;):అటతాళము; (142) వీణకరపకు.—సేవకము (చూ, వీణాదండము); (143) వజ్రిఘుట్టనవలని ధ్వనికి.— వజ్రనిర్ఘోషము (వజ్రనిష్పేషము); (144) వజ్రిధ్వనికి:-మృష్టధ్వని;(145) కీఁచుకీఁచుమను ధ్వనికి.—సకిన; (146) చేలిబాధకు:— పీతర్కరము; (౧౪౭) అఱుస్వరముల రాగముకు.— షాడవము; 3. ముక్కుగాలి: చూ, వాయువు;అం.4: చూ, లక్షణాంగములు.(పురుషునకు.—"హంసస్వరమైన ధన్యుఁడగు. మేఘస్వరమైన రాజగు. భృంగస్వరమైన భోగియగు. క్రౌంచస్వరమైన భాగ్యవంతుఁడగు దుందుభిస్వరమైన సౌఖ్యమగు. ఖరస్వరమైన నిర్ధనుండగు. కాకస్వరమైన పాపకర్ముండగు."); 5: చూ, స్త్రీలక్షణాంగములు. (స్త్రీకి.—"తీక్ష్ణము, అతిగంభీరము, అతిమధురములయినను, కోవెల-హంస-వీణాస్వరములఁబోలినను అష్టపుత్రులఁగనును. మృదువైనపుత్రవతియగు. కొంగ-చక్రవాకము-కోకిలధ్వనులఁ బోలినను రమ్యమైనను ధనధాన్యవృద్ధియగు. గాడిదధ్వనిఁబోలిన బిడ్డలు లేనిదై విధవయగు."); 6: చూ, అష్టాదశపదార్థములు. [గ్రంథములు.

స్వరమేళకళానిధి. అం: చూ, భరతశాస్త్ర

స్వరయతులు. అం: చూ, యతులు.

స్వరరాగసుధారసము. అం: చూ, భరతశాస్త్ర గ్రంథములు.

స్వరవల్లి. అం: చూ, భిన్నషడ్జకజభాషలు.

స్వరశాస్త్రము. అం. కుడియెడమ ముక్కురంధ్రములవెడలు వాయువు సూర్య చంద్ర స్వరములను పేరుఁజెంది సకలశుభాశుభములను లోకవ్యవహారములను జీవితకాలమును దెలియఁజేయునది, ప్రత్యక్ష ప్రమాణము: చూ, శాస్త్రములు.

స్వరాటు. సం వి. ట్. పుం. రూ—స్వరాట్టు. 1. బ్రహ్మ: చూ, హంసుఁడు; 2. ఇంద్రుఁడు: చూ, సహస్రాక్షుఁడు.

స్వరాట్టు. సం. వి. ట్. పుం.—పై.—

స్వరితము. అం: చూ, వేదస్వరములు.

స్వరువు. సం. వి. ఉ. పుం. 1. వజ్రాయుధము: చూ, బాణము. 1; 2. యూపస్తంభము యొక్క తునుక; 3 అమ్ము: చూ, బాణము. 1; 4. జేన్నము: చూ, యజ్ఞము; విణ. 5: చూ, స్వతంత్రము.

స్వరూపము. సం. వి. అ. న: (చూ, స్వభావము.) తద్వి.—రూపునకు.—ఆకారము, ఆకృతి, తత్వము, తలము, బలము, రూపకము, రూపము, స్వభావము, (అవ్య) అనో. (తె) అడ, ఉరువు-ఉఱువు, నిలువు,పాడ, పాడవు, పోలిక-పోల్కి, పొడగు-పొడుగు-పొడువు-ఠీవు.

స్వర్గము. సం. వి. అ. పుం. (లెస్సగా సుఖము నుభవింపఁబడునది). 1: అక్షయలోకము, అభ్రము, అపరోధము, అపరోహము, ఇంద్రలోకము, ఇడ, ఊర్ధ్వలోకము, ఋభుక్షకారము, కులకము, ఖంబు, ఖమ్, ఖోలకము, గులూచి, గోవు, గైతి, జీవంతిక, త్రిదశాలయము, త్రిదివము, త్రివిష్టపము, దివము, దేవలోకము, నభము, నాకము, పరమపదము, మోక్షము, వాసుకము, వైకుంఠము, శమ్ సురలోకము, సైరిభము, స్వర్లోకము. (తె. ప) జేజేపట్టు-జేజేలపట్టు - జేజేలపాలెము,

దివము, దివి, త్రివిష్టపోలు,-విష్ణుపోలు-కన్వోలు, వినువలను-విన్వలను, వెల్లజెక్కు-పామిడెంకి, వెల్లకొల్లలవీడు, వేగంటికచ్చేరి, వేల్పుటెంకి; ౨. ముక్తి, శ్వశ్రేయసము: చూ, మోక్షము. 1; అం. 3: చూ, లోకములు.

స్వర్గలోకమునుబొందు జాతకుఁడు. పా. ౧. లగ్నాధిపతి గురునితోఁ గలిసినను, గురుక్షేత్రమందున్నను (పాపగ్రహసంబంధము లేకుండ నుండవలెను). ౨ వ్యయాధిపతివ్యయమందుండి శుభునితో సంబంధముండినను, 3 ఉచ్చగ్రహముతోఁ గలిసినను, ౪ వ్యయమందు శుభులున్నను, ౫ శుభగ్రహములచే వ్యయస్థానము చూడఁబడినను స్వర్గలోకమును బొందుదురు.

స్వర్గస్థుఁడు. సం. వి. అ. పుం. స్వర్గమును బొందినవాఁడు తద్వి:— చూ, పరేతుఁడు.

స్వర్గారోహణపర్వము. అం: చూ, పర్వములు.

స్వర్ణకారుఁడు. సం. వి. అ. పుం.=సొన్నారి. (బంగారుఁ జేయువాఁడు) అగసాలె: కనకకారుఁడు, కలాదుఁడు, కలాపుఁడు, కొటిలుకుఁడు, గాంజికుఁడు, నాడింధముఁడు, పంచాణుఁడు, పశ్యతోహరుఁడు, మూషకుఁడు, రుక్మకారకుఁడు, లోహకారుఁడు హేమకారుఁడు. (తె. వ) అగసాలె, ఓజే, కంసాలి_కమసాలి_కమసాలె, కమ్మటీఁడు, కొమ్మకాఁడు, పటకారుఁడు, పారసి, పొన్నారి, సొన్నారి. తద్వి.—౧. దేవశిల్పికి.—మయుఁడు, విశ్వకర్మ-విశ్వకర్ముఁడు; ౨. శిల్పికులప్రధానుఁడు:-కారుకుఁడు, కులకుఁడు, కులికుఁడు, కులుఁడు, కులశ్రేష్ఠి-కులశ్రేష్ఠుఁడు, కృత్స్నవు, శిల్పి, శిల్పకారి-శిల్పకారుఁడు, శ్రేష్ఠి; 3. వడ్లవానికి.-కారుకుఁడు, కారువు, కాష్ఠతక్షకుఁడు (కాష్ఠతక్షుఁడు), కూటతక్షుఁడు, గ్రామతక్షుఁడు, తక్షకుఁడు-తక్షుఁడు, త్వష్ట-(త్వష్ట్రి), రథకారుఁడు, వర్ధకి, శిల్పి, సూత్రుఁడు, సూత్రధారుఁడు. (తె. వ) వడ్రంగి_వడ్ల-వడ్లంగి, వడ్లబత్తుఁడు, వడ్లవాఁడు; ౪. కంచేరికి.—కాంస్యకారుఁడు, కాముంధమి, కారంధమి. (తె) కంచేరవాఁడు, కంచేరి; ౫ రాగిపనివాఁడు:— తామ్రకుట్టకుఁడు, శౌల్బికుఁడు; ౬. ఇనుము చేయువాఁడు:-వ్యోమకారుఁడు; ౭. కమ్మరి:_వ్యోమకారుఁడు; ౮. (తె) ముద్దకమ్మరి; ౯. సమానమైన శిల్పులవరుసకు:-శ్రేణి; ౧౦: (తె) తట్రి-తట్టురి; ౧౧: చూ, శిల్పులు.

స్వర్ణకేతకి. సం. వి. ఈ. స్త్రీ: కామఖడ్గదళ. (తె) బంగరుమొగలి* (చూ, మొగలి.)

స్వర్ణక్షీరి. సం. వి. ఈ. స్త్రీ. 1: కంకుష్ఠ, కషిణి, పటుపర్ణి, పయస్య, హిమావతి_హైమవతి. (తె) రెడ్డివారినాఁబ్రాలు; 2: అవ్యాజపత్రిక, క్షేమము, క్షేమిని, గజకర్ణము, గజహాసకము, చండ, చోదనహారి, దుష్పత్రము, ధనహారి, బృహచ్ఛదము (తె) బలురక్కసి-బలురక్కస*. తద్వి:-చూ, రక్కస.

స్వర్ణక్షీరిణి. సం. వి. ఈ. స్త్రీ: కంకుష్ఠము, కంకుష్ఠరేచని, కాకకృష్ణ, కృష్ణగంధ, క్షీరిణి*.

స్వర్ణగృహము. సం. వి. అ. న. బంగారపుటిల్లు: చూ, సదనము. 1.

స్వర్ణది. సం. వి. ఈ. స్త్రీ. ఆకాశగంగ: చూ, నది: చూ, స్రోఢిని. తద్వి.—౧. పరిఖకు—ఆఖాతము, అఘాటము, ఖాతకము, ఖాతిభువు, ఖేయము, ఘాతిక, గడము, దేవఖాతకము, ప్రతికూపము, పరిఖ. (తె) అగడిత-అగడ్త, కందకము, దవంతి; ౨. ఏఱునకు.—నేత్రము, పయస్విని, పావని, భగవతి, భూమిజ; 3. చిన్నకాలువకు.—(తె) పరి, బోదియ-బోద; ౪. నదిలోనుంచి చీలిపోయిన పాయకు:-(తె) పాయ; ౫. క్షీరనదికి.—(తె) పాలేఱు; ౬. పినాకినియనునదికి.—

పినాకిని. (తె) పెన్న: ౭. ఏటిసంపుననకు.—చక్రిణి, పుటభేదము; ౮. నర్మదానదికి:-పూర్వగంగ; ౯. ఆకాశగంగకు.—(తె) పాడుగుమడుగు; ౧౦. కాలువకు.—సారణి; ౧౧ పశ్చిమసముద్రమునందుండు వరుణోద్యానవదికి. —బుసి; ౧౨. పాతాళమునందగియేఱుకు.—భోగవతి; ౧౩. నదీప్రాంతమునకు:-చూ, మడి. 1; ౧౪. మాలికయనునదికి.—మాలిక; ౧౫. నదులపేర్లు·—రహస్య, రాక. ఇత్యాది. (చూ, నది.)

స్వర్ణదీధితి. సం. వి.ఇ పుం.అగ్ని: చూ, వహ్ని.1

స్వర్ణధేనువు. అం: చూ, దానము. 2

స్వర్ణపక్షుఁడు. సం. వి.అ.పుం.గరుడుఁడు: చూ, హరివాహనుఁడు. [చూ, శర్కరాంకము

స్వర్ణపారేవతము: సం. వి అ న పెద్దయీత*:

స్వర్ణపుష్పి. సం వి. ఈ. (స్త్రీ): ఉత్క్రాంత, సిత వీర్య: (తె) జిలుగు-(జిల్గు)-జీలుగు, బెండు, బొందుబెండు. *. [చూ, విష్ణువు. 1.

స్వర్ణబిందువు. సం. వి. ఉ. పుం. వెన్నుఁడు:

స్వర్ణము. సం. వి. అ. న. 1.=సొన్నము-సొన్న. బంగారు: చూ, లోహము. 1; పుం. 2. ఎఱ్ఱపెంకాయచెట్టు: చూ, స్కంధఫలము; అం. 3: చూ, దానము. 2.

స్వర్ణరంజకము. అం: చూ, అపఁయుక్తహస్తములు.

స్వర్ణవల్లి. సం. వి. ఈ. (స్త్రీ): కనకప్రభ, కాకాండి, కాకాండోల, కుంగని, మహాజ్యోతిష్మతి. (తె) పెద్దమానేరు; తద్వి.—మానేరుకు:-అగ్నిభాస, అనలప్రభ, ఆరోహము, కంగుణి, కంగునీపత్రి, కటభి, కాకవల్లరి, కాకాయువు, కింశుక, క్షుద్రశ్యామ, జ్యోతిర్లత, జ్యోతిష్మతి, జ్యోతిష్కాస. జ్యోతిష్మా, పణ్యా, పారావతాంఘ్రి, లత. (తె) ఉప్పరింత-ఉప్పిరింత, ఎక్కుడుఁదీఁగ, మానెరు-మానేరు, మెఱపుఁదీఁగ.

స్వర్ణస్తేయము. అం: చూ, మహాపాతకములు.

స్వర్భానువు. సం. వి. ఉ. పుం. రాహుగ్రహము: చూ, రాహువు. 1. తద్వి.—కేతువునకు.—విశేచము: చూ, రాహువు. 1.

స్వర్లోకము. సం. వి. అ. పుం: చూ, స్వర్గము.

స్వర్వైద్యులు. అం: అశ్వినీదేవతలు (అశ్వులు)

స్వల్పదురాలభ. సం. వి. ఆ. (స్త్రీ). పిన్నరేగటిదూలి*: కటు, కరభప్రియ, కరభాదని, కషాయ, కునాశకము, క్షుద్రదురాలభ, క్షుద్రదుస్పర్శ, గంధారి, చోదని, యవాసము, యాసము, యాసలత.*. తద్వి.—రేగడిమాలకు.— చూ, సముద్రాంత *.

స్వల్పము. సం.వి.అ కొంచెము: అంశువు,అణిమ, అణీయము, అణువు,అత్యల్పము,అనుబంధము, అల్పము, అల్పిష్ఠము, అల్పీయము, ఇయాంసము, కణము, కణిక-కణికము, కణిష్ఠము, కణీకము,కణీయము-కణీయము-కణీయస్సు, కాకము, కీలము, కృశము, క్షుద్రము, క్షుల్లకము, ఖర్వము, ఖలము, ఖుల్లకము,గంధము, ఛాయ, టుంటకము, తనువు, త్రుటి,దరము, నఞ్ (నఞ్), మాత్ర, రేణువు, లవము, లేశము, వీచి, సంగ్రహము, సూక్ష్మము, సూచపదము, స్తోకము. (అవ్య) అ, అప, అజ్, ఆత్, ఈషత్, కిమ్, కించిత్తు, కు. (తె) అన్నువ, అలక-అలకన. అల్కన, అలఁతి, అలుకము, అసదు, ఈరు, ఉలి, ఎల, ఒకింత-ఒక్కింత, కన్నియ-కన్నె, కసిడి, కాకి, కింగిరి, కిముడు, కీసర, కుఱుకుఱు,కొంచియము- కొంచెము, కొద్ది, గిటగిటన, గుడిగుడి,గుల్ల,గొఱకము,గోరు,చికిచికి,చిటి-చిట్టి, చిడిపి, చిదుగు, చిదుర, చిన-చిన్న, చిని-చిన్ని, చిప్పు, చిఱి-చిఱు-చిఱుత,చిలిపి-చిలుప, చెణుకు, చెనఁటి-చెన్నఁటి, జినుఁగు, జిలిబిలి, జిలుఁగు జిల్గు, తిక్కఱ, తని, తిబిరి, తుక్కు, తోడెము, తోటము, దడి

ముము-దడిపము-దళిపము, నజ్జు, నఱుజో, నలి, నీరు, నులి, నుసి, పిన-పిన్న, పిల్ల, పిసరు, పున్న, పులు-పుల్లు, పొటిపాటి, బుచ్చి, బుడిబుడిపి, బొమ్మ, మాటి, రవ, లిగాడు, శే, శేత, వాడ, సన్నదనము, సన్నవ, సన్నము, సయికము-సైకము, సలికము, హాల్కా. తద్వి.—౧. బహుస్వల్పమునకు— కనిష్ఠము, క్షోదిష్ఠము, క్షోదీయము, లేశము. (తె) (అవ్య) ఇంచించుక, ఇంచుక, ఇంచుకంత, ఇనుమంత, ఒకింత, కొంత, కీస, కొండిక-కొండొక, చిటిపొటి, చిన-చిన్న, చిని-చిన్ని, గోరంత, బుల్లి, రవంత-రవ్వంత, రొంత, వడవడ, నంత, ౨. కొంచెముకొంచెమునకు — (అవ్య) అల్పశము (తె) చిలువచిలువ, కొద్దికొద్ది, పొటిపాటి, మొటిమొటి.

స్వవశమగు. మి. అ. క్రి: (తె) సముతువడు: చూ, లోబడు. [చూ, స్వాధీనము.

స్వవశము. సం. వి అ. న. తనవశము, వశము:

స్వవాసిని. సం. వి. ఈ. స్త్రీ. రూ. సువాసిని. 1. పేరంటాలు: చూ, స్త్రీ; 2. పుట్టినింట నుండెడి యాఁడుది: చూ, స్త్రీ.

స్వవిరము. అం: చూ, సంచారి వర్ణగతాలంకారములు. [చూ, సహోదరి.

స్వస. సం. వి. ఋ. స్త్రీ. తోడఁబుట్టినది:

స్వసమ్ముఖతలము. అం: చూ, హస్తపరిచారములు.

స్వస్తి. సం. ఇ. (అవ్య): చూ, శుభము.

స్వస్తికచ్ఛము. అం: చూ, సంయుతహస్తములు.

స్వస్తికము. సం. వి. అ. పుం. 1. తూర్పువాకిలిగల రాజగృహము: చూ, సదనము. 1; 2. చేనుకము: చూ, సృతి. 1 (మార్గము.1); 3. భుజబంధవిశేషము; 4. మంగళవస్తువు; 5. ముగ్ధస్త్రీ హస్త విన్యాసవిశేషము; 6. పాముయొక్క పడగమీఁదివంపయిన మొవలుగల యర్ధచంద్రాకారపు నల్లని రేఖ; అం. 7. చూ, అసంయుతహస్తములు; 8 చూ, బహుపరిచారములు; 9: చూ. ఏకవింశతిస్థానకములు; 10: చూ, సంయుతహస్తములు.

స్వస్తికరేచితము. అం: చూ, కరణములు.

స్వస్తికాసనము. అం: చూ, ఆసనములు. (ఆసనవిశేషము=చటువు.) తద్వి.—బ్రహ్మాసనము.

స్వస్తిముఖము. సం. వి. అ. పుం. జోడు; చూ, లేఖ. 3.

స్వస్తిముఖుఁడు. సం. వి. అ పుం. 1. బ్రాహ్మణుఁడు: అగ్నిముఖుఁడు, అగ్రజన్ముఁడు, అగ్రజుఁడు, అధర్వుఁడు, ఏకకుఁడు, కుతపుఁడు, ఘోషయిత్నువు, చతుష్పథుఁడు, ద్విజన్ముఁడు, ద్విజాతి, ద్విజుఁడు, ధరామరుఁడు, బాడబుఁడు, బ్రహ్మ, బ్రాహ్మణుఁడు, భూదేవుఁడు, భూసురుఁడు, వచత్నువు, విప్రుఁడు, శమీగర్భుఁడు, షట్కర్ముఁడు. (తె. వ):—ఇరుఁబుట్టువు, తొలుజాతివాఁడు, దుగపుట్టుక, నేలవేలుపు, పాఱుఁడు, వాఱువాఁడు, పుడమివేలుపు, బాఁపఁడు, బాఁపనయ్య, బాఁపనవాఁడు, బాఁపనుఁడు, బొమ్మఁడు, మిన్కుఁచేదువరి. తద్విశేషములు—౧. వేదాధ్యయన సంపన్నుఁడు:— వైదికుఁడు, గృత్సుఁడు, శ్రోత్రియుఁడు, షట్కర్ముఁడు; ౨. భుజింపుమేండఁగా ముందులేచిపోయిన బ్రాహ్మణుఁడు :—బ్రహ్మఘ్నుఁడు; ౩. జాతిమాత్రోపజీవియైన బ్రాహ్మణుఁడు:—బ్రాహ్మణబ్రువుఁడు; ౪. విద్వాంసుఁడును సత్కర్మపరుఁడునైన వంశకర్తవలనఁబుట్టినవిప్రుఁడు:—బ్రాహ్మణాయనుఁడు; ౫: వ్రాత్యుఁడు; ౬. విష్ణుభక్తుఁడు:—వైష్ణవుఁడు:— (తె) తిరుమడి; ౭. అధర్వణవేదము తెలిసిన బ్రాహ్మణుఁడు:— అధర్వణుఁడు; ౮. అనూ

చానుఁడు; ౯. రజస్వల కన్యను పెండ్లియా
డిన బ్రాహ్మణుఁడు:— అపాంక్తేయుఁడు;
౧౦. కపట బ్రాహ్మణుఁడు:—కంకుఁడు, కర
టుఁడు; ౧౧. విప్రనామానుబంధము:—
భట్టు, శర్మ. (తె) బొట్టి-బొట్టు; ౧౨. పూ
జ్యుఁడగు బ్రాహ్మణుఁడు:— (తె) అయ్య
గారు-అయ్యగారు-అయవారు-అయ్యవారు;
౧౩. యజ్ఞార్హములైననియమములనడపు బ్రాహ్మ
ణుఁడు:—(తె) జన్నిగట్టు; ౧౪:(చూ, బ్రా
హ్మణులు 1932—1933 పొరటలు); 2. బ
ట్టువాఁడు: చూ, సూతుఁడు (వంది).

స్వస్త్రీసంగమము. అం: చూ, శకునరహితములు.

స్వస్థమగు. మి. అ. క్రి: (తె) తేఱు, తేఱు
కొను, రెక్కును.

స్వస్థము. సం. విణ. నెమ్మదిగా నుండునది:
(తె) తిన్న, తిమ్మ, నిమ్మళము, వాసి.
తద్వి.—స్వస్థతకు — ప్రసాదము, స్వాచ్ఛ
ము, స్వాస్థ్యము. (తె) తిన్నన-తిమ్మన.

స్వస్థావస్థ. అం: చూ, అవస్థలు (స్వక్షేత్రమం
దున్న గ్రహము స్వస్థావస్థ యందుండును.
ఖ్యాతి, సుఖము, సంతానము, ధనము గలు
గును) [చూ, స్నప.

స్వస్రీయ. సం. వి. ఆ. స్త్రీ. మేనగోడలు;

స్వస్రీయుఁడు. సం. వి. అ. పుం, భాగినేయుఁ
డు. (తె) మేనల్లుఁడు-మేనయల్లుఁడు,(చూ,
మేన. (1).); తద్వి.—౧. చెల్లెలికొడుకు:—
కానిష్ఠినేయుఁడు; ౨. తోఁబుట్టువు కొడు
కు.—భాగినేయుఁడు.

స్వస్వామిసంబంధము. అం: చూ, సంబంధములు.

## స్వా

స్వాంతము. సం. వి. అ. న. 1. మనస్సు: చూ,
హృదయము. 2; 2. బుజ్జగింపు: చూ,
రూ-సాంత్వము. 3; 3. గుహ: చూ, రం
ధ్రము. 1.

స్వాగతము. సం. వి. అ. న. 1. కుశల ప్రశ్న
ము: కౌశలి; 2: సుఖముకోడిరాక; అం.
3: చూ, వృత్తము. 1. ("ర-న-భ-గగ. 7
యతి. 11 వ ఛందము. ఉదా.—స్వాగతం
బెవఁడు-శౌరికి నెంతే." [చూ, శాఘోట.

స్వాఘాటము. సం. వి. అ. పుం. బరివెంక*:

స్వాచ్ఛ్యము. సం. వి. అ.న. స్వచ్ఛత: చూ, స్వచ్ఛము.

స్వాతంత్ర్యము. సం.వి.అ.న: చూ, స్వతంత్రము.

స్వాతి. సం. వి. ఇ. స్త్రీ. 1. సంజ్ఞాదేవి: చూ,
భార్య 1-౬౪. తద్వి.—సూర్యుని భార్య
కు.—వరుణ సుత; అం. 2. కరువలిచుక్క—
స్వాతి: చూ, రిక్క.

స్వాత్త్వికము. అం: చూ, అభినయములు.

స్వాదనము. సం. వి. అ. న: ద, పానము, పీతి,
సరకము. (తె) ఆనిక, త్రాగుడు, త్రాగు
డు. తద్వి.—కల్లుత్రాగుటకు:—అనుతర్షణ
ము—అనుతర్షము, సరకము. (అవ్య) కచ్చి
త్. (తె) కల్లుత్రాగుట (చూ, సరకము.3).

స్వాదము. సం. వి. అ. పుం. 1: చూ, రుచి.1;
2. రుచిచూచుట. [చూ, లేహము.

స్వాదితము. సం. విణ. పానముచేయఁబడినది:

స్వాదుకంటకము. సం. వి. అ. పుం.1.పల్లేరు*:
కంటకిఫలము, కంటఫలము, క్షురకము, క్షు
రము, పలంకష, వనశృంగాటము, శ్వదంష్ట్ర
(తె) పల్లెరు-పల్లేరు. తద్వి:—పెద్దపల్లేరు
కు.-అశ్వదంష్ట్ర, ఇక్షుగంధ, క్షురాంగము,
గోకంటకము, గోక్షురకము, గోఖురము,
గోఖురి, త్రికంటకము, మహాపలంకష. (తె)
ఏనుఁగుఁబల్లేరు, పెద్దపల్లేరు.*; 1. మొలవె
లఁగ*: చూ, వెలఁగ 1-3.

స్వాదుధన్వుఁడు. సం. వి. న్. పుం. తియ్యవిలు
కాఁడు: వ, విషయి, శూర్పకారాతి, శృం
గారయోని: చూ, మన్మథుఁడు.

స్వాదుపుష్పము. సం. వి. అ. పుం. ఆరుకొండ*:
చూ, రక్తఫల.

స్వాదుఫల. సం. వి. ఆ. స్త్రీ: ద్రాక్ష, కృష్ణగో స్తని, ప్రియాల, మధురస, మృద్వీక-మృద్వీక, స్వాదురస, స్వాద్వీ. (తె): —దాక-ద్రాక*. తద్వి: —చూ, లికుచము. 2; 2. ఆరుదొండ*: చూ, రక్తఫల; 3. రేఁగు*: చూ, రేఁగు. 1. తద్వి.—కానరేఁగునకు.- చూ, వికంకతము.

స్వాదుమజ్జాఫలము. సం. వి. అ. పుం. గోఁగు*: చూ, వరగోఁగు తద్వి.—౧. కొండగోఁగునకు.—రాజాహ్వయము. (చూ, వరగోఁగు); ౨. గోనుగునకు.—సప్రింసి.

స్వాదురస. సం. వి. ఆ. స్త్రీ: కబలి, కాయస్థ, కాక, కాకోలి, కృష్ణ, గౌడదేశిక, ఘృతమండ, మాంసి, వయస్థ, వాయసోలి, వీరవృక్షము. (తె) కారుకొత్తి, కారుకొల్లి (కారు గొలిమిడి), తప్పెట, మాఁడె, మాడి. (అడవియాలవ అనికొందఱు) *; 2. ద్రాక్ష*. చూ, స్వాదుఫల.

స్వాదువు. సం. వి. ఉ. న. 1. బెల్లము: చూ, శర్కర. 1; 2. స్వాదువనుగంధ ద్రవ్యము, గంధధూమజము: చూ, రాజార్హము. 2—ఠం; విణ. 3. ఇంపయినది: చూ, హృద్యము; 4. గరగరికైనది; 5. తియ్యనిది: చూ, సురసము. 2.

స్వాదూదము. సం. వి. అ. పుం. మంచినీళ్ల సముద్రము; చూ, సముద్రములు. 2

స్వాద్వీ. సం. వి. ఈ. స్త్రీ. ద్రాక్ష*: చూ, స్వాదుఫల. 1.

స్వాధిష్ఠానము. అం. (స్వాధిష్ఠానము) వెన్నెముకయందలి షట్చక్రములలో నొకటి: చూ, చక్రములు (షట్చక్రములు.) [స్వాధీనము.

స్వాధీనత. సం. వి. అ. న. వశము: చూ,

స్వాధీనపతిక. అం. స్వాధీనుఁడైన పెనిమిటి గల నాయిక: చూ, నాయికలు.



స్వాధీనపురుషనఖా. వా. వి: చూ, ఖండసుక్తి.

స్వాధీనము. సం. వి. అ. పుం: అధీనము, ఆయత్తము-ఆయత్తి, గృహ్యకము, గృహ్యము, ఛందము, ప్రత్యయము, వశము, స్వవశము, స్వాధీనత. (వి. విణ) వశ. (తె) అంకియ-అంక, అగ్గము, ఇల్లెస, ఒళవు, కైవసము, చేవల్ఁతి, జోక, దక్కోలు, పాలు, మస్తరు, లొక్కు, లోఁకువ, లోను, వలఁతి, వసము, వెరవు-వెరువు. తద్వి.—ఒకరికిలోఁబడినది (స్వతంత్రముకానిది): —అవగ్రహము, అస్వతంత్రము, గృహ్యకము, గృహ్యము, పరవశము, పరాధీనము.

స్వాధీనముచేయు. మి. స. క్రి. చూ, వశపఱచు.

స్వాధీనుఁడు. సం. విణ. తనకులోఁబడినవాఁడు: వశి.

స్వాధ్యాయము. సం. వి. అ. పుం. 1. వేదాధ్యయనము: అధీతి, అధ్యయనము, ఉపక్రమము, జపము; 2. ఆమ్నాయము: చూ, వేదము; 3. జపము: అక్షరము, జపము (జాపము), తపము-తపస్సు, సంతాప్రవృత్తి. (తె) కాఁక-కాఁక, తబము; అం. 4: వాచికము, ఉపాంశువు, మానసికము (3).

స్వాధ్యాయి. సం. వి. న్. పుం. 1. వేదాధ్యయనము చేయువాఁడు: అధ్యాపకుఁడు, ఉపాధ్యాయుఁడు, గణి, గురువు. తద్వి: —ఛాందసుఁడు, వైదికుఁడు, శ్రోత్రియుఁడు; (చూ, స్వస్తిముఖుఁడు. 1.); 2. పట్టణమునందలి వర్తకుఁడు: చూ, సార్థవాహుఁడు.

స్వానము. సం వి. అ. పుం. రూ—స్వనము, ధ్వని, మ్రోఁత: చూ, స్వరము. 2.

స్వాపతేయము. సం. వి. అ. న. ధనము: చూ, హిరణ్యము. 3. [స్వప్నము 1-2.

స్వాపనము. సం. వి. అ. పుం: చూ, రూ-

స్వాపము. సం. వి. అ. పుం. 1. నిద్ర: చూ, స్వప్నము 2. తద్వి,—!లక: చూ, స్వ

స్నము. 1; 2. శయనము: చూ, శయ్య. 1; 3: అజ్ఞత, అజ్ఞత్వము, అజ్ఞానము, అవిద్య, అవివేకము, అవామ్మతి, జడము, జలము, సగ్గము. (తె) ఎడ్డెతనము, ఎఱుంగమి, కాఱు, తెలివిలేనితనము, నేరమి, పిస, పిసి, మఱకువ, మఱపు, వెడఁగు, వెఱ్ఱి; 4. తిమ్మిరి: ఉన్మాథము, తిమిరము-తిమ్మిరము, సుప్తి. (తె) తిమిరి-తిమ్మిరి-తిమురు, బోము.

స్వాభావికము. సం. విణ. స్వభావముచేతఁ గలిగినది, నైజము: చూ, స్వభావము.

స్వాభావికి. అం: చూ, నాశికాక్రియలు.

స్వామి. సం. వి. న్. పుం. 1.=సామి. ఒడయుఁడు (చూ, రాజు. 1-2-3): అధిపతి-అధిపుఁడు, అధిభువు, అధీశుఁడు, అధీశ్వరుఁడు, అర్యుఁడు, ఇనుఁడు, ఈశితుఁడు, ఈశుఁడు, ఈశ్వరుఁడు, ఉదాస్థితుఁడు, కలిమాలకుఁడు, కాంతుఁడు, నాథుఁడు, నాయకుఁడు, నేత, నేతృఁడు, పతి, పరిపాలకుఁడు, పరివృఢుఁడు-పరీవృఢుఁడు, లక్ష్మీపతి, వరుఁడు, వల్లభుఁడు, ప్రభువు, విభుఁడు. (తె. ప):—ఎకిమీఁడు, ఏలిక, ఏలికవాఁడు, ఒడయఁడు-ఒడయుఁడు, గమికాఁడు, జియ్య, ఠాకురు, తీరుపరి-తీర్పరి, దణి-దణియ-దణె, దేవర, దొర, నాయకుఁడు-నాయఁడు, పలువు, మగఁడు, మనెవారి, మన్నియ - మన్నె - మన్నియఁడు-మన్నీఁడు-మన్నెఁడు, మన్నెకొడుకు, మన్నెకాఁడు, మన్నెవాఁడు, మానిసిఁడు, మేటి, రా-రాజు, రాయఁడు-ఁడు, రావు, సర్కారు, సామి, సాయిబు-సాహెబు-సాహేబు. తద్వి.—౧. పన్నిద్దఱు బంటుల కధిపతికి.—నాయకుఁడు. ౨.గొప్ప ప్రభువునకు.—అధీశుఁడు, అధీశ్వరుఁడు, మహేశ్వరుఁడు; 3. గృహస్థునకు.—వాస్తవ్యుఁడు: చూ, యజమానుఁడు.

1, 2. కుమారస్వామి: చూ, స్కందుఁడు; విణ. 3. న్యాయాధికారి: అక్షదర్శకుఁడు, అతిమాత్రకుఁడు, అధికారి, అధికుఁడు, అధికృతుఁడు, అధ్యక్షుఁడు, అభిజాతుఁడు, ఉద్భటుఁడు, నైయాయికుఁడు, న్యాయాధిపతి, న్యాయాధికారి, యజమానుఁడు, వ్యవహర్త, సభికుఁడు, స్థేయుఁడు. (తె. ప) తగవరి (తగుపరి), తీరుపరి-తీర్పరి, పెడనెల. తద్వి:—౧. అధికుఁడు అనుటకు:—(తె) మిండఁడు-మిండగాఁడు-మిండగీఁడు, మిక్కిలివాఁడు; ౨. మహంతు క్రింది యధికారి:—స్థానికుఁడు. (తె) పారుపత్తెకాఁడు, పారుపత్తెదారు, మణిపకాఁడు, మనియకాఁడు; 3. నియమించెడి యధికారికి:—కోలుకాఁడు; 3. ఒక గ్రామమున కధికారి:— స్థాయుకుఁడు; అం. 4: చూ, రాజ్యాంగములు (చూ, అంగము. 9.)

స్వామిని. సం. వి. ఈ. స్త్రీ=సాని. పట్టపుదేవి. రాజభార్య (అని కొందఱు): దేవి, ప్రభ్విణి, మహిషి, రాజ్ఞి. (తె) ఏలికసాని, ఒడయురాలు, దేవరి-దేవేరి, దొరసాని, పట్టపుదేవి, రాణి, సాని. [ములు.

స్వామిపాల వివాదము అం: చూ, వ్యవహారపద

స్వామిభృత్యన్యాయము. అం: చూ, వివాదములు. [స్వతంత్రము.

స్వామ్యము. సం. వి. అ. న. సొంతము: చూ,

స్వామ్యములు. అం: దాన, వినమయ, జల, తరు, పాషాణ, నిధి, నిక్షేపములు (7).

స్వాయంభువమనువు. అం: చూ, మనువులు.

స్వాయంభువము. అం: చూ, ఆగమములు(చూ, ఉపవిద్యలు)

స్వారాజ్యము. సం. వి. అ. న. స్వర్గలోకపు దొరతనము. తద్వి.—ఆధిపత్యము, ప్రభుత్వము, ప్రాభవము, మహత్తు, మహోద

యము, రాజ్యము, వశము, వాల్లభ్యము, శృంగము. (తె) అడపడి, దొరతనము, నాయంకరము.

స్వారాట్టు. సం. వి. జ్. పుం. స్వర్గలోకాధిపతి, ఇంద్రుఁడు; చూ, సహస్రాక్షుఁడు.

స్వారి. దే.వి.రూ-సికారు: చూ, సంచారము. ౧.

స్వారోచిషమనువు. అం: చూ, మనువులు.

స్వార్థము. పా. ఏధాతువునకేది నిశ్చితమైన యర్థమో యదిస్వార్థము. వర్తమాన, భూత, భవిష్య, త్ర్యర్థములని స్వార్థమున నాలుగు కాలములు కలవు.)

స్వాశ్రితావనసమోనహిధర్మః. లో. ఆశ్రితుల రక్షించుటతో సమమగు ధర్మము లేదుగదా? "ఉదా.—తత్త్వజ్ఞులెప్పుడును హింసకుంగడుదవ్వగఁజరియించుచుందురు. "స్వాశ్రితావన సమోనహిధర్మః" యని వేదము. (నీతిచంద్రిక-విగ్రహము)

స్వాస్థ్యము. సం. వి. అ. న. ప్రసాదము, స్వస్థత: చూ, స్వస్థము.

స్వాహా. సం. వి. ఆ. స్త్రీ. 1. ఆగ్నాయి, అగ్నిభార్య; చూ, భార్య. 1-౯౧; 2 బుద్ధుని భార్య: చూ, భార్య.1-౮౦;అం. 3: చూ, దిక్పాల భార్యలు.

## స్వి

స్విత్రము. సం. వి. అ.న. పులుసు: చూ, సితము. 1-౫.

స్విన్నము. సం. విశే. స్వేదముతోఁగూడినది.

స్విష్టకృత్తు. అం: చూ, రిహీనతానములు (చూ, తానములు)

స్వస్తికము. అం: చూ, ప్రచారములు.

## స్వీ

స్వీకరించు. సం. స. క్రి. 1. అంగీకరించు: చూ, సమ్మతించు; 2. పుచ్చుకొను: అనుగ్రహించు, గ్రహించు, గ్రహియించు, పరిగ్రహించు, సంగ్రహించు. (తె) అందు, అందుకొను, అప్పళించు, అలము, ఇముడుకొను, ఎత్తు, కవుచు, కయికొను-కైకొను, కొను, కోలు, చేకొను, చేపట్టు, తోడుకు, పట్టు, పుచ్చు, పుచ్చుకొను, పుడుకు-పుణుకు, సందుకొను. తద్వి.—రాఁబట్టు, సమకట్టు, సేకరించు; 3. అవధరించు, ధరించు, వహించు. (తె) అలవరించు-అల్వరించు, అఁగు, అదుకొను, ఆను, ఆనుకొను, ఉంచికొను-ఉంచుకొను, పూను, తలకొను, తాలుచు-తాల్చు, నుసలు, వరిషవించు, పాటించు, పూను-ఊను, పెట్టు, పెట్టుకొను, మోచు, సంతరించు, సమకొల్పు, సవరించు, హవణించు తద్వి:-శిరసావహించు. [మేవాఁడు: వహి.

స్వీకర్త. సం విశే. (బు. ఈ. బు) స్వీకరించు

స్వీకారము. సం.వి అ. పుం. 1. అంగీకారము: చూ, సమ్మతి. 1; విశే. 2 = సేకరము: అభినివేశము, అభ్యుపగమము, అభ్యుపపత్తి, ఆగ్రహము, ఆదానము, గ్రహణము, గ్రహము-గ్రాహము, పరిగ్రహణము, పరిగ్రహము, పురస్కారము, ప్రతిగ్రహము, సంగ్రహము. (అవ్య) ఆజ్. (తె) ఎత్తు, కయికోలు-కైకోలు, చేయి, పట్టు-పట్టుట-పట్టుడు, పట్టువల, పుచ్చికోలు-పుచ్చుకోలు, సేకరము. తద్వి.—౧. (తె): చూ, లాగు. 1; ౨. ముక్తపరునకు:— చూ, సంగ్రహము. 2.

స్వీకృతము. సం. విశే. 1. అంగీకరింపఁబడినది: (చూ, సమ్మతి.1): అంగీకృతము, అభిపన్నము, అభిమతము, అనుమతము, ఉపగతము,

ఉపక్రితము, ఉరరీకృతము - ఉరీకృతము - ఊరీకృతము, ప్రతిజ్ఞాతము, మతము, విదితము, సంగీర్ణము, సంశ్రితము, సమాహితము, సమ్మతము. (తె) ఒడఁబాటు; 2: గృహీతము, పరిగృహీతము. తద్వి.—౧. పుచ్చుకొనఁదగినది:— గ్రాహ్యము, పరిగ్రాహ్యము; ౨. సంగ్రహింపఁబడినది:—ఆచితము.

**స్వీకృతుఁడు.** సం. విణ. పుచ్చుకొన్నవాఁడు: ప్రతిగృహీతుఁడు. తద్వి.— పుచ్చుకొను వాఁడు (గ్రహించువాఁడు):— గ్రహీత, గ్రాయకుఁడు, గ్రహయాలువు, గ్రహీలుఁడు, గ్రాహకుఁడు, గృహయాలువు, గృహీత.

**స్వీయ.** అం. 1. పతియందుమాత్రము అనురాగముగల నాయిక: వాణిని (చూ, నాయికలు). [(1). "వివిధశృంగారరమణీయలైనరమణీమణులు:—౧స్వీయ, ౨పరకీయ, ౩సామాన్యలను ముత్తెఱంగులు. ౧ స్వీయ వివాహమాడినది. ఇదే ముగ్ధ, మధ్య, ప్రగల్భయను భేదములుగలది. (౧) ముగ్ధాభేదంబులు:—అజ్ఞాతయౌవన ౧, జ్ఞాతయౌవన ౧, నవోఢ ౧, విస్రబ్ధనవోఢ ౧= ౪. ఇది పం[డెండేండ్ల వయసుగలిగి యౌవనోదయ ముందుమేన్నది; (౨) మధ్యాభేదంబులు:—మధ్యధీర ౧, మధ్యాధీర ౧, మధ్యధీరాధీర ౧, మధ్యధీరాజ్యేష్ఠకనిష్ఠ౧, మధ్యాధీరాజ్యేష్ఠకనిష్ఠ ౧, మధ్యధీరాధీరా జ్యేష్ఠకనిష్ఠ ౧=౬. ఇది పదుమూఁడేఁడ్లు మొదలు పదునానిమిదేండ్లదనుక వయసుగల్గి యౌవనోదయమైనది. ఇదిపతి యన్యసతీసక్తుఁడైనను గోపింపక తన పాతివ్రత్యభావము తప్పక యుండును,(౩) ప్రగల్భాభేదంబులు:—ప్రగల్భధీర ౧, ప్రగల్భాధీర ౧, ప్రగల్భధీరాధీర ౧, ప్రగల్భధీరాజ్యేష్ఠకనిష్ఠ ౧, ప్రగల్భాధీరాజ్యేష్ఠకనిష్ఠ ౧, ప్రగల్భాధీరాధీరాజ్యేష్ఠకనిష్ఠ ౧, సురతప్రియ ౧, సురతానందమోహిత౧=౮, ఇది పదునెనిమిదేండ్లకుమించిన వయసుగలిగి సంపూర్ణయౌవనముచే వెలయునది. దీనికి రతికళాజ్ఞానము మెండు. వీని విభాగక్రమము.— అజ్ఞాతయౌవన— తనకు యౌవనప్రాదుర్భావమైనదని తెలియకుండునది; జ్ఞాతయౌవన=తనకు యౌవన ప్రాదుర్భావమైనదని తెలియునది; నవోఢ = లజ్జాభయపరాధీన రతిగలది. విస్రబ్ధనవోఢ—కొంత రతిపరిచయముగలది; మధ్యధీర=అన్యస్త్రీ సంభోగమువలన పతియందు వ్యంగ్యముగా కోపప్రకాశము చేయునది; మధ్యాధీర=అన్యస్త్రీ సంభోగమువలన పతియందవ్యంగ్యముగా పరుషవాక్యములుపలుకునది; మధ్యధీరాధీర=అన్యస్త్రీ సంభోగమువలన పతియందు వ్యంగ్యవచనంబుచేయుచే వెంటనేఅవ్యంగ్యమైన కోపచేష్టగలది; జ్యేష్ఠకనిష్ఠ=ఇద్దఱి భార్యలయందు పడఁతికిఁగల యధిక న్యూనస్నేహమువలన నేర్పడునది. అట్టి సమయములో తన యందుఁగల న్యూనస్నేహంబు నెఱిఁగి పతియందుకోపప్రకాశము చేయుటలో పైనఁ జూపిన ధీరాధీరాదిలక్షణంబులుగల యది; ప్రగల్భధీర.= అన్యస్త్రీ సంభోగముచేసి వచ్చిన పతియందురత్యుదాసీనభావముగలది; ప్రగల్భాధీర= అన్య స్త్రీ సంభోగముచేసి వచ్చిన పతియందు తర్జనతాడనాదులు చేయునది; ప్రగల్భధీరాధీర=అన్యస్త్రీ సంభోగముచేసి వచ్చిన పతియందు రత్యుదాసీనభావము గలిగి తర్జనాదులు చేయునది. జ్యేష్ఠకనిష్ఠాది భేదంబులు ప్రగల్భకుంగలవు. తనయందుండు న్యూనస్నేహము నెఱిఁగి పతియందు కోపప్రకాశము చేయుటలో ప్రగల్భకుఁ జెప్పియుండు ధీరాధీరాదిలక్షణంబులు గలయది."; (2): చూ, పరకీయ. ("ఇందనేక

భేదంబులుండినను ప్రాచీనోక్తంబులై ప్రసిద్ధములైన కొన్ని భేదంబులు గలవు. అవే వన:—౧. గుప్త:—జారసురతమును గోపనము చేయునది. ఇది త్రివిధము:—(౧) వృత్తసురతగోపన=జరిగిన జారసురతమును గోపనము చేయునది. (౨) వర్తిష్యమాణ సురతగోపన=జరుగఁబోవు జారసురతమును గోపనము చేయునది. (౩) వృత్తవర్తిష్యమాణ సురతగోపన=జరిగిన జారసురతమును జరుగఁబోవు జారసురతమును గోపనము చేయునది. ౨. విదగ్ధ=తన మనోభిప్రాయము నితరులకుఁ దెలియకుండఁగ జారునికిమాత్రముఁ దెలుపునది. ఇది ద్వివిధము:—(౧) వాగ్విదగ్ధ=వాక్చాతుర్యముచేఁ దెలుపునది; (౨) క్రియావిదగ్ధ=క్రియలచేతఁ దెలుపునది. ౩ లక్షిత=కొంత బయలుపడిన జారసురత వ్యాపారము గలది; ౪. కులట=బహుపురుషానురాగము గలది; ౫. అనుశయాన=సంకేతస్థానా సందర్భమును చింతించునది. ఇందులో ౩ భేదములు.—(౧) వర్తమాన సంకేత స్థలాసందర్భమును చింతించునది. (౨) భావిస్థాన సంకేతస్థలాసందర్భమును చింతించునది. (౩) రతిప్రాప్తమైన సంకేతస్థలమును అసందర్భముచేత పొందఁజాలక చింతించునది: ౬. ముదిత=తనకుసమయము దొరికెనని జారునికిఁ దెలుపుటకు సంతోషించునది; ౭. సాహసిక=పతి సమీపములోనుండఁగా పతిని వంచించి జారునితో రతి సల్పునది; ౮. ప్రతిభాచతుర=తనయంకుతనము కొంత బయలుపడినను సమయోచితముగా తెలియరాకుండఁగ 'కలగనిమేలుకొంటిని' అని బొంకువలె బొంకునది; ౯. అపలాపచతుర=తన జారత్వమును అపలపించి రోదనము చేసి తవయఁదు పతికి కనికరము పుట్టించునది."; (౩): చూ, సామాన్య. 1. (సామాన్య=ద్రవ్యనిమిత్తంబుగ సకల పురుషులయందనురాగముగలది. ఇది ౧. జాతిసామాన్య, ౨. ఆగంతుకసామాన్య. ౩.గూఢసామాన్య అని త్రివిధము. ౧. జాతిసామాన్య=అవివాహితులురాలుగాక తన జాతిరీత్యా పైఁజెప్పిన లక్షణంబులుగలయది: ౨ ఆగంతుక సామాన్య=వివాహితయై పెనుక పతిని విడిచి స్వేచ్ఛలవిడిగా పైనఁజెప్పిన ప్రకారము వర్తించునది; ౩ గూఢసామాన్య=వివాహితురాలైగాని కాకగాని పతి గతించిన వెనుకగాని యింటివారి అనుమతిమీఁద పైఁజెప్పిన లక్షణ ప్రకారము గూఢముగా సంచరించి ద్రవ్యమును సంపాదించి పోషకులకుఁ దెచ్చియిచ్చునది. ఈగూఢ సామాన్యను ప్రాచీనులంగీకరింపలేదుగాని మనుధర్మశాస్త్రములో ఈస్త్రీయొక్క రతిని పురుషునికి వ్యభిచారదోషజనకముగాఁ జెప్పలేదు. గాన నిది సామాన్యలో నంతర్భావముగాఁ జెప్పఁబడెను. (చూ, నాయికలు 1585 పుట. మఱియు నాయికలలో ౯. తమోభిసారిక=చీఁకటిలో ప్రియునిఁగూర్చి పోవునది. ఇట్లనేక భేదంబులూహ్యంబులు. మఱియు నాధునికులేర్పఱచిన నాయికలు. ౧. ప్రవత్స్యత్పతిక, ౨ ప్రవసత్పతిక, ౩.సమాగమిష్యత్పతిక, ౪. సమాగచ్ఛత్పతిక అని నల్వురు గలరు. (౧) ప్రవత్స్యత్పతిక=ప్రియుఁడూరికిఁ బోవుచున్నాఁడని భావివిరహమును గూర్చి దుఃఖించునది; (౨) ప్రవసత్పతిక=దేశాంతరముఁ బోయెడు ప్రియునింజూచి భావివిరహమును గుఱించి దుఃఖించునది; (౩) సమాగమిష్యత్పతిక=ప్రియుఁడు దేశాంతరమునుండి రాఁబోవునని సంతోషించునది; (౪) సమాగచ్ఛత్పతిక=ప్రియుఁడు దేశాంతరమునుండి వచ్చుచుండఁగా చూచి సంతోషించునది. ఈనాయికల ప్రసిద్ధలక్షణములతో ఈఅవాంతర భేదములు చేరియుండునని

చూపేకొని వాటివాటియొక్క, అవాంతర భేదముల నిరూఢిచేసి నామనిర్దేశము చేసికొనవలయును."]; 2: చూ, మానవతి 3 [(౧) "మానవతి = ప్రియునియందన్యస్త్రీప్రియుక్తముగాఁ గోపించుటయును దానికిఁ బ్రియుఁడు చేయు మనశ్శాంతియునుబట్టి చేయునది. ఇది లఘుమాన, మధ్యమాన, గురుమాన అని త్రివిధము. (౨) తృప్త, అతృప్త, తృప్తాతృప్తఅని ముగ్గురు నాయికలు గలరు; (౩) మఱియు గర్వితలలో అయిదు భేదంబులు:- సౌందర్యగర్వితా, ప్రేమగర్వితా, విద్యాగర్వితా, యౌవనగర్వితా, కులగర్వితా; (౪) అన్యాసంభోగదుఃఖిత; (౫) ఉత్తమ, మధ్యమ, అధమ; (౬) పద్మిని, చిత్తిని, శంఖిని, హస్తిని. (చూ, స్త్రీ); ఇత్యాది. గ్రంథవిస్తరభీతిచే నీవిషయమింతటితో ముగింపఁబడియె")

స్వీయము. సం. విణ. తనది: చూ, స్వతంత్రము.

## స్వే

స్వేచ్ఛ. సం. వి. ఆ. స్త్రీ. ఇచ్ఛవచ్చినట్లు: ఇష్టము, కామము, టకము, నికామము, పర్యాప్తము, ప్రకామము, యథేచ్ఛత, యథేచ్ఛము, యథేష్టము, యస్వచ్ఛ, స్వైరిత. (తె) అలవోక, ఇంపు-ఇంబు, ఒనరు, విచ్చలవిడి. (విణ): యథేప్సితము.

స్వేచ్ఛానువృత్తి సం.వి.ఇ. స్త్రీ: చూ, యథాకామి.

స్వేచ్ఛామృత్యువు. సం. వి. ఉ. పుం. భీష్ముఁడు: చూ, శాంతనవుఁడు.

స్వేదజము. సం. విణ. చెమటవలనఁ బుట్టినది. (పురుగు లోనగునది.)

స్వేదజములు. అం: చూ, సృష్టిభేదములు.

స్వేదని. సం. వి. ఈ. స్త్రీ. పెనము: చూ, పాత్రము. 6_3౮.

స్వేదము. సం. వి. అ. పుం. 1. చెమట: ఘర్మము, తనురసము, నిదాఘము, పీనము, ప్రస్రవణము, విపాకము, శ్రమము. (తె) చెమట-చెమ్మట, చెమర-చెమరు. తద్విశేషములు.— కొంచె, ముతికిచెమట; 2. చెమటపోయుట; అం. 3: చూ, సాత్వి(త్త్వి)కభావములు.

## స్వై

స్వైరి. సం. విణ. (న్. ఈ. న్): చూ, స్వతంత్రుఁడు.

స్వైరిణి. సం. వి. ఈ. స్త్రీ. ఱంకులాఁడి: అర్జుని-ఆర్జుని, అసతి, ఇత్వరి-ఈత్వరి, ఋషభి-వృషభి, కర్షణి-కషణి, కలతూలిక, కులట, చర్షణి, ధిక్కు, జార, జారిణి, డింబిక, త్రిప, దిక్చారిణి, ధర్షణి, ధృష్టలంజ, నిశాచరి, పాంశుల-పాంసుల, పుంశ్చలి, బంధకి, ముక్త, లంజ-లంజిక, వండ, వాంఛిని, విటి, షండ. (లై.వ.) అంటిగది, అంటుకత్తియ (అంటుకత్తె), ఆపగలది, గుడిసెవాటు, చెడిప - చెడిపె, చెడ్డతొయ్యాలి, జెంభి, తిరుగుఁబోతు, వనుపుకత్తె, నసగూటి, బజారి-బాజారి, బసవి-బసివి, మిండకోర-మిండలకోర-మిండలకోరి, మిండత, ముండ, రంకుటాలు-ఱంకుటాలు-రంకులాఁడి-ఱంకులాఁడి, ఱంకుఁబోతు, రంకెత-ఱంకెత, ఱాఁగ, ఱండ, లంక, లంజి-లంజియ-లంజె, లంబిడి-లంబ్డి-లమ్మిడి-లమ్డి, వాడవదిన, విటకత్తె, విటుకులాఁడి, వెలిచేవులగన్న తొయ్యాలి, వలిచోరవరి, వెల్లాటకత్తియ-వెల్లాటకత్తె, వేసుకకత్తియ-వేసుకకత్తె, సాగనుకత్తె. తద్వి.— శివదాసియై వ్యభిచరించు స్త్రీ:— బసవి-బసివి.

స్వైరిత. సం.వి.ఆ.స్త్రీ. యథేచ్ఛత: చూ, స్వేచ్ఛ.

**స్వైరుఁడు.** సం. విశే. 1. స్వైరి: చూ, స్వతంత్రుఁడు; 2: చూ, సోమరి.

# హ

**హ.** ఒకయక్షరము. సం. అవ్య. 1. పాదపూరణమందువచ్చెడి నిపాతము. "రామం 'హ' ప్రాహలక్ష్మణః." 'తు-హి-చ-స్మ-హ-వై.' ఈఆఱును పాదపూరణమందు వర్తించును; 2. పూజ: (చూ, సపర్య); 3. సంబోధనము: చూ, సంబోధనము. 1;4. నింద: చూ, నెగ్గింపు; అం. 5: చూ, కంఠ్యములు; 6: చూ, తాలవ్యములు; 7: చూ, ఊష్మములు.

**హంకరించు.** వై. అ. క్రి.=అహంకార: ఎగసిపడు, గర్వించు, గరువపడు, తరితీపుసేయు, తిమురు, తెగటు, తుళ్లియాడు, తుళ్లు, నిక్కు, నిఱ్ఱసీలుఁగు, పొంగు, మురియు, మెకమెకపడు, రేఁగు, విక్కు, విఱ్ఱవీఁగు, విఱుగఁబడు, వేఁచు. (సం.వ)అహంకరించు, అహమించు, ఆటోపించు, ఉత్సేకించు, గర్వించు, దర్పించు. తద్వి.—నుమాళించు: చూ, మబ్బుకొను.

**హంకారము.** వై. వి. అహంకార.గర్వము: అదటు, అసము, అహు, ఉదుటు, ఎగవు, ఎగసిపాటు, ఏతు, ఏపు, ఒయారము-ఒయ్యారము, కండకావరము, క్రొవ్వు, గబ్బు, గరువము, గురుపతనము, గెబ్బు, గోరింపు, డంబు, డబడబ, తరితీపు, తిమురు, తెగటు, తెగసీలుఁగుట, తుక్కు, తుళ్లింత, తుళ్లు, దిమాకు (ధిమాకు), దుడుకు, నిక్కు, నీటు, నెగవు, పించెము, పిలుకు, పీఁచెము, పురి, పొంగు, పొగరు, పొనరు, పోతరము, ప్రల్లఁదనము, ప్రిల్లదము, బడాయి, బింకము—బింకెము, బిగి, బిగువు, బిఱ్ఱ—బిఱ్ఱు, బీరము, బెట్టిదము, సెట్టు, జెట్టుసరి—జెట్రిసరి, మదము, మల్లరము, మిట్టిపాటు, మిడి, మిడిమేలము, మిడిసిపాటు, మురి, మురిపము—మురిపెము, మురవు, మెఱకము, మెకమెకపాటు, రాలిపాటు, విరగఁబాటు, విఱుగఁబాటు, వీఁక, వీఁకు. (సం.వ.) అంతుకము, అభిమానము, అవలేపము, అవశ్యాయము, అవష్టంభము, అహంకారము, అహంకృతి, అహంక్రియ, అహంత, అహంభావము, ఆటోపము, ఆరంభము, ఉచ్ఛ్రాట, ఉత్సవము, ఉత్సేకము, ఉద్ధతి, ఉద్ధృతి, ఉద్వృత్తి, ఊష్మము, కూర్చము, క్ష్వేళము, ఖరువు, గండము, గంధము, గర్వము, గుహ్యము, చిత్తోన్నతి, ఛా, టంకము, దండము, దర్పము, ధ్వజము, నాసీరము, మదము, మానము, విస్మయము, స్మయము. తద్వి.—౧. గర్వభేదము:—(సం) జాలిక: ౨. విద్యాగర్వము:—(సం) ఇరాద్ధత్యము; 3. అధికగర్వము:—ఉక్కురోసము, తెగసీలుగుట, ర.నడమేటయందలినిక్కు:—టేకు, టేవి.

**హంక్షము.** అం: చూ, చక్రములు.

**హంగామా.** వా. వి. 1. కొంతకాలము ఉండు; 2. ఒకవిధమగు అధికారము; 3. నిగహా.

**హంగామీ.** వా. వి. పెత్తనదారీ.

**హంగు.** వా. వి. 1. అలంకరించిన అలంకారము, ముస్తాబు; 2. రీతి: చూ, విధము. 1.

**హంజిక.** సం. వి. ఆ. స్త్రీ. (హఞ్జికా=రోగమును బోఁగొట్టునది): రూ—భంజిక, అంగారవల్లి-అంగారవల్లిక-అఙ్గారవల్లి, కంజక, కరి, కాలింది—కాళింది, కాసజిత్తు, కృష్ణబర్బరకము, ఖరశాకము, గంధపత్రిము, గరఘ్నము, గర్దభశాఖ-గర్దభశాఖము-గర్దభశాఖి, పద్మ, బర్బరము (బర్బరకము), బాలేయశాకము, బ్రాహ్మణయష్టిక (బ్రహ్మయష్టి), (బ్రాహ్మ

ణి), బ్రాహ్మి, భార్గి, వందకము, వర్ధనము, శాకము. (తె) ఎరువంటి, గంటుబారంగి, చిఱుతేకు, బంజియ-బంజె, బాఁగి*. (తద్వి.—౧: చూ, శాకోటము. ౧-౨-3. ౪.); ౨. ఒకటేఁకుకు.—క్రకచపత్రము, సోమ వల్కము. (తె) టేఁకు-తేఁకు, తోఁటి*.

హంజే. వై. వి. రూ-అంజె-హజ్జె, పాఠము: రూ-చూ, హజ్జే.

హండ. సం. వి. అ. (స్త్రీ).రూ-హండా-హండీ.= అండా-అండి-అండీ, వెడల్పునోరుగల పెద్ద లోహ (మట్టి) పాత్రము: చూ, పాత్రము. ౬-౧.

హండా. సం. వి. ఆ. (స్త్రీ). —పై.—

హండి(డీ). సం. వి. ఈ. (స్త్రీ) —పై.—

హండే. సం. అవ్య. (సంబోధనార్థకమైన అవ్యయము)నీచురాలినిపిలుచుటయందువర్తించును.

హంత.సం.విణ.(ఋ.ఈ.ఋ): చూ, హింసకుఁడు.

హంవీరుఁడు. సం. వి. అ. పుం. 1. క్షత్రియుఁడు: చూ, రాజా. ౧. తద్వి.—శరీరముదాఁచేనిబంటునకు —సూత్థానుఁడు; విణ.2 శూరుఁడు: ఊర్ధ్వరుఁడు, కలి, గండీరుఁడు, గండుఁడు, చండుఁడు, ణ, దమనుఁడు,యోధ, యోధవరుఁడు, యోఘుఁడు,యోద్ధ, విక్రాంతుఁడు, వియాతుఁడు, వీరుఁడు, శూరుఁడు. (తె. వ) ఉక్కడీఁడు, ఉక్కరి, ఉక్కుతునియ, ఎక్కటి, కట్టు పకాసి,గండఁడు, గడుసరి, చేలుమానిసి, చేఱుకరి, చేఱుకటీఁడు, జెట్టి, తెంపరి,దునీఁడు-దునీదారు-దునెదారి-దునేదారి, దుముదారి, దొర, నెఱసరి, పాలసుఁడు, పోటరి, పోటుకాఁడు, పోటుబంటు, పోటుమగఁడు, పోటుమానిసి, బంటు, మగఁడు, మగవాఁడు, మనసరి, మాసటి-మాసటీఁడు-మాస్టీఁడు, మిడిమాసి, మొక్కలి-మొక్కలీఁడు-మొక్కలుఁడు, మొనకాఁడు, మొనసరి, వజీరు-వజీరు-వజ్జీరుఁడు-వజ్జీరుఁడు-వజీరుఁడు, వటారి-వతారి, వడికాఁడు, వడిగలవాఁడు, వడివాఁడు, వాఁడిగలాఁడు, వాఁడిమగఁడు, వాలుమగఁడు, సరదారు, సరిమిడిమానిసి, సిపాయి, హంవీరుఁడు. తద్వి.—౧.నీటిలో శూరుఁడు:—కశూరుఁడు; ౨. భూరులకెల్ల శూరుఁడు:—(తె) గండరగండఁడు. 3: మహారథుఁడు, మానిసి: చూ, భటుఁడు. 1; ౪: చూ, సమరథుఁడు; ౫: చూ, సాహసికుఁడు; ౬. రథికచతుష్టయము:—అతిరథ, మహారథ, సమరథ, అర్ధరథులు (4); ౭: చూ, దిట్టఁడు; ౮. యుద్ధమునకు భయపడనివాఁడు: అరిందముఁడు - హరిందముఁడు. (తె) దుడ్డు; వై. విణ. (1)=హంవీర. శూరుఁడు. ఆ. పదా వర. ౩3: చూ హంవీరుఁడు. 2.

హంస. సం. వి. అ. పుం. 1.=అంచే. (చలించునది): అజవాహనము, కలకంఠము, కవీశ్వరుఁడు, క్షీరాశము, చక్రపక్షము, చక్రాంగము, జాలపాదము, జ్యేష్ఠము, ధవళపక్షన్ను, యమి, శ్వేతగరుత్తు, శ్వేతపత్రము. (తె. వ):—అంచే, తూఁడుదిండి, తెలిపిట్ట, తెల్లనిపిట్ట, తొలకరిగల్లుగువ్వ, తొలకరిసూడు, నఱవతేజి, నల్వజేక్క, పాలునీరునవెలిఁజేయుపక్కి, మదికొలంకు పులుఁగు, మదికొలనువెక్కనుపిట్ట, వానజోలిపుల్గు. తద్వి —౧. ఆఁడుహంసకు.—గండోలి-గంధోలి, చక్రాంగి;వరట-వారట, హంసి-హంసిక; ౨. ఎఱ్ఱనిముక్కు కాళ్లుగలహంసకు:—కలహంస-కలహంసము, రాజహంస, హంస-హంసము. (తె) రాయంచే (చూ, రాజహంస 1-2-3 అర్థములు దీనికి వర్తించును.); 3. మధురముగాఁ బలికెడిహంసకు.—అధూసరచ్ఛదము, కలహంస-కలహంసము, కాదంబము, రాజహంస, హంస-హం

సము; ౪. మాసిన ముక్కుకాళ్లుగల హంసకు.—మల్లికము, మల్లికాక్షము; ౫. నల్లని ముక్కుగల హంసకు.— ధార్తరాష్ట్రము. (ఇందలి ౨-౩ అర్థములలోని హంస—హంసము అను శబ్దములు హంసయొక్క విశేషములనిగ్రహించేది.); 2. యోగివిశేషము: చూ, యోగి; 3. పరమాత్మ: చూ, హంసుఁడు; 4 తెల్లగుఱ్ఱము: చూ, హయము; 5. మంత్రవిశేషము: చూ, మంత్రము. 1; 6. శరీరవాయువిశేషము: చూ, వాయువు; 7: మత్సరము, మాత్సర్యము, అంకము, అక్షాంతి, అమర్షము, అసహనము, అసహిష్ణుత, అసహ్యత, ఈర్క్ష్య-ఈర్ష్య, రాగము, శంబలము. (విణ) కుహనము. (తె) ఈరస-ఈరసము-ఈసు, ఊఁద, ఊసివాసము, ఎరుసు, ఓర్వమి, కడుపుబ్బు, కడుపుమంట, కనుపూఁద, కనుసుట్టుఁదనము, కరకరి, కరకొమ్మ, కాంతాళము, చేలపకారము, చేలము, మచ్చరము, మచ్చరికము, సూడు; 8. (ఉత్తరపదమైనచో) శ్రేష్ఠము. "రాజహంస"; అం. 9: చూ, కూజితములు.

హంసకము. సం. వి. అ. పుం, న. (హంసవలెఁ బలుకునది) కాలియందె (లేక) కాలికడియము: చూ, భూషణము. 2. (హంసక పాదకటకశబ్దములు కాలిసొమ్ము పేళ్లనికొందఱు). (పాదకటకము=కాళ్లకడియము.)

హంసతూలికాతల్పము. సం. వి. అ. న. అంచెగరులపాన్పు: చూ, శయ్య. 1.

హంసనాదము. అం: చూ, జన్యతాళములు.

హంసపక్షము. అం: చూ, అసంయుతహస్తములు.

హంసపదన్యాయము. అం: చూ, ఒకానొక న్యాయము.

హంసపదము. సం. వి. అ. పుం.=అంచెపదము: రూ-హంసపాదము, అధ్యాహారము, ఊహము, తర్కము. (తె) అంచెపదము, (వా) హంసపాదు.

హంసపాదము. సం. వి. అ. పుం.—పై.—

హంసపాది. సం. వి. ఈ. స్త్రీ.=అంసపాది*. (మిశ్రమనికొందఱు): కాకాండము, కాంక్షితపిత్రయము, కీటపాది-కీటపాదిక, కీటమాత, కీటమారి, కీటమాలిక, గోధాపది, గ్రీష్మసుందరి, ఘృతమండలిక, ఘృతమంథ, చర్మాగము, త్రిపత్రిక, త్రిపాది, ధృతరాష్ట్రపది, రక్తపాది. (తె) అంసపాఁది, చెర్పుటట్ట*.

హంసపాదు. వా. వి: చూ. హంసపదము.

హంసబకన్యాయము. అం. కొంగలలో హంసయున్ననోదానిపేరు వర్తిత్వలు గాన్పింపఁ వను రీతి.

హంసమాల. అం: చూ, వృత్తము 1. ("స-ర-గురువులతోఁగూడినదై ఏడవఛందస్సునఁ బుట్టిన వృత్తము")

హంసము. సం. వి. అ. పుం: చూ, హంస. 1-౨, 3.

హంసమోచ. సం వి. ఆ స్త్రీ. పిన్నబూరుగు*: చూ, శాల్మలి.

హంసయాన. సం. వి. ఆ. స్త్రీ =అంచెనడక: [చూ, స్త్రీ.

హంసరథుఁడు. సం. వి. అ. పుం =అంచెరవుతు: చూ, బ్రహ్మ. 1.

హంసరాహిత్యుఁడు. సం. వి. అ. పుం.—పై —

హంసరుతము. అం: చూ, వృత్తము. 1. ("మ-న-గగములతోఁ గూడినదై 8వ ఛందస్సునందుఁబుట్టిన వృత్తము.")

హంసవాహనుఁడు. సం. వి. అ. పుం: చూ, హంసరథుఁడు.

హంసాయి. వా. వి. 1. ఇరుగుపొరుగువాఁడు; 2. పెత్తనముగలిగియుండుట; 3. సరిహద్దుదారు.

హంసాస్యము. సం. వి. అ. పుం: చూ, అసంయుతహస్తములు.

హంసి. సం. వి. ఈ. స్త్రీ. ఆఁడుహంస: చూ, హంస. 1.

హంసిక. సం. వి. ఆ. స్త్రీ.—పై.—

హస్తధారణము. సం. వి. అ.న. రూ. హస్తవారణము. చేంపవచ్చినవాని నడ్డుట: రూ-హస్తవారణము, పరిత్రాణము, పర్యాప్తి.

హస్తపుచ్ఛము. సం. వి. అ.న. హస్తావయవములు(వ్రేళ్లు):కమ్యూసము. [శా(స్త్ర)ములోనివి.]

హస్తపుపాదువు. అం: చూ, ఉపవీతములు (మల్ల

హస్తపృష్ఠములు. అం: చూ, లక్షణాంగములు. (పురుషునకు:-హస్తపృష్ఠముపైమచ్చేయున్న కులక్షణమగు.)

హస్తపరిచారములు. అం: ఉత్తానము, అధస్థలము, పార్శ్వతలము, అగ్రితస్థలము, స్వసమ్ముఖతలము, ఊర్ధ్వగము, అధోగతము, పార్శ్వగతము, అగ్రిగము, సంముఖాగతము, పరాఙ్ముఖము, సంముఖము, ఊర్ధ్వముఖము, అధోముఖము, పార్శ్వతోముఖము. (15)

హస్తప్రాణములు. అం: పరిసారణము, కుంచితము, రేచితము, పుంఖితము,అపవేష్టితకము, ప్రేరితము, ఉద్వేష్టితము, వ్యావర్తకము, పరివర్తము, సంకేతము, చిహ్నము, పదార్థటీక. (12).

హస్తభము. అం: చూ, తతవాద్యములు.

హస్తభూష. సం. వి.అ. స్త్రీ. మురుగు: చూ, భూషణము. 2.

హస్తభేదము. అం: చూ, నృత్యములు.

హస్తము. సం. వి. అ.పుం. 1.= హత్తము (చేతులబడిన అరచెయ్యిగల మోఁచేతికి దిగువనున్న ప్రదేశము. దీనిచేత వస్త్రాదులు కొలువబడును) చేయి: అళ, ఐ,ఐక్యము,కరము, కరన్నువు, కులి, కుశాలి, గుడము, పంచశాఖము, పరిఘోరము,బాహ,బాహు_బాహువు, భుజ, భుజము. (తె):—కయి-కై, కేలు, చెట్టు, చెయి-చెయ్యి-చై-చేయి, బుజము, హత్తము. తద్విశేషములు:—౧. చంకకు.- కక్షము, కక్ష్య, కణము, దోర్మూలము, బాహుమూలము. (తె) చంక-చంకిలి-చక్కిలి, మడిసంది, ౨. మోఁచేతికి మీఁదిభాగమునకు.— ప్రగండము. (తె) దండచే-దండచేయి, సందిలి. (దృఢసంధికి: చూ, సంహతము);3.ముంజేయికి.-కటక,కిష్కు-వు, జఘునము, ప్రకోష్ఠము, మణి. (తె) మడికట్టు-మణికట్టు-మనికట్టు, ముని, ముంగేలు, ముంజెయి-ముంజెయ్యి-ముంజే- ముంజేయి; ౪.మణికట్టునుండి వ్రేళ్లతోఁగూడినచేయికి.- కంగులము, పంచశాఖము, పాణము_పాణి, ప్రతలము, ప్రహస్తము, శయము;౫. చాచినవ్రేళ్లుగల అఱచేయికి.—చపటము-చపేటము-చర్చరి, చర్పటము, తలము. (తె) చేప్పట;౬.కరపృష్ఠభాగమునకు.- (తె) పెడచేయి, మీఁజేయి; ౭. అఱచేయికి.—ఉద్ఘము, కరతలము, కిరంజి, ఖుజ, చపటము-చపేటము, తాలము, ప్రతలము, ప్రహస్తము,హస్తతలము (చూ,హస్తము. ౧-౪,౫) (తె)అరచెయి-అరచెయ్యి-అరచేయి. అఱ- అఱచెయి_అఱచెయ్యి-అఱచేయి, చేప్పట, లోచెయి-లోచెయ్యి. (చూ,హస్తము.1_౪, ౫);౮.పద్మమువంటిహస్తమునకు:-(తె) కేలందమ్మి;౯.హస్తాగ్రమునకు:—(తె)కేగయి; ౧౦.రోగినిపరీక్షించు హస్తమునకు: -అమృతహస్తము; ౧౧. శివునిహస్తమునకు.—పల్లారము;౧౨. ఈచేఁబోయిన చేయికి:—(తె) తొంటచేయి;౧౩. చేరెడుకు.—చులుకము, నికుబ్జము, పాణి, ప్రసృతి. (తె) చార-చేర_చేఱ-చేరెడు;౧౪. పుడిసిలికి:—చులుకము, ప్రసృతి. (తె)కొడిద-కొడిదిలి-కొణిదిలి,పుడిసలి-పుడిసిలి; ౧౫.కుదియఁబట్టినచేతలో సగముపరిమాణమునకు:-(తె)పుడిసెడు; ౧౬. దోసిలికి:—అమ్, అంజలి, పుటితము. (తె) అంజలి-అంజలికి, దోయిలి-దోసిలి; ౧౭.లొడితిలికి:-ప్రదేశము-ప్రాదేశము.(తె)

లోడిత-లోడితిలి; ౧౭. తర్జని మొదలైన నాలుగు వ్రేళ్ల అడ్డకొలతకు.—ప్రదేశము-ప్రాదేశము, భిత్తి. (తె) బెత్తిలి; ౧౮. చాచబడిన బొటనవ్రేలి చూపుడువ్రేలి నడిమి కొలతకు:—ప్రదేశము-ప్రాదేశము. (తె) జోట్ట-జోట్టిలి-జోట్టె-జోత్త-జోత్తిలి-జోత్తె; ౨౦: ముష్టి, ముష్టిబంధము, సంగ్రాహము. (తె) పిడి-పిడికిలి, గబ్బిలి-గుప్పిలి; ౨౧. పిడికిలి పట్టుటకు.—ముష్టిబంధము, సంగ్రాహము; ౨౨. చేదోయికి:—సంహతిలము, సింహతలము; ౨౩. గర్భపిడికిలికి.—విష్టి ౨౪. వంచబడినవ్రేళ్లుగల పుడిసిలికి:—(తె) కమి, కమికిలి, కుప్ప, పట్టిలి, లప్ప; ౨౫. వ్రేలుకు.—అంగుళము-అంగులి, అంగుష్ఠము, కరపల్లవము, కరశాఖ. (తె) వేలు-వ్రేలు తద్విశేషములు:—(౧) బొటనవ్రేలుకు:—అంగుళము, అంగుష్ఠము. (తె) అంగుటము-ఉంగుటము, పెద్దవ్రేలు, పెనువ్రేలు, బొటనవ్రేలు-బొటమనవ్రేలు-బొటవ్రేలు-బొట్టనవ్రేలు-బొట్టవ్రేలు, వేలు; (౨): తర్జని: ప్రదేశని-ప్రదేశిని. (తె) చూపుడువ్రేలు, జోట్టనవ్రేలు-జోట్టవ్రేలు-జోట్టెనవ్రేలు-జోత్తనవ్రేలు-జోత్తెనవ్రేలు, ముత్తనియవ్రేలు, మెండేడు; (౩): అనామిక. (తె) ఉంగగపువ్రేలు, దబ్బవ్రేలు; (౪): కణిక, కర్ణిక, మధ్యమ-మధ్యమము. (తె) నడిమివ్రేలు-నడివ్రేలు, నిడివ్రేలు; (౫): కనిష్ఠ, కనిష్ఠిక, కనీని-కనీనిక, ఊర్మిక. (తె) చిటికెన, చిటికెనవ్రేలు-చిటివ్రేలు-చిట్టివ్రేలు, పిల్లవ్రేలు; ౨౬. చిటికె చాచినమూరకు:—అరత్ని, రత్ని. (తె) పిడిమూర; ౨౭. రెండుచేతులకొలదికి:—కరము, కిష్కువు, హస్తము. (తె) మూర, మూరెడు; ౨౮. మోచెయ్యికి.—కఫణి-కఫోణి-కఫోణి, కీలము, కుర్పరము-కూర్పరము, కూబరము, కూరరము. (తె) మోచెయి-మోచెయ్యి-మోచేయి; ౨౯: చూ, నఖము, పునర్నవము; 30. హస్తపరిమితార్థములు:—(తె) జిట్టెడు, జొత్తెడు, జేనెడు, నల్లెడు, పిడికెడు, పుడిసెడు, బారెడు, బెత్తెడు, మూరెడు; 31. భుజశిరస్సునకు:—చూ, స్కంధము; 2. తొండము: చూ, శుండము. 1; 3. మూర: చూ, హస్తము. 1—27; 4. (కేశపర్యాయములకు వెనుక వచ్చినపుడు) వానిసమూహము. "కేశహస్తము, కేశపాశము, కేశపక్షము".

హస్తములు. అం. 1: దక్షిణహస్తము, వామహస్తము; 2: చూ, నాట్యోపయోగములైన యంగములు (చూ, అంగము. 9.)

హస్తరేఖలు. అం. 1. పురుషలక్షణాంగములు ౫౫ లో నొకటి: చూ, లక్షణాంగములు; 2. స్త్రీలక్షణాంగములలో నొకటి: చూ, స్త్రీలక్షణాంగములు. (హస్తరేఖల విషయము మహారము. ఇందుకు సాముద్రిక శాస్త్రము చూడదగు. గ్రంథ విస్తరభీతిచే నిట వివరించలేదు.)

హస్తలాఘవము. అం: చూ, ఐంద్రజాలికము.

హస్తవారణము. సం. వి. అ. న. 1. చేతితో అడ్డగించుట: చూ, సంరోధము; 2. చంపెడువాని హస్తముపట్టి నిలుపుట; 3. చంపవచ్చినవానినడ్డగించుట: చూ, హస్తధారణము.

హస్తాంగుళములు. అం: చూ, లక్షణాంగములు. ("పురుషునికి:—చేయి సగముపంచిన వ్రేళ్ల సందులు లేకున్న శుభలక్షణవంతుండగు. వంకరలై రొడములైన దరిద్రుండగు. శుభములై వరములుగనుపించు భావకుడుండగు")

హస్తాంగుళనఖములు. అం: చూ, లక్షణాంగములు. ("పురుషునికి:—వంకరలై తెల్లనై యున్న దుఃఖవంతుండగు. పుప్పిగలిగిన దుష్టుండును కామభోగవర్జితుండును నగు. పచ్చైగనున్న బ్రహ్మఘ్నుడగు. అర్ధ్రిపుత్రులవలె

మనుపుగలిగి తామ్రవర్ణములైన రాజెగు. వర్తులములైన నైశ్వర్యప్రదము. పుష్టితములైన శుభగత్వము. మొనలు వంకలై త్రిశూలసమములై ఆఃసియున్న దరిద్రుఁడగు")

హస్తాగ్రము. సం. వి. అ. న. కేలికొన: చూ, హస్తము.

హస్తాభరణము. అం: చూ, కామమానములు.

హస్తావలంబము. సం. వి. అ. పుం. చేదండ: చూ, భూషణము. 2.

హస్తి. సం. వి. న్. పుం =అత్తి హత్తి, ఏనుఁగు: ఆదీనము, అనేకపము, అరాళము, అనుగము, ఇభము, ఋ, కంజరము–కంజారము, కంబువు, కక్షీవంతము, కటి (కటి), కపటి, కపి, కరటి, కరభి, కరి, కరేణువు, కర్ణికి, కాలింగము–కాళింగము, కుంజరము, కుంభి, కునాసికము, కూబరము, కృష్ణము, క్రోడము, గజము, గిరి, గిరిమానము, గూఢముష్కము, చందిరుఁడు, చక్రపాదము, జలకాంక్షము, జీమూతము, దంతావళము, దంతి, దీర్ఘమారుతము, ద్విపము, ద్విపాయి, ద్విరదము, నాగము, పద్మి, పిండపాదము, పిప్పలాశనము, పీలువు, పుష్కరము–పుష్కరి, పేచకి, పేచిలము, మతంగజము, మహామరము, మహామృగము, రాజీవము, లతాలకము, వరాంగము, వారణము, విలోమజిహ్వ, విషాణి, శుండాలము, శూర్పకర్ణము, శూర్పశృతి, శృంగారి, శృంగి, సమాజము, సామజము, సారంగము, సింధుకము, సింధురము, సింధువు, స్తంబేరము. (తె. ప): — అత్తి–హత్తి, ఇరుదంతి, ఎక్కుడు మెకము, ఏనిక–ఏనుఁగు ఏప్గు, గబ్బుచెంప మెకము, గొప్పబొజ్జ మెకము, గొప్పయజ్జె మెకము, గారు, చెయ్యిగలమెకము–చేగలమెకము, చేటచెవుల మెకము, పలుఁగొమ్ముల మెకము, బలునంజె మెకము, బలుహజ్జె మెకము, బల్లుల మెకము, రెంటతాగుడు, రెంటతాగుడు మెకము, వెల్లఁగొమ్ముల మెకము, సిబ్బిమని మెకము. తద్విశేషములు: — ౧. అష్టదిగ్గజములు: — ఐరావతము, పుండరీకము, వామనము, కుముదము, అంజనము, పుష్పదంతము, సార్వభౌమము, సుప్రతీకము. (౮); ౨. దిగ్భేదస్త్రీగజములు: — అభ్రమూతంగము; (౨) దక్షిణమునకు — అంగద, పింగళ; (3) పడమరకు. — అంజనము, అంజనిక, తామ్రకర్ణి, తామ్రపర్ణి; (౪) ఉత్తరమునకు — అంగన, అంజన; (౫) ఆగ్నేయమూలకు. — కపిల; (౬) నైరృతిమూలకు. — అనుపమ, సుమానము; (౭) వాయవ్యమూలకు. — శుభదంతి–శుభ్రదంతి; (౮) ఈశాన్యమూలకు. — అంజనావతి; 3. గజజాతులు — (౧) భద్రము (రాజెక్కెడి ఏనుఁగు) తద్వి: — ఉపవాహ్యము= ఔపవాహ్యము, పక్షము. (తె) పట్టపుటేనుఁగు; (౨) మందము (యుద్ధకాలమందు వాహనయోగ్యమైనది). తద్వి. — సన్నహ్యము; (3) గోకర్ణము, మృగము (అడవియందు తిరుగునది); ఈత్రివిధగజములకును మానభేదముచే అరాళము, అత్యరాళము, మద్యము, కనిష్ఠము, వామనము అని నామములు గలవు (చూ, గజశాస్త్రము 1035 పొరట). మఱియు పిష్టకము, వ్యాళము, పూతనము, మాత్సకము, మాయుకము, పంచనంగళము మున్నగు గజభేదములనేకములు గలవు. గజము యొక్క: — (1) శిరఃపిండములు కుంభములు. (2) కుంభములక్రిందిచోటు అరతము–అరతము, కుంభసంధి (అనికొందఱు). ప్రతిసరము. (3) వానినడిమిచోటు విదువు. (4) చెక్కిలికటము, గండము (అని కొందఱు). (5) నొసలు అవగ్రహము. (6) కనుగ్రుడ్డు ఈషిక. (7) కడకన్ను (కడగంటి

చోటు) నిర్యాణము. (8) కర్ణమూలము చూళిక. (9) దంతమూలము కరీరిక. (10) దంతమధ్యము కంఖము. (11) అడ్డముగా విసరఁబడిన కొమ్ముదెబ్బ పరిణామము. (12) నొసటిబొడిపి వాతకుంభము (తె) పిన్ననుదురు (13) వాతకుంభము క్రిందిచోటు వాహిత్థము. (14) వాహిత్థము క్రింది కొమ్ములలో పలిచోటు ప్రతిమానము. (15) తొండము శుండ. (16) తొండము చివర కర్ణిక (17) తొండమున వచ్చు తుంపురులు వమథువు. (18) ముఖమునందలి బొట్లగుంపు పద్మకము (19) మూఁపు ఆసనము. (20) మోఁకాలు ప్రోహము (21) మోఁకాలి క్రిందిచోటు సందానము. (22) పిక్కకుముందటిచోటు అయస్కారము. (23) ప్రక్కచోటు పక్షభాగము. (24) ముందటిచోటు దంతభాగము. (25) ముందటికాళ్ల పిక్కలు మొదలుగాఁగలచోటు గాత్రము (26) వెనుకటికాళ్లపిక్కలు మొదలుగాఁగలచోటు అపరము (27) మెడనుగట్టెడు గొలుసు కలాపకము. (28) కాళ్లఁగట్టెడు గొలుసు త్రిపది (29) నడుమునఁగట్టెడు మోకు వరత్ర (30) దీనిని అయితము జేయునపుడు మెడనుగట్టెడు త్రాడు సజ్జన (31) వీఁపుమీఁదఁ బఱచు కంబళము విధానము. (32) గంతకారి. (33) ఇది నీళ్లమునుఁగుట నిర్వాణము. (34) దీనిఅలంకారము శృంగారము, భూతి (అనికొందఱు). (35) దీనిఁబట్టుటకు త్రవ్వెడు పల్లము అవపాతము. (36) దీనికిఁగలిగెడు పిత్తజ్వరము పాకలము. (37) మదము దానాది దానాదులు శ. (చూ, మదములు 1990 పొరట.). ఇందుకుసంబంధించిన మతికొన్ని విశేషములు:— (38) ఏనుఁగుయొక్క మందబుద్ధి ప్రసరించుటకు .— అవిన్తాల. (39) ఏనుఁగు వెన్నెముకయొక్క మాంసాదిభాగమునకు.— తన్మనము (40) కొమ్ముతో నడ్డముగాఁబొడిచినది (ఏనుఁగు) నకు:—(విశే) పరిణతము (41) ఏనుఁగురేతస్సునకు.- మదము. (42) తనకిదుపుమబాసి యొంటిగాఁ చరించెడు ఏనుఁగకు - పక్షచరము (43) సేనాపతికిని, రాష్ట్రమునకును నాశనము కలిగించు ఏనుఁగునకు — మాయుకము (44) చిన్నకొమ్ములుగల ఏనుఁగకు —(తె) మొక్కట్టీఁడు - మొక్కడి; (45) ఏనుఁగుకొమ్మునకు — రజతము, విషాణము (చూ, హాస్తి (58)) (46) ఏనుఁగుకవచము ప్రఖరము. (47) ఏనుఁగుకాలు ప్రోహము. తద్వః- మోఁకాలుప్రోహము. (48) తొండము చివరకు -అంగురి—అంగులి, కర్ణిక, గండూషము, పుష్కరము, స్రోతస్సు. (తె) తొండముచివర. (49) తెగకు ముఖ్యమైన ఏనుఁగునకు — యూథనాథము, యూథపము (తె) పరికాడు (50) ఏనుఁగును కట్టుచోటునకు — గంజబంధని (చూ, స్థానము 1-2) తద్వి —(1) ఏనుఁగును బట్టెడు చోటునకు - వారి; (2) ఏనుఁగును బట్టెను పల్లమునకు — చూ, వారి 6. (51) ఏనుఁగు నడితరపువడకు — స్థూలోచ్చయము (52) ఏనుఁగుల గుంపునకు.— ఘట-ఘటితము, గజత, హాస్తికము (53) ఏనుఁగు కాలి కణుపునకు.— చరణపర్వము, ప్రోహము (54) ఏనుఁగు కుంభస్థలముకడచోటుకు .— శంబుకము - శంబూకము. (55) ఏనుఁగుతోఁక మొదలునకు - పేచకము. (56) గజకుంభమునకు — పిండము. (57) కొలఁదికి రెండరత్నులుకొరవడిన ఏనుఁగునకు:— కనిష్ఠము. తద్వి.— ఏడరత్నుల పొడుగును తొమ్మిదియరత్నులనిడుపును పదియరత్నుల వెడల్పునుగల యేనుఁగునకు — శుభము. (58) ఏనుఁగుదంతమునకు:— ఈశాదంతము, [illegible], కుంజము, గజదంతము, జీవదంతము, నా

గదంతము, మహాదంతము. (తె) కొమ్ము. (మా, పల్లు. 1.); తద్వి.—(౧). ఏనుఁగు జీవించియుండఁగా కోసియెత్తిన దంతమునకు.—జీవదంతము. (౨) కొమ్ములులేని యేనుఁగునకు.—మత్కుణము; (59) నిర్మించిన ఏనుఁగునకు.—కల్పితము. (60): నారాచము, తుండ. (తె) నీరేనుఁగు. (61) ఏనుఁగుమీఁది పీఠమునకు.-పల్యాణము. (తె)అంబారి, చేవుడోలు-చౌడోలు, పల్లవ-పల్లవము, హౌవుదా-హౌదా. (62) ఏనుఁగును కట్టు స్తంభమునకు:—కరిబంధము,పొ్రిక్ధి. (63) ఏనుఁగు కుంభస్థలమునకు.—కుంభము, ఘటము. (తె) కుండ. (64) విఱిగినపల్లుగల ఏనుఁగునకు.—ఖండపరశువు (65) ఏనుఁగు ముక్కునకు.—కరము, తుండము, శుండ-శుండము, హస్తము. (తె) కయి-కై, కేలు, చెయి - చెయ్యి-చే-చేయి, తొండము. (66) మగయేనుఁగునకు:—పుష్కరి. (తె) కొమ్మయేనుఁగు. (67) ఆఁడేనుఁగుయొక్క అంతర్భాగమునకు.—ఇ. (68) సత్తువలేని యేనుఁగునకు—వీతము.(69)లేఁతఏనుఁగుపిల్లకు.—కరిజము, కరిపోతనము, కరిశాబకము, కలభము-కళభము, కారుజము, కుతపము, వికర్ణము. (తె) ఎత్తుగున్న, కొదమయేనుఁగు, గున్న. తద్వి.-పోతము, బాలము,వికర్ణము. (70) కొన్నిరకముల ఏనుఁగులు:—(౧) కంబోజము-కంభోజము- కాంభోజము. (౨) కశేరువు. (3) కుబ్జము. (౪) పిష్టకము. (71) వయస్సునుబట్టి ఏనుఁగులు:— (౧) 5 సం= బాలము. (౨) 10 సం= పోతము. (3). 14 సం=ఇభేరమము. (౪). 15 సం= కపోతము. (౫). 16 సం.=కుతపము. (౬). 17 సం.=అమోది. (౭). 19 సం.=తుండి. (౮) 20 సం.=కలమము, వికర్ణము. (౯). 30 సం.-కలభము-కళభము. (72) మత్తగజమునకు.—అంకుశదుర్ధరము, ఆరాళము, ఉపాశ్రయము, ఋషభము,గంధగజము, గంధమాదనము, గంభీరవేది, గర్జితము, చాలకము, తుంగభద్రము, ప్రభిన్నము, మత్తము, మదకలము, మదహస్తి, వ్యాలకము. (తె) మదటయేనుఁగు, మదపుటేనుగు,మదహస్తి. (73) మదమువిడిచిన ఏనుఁగునకు.—ఉద్ధాంతము, ఉద్భ్రాంతము, ఉద్వాంతము, ఉపపన్నము, గతసన్నకము,నిర్మదము. (74) హింసించు (చెంపు) నట్టి మదపుటేనుఁగునకు.—ఘనాఘనము. (75) ఆఁడేనుఁగునకు.—ఇ, ఇభి, ఇభ్య, కచ, కటంభర, కటుంబరము, కరిణి, కరేణువు, కుంజర-కుంజరి, కుంభిని, కుముద, గణిక, గణేరువు, ధేనుక, వర్తకి, పత్త్రిణి, పుష్కరిణి, బంధకి, వరాంగము, వశ, వాశిత-వాసిత, హస్తిని. (తె) ఆఁడేనుఁగు, పిడియేనుఁగు. (76) ఇంద్రుని ఏనుఁగునకు.—అభ్రమాతంగము,ఇరావణము,ఐ, ఐరావణము, ఐరావతము, గజాగ్రణి, చతుర్దంతము, పున్నాగము, భద్రరేణువు, మందావరము, శ్వేతద్వీపము, సుదాము, హస్తిమల్లము. (తె. ప) అడవిపుట్టువు, వేదలయేనుఁగు-వేదలయేన్గు, చేవుదంతి-చౌదంతి, జోలుపుట్టువు-జోల్పుట్టువు, తెల్లయేనుఁగు, నీరుపుట్టువు, మబ్బురూవరి, వెంపటిహస్తి, వెలిగారు,వేగంటియెక్కుడు,వేలుపులగారు.

హాస్తికంద. సం. వి. అ. (స్త్రీ) ముల్లంగి *: అభ్రమార్దవము, కటిమూలము, కుంజరక్షారమూలము,కురకందకము,కుష్ఠహంత్,క్షారకము, గిరివాసి, గజకంద, గృంజనము, నీలకంఠము, మూలకము, హరిపర్ణము, హాస్తిదంతకము. హిలమోచి-హిలమోచిక. (తె) ముల్లంగి. చిలకకూర-చిలుకకూర-చిల్కకూర (అని కొందఱు). తద్విశేషములు:— ౧. పిన్నముల్లంగికి.—కర్కటము, తుణక

ము, క్షుద్రమూలకము, చరణామల, పిండమూలము, బాలేయము, విష్ణుగుప్తఫలము, విస్రము, పాలోవ. (తె) పిన్నముల్లంగి; 2: మహామూలకము. (తె) పెద్దముల్లంగి.* (చూ, నూరణము.)

హస్తికము. అం: చూ, ఆసనములు.

హస్తికర్ణి. సం. వి. ఈ. స్త్రీ: గజకర్ణి. (తె) ఏనుఁగుచెవిచేమ. * (ప్రసవించిన స్త్రీలకు దీని ఆకులు ఆముదములో వెచ్చచేసి పొత్తికడుపునఁగట్టిన మైలరక్తము జారీయగును.)

హస్తికందకము. సం. వి. అ. పుం. ముల్లంగి*: చూ, హస్తికంద.

హస్తినఖము. సం. వి. అ. పుం. (ఏనుఁగుగోరువలెనుండునది) పట్టణము వాకిట గొబ్బున శత్రువులు రాకుండునట్లు నిమ్నోన్నతముగా చేసిన మట్టితిన్నె: మాలకము, మాలము. (తె) తిన్నె, దిబ్బ.(చూ, భూమి. 1-౯౯): చూ, వేదిక.

హస్తినపురము. అం. రూ-హస్తినాపురము-హస్తిని, హస్తినిపురము-హస్తినీపురము, ఢిల్లి: చూ, దేశములు. ౨౦. 1516 పొరట.

హస్తినాపురము. అం.—పై.—

హస్తిని. సం. వి. ఈ. స్త్రీ. 1. ఆఁడేనుఁగు: చూ, హస్తి (75.); 2: చూ, హస్తినపురము; 3. హస్తినీజాతిస్త్రీ: (ఊర్ధ్వములైన యల్పకేశములు, వక్రస్తనములు, ఉన్నతదంతములు, మధుగంధము, గూఢస్వరము, ఊరుసౌభాగ్యము, ద్రవ్యమందుకోర్కె కలిగియుండును.): చూ, స్త్రీ; 4. గురుగు*: కరటుకము, కురకటము, కురుటకము, కృష్ణ, పిచుకము, భూరుండి, మస్తకమంజరి, శ్రీహస్తిని, సితవాలుకము, సూక్ష్మఫల. (తె) గురుగు, గురుగువల్లిక *; అం. 5: చూ, స్త్రీజాతులు; 6: చూ, అవాంతరజాతులు.

హస్తినిపురము. అం: చూ, రూ-హస్తినపురము.

హస్తినీపురము. అం.—పై.—

హస్తిపకుఁడు. సం. వి. అ. పుం: చూ, హస్త్యా[రోహుఁడు.

హస్తిపదన్యాయము. అం. ఏనుఁగడుగులోనన్ని జంతువులయడుగులు నిముడుననురీతి.

హస్తిపర్ణి. సం. వి. ఈ. స్త్రీ. ఎఱ్ఱాముదము*: చూ, వ్యడంబకము.

హస్తిమల్లము. సం. వి. అ. పుం. ఇంద్రునియేనుఁగు: చూ, హస్తి.

హస్తిమశకన్యాయము. అం. ఏనుఁగునకును దోమకును నెంతయంతరువో అంతయనురీతి.

హస్తిశుండి. సం. వి. ఈ. స్త్రీ: అస్థిసంహారము, వజ్రవల్లి, వజ్రాక్షి, వనాలిక. (తె) నల్లేరు*.

హస్త్యారోహుఁడు. సం. వి. అ. పుం. (ఏనుఁగునెక్కువాఁడు): ఆధోరణుఁడు, ఆరోహుఁడు, గజాజీవుఁడు, నిషాది, మహామాత్రుఁడు, యంత, వరారోహుఁడు, సాది, హస్తిపకుఁడు. (తె. ప) బరికాఁడు, మావంతి, మావంతు, మావటి, మావటికాఁడు, మావటివాఁడు-మావటీఁడు, మావతుఁడు (ఏన్గుకాపరి అనికొందఱు.)

హాళఁది. వై.వి.=హరిద్రా. రూ-అళఁది-అడది-అలిది-హాళిది: చూ, వర్ణము. 6.

హాళహాళి. సం. వి. ఈ. స్త్రీ. త్వర. రూ-హాళహాళిక-హాళాహాళి. ఉ, రా.6, ఆ.18: చూ, సంభ్రమము. 1.

హాళహాళిక. సం. వి. ఆ. స్త్రీ.—పై.—

హాళాహాళి. సం. వి. ఈ. స్త్రీ. 1.—పై.— విజ. 1, ఆ. 165; 2. శూరత్వము. సా. 2, ఆ. 175: చూ, శౌర్యము. 1; దే. వి. (1) కలకలధ్వని. నీలా. 3, ఆ: చూ, స్వరము. 2.

హాళిది. వై.వి: చూ, రూ-హాళఁది.

హాళ్లి. కొ. అవ్య. ఏమియు లేదనుటయందు వర్తించును. (హాళ్లికిహాళ్లి=సున్నకుసున్న): చూ, శూన్యము. 1.

# హా

హా. సం. అవ్య. 1. ఆశ్చర్యమును దెలుపునది: చూ, వింత. 1; 2. వ్యథ దుఃఖము పీడలోనగు వానిం దెలుపునది: చూ, శోకము. ౧౪—౧౫—౧౬.

హాకీము. వా. వి. 1. యజమాని; 2. వైద్యుఁడు.

హాజరు. వా. వి. వచ్చుట, ఉండుట, నిలుచుట.

హాజరుపట్టీ. వా. వి. (అటెండెన్సు రిజస్టరు) 1. వచ్చినవని వారలకొఱకేర్పడిన మస్తరు పాత్రము; 2. బడికివచ్చిన బాలబాలికల హాజరుపాత్రము.

హాజారము. దే. వి: చూ, రూ-హజారము.

హాజోలము. దే. వి.—పై—

హాటకగర్భుఁడు. సం. వి. అ. పుం. నలువ: చూ, బ్రహ్మ 1.

హాటకము. సం. వి. అ. న. 1. బంగారు: చూ, లోహము. 1; 2. ఉమ్మెత్త*: చూ, హలాపుష్పము.

హాని. సం. వి. ఈ. స్త్రీ. 1. తక్కువయగుట; 2. కీడు: అనయము, అనర్థము, అపకారము, అపకృష్టి, అపచయము, అపచితి, అపనయము, అపాయము, అమంగళము, అరిష్టము, అశుభము, ఖలీకారము, గండము, ప్రళయము, భంగము, మోప, రిష్టము, రిష్టి, విప్రకారము, వైశసము, వ్యసనము. (అవ్య.) అరాత్. (తె. ప):—అఱ, ఇబ్బంది, ఎగ్గు, ఎడరు, ఒంజిలి-ఒండిలి, ఒప్పమి, ఓగు, ఓటమి, ఓటు, కీడు, కోలుపాటు-కోల్పాటు, చెట్ట, చెడిది, చెడుగు, చెడ్డ, చెఱుపు-చెఱుపు, చేట, చేటు, చేటుపాటు-చేట్పాటు, చేడి, చేడిది, చేఁతఱికము, దగరము-దగరము, [దుండగము—దుండగీకము, దెబ్బర-దెబ్బరము, దోసము, పడవ, బెడఁద, మొప్పి, మోపాది, పిలుగు, పెబ్బర-పెబ్బ.
సేరి. తద్వి.—అప్పటప్పటికి ఒకరింపాడు బుద్ధియొక్క హానికి.—తప్పదు; వా. 3. వేఁపట: చూ, హింస. 1.

హానికాఁడు. వి. గుణ: అపకారి. (తె) రాయిడికాఁడు.

హాఫిక. సం. వి. ఆ. స్త్రీ: ఉజ్జృంభణము, ఉపప్రప్తిక, జృంభ, జృంభణము-జృంభము, జృంభితము. (తె) ఆవరింత-ఆవలింత-ఆవురింత-ఆవులింత.

హామిక. వై. వి. రూ-ఆమిక-ఆము, [అడిబీరము, కావరము, క్రొవ్వు, గజ్జె, దిమ్ము, మఁపు, మత్తా-మత్తు-మస్తు, మయికము-మైకము. (సం) ఉత్కటము, క్షీబ. తద్వి.—౧. ఏనుఁగుచెక్కిలి మదము.—కటారము; ౨. ఏనుఁగులోఁడము చివరము దమకరశీకరము; 3. ఏనుఁగుహృదయమదము.—చిక్కణము; ౪. ఏనుఁగుమదమునకు.—గఁడకుసుమము; ౫. ఏనుఁగుమదములకు.—(చూ, మదములు.)

హామీ. వా. వి. పూచీ, బాధ్యత, జామీను.

హామీదారు. వా. వి: చూ, లగ్నకుఁడు. 1.

హాయనము. సం. వి. అ. పుం, న. (వరుసగా ఋతువులను గడచేనది.) రూ-హాయనము: చూ, సంవత్సరము; 2. కిరణము (సూర్యచంద్రాదుల కిరణములయందు వర్తించునది.): అంశము, అంశువు, [అభిషువు-అభీశువు-అభీషువు-అభీషుపు-అభీషువు, అర్చి-అర్చిస్సు, ఇయాంసము, [క్ష్మ ఈహ, ఉస్రము, ఋషి, ఓజస్సు, ఔస్రము, కరము, కిరణము, గభస్తి, గోవు, గ్రీవము, ఘృణి, ఘృష్టి, ఛవి, త్విట్టు, దీధితి, ద్యుతి, ధృష్టి, పదము-పాదము, పృశ్ని, భంబు, మయూఖము, మరీచి, రశ్మి, వసువు, శిఖ, హరి. (తె. వ):—కలుకు-కల్కు, చేయి, తళుకు-తళుక్కు-తల్కు, త్రాడు, నిగ్గు, మించు, మిసు

కు, మెఱుఁగు, వెలుఁగు. తద్వి.—౧. సూర్యకిరణమునకు.—ఇంద్రాయుధము, ఉఖ, కకిరణము, కఘృణి, గభస్తి, ట, భా, భానువు, భానుము, రుక్కు, రుచి, రోచిస్సు, శోభిస్సు, హేతి; ౨. చంద్రకిరణమునకు.—ఇ; ౩:(తె) పొగకఱ్ఱ; ౪: (తె) నీరుకాళ్లు; పుం. ౩. హాయనమను ధాన్యము: చూ, ధాన్యము.

హాయి. దే. వి. 1. సుఖము, సౌఖ్యము: చూ, హ్లాదనము; 2. అపరిమితసుఖము: చూ, హ్లాదనము.

హారకుఁడు. సం. వి. అ. పుం. 1. దొంగ. (అన్నిరకములగు దొంగలకును వర్తించును): అపహర్త-ఆహర్త-అపహరుఁడు. అపహారుఁడు, ఐకాగారికుఁడు, కలమూఁడు, కుంభిల్యుఁడు-కుంభీరుఁడు-కుంభీలుఁడు, కుఠంభయుఁడు, ఖర్పరుఁడు, చ, చోరుఁడు, చౌరుఁడు, ఝు, త, తస్కరుఁడు, దస్యుఁడు, దివాభీతుఁడు, పరాస్కంది, పాటచ్చరుఁడు, ప్రతిరోధి, మలిమ్లుచుఁడు, మోషకుఁడు, లుంటాకుఁడు, శంకిత వర్ణకుఁడు, స్తేనుఁడు, స్తేయి, హారి. (తె.ప):—ఎతుబరికాఁడు-ఎత్తుబరికాఁడు, కొల్లకాఁడు, చోఱకారుఁడు, చేవాఁడికాఁడు, జోజేరకాఁడు, డొంగ-దొంగ, తపళి, తెక్కలికాఁడు, దాఁపరీఁడు, దొద్దకాఁడు, దోఁపరి, దోఁపిడికాఁడు, దోఁపుకాఁడు (దోఁపుడుకాఁడు), ద్రోఁచేవాఁడు-ద్రోయువాఁడు, నాఁచే, పచ్చిదొంగ, పచ్చెకాఁడు, బరి, మచ్చేరి, ముచ్చు-మ్రుచ్చు, రేదిమ్మరి-రేదిమ్మరీఁడు, లోవాడికాఁడు, వల్లడికాఁడు, వాఁడికాఁడు. తద్విశేషములు:—౧. మాటలదొంగకు:-(తె) ముడియువిడుపు-ముడియవిడుప్పు, ముల్లియవిప్పు (ముల్లియవిప్పువాఁడు); ౨. కన్నగానికి:-అఖనికుఁడు, కపికుఁడు (కపీకుఁడు), ఖనకుఁడు, ఖానిలుఁడు, కుంభిలుఁడు, సురంగాహి. (తె) కన్నగాఁడు, కన్నడీఁడు, గండిదొంగ, గజిముచ్చు, గడిదొంగ (ఒకపెతెఁగినదొంగ), పచ్చిదొంగ, బందకాఁడు-బందకాఁడు, బొక్కలాఁడు; ౩. దారిదొంగకు:—చిల్లాభుఁడు, పరిపంథి. (తె) ఎడతోవకాఁరి, ఏనాది, తెరువాటుకాఁడు, తెరువాటీఁడు, దారిదొంగ, పాలరి-పోవరి; ౪. వమ్మించి దొంగిలించేదొంగ:—(తె) దొరఁకుసన్నాపి, దొరకోలుసన్నాసి; ౫. పెద్దదొంగకు:—(తె) గజిముచ్చు, గరిడిముచ్చు, జెట్టింగ, మ్రిమ్చెగోర; ౬. అడవిదొంగకు.—(తె) ఎల్లాఁపి; ౭: (తె) కత్తెరదొంగ; ౮. శ్లోకార్థచోరునకు:— కుంభిల్యుఁడు; ౯. కావ్యచోరునకు:— చంద్రరేణువు; ౧౦. చేంపిద్రోఁచేకొను దొంగకు.—కుజంభిరుఁడు-కుజంభల్యుఁడు-కుజంభిలుఁడు, వధచౌరుఁడు; ౧౧: (తె) తడకదోపరి-తడికద్రోపరి-తడికదోపరి; ౧౨. పరిహరించేవాఁడు:—పరిహారి, హారి; ౧౩. (తె) ఎల్లాఁపికత్తియ; ౧౪: (తె) కొల్లకత్తె, దొద్దకత్తె; ౧౫. ఎదురుగా దొంగిలించేవాఁడు:—పశ్యతోహరుఁడు. (తె) మునిముచ్చు; ౧౬. ఎదురుగా దొంగిలించేనది (స్త్రీ):- పశ్యతోహరురాలు:— (తె) మునిముచ్చు; ౧౭: (విశ)—ప్రహారకుఁడు, ప్రహారి; ౧౮: పగటిదొంగకు.—కుసుమాలుఁడు, చోరుఁడు; ౧౯: (విశ) లుంటాకుఁడు; ౨౦: ఎఱుఁగఁదగినదొంగకు:-గోత్రుఁడు; 2. జూదరి:—అక్షదేవి, అక్షధూర్తుఁడు, అజగలుఁడు, అసభికుఁడు, అక్షకుఁడు, కితవుఁడు, కృష్ణభోజికుఁడు, కృష్ణకోహలుఁడు, దురూదరుఁడు - దురోదరుఁడు, ద్యూతకారుఁడు, ధూర్త-ధూర్తుఁడు, శరండుఁడు. (తె.ప).—జూజకాఁడు-జూదకాఁడు, జూజరి-జూదరి,

సాత్తరి, పండరకాఁడు - పండరపుకాఁడు తద్వి.—జూదమునకు— చూ, వ్యవహారము. 4; విణ. 3. దోఁచుకొనువాఁడు: చూ, చోరకుఁడు. 1-౧౭, ౧౮.

హారతి. వై. వి.=ఆరాత్రికమ్: ఆరతి-ఆర్తి, నివాళి—నివాళిక-నివ్వాళి-నివ్వాళిక, మంగళహారతి-మంగళారతి. (సం) ఆరాత్రికము, నీరాజనము, మంగళార్తి తద్వి.—యుద్ధసన్నద్ధుఁడైన వరిభునకిచ్చుహారతికి-లోహాభిసారము-లోహాభీసారము.

హారతికర్పూరము వై. వి. హారతికొఱకుప యోగించెడి తెల్లని సుగంధద్రవ్యము చూ, సిరము. (2)

హారము. సం.వి అ పుం. 1. (దీనిచేత మనస్సు హరింపఁబడును) ముత్యాలదండ రూ-హారి. ముక్తావళి. నూటయెనిమిది పేటల ముత్యాల పేరు చూ, హవణిక. 2 (చూ, భూషణము 2.). తద్వి.—విజయచ్ఛందము: చూ, హవణిక. 2 (చూ, భూషణము. 2); 2 =అలము: చూ, యుద్ధము. యుద్ధమునకు.—సమాహ్వయము. తద్వి.-౧ కల్లజగడమునకు.-(తె) లేనిమాట; ౨. పోట్లాటకు —వలజము, వాదము; 3. అట్లాటజగడమునకు — విస్రంభము; ౪. పులులజగడమునకు.—వీరంధరము; ౫. గొప్పయుద్ధమునకు - వైరాకోహము; విణ.3.హారసంబంధమైనది: చూ, (వి) ఛేదము. 8.

హారి. సం. వి ఇ.(స్త్రీ).1.పథికజనసమూహము: చూ, సమూహము; విణ. 2. మనోజ్ఞమైనది: చూ, హృద్యము; న్. ఈ. న్. 3. దొంగ. పరిహారి (అనికొందఱు): చూ, హారకుఁడు. 1-౧౨; 4. హరించువాఁడు, నశించువాఁడు; 5. మాలగలవాఁడు: మాలి.

హారిద్రము. సం. వి. అ. పుం. 1 కడిమి*: చూ, హాలిప్రియము; 2. పసుపురంగు: చూ, వర్ణము. 6; విణ. 3. పసుపురంగుగలది: చూ, వర్ణము. 6.

హారీతము. సం. వి అ. పుం. 1 పచ్చపిట్ట: చూ, హారితము 3; 2. కపటము: చూ, వ్యాజము. 1 [ముని: చూ, సవ్యాసి.

హారీతుఁడు సం. వి. అ పుం. హారీతుఁడను

హారువు దే వి. జూదమునందలిపరిభాష: చూ, భాషలు

హార్దము సం. వి. అ న. 1 (హృదయమందుఁ బుట్టినది.) చెలిమి: చూ, స్నేహము. 1; 2 ప్రేమ-ప్రేమము కనికరము చూ, దయ. 1. తద్వి —దాక్షిణ్యము, విరాళి, శూకము, సాంత్వము. (తె) మొగమాట-మొగమాటము-మొగమోట-మొగమోటము - మోమోట-మోమోటము-మొగవిచ్చే.

హార్యము. సం వి అ పుం. 1. తాండ్ర*: చూ, విభీతకము, విణ 2. హరింపఁదగినది.

హాల. సం వి. ఆ. (స్త్రీ). సారాయి. చూ, సుర. 2.

హాలము సం. వి అ. పుం. నాఁగేలు: చూ, రూ-హలము

హాలహాలము. సం వి. అ. పుం, న. రూ-హాలాహాలము. నలికండ్లపాము: చూ, సర్పము; 2 బల్లి: చూ, రూ-హాలాహాలము. 2; 3. ఒకానొకవిషము: చూ, సంగరము. 6

హాలాహలము. సం. వి. అ. పుం. 1. విషము. (రూ హాలాహాలము—హలాహాలము—హలహాలము-హాలాహలము-హాలహలము. హలహలము): చూ, సంగరము. 6. తద్విశేషములు -౧. ఒకానొక విషము; ౨. ఇందుకు సంబంధించిన వానికి:— చూ, సంగరము. 6; 2. బల్లి: రూ-హాలహాలము, అంజనము, అండజము, కుడ్యమత్సి, కుడ్యమత్స్య, కోకము, గృహగోళ, గృహగోధిక, గృహగోళిక, గృహాలిక, గృహోలిక, చికురము, జ్యేష్ఠ-దైవజ్ఞ, బల్లి,

ముసలి, హాలహాలము-హాలహాలము-హాలా హాలము.(తె) బల్లి. తద్వి.—౧. శకునములు చెప్పెడుబల్లికి.—(తె) గవుడు-గౌర గవులి-గౌళి; ౨.కాటుకబల్లికి.—అంజనాధిక, అంజనిక. (తె) కాటుకబల్లి; 3 తెల్లబల్లికి:—కుండుర్గిణావి, కుందుర్గిణ (తె) తెల్లబల్లి; పుం, న. 3. హాలాహలమను విషము: చూ, రూ-హాలాహలము. 1.

హాలికము. సం వి. అ. పుం. దుక్కిటెద్దు, సైరికము: చూ, వృషభము 1.

హాలికుఁడు సం వి అ. పుం రూ-హాలికుఁడు చూ, సేద్యకాఁడు.

హాలుఁడు సం. వి అ పుం. బలరాముఁడు చూ, హలాయుధుఁడు

హాలుసాలు. వా. వి. ఈసంవత్సరము: చూ, సంవత్సరము.

హాలుసాలుమక్తా. వా. క్రి ఈసంవత్సరపువంట.

హాలెము. దే వి అత్యంతము చూ, ముతిమతి.

హావడి దే వి రూ-హావళి ఆవడి చూ, విరత్తు.

హావము. సం వి అ పుం 1. భ్రూనేత్రాది వికారములచేత కొంచెము తెలియఁదగిన మనోవికారము కిలకించితము-కిలికించితము. తద్వి.—గాంభీర్యము, అం 2: చూ, శృంగారచేష్టలు.

హావళి. దే వి చూ, రూ-హావడి.

హాస. దే వి, విణ క్రొత్త (అం, భా తృ. 23) కన్నియ-కన్నె-కన్య, క్రొత్త, మిహి (సం) అక్లిష్టము, అభినవము, అయాతయామము, అధునికము, నవము, నవీనము, నవ్యము, నూతనము-నూత్నము, ప్రత్యగ్రము, ముగ్ధ, శారదము.

హాసము. సం. వి. అ. పుం. 1: చూ, రూ-హాస్యము; 2 (జనులను నవ్వించునది) హాస్యరసము. చూ, రసములు; 3. చూ, రసస్థాయీభావములు.

హసించు. సం అ.క్రి. నవ్వు: చూ, వెక్కిరించు. 3.

హసీలు. వా. వి. వన్ను: చూ, సిస్తు.

హనువు. సం వి. అ. న. దంతము: చూ, పల్లు.1. తద్వి.—౧. పల్లునకు.—రదకము; ౨. ఏనుఁగు దంతపల్లునకు — రాజదంతము; 3. ఏనుఁగుకొమ్మునకు.—చూ, హస్తి (౮౫-౫౯); ౪. మేఁకకొమ్మునకు —విషాణి, ౫. పందికోఱకు.—దంష్ట్రి, విషాణము. (తె) కోఱ, పందికోఱ; ౬ ఎద్దుగోనగువాని కొమ్మునకు:—(తె) కొమ్ము (చూ, పల్లు 1)

హాస్తికము. సం వి. అ. న ఏనుఁగులగుంపు: చూ, హస్తి

హాస్యకరుఁడు. సం వి: చూ, వికటకవి.

హాస్యకరులు. అం. చూ, సప్తాంగములు (చూ, అంగము. 3)

హాస్యగాఁడు. మి. వి. వినోదగాఁడు. (సం) కేళికిలుఁడు, కేళికిలుఁడు, పరిహాసకుఁడు, వాసంతికుఁడు (తె) పరియాచకుఁడు.

హాస్యము. సం. వి అ న 1. నవ్వు: రూ-హాసము, ద, స్మితి. (తె) అలరింత, ఇసిరింత, కేరింత, దిసంత, నగవు-నగు-నవు-నవ్వు-నా. తద్వి శేషములు —౧ చూ, హాస్యములు; ౨ చిఱునవ్వునకు — ఈషద్హసితము, దరహాసము, మందస్మితము, మందహాసము, స్మితము. (తె) అల్లఁతినగవు, ఎలనవ్వు, చిరునగవు-చిర్నగవు-చిర్నవ్వు-చిఱునవ్వు, మూసినగవు-మూసిమూసినగవు-ముసిముసినవ్వు, లేనగవు, 3: అపహసితము-అపహాసము-అపహాస్యము; ౪. అకృతరసమువలనఁ బుట్టిననవ్వు:—ఘర్ఘరము; ౫. తలయూడించుచేసినవ్వెడు నవ్వు —పరిహాసము; ౬. శిరఃకంపముతోఁ గూడిన నవ్వు:—పరిహసితము; ౭: అట్టహాసము, పరిహాసనము. (తె) పెదనవ్వు — పెద్ద నవ్వు; ౮. లోలోననవ్వు.—అంతర్హాసము,

ఉద్వర్ధనము. (తె)లోనవ్వు; ౯. ఎత్తిపొడుచేమేనవ్వుటకు:—అచ్ఛురితకము, సోత్ప్రాసము, సోల్లుంఠనము. (తె) ఎత్తిపొడుపు, దెప్పు; ౧౦: (తె) ఎకతాళి.(చూ, హాళి.5.)

హాస్యములు. అం: స్మితము, హసితము, విహసితము, పరిహసితము, అపహసితము, అతిహసితము. (6) (చూ, హాస్యము.)

హాసీలు. వా. వి. నవ్వు: చూ, సిస్తు. 1.

హాహా. సం. అవ్య: చూ, రూ-హా.1-2.

హాహాహుఁడు. సం. వి. అ. పుం. ఒకానొక దేవగాయకుఁడు. (గానము చేయునప్పుడు హాయను శబ్దమును పలికెడువాఁడు): హుహువు-హూహూవు: చూ, సీకారి. (గానమే ధర్మముగాఁగలవారు గంధర్వులనియును గలదు.)

హాళి. దే. వి. 1. సంతోషము: చూ, హ్లాదనము; 2. కాంక్ష: శ్రద్ధ, శ్లాఘ, సమాసంజనము: చూ, వాంఛ; 3. ఉత్సాహము: చూ, యత్నము; 4. ఒయారము: చూ, విలాసము. 2; 5. ఎగతాళి: ఆట, ఎకతాళి-ఎగతాళి, ఎకిరింత-ఎక్కిరింత, కేరడము, క్రేణి-గ్రేణి, కోడిగము-కోడిగెము, కోఱడము-గోరడము, గిగ్గలు-గేలి, తచ్చేన-త్రిచ్చేన, త్రిస్తరి, నగుఁబాటు-నవ్వుఁబాటు, నవ్వు, నవ్వుటాల(లు)— నవ్వులాట, పరాచకము-పరియాచకము- పరేచకము, పిసాళము, మందె మేలము, మేలము, వేలాకోలము- వేళంకోళము-వేళాకోళము, (వి. విణ) ఎకసకియము-ఎకసకెము-ఎకసక్కియము-ఎకసక్కెము-ఎకసెకియము-ఎకసెకెము-ఎకసెక్కియము-ఎకసెక్కెము-ఎక్కసకియము-ఎక్కసకెము-ఎక్కసక్కియము-ఎక్కసక్కెము-ఎక్క సెకియము-ఎక్కసెకెము-ఎక్కసెక్కియము-ఎక్కసెక్కెము. (సం. ప.) కేళిముఖము, క్రీడ, క్రీడనము, ద్రవము, నర్మము, పరిహసనము, పరిహాసము-పరీహాసము, ప్రహసనము, బర్కురము, రాసము. (చూ, విలాసము.). తద్వి:- ౧. స్త్రీపురుషుల పరిహాసమునకు:- కౌతుకము, సహాటనము. (తె) సయాట-సయాటము, సయ్యాట-సయ్యాట-సయ్యాటము; ౨. వేరలాటమునకు.—చూ, విలాసము. 1; 3. లీలకు.—(తె) సయాట-సయాటము-సయ్యాట-సయ్యాట-సయ్యాటము; ४. కందుకాదిక్రీడకు.—(తె) మందెమేలము, సయాట-సయాటము-సయ్యాట-సయ్యాట - సయ్యాటము: చూ, విలాసము. 1-४; వా. వి. 6. నిజాము దేశపు నాణెమునకుఁ బేరు: (చూ, బీజీ, కల్దారు. అనుబంధములో చూడుము.)

## హి

హి. సం. అవ్య. పాదపూరణమందు వచ్చెడి అవ్యయము. "అహంహియాస్యే నగరమ్" (తు-హి-చ-స్మ-హ-వై ఈయాఱును పాదపూరణమందువర్తించెను.)

హింగుది. సం. వి. ఈ. స్త్రీ: రూ-ఇంగుదము-ఇంగుది, క్రోష్టుఫలము, తాపసతరువు.(తె) గార, తపసి*.

హింగునిర్యాసము. సం. వి. అ. పుం. 1. ఇంగువరసము; 2. వేఁప*: చూ, వేము.

హింగుపత్రి. సం. వి. ఈ. స్త్రీ: మరుపత్రి*.

హింగువు. సం. వి. ఉ. న.=ఇంగువ. 1. ఉగ్రగంధము, జంతుకము-జతుకము, దారవము, పింగ, బాహ్లికము-బాహ్లీకము, రామఠము, సహస్రవేధి, సూపధూపనము, సూపాంగము-(తె):—ఇంగువ; 2. ఇంగువ*: ఉగ్రగంధము, కేశరము-కేసరము, గౌరి, పిణ్యాకము, పృథువు-పృథ్వి. (తె) ఇంగువ.* (ఇందలి పదములన్నియు 1-వయర్థమునకుఁ జెందును, వని కొందఱు.)

**హింగుళము.** సం. వి. అ. పుం.=ఇంగిలీకము. రాగద్రవ్యవిశేషము: అగురువు, కపిశీర్షకము, కురువిందము, చూర్ణపారదము, జాతిలింగము, దరదము-దారదము, రంజకము, రంజనము, రసగర్భము. (తె. వ):—ఇంగలము-ఇంగిలికము-ఇంగిలీకము, కెంపుకావి రాయి. (చూ, సౌగంధ్యము. ౬.)

**హింగుళి.** సం. వి. ఈ. స్త్రీ: కంటకవృంతాకి, దుష్ప్రధర్షణి, బృహతి, బంటాకి, వార్తాకి, సింహి. (తె. వ) ములక-ములంక, మోళంగి.*.తద్విశేషములు:—౧: శ్వేతబృహతి. (తె) తెల్లములక; ౨: మహావార్తాకి. (తె) పెద్దములక; 3. నేలములకకు.—(తె) నేలములక-నేలములగ-నేలమూలక, పిన్నములక, రాములక. (చూ, వాఁకుడు; చూ, సింహి. ౨.)*; ౪. కవ్రిములకకు:—(చూ, వార్తాకము. 1-౫). [నీరుగన్నేరు.*

**హింజలము.** సం. వి. అ. పుం. ఇలసము. (తె)

**హిండనము.** సం. వి. అ. న. 1. వ్యాపించుట, వ్యాప్తి: చూ, వ్యాపనము; 2: ఆఘూర్ణనము, ఘూర్ణనము, యంత్రము. (తె) జంతిరము-జంత్రము, తిరుగుడు-తిఱుగుడు, తిరుగుడు చీల, తిరుగుడునొక్కు-తిఱుగుడునొక్కు, మర-మఱ. తద్విశేషములు:— భ్రమణమునకు:-చూ, సంచారము. 1; 3. భ్రమణము: చూ, హిండనము. 2; 4. సురతము: చూ, సంయోగము. 1.

**హిండి.** సం. వి. ఈ. స్త్రీ. గౌరి: చూ, పార్వతి.1.

**హిండితము.** సం. విణ. వ్యాపించినది: అభ్రగుణము, ఆకులము, చితము, వ్యస్తము, వ్యాప్తము. (తె) పొలసము. (తె) విణ. ఆకులత, అకులపాటు. (చూ, సంవృతము). తద్వి.— ౧. వ్యాపనముగలది:—(తె) పిసాళి; ౨. ఒకటితోనొకటి కలసినది:—ఆకీర్ణము, సంకీర్ణము, సంకులము.

**హింతాలము.** సం. వి. అ. పుం.=ఈఁదాడు-గిఱకతాడు*: కోశము, గర్భస్రావము, తృణరాజము, ప్రలంబము, లతాంకూరము. (తె) ఈఁదాడి(ఈదాఁడు)-ఈఁదు, గిరకతాడి-గిగకతాడు-గిఱకతాడు. తద్విశేషములు:— ౧: పిండి; ౨: అల్పాక్షి; 3: కోలకర్కటిక; ౪: ఖర్జూరి, ఖర్జువు, గిరిపీలువు, వరూషి, మధుఖర్జూరిక, మృదుఫలము. (తె): చిట్టీఁత-చిట్టీఁదు; ౫: (తె) ఇందు, ఈఁత, ఈఁద, ఈఁదు; ౬. వృద్ధఖర్జూరమునకు.-అశ్వభత్స్య; ౭. పేరీఁదుకు.—ఖరస్కంధ, ఖర్జూరము, గాతువు, చీర్ణపర్ణము, వరూషము, పాండువు, రోషణము, వికచము. (తె. వ) ఉబ్బలి, కజ్జూరము-కజ్జూరము-కజ్జూరము (గజ్జూరము), పేరీఁదు; ౮. హింతాళఫలమునకు:-కిరిటి. (పైనఁజూపిన పర్యాయపదములు శీర్షికలయినచోటుల "చూ, మధుఖర్జూరిక" అనిఁజూపఁబడెనుగాని పొరపాటున "మధుఖర్జూరిక" 1992 పొరటలో శీర్షికాపదముగఁజూపలేదు. గాన "మధుఖర్జూరిక" అనుపదము అనుబంధములోఁజూపఁబడినది. అక్కడ చూడవలసిన విషయమిచేట పొందుపఱుపఁ బడినది.)

**హిందూమతము.** అం: చూ, మతము. 7.

**హిందూమహాసముద్రము.** అం: చూ, సముద్రములు.

**హిందోళజభాషలు.** అం: వేసరి, భూతమంజరి, వృషమధ్యమ, మధ్యవిత్తు, భిన్నవరాళి, గౌడి, మాళవవేసరి, చేవాటము, ఓంజలి.(9)

**హిందోళము.** సం. వి. అ. పుం. 1. ఒకానొక రాగము. (దీనిని శిశిరవసంతఋతువుల సంధిని పాడుదురు): చూ, స్వరము. 2; అం. 2: చూ, పురుషరాగములు.

**హింస.** సం. వి. అ. స్త్రీ. 1. చంపుట: అవిసర్జనము, అపాసనము, అభిమరము, అభిమా-

వము, ఆయోధనము, ఆరంభము, ఆలంభము, ఉజ్జాసనము, ఉద్వాసనము, ఉన్మంథనము-ఉన్మంథము-ఉన్మాథము, ఉపసంహారము, కారణము, కారము, క్రథనము, క్షణనము, క్షుజ, ఘాతము, దండము, నికారణము, నిబర్హణము, నిరసనము-నిరాసనము, నిర్యాతనము, నిర్వాపణము, నిర్వాసనము, నిర్గ్రంథనము, నిశారణము, నిషూదనము, నిస్తర్హణము, నిహననము, నిహింసనము, పరాసనము, పరిఘము, పరివర్జనము, పింజము, ప్రతిఘాతనము, ప్రమథనము, ప్రమాపణము, ప్రవాసనము, బంధనము, మారణము, వధము, వపువు, వర్జనము, విదారణము, విశరఘాతము, విశసనము, విస్రంభము, వ్యాపాదనము, శమనము, శరణము, శసనము, శేషము, సంజ్ఞపనము, సంజ్ఞప్తి, సంప్రహరణము, సంహారము, సంహృతి, సమాఘాతము, సమాపనము, సాధనము, సూదనము, హననము, హత్య, హాని, హింసనము. (అవ్య.) ఆక్. (తె. వ) కొల, చంపుడు, చేక్కాట, చేఁగరలాట, చిదుముట, జేపువు, తునుముట, తుంచుట, నుగ్గాట, పగదెంచుట, పరిమార్పు, పించేపడుపు-పీఁచేపడుపు, పొరిగొనుట, బారి, బిల్కుమార్పు, వెంపర, సదమదము, సదసద తద్విశేషములు:— నిద్రించునపుడు శత్రువులపైఁబడి చంపుట:— అవస్కంధము, సౌప్తికము. (తె) ముచ్చిలిపోటు; 2. దొంగతనము: చూ, హరణము. 1; 3. బాధించుట: చూ, శోకము; 4. పాపము: చూ, వృజినము. 1; అం. 5: చూ, అజ్ఞానదాయకములు. (హింసము అనికొందఱు.).

హింసకుఁడు. సం. విణ. హింసించువాఁడు: ఉన్మాథుఁడు, కపి, కష్టకారకుఁడు, కుఘాకువు, కుపాకువు, క్రూరుఁడు, క్షుద్రుఁడు, ఘాతుకుఁడు, నృశంసుఁడు, పాపుఁడు, పీడాకరుఁడు, బాధకుఁడు, మారకుఁడు, హంత. (తె. వ) కనుకట్టు, నమ్మెకాఁడు, ముక్కుకొయ్య, వల్లడికాఁడు, వేపరి. తద్వి.— ౧. చంపువానికి.— (తె) మూవకాఁడు, మూనరి; ౨. నఱకువానికి.— కుట్టకుఁడు, (మి) ఛేదించువాఁడు. (తె) నఱకువాఁడు; 3: చూ, వ్యాధుఁడు. 2.

హింసనము. సం. వి. అ. న. 1. చంపుట: చూ, హింస. 1; 2. బాధించుట: చూ, శోకము.

హింసాకర్మము. సం. వి. న్. న. హింసయే ఫలముగాఁగలిగిన యథర్వణవేద విహితమైన హోమాదికర్మము: కార్మణము, మూలకర్మము. (తె) చిల్లింగి.

హింసించు. సం. స. క్రి. 1. చంపు: చూ, సంహరించు. 2: కారించు, పీడించు, బాధించు, విషమించు, వేధించు. (తె) ఉడికించు-ఉడికిలించు, ఏఁచు, కక్కసపెట్టు, కక్కసించు, కతిలపెట్టు, గాసిఁబెట్టు, చెకపికలాడు, తల్లడపెట్టు, నొంచు, నొగులుచు-నొగుల్చు, నొప్పించు, పసగరగొను, పిరువీఁకుసేయు-పిరువీఁకులుసేయు, పీఁకిపిండెట్టు, ప్రాము, వెంపరలాడు, సతాయించు. తద్వి.—౧. (ని) బాధపఱుచు, సంకటపఱుచు; ౨: (మి) అతపరపెట్టు, (తె) తొందరచేయు, నచ్చుపెట్టు; 3: (తె) బారిముసరు, వెంపరలాడు.

హింసితము. సం. విణ. బాధింపఁబడినది:— అక్షతము, అర్దితము, కీర్ణము, కృతము, ప్రతిపన్నము, బాధితము, విద్ధము, వేధితము. తద్వి.— ౧. బాధించునది:— బాధకము. (తె) గొడ్డగము. (చూ, క్రూరము 9, కర్కశము); ౨. బాధింపఁదగినది:— బాధ్యము.

హింస్ర. సం. వి. ఆ. స్త్రీ. 1. నల్లయుప్పి... చూ, లవణి; విణ. 2. చంపునది: ఘస్రము,

శరారువు, శార్వరము, సమాపకము, సూదనము. తద్వి.— ౧. చేంపుటకు.— చూ, హింస. 1; ౨. చేంపంబడినది:— చూ, సూదితము.

హింస్రువు. సం. విణ. స్వభావముచేతనే చేంపువాండు: ఘాతకుండు, శరారువు.

హిక్క. సం. వి. అ. స్త్రీ. 1.=ఎక్కిలి (పైత్త్యమునం బుట్టునది. దప్పి లోనగువానిచేం గలుగు తెవులు.): అనుబంధ, క్షవథువు, విదాహము. (తె) ఎక్కిలి-వెక్కిలి-వెక్కలి-వెక్కిలి-వెక్కిలి- వెక్కిలి - వెక్క-వెక్కు; 2 పైండికంటియనుపక్షి: చూ, పకీసంపుంబులుంగు

హిజోరు. దే. వి: చూ, రూ. ఇజోరు.

హిజిరి. వా. వి. మహమ్మదీయశకము.

హిజ్జలము. సం. వి. అ. పుం. రూ-ఇజ్జలము ఎఱ్ఱగన్నేరు*: చూ, హయమారకము.

హిడింబజిత్. సం వి. త్, పుం. భీమసేనుండు: చూ, వృకోదరుండు.

హిడింబారమణుండు. సం. వి. అ. పుం. అంజనేయుండు: చూ, వానరము.

హితకారి. సం. వి. ఇ. పుం.=ఇతకరి: క్షముండు, హితుండు. (తె) ఇతకరి-ఇతవరి, ఇతవుండు, హితవుండు: చూ, స్నేహితుండు

హితము. సం. విణ. 1. వెనుకటికి మేలుచేయునది: ఆశీస్సు. (తె) మంచిపని: విణ. 2. ధరింపంబడినది: గృహీతము, ధృతము. తద్వి.- ధరింపందగినది:— ధర్తవ్యము, ధార్య; 3. పోయినది: అత్తము, అపగతము, అభ్యక్తము, గతము, యాతము, వీతము. తద్వి:—ప్రగతము, విగతము; 4.=ఇతము. హితవైనది, సమర్థము: చూ, స్నేహము. 1; అ. న. 5. చెలిమి: చూ, స్నేహము. 1.

హితపడు. మి. అ. క్రి: చూ, సాయించు.

హితవచనము. సం. వి. మంచిమాట, కల్యము, ఆరోగ్యము: చూ, శబ్దము. 2.

హితవరి. వై. విణ. (హితవు + అరి)=హితకారి: చూ, హితకారి.

హితవు. వై. విణ.=హిత. రూ-ఇతవు-ఇతము. సత్తుపన్యము, హితవుకలది: చూ, స్నేహము.1.

హితవుండు. వై. విణ.=హిత: చూ, హితకారి.

హితుండు. సం. విణ =హితవుండు.— పై—

హితావళి. సం. వి. ఈ. స్త్రీ. కుష్ఠుమనుమందు: చూ, మంగు. 1. [నుమంగళ.

హిమ. సం. వి. ఆ. స్త్రీ పాలకూర*: చూ,

హిమకరుండు. సం. వి. అ. పుం. చంద్రుండు: చూ, హిమాంశువు. [రిక్క.

హిమనిధితి. అం. మృగశీర్షానక్షత్రము: చూ,

హిమద్యుతి. సం. వి. ఇ. పుం: చూ, హిమకరుండు.

హిమద్రుమము. సం. వి. అ. పుం. పెద్దవేము*: చూ, వేము. [చూ, హిమము.1.1-౧.

హిమని. సం. వి. ఈ. స్త్రీ రూ-హిమాని:

హిమము. సం. వి. అ. న. 1.=ఇగము-ఇవము, మంచు: అవశ్యాయము, ఇందాగ్ని, ధూమము, ఋూ, కుజలము, ఖనిశాజలము, తుషము, తుషారము, తుహినము, నిహారము-నీహారము, ప్రాలేయము, మహిక-మిహిక, రజనీజలము, వరంధకము, హిమని-హిమాని, హిమిక. (తె.ప): ఇగము-ఇవము, ఈము, పొగమంచు, మంచు. తద్వి.—౧. మంచుసమూహమునకు.—కుహేళిక, ధూమిక, హిమని-హిమాని, హిమసంహతి. (తె) మూడమంచు; ౨. పిడుగునకు:— భిత్తిక: చూ, పిడుగు; 3: చూ, చేలిపిడుగు, 2. చందనము: చూ, వాసన. 1: విణ. 3. చేల్లనిది: అనుష్ణము, జడము, తుషారము, శిశిరము, శీతము, శీతలము, సిరము, సుషిమము.

హిమకరుండు. సం. వి. అ. పుం. చలివెలుంగు: చూ, హిమాంశువు.

**హిమగ్రస్తుఁడు.** సం. విణ. మంచుచేతఁగొట్టఁబడినవాఁడు: జడుఁడు. [కరుఁడు.

**హిమధాముఁడు.** సం. వి. న్. పుం: చూ, హిమ

**హిమవంతము.** సం. వి. త్. పుం. 1. మంచుకొండ. (మంచుగలిగినది. ఇది కింపురుషవర్గమునకు దక్షిణమందు మేరయైయుండునది.): చూ, పర్వతము; అం. 2: చూ, కులపర్వతములు; 3: చూ, వర్షపర్వతములు.

**హిమవత్పర్వతము.**—పై— [చూ, సిరము.

**హిమవాలుక.** సం. వి. అ. స్త్రీ. కర్పూరము:

**హిమసంహతి.** సం. వి. ఈ. స్త్రీ. హిమాని. చూ, హిమము. 1. [సలిలము.

**హిమాంబువు.** సం. వి. ఉ న. పన్నీరు: చూ,

**హిమాంశువు.** సం. వి. ఉ. పుం. చంద్రుఁడు (చల్లని కిరణములు గలవాఁడు): అంశుమంతుఁడు, అత్రిజాతుఁడు, అత్రినేత్రభువు, అబ్జారి, అబ్జుఁడు, అబ్ధిజుఁడు, అబ్ధినవనీతుఁడు, అమతి, అమృతసర్గముఁడు, అమృతాంశువు, అవలక్షగువు(ఁడు), ఆత్రేయుఁడు, ఇందుఁడు, ఇభుఁడు, ఈరుఁడు, ఉడుపుఁడు, ఉద్గీధుఁడు, ఊః, ఏకత్రింశుఁడు, ఏణతిలకుఁడు, ఓషధీశుఁడు, ఔపగ్రస్తికుఁడు, కంఠీరవుఁడు, కలాదుఁడు, కలానిధి, కలాపతి, కలాపుఁడు, కలాపూర్ణుఁడు, కలాభృత్తు, కళానిధి, కుముదబాంధవుఁడు, కుముదినీపతి, కుముదేశుఁడు, కువలయప్రియుఁడు, కైరవి, కైశికుఁడు, కౌముదీపతి, క్లేదుఁడు—క్లేదువు, క్షపాకరుఁడు, క్షపాపతి, క్షీరాబ్ధిజుఁడు, క్షీరాబ్ధితనయుఁడు, క్షీరోదనందనుఁడు, ఖగుఁడు, ఖచమసుఁడు, గోపతి, గోవు, గౌరుఁడు, గ్రహరాజు, ఘూమాఁడు, చ, చండిలుఁడు, చందిరుఁడు, చంద్రమసుఁడు, చంద్రుఁడు, చిత్రాటీరుఁడు, చిత్రేశుఁడు, ఛాయాభృత్తు, ఛాయామృగధరుఁడు, జయంతుఁడు, జర్ణుఁడు, జలజుఁడు, జీమూతుఁడు, జైవాతృకుఁడు, జ్యోతి, తపనుఁడు, తమోనుత్తు—తమోపహృత్తు, తమోఘ్నుఁడు, తమోపహుఁడు, తారాపీడుఁడు, తిథిప్రణి, తుంగీపతి (తుంగీశుఁడు), తుహినకరుఁడు, త్రినేత్రచూడామణి, ధ, దక్షజాపతి, దశాశ్వుఁడు, దర్శవిపత్తు, దాక్షాయణీపతి, దాక్షాయణీరమణుఁడు, దోషాకరుఁడు, దోషాచరుఁడు, ద్విజపతి, ద్విజరాజు, నక్షత్రేశుఁడు, నారాయణుఁడు, నిశాకరుఁడు, నిశాపతి—నిశిపతి, నిశామణి, పక్షచరుఁడు, పక్షజన్ముఁడు, పక్షజుఁడు, పర్వధి, ప్రహాసోమి, మ, మృగపిప్లుఁడు, మృగాంకుఁడు, యజ్వపతి, రజనీకరుఁడు, రాజరాజు, రాజు, రాత్రిమణి, రోహిణీశుఁడు, వరాళి, వలక్షగుఁడు, వికసుఁడు, విధువు, విబుధుఁడు, విరోచనుఁడు, శశధరుఁడు, శశి, శశాంకుఁడు, శీతకరుఁడు, శుభ్రాంశుఁడు—శుభ్రాంశువు—శుభ్రమాంసుఁడు—శుభ్రాంశుఁడు—శుభ్రాంశువు, శ్వేతవాహనుఁడు, సముద్రనవనీతుఁడు, సింధునందనుఁడు, సిప్రుఁడు, సుధాంగుఁడు, సుధాంశువు, సుధాకరుఁడు, సోముఁడు, స్వచమనుఁడు, హరి, హిమకరుఁడు, హిమద్యుతి. (తె. ప):—ఎవఁగందు, కందుగలదుండగీఁడు, కడలిమీఁగడముద్ద, కడలివెన్న, కఱివేల్పుడాకన్ను, కఱకంఠుతలమానికము, కఱకంఠుతలయేలు, కలువరాయఁడు, కలువవిందు, కవపుల్గుదాయ, చందమామ—చందురమామ, చందు, చందురుఁడు, చలివెలుఁగు—చలివెల్గు, చలువజోతి, చలువఱేఁడు—చలువలఱేఁడు, చేటుబోటులబావ, చీఁకటిమిత్తి, చీఁకటి పెరువిత్తు, చుక్కలగమికాఁడు, చుక్కలదొర,

చుక్కలఱేఁడు, చెంగలువనెచ్చెలి, జక్కవగొంగ, జక్కవకవవిచ్చు, జడదారికన్నువు, జాబిలి-జాబిల్లి, జింకతాలుపరి-జింకతాలుపు, తపసికన్నువ, తమ్మిపగతుఁడు, తమ్ములపగవాఁడు, తలమగరాకుఱాయి, తొగచెలికాఁడు, తొగఱేఁడు, తొగవిందు, నిసివెలుఁగు, నీరుపుట్టువు, నెత్తమ్మిదిమ్మలనిదురమందు, నెల, పంటపైరుల దొర, పదార్వాళ్లదొర, పయిరులయొకిమీఁడు-పైరులయొకిమీఁడు, పాలకడలివెన్న, పాల్కడలిపట్టి, పుట్టుకచేల్వజోతి, పెనుకాఁకరాజోడు, పొద్దుజంట, పొద్దుజోడు, పొద్దుజోడుకోడె, బిత్తరిజింకదాల్పు, బూతములసామి, మందురా, మరుమామ, మామమామభావ, ముక్కంటితలపువ్వు, మున్నీటిపట్టి, మునుచీఁకటులవిచ్చుమొగ్గ, రాజు, రిక్కలపంటు, రేజేనరాలిమగఁడు, రేజోతి, రేదొర, రేపాల్ఁతిమగఁడు, రేయివెల్గు-రేవెలుఁగు-రేవెల్గు, రేఱేఁడు, లచ్చియన్న, లచ్చితోనెకమకన్ను, లేటిమ్రోఁగలమేటి, వలివెలుఁగు-వలివెల్గు, వెన్నముద్ద, వెన్నునెడమకన్ను, వెన్నెలగుత్తి, వెన్నెలరాయఁడు, వెలివెల్గు, వేలుపులబోనము, సిరియన్న. తద్విశేషములు:—౧. బాలచంద్రునకు:—(తె) నెలకూన, నెలవంక; ౨: చూ, పున్నమ. [వంతము.

హిమాచలము. సం. వి. అ. పుం: చూ, హిమ

హిమాని. సం. వి. ఈ. స్త్రీ: చూ, రూ—హిమని.

హిమాలయము. సం. వి. అ. పుం. శీతనగము: చూ, హిమవంతము. (చూ, పర్వతము). తద్విశేషములు:— ౧. కొండకు:—భూధరము, మరువు, వృత్రము; ౨. వెండికొండకు:—వజ్రాలయము, వీర, శ్వేతము(చూ, పర్వతము౯.); ౩. వరుణపర్వతమునకు.—వరుణము; ౪: వింధ్య. (తె) వింజేము (చూ, పర్వతము. ౨౭.); ౫. ద్రోణపర్వతమునకు.(తె) మందుమల(చూ, పర్వతము౧౯); ౬. క్రౌంచపర్వతమునకు.—మాల్యవంతము (చూ, పర్వతము౧౪); ౭. మేరుపర్వతమునకు.—రత్నసానువు, సురాలయము(చూ, పర్వతము ౨౨); ౮. శ్రీఘట్టము, శ్రీశైలము.(తె) సిరిగట్టు; ౯. సహ్యము; ౧౦. కుమారస్వామికొండకు:—(తె) సామిమల; ౧౧. పర్వతశిఖరమునకు.—(తె) పేటు, కొరు(చూ, శిఖరము 1); ౧౨. పర్వతమునందు పుట్టినది:— (విణ) పార్వతీయము; ౧౩. పర్వతసంబంధమైనది:— (విణ) పార్వణము; ౧౪. కొండనడుమునకు.—మేఖల(చూ, పర్వతము౧౭); ౧౫. కొండనెత్తమునకు.—పత్రము, సానువు(చూ, పర్వతము ౧౩.); ౧౬: రోహణము.

హిమావతి. సం. వి. ఈ. స్త్రీ. రెడ్డివారినానబ్రాలు*: చూ, స్వర్ణక్షీరి.

హిమాహ్వయము. సం. వి. అ. న. కర్పూరము: చూ, సిరము. [హిమము. 1.

హిమిక. సం. వి. ఆ. స్త్రీ. మంచు: చూ,

హిరణ్మయము. అం: చూ, వర్షములు.

హిరణ్యగర్భము. అం: చూ. మహాదానములు.

హిరణ్యగర్భుఁడు. సం. వి. అ. పుం. (గర్భమంద హిరణ్యముగలవాఁడు) నలువ: చూ, బ్రహ్మ. 1.

హిరణ్యము. సం. వి. అ. న. 1. బంగారు: చూ, లోహము. 1; 2. మాడ: సువర్ణము, నిష్కము. (తె) మాడ, అరవరా, సొన్న—సొన్నము—సొన్నా. తద్వ.— నూటయెనిమిదిమాడలకు.—నిష్కము(చూ, సువర్ణములు); 3. ధనము: అర్థము, ఆదాయము, ఋక్థము—రిక్థము, ఋా, కటప్రవము. గుహిలము, గోత్రము, గ్రంథము, జ్యోతి, ద్యుమ్నము, ద్రవిణము, ద్రవ్యము, ధనము, నీతము, పణము, భోగము—భోగ్యము, మాత్ర, రయాగ

ము, రుక్మము, రై, రోకము, వసువు, వస్నము, వామము, విత్తము, విధానము, విభవము, సాధనము, సారము, సువర్ణము, స్వత్వము, స్వము, స్వాపతేయము. (తె):— ఆస్తి, ఒడమి-ఒడమె, కాసు, చోకట్టు, డబ్బు, దనము, దస్తు, నగదు, నెలగ, పయికము-పైకము, పయిఁడి-పైఁడి, పసిఁడి, పింగు, ముదువు, మొల్లము, రూక, రొక్కము, రో, లవక, లిబ్బి, విడిముడి, సొత్తు, సొమ్ము. తద్విశేషములు:—౧. ఆర్జితవిత్తమునకు:—(తె) పడవు; ౨. దాఁచుకొన్న సొమ్మునకు:— కుండము.(తె) చిలువాసము, దాఁపురము. (చూ, లిబ్బి, పంటసాల, విత్తము.); 3. దొంగసొత్తునకు:— లుప్తము-లోప్త్రము-లోప్త్రము; ౪. కానుకిచ్చినసొమ్మునకు:— (తె) కానుమొదలు; ౫. మంచి నడవడికకు పూఁటగాఁగట్టిన ధనమునకు:-(తె)టీపు;౬. రైతులులోనగువారివలన కోఁగుచేసిన సొమ్మునకు:. (తె)దస్తు;౭.వసూలుచేసినసొమ్మునకు: (తె) బస్తు; ౮.మృత్పాషాణాదివస్తువునకు:- అర్థము; ౯. పంచుకొనఁదగిన తండ్రిసొత్తునకు:-దాయము;౧౦.చేతివెలకు:-(తె) నగదు, రొక్కము; ౧౧. వెచ్చపు సొమ్ము వందుకూడఁబెట్టినధనమునకు:-(తె)సిద్దాయము; ౧౨. మెట్టమొదట సరకు అమ్మగా వచ్చినసొమ్మునకు:- (తె)బోణి;౧౩. గోధనమునకు:(తె)సొమ్ము; ౧౪.స్త్రీధనమునకు:— సౌదాయికము; 4. గవ్వ: చూ, సంకు. 1; 5: చూ, రేతస్సు.1;అం.6:చూ, దానములు.

హిరణ్యరేతసుఁడు, సం. వి. స్. పుం. 1.అగ్ని (హిరణ్యమేరేతస్సుగాఁగలవాఁడు): చూ, వహ్ని. 1; 2: చూ, సూర్యుఁడు.

హిరణ్యరేతుఁడు. సం. వి. స్. పుం.—పై—

హిరణ్యవాహుము. సం. వి. అ. పుం. శోణనదము, శోణము: చూ, సముద్రము.

హిరలి. సం. వి. ఈ. స్త్రీ. నల్లయుప్పి*: చూ, లవణి. 2.

హిరుక్. సం.అవ్య.పాయుటయందువర్తించును.

హిలమోచిక. సం. వి. అ. స్త్రీ: చూ, రూ-హీలమోచిక *. (హిలమోచిఅనియు.)

హిహుకము. సం. వి. అ. పుం.దేహముముడుఁచుకొనినపిల్లి: చూ, మార్జాలము.

హిహీ. దే.అవ్య.ఇసీ-ఇహిహీ:చూ, హూహూ.

## హీ

హీ సం. అవ్య. అహో. ఆశ్చర్యార్థకము:చూ, వింత. 1.

హీనతానములు. అం: చూ, తానములు.

హీనమగు. మి. అ. క్రి: చూ, ఉలివడు.

హీనము. సం. విశ. 1. తక్కువైనది: అంత్యము, అణకము, అధమము, అధరము, అవకృష్టము, అర్వము, అవద్యము, అవమము, ఊనము, కంకరము, కచ్చరము, కనీసము, కాండము, కుత్సితము, కుపూయము, క్షామము, క్షితము, క్షీణము, ఖర్వము, ఖలము, ఖేటము,గర్హ్యము, చేల-చేలము, నికృష్టము, నైచ్యము, న్యక్కుము, న్యూనము,పరిక్షీణము, యాప్యము, (అవ్య) అను. (తె. వ):—(వి) అడుగు-అడ్గు, అసదు, అలి, ఈరు, కడ, కనీసము, కిలుకు, కీడు, చిలిపి, తున్న, దాలిబ, నాలి, పిచ్చె, బీడు, లాలూచి. (విశ) కిలుదు, కుక్క, కుచ్చితము, కుటిల, కూళతనము, కైలాటము, గొంటు, చెనఁటి-చెన్నటి,టకటొంకు, నాతి, పలుచే, పిదప, పొచ్చెము, పోటిపాటి, మందము, మట్టము, మసలిక, ముత, మెదుక, మెదువు,లొచ్చె, లొజ్జె, వెల్లితి; 2. దూలఁదగినది: జఘన్యము, దూష్యము, నింద్యము, న్యక్కృతము, రేఫము, వక్తవ్యము, వాచ్యము. (తె)

అగడు, హాస్యము, రట్టడి-అట్టడి-రట్టు-అట్టు. తద్వి:- హేళి(నిందింప)బడినది:- అధిక్షిప్తము, అవగీతము, అవధ్వస్తము, గర్హితము, నికృతము, పురస్కృతము; 3. విడువఁబడినది: అపనీతము, అవధ్వస్తము, ఉజ్ఝితము, ఉత్సర్జితము, ఉత్సృష్టము, కిశోరరము, కీర్ణము, త్యక్తము, త్యజితవంతము-త్యాజితవంతము, ధుతము-ధూతము, నిర్ధూతము, నిర్వ్యూఢము, నిస్తుషితము, పరిచ్యుతము, పరిత్యక్తము, పరివర్జితము, పరిహృతము, ముక్త-ముక్తము, మీఢము, యాతయామము, రహితము, విరహితము, విధుతము-విధూతము, సముజ్ఝితము. (తె) తొలఁగింపు, మినహాయింపు. తద్వి—౧. విడువఁబడనిది:—అవిముక్తము; ౨. అనుభవించి విడువఁబడినది:—యాతయామము; 3 విడువఁదగినది:—త్యాజ్యము, దేయము, పరిత్యాజ్యము, పరిహార్యము-పారిహార్యము, వర్జనీయము, వర్జ్యము, విసర్జనీయము, హేయము; ౪: చూ, వాంతము.2.

హీనుఁడు. సం. విణ. తక్కువపడినవాఁడు: అనయుఁడు, అధరుఁడు, అపశదుఁడు-అపసదుఁడు, అర్వాన్యుఁడు, అల్పుఁడు, అపటువు, ఇతరుఁడు, ఇత్వరుఁడు, కటుంటుకుఁడు, కటుఁడు, కనిష్ఠుఁడు, కనీయుఁడు, కీచకుఁడు, క్రూరదృక్కు, క్షుద్రుఁడు, క్షుల్లకుఁడు, క్షోదిష్ఠుఁడు, ఖలుఁడు, ఖుల్లకుఁడు-ఖుల్లుకుఁడు, ఖేటుఁడు, గర్హ్యుఁడు, గోనసుఁడు, చపలుఁడు, చేలుఁడు, జంబుకుఁడు, జఘన్యుఁడు, జఘన్యజుఁడు, జాల్మ్యుఁడు, నిహీనుఁడు, నీచ-నీచుఁడు, న్యక్షుఁడు, పాపుఁడు, పామరుఁడు, పిశునుఁడు, పుల్కశుఁడు-పుల్కసుఁడు, పృథగ్జనుఁడు, ప్రాకృతుఁడు, మందుఁడు, యాప్యుఁడు, వివర్ణుఁడు, శక్లుఁడు, శ్లథుఁడు. (తె. ప) అనద, కడ, కించే-క్రించే-క్రించేఁడు, కొంచెకాఁడు, కొద్దివాఁడు, గొఱకు, చిల్లరకాఁడు, తక్కువవాఁడు, దూబ, ద్రాబ, నీచె, పాదలి, పెయ్య-పేయ, ప్రిద్యాకుఁడు, లుల్లిగాఁడు, వెలితిమానిసి, సన్నగాఁడు-సన్నపుగాఁడు, హాసదు. తద్వి.—పామురవకు.—గోండుఁడు.

హీనోపమము. అం: చూ, అర్థదోషములు.

హీర. సం. వి. ఆ. స్త్రీ. 1. చీమ: లత, లూతః చూ, పిపీలిక; 2. లచ్చి: విచర్చిక, శమ. (తె) సీ: చూ, లక్ష్మి. 1.

హీరకుఁడు. సం. వి. అ. పుం. ముక్కంటి: చూ, శివుఁడు.

హీరము. సం. వి. అ. పుం. వజ్రము: చూ, రత్నములు.

హీరింగు. వా. వి. వాయిదా. (హియరింగు.)

హీలమోచి. సం. వి. ఈ. స్త్రీ: చూ, బచ్చేలి. తద్విశేషములు:—పుల్లబచ్చేలికి:—భేదము, వనస్థ, వరుణసూరణ-వరుణసూరణము, వల్లి. (తె) వెఱ్ఱిబచ్చేలి *.

హీలమోచిక. సం. వి. ఆ. స్త్రీ: రూ-హీలమోచిక. (తె):-చిలకకూర-చిలుకకూర-చిల్కకూర. *. (దీనినే ముల్లంగి అని కొందఱు: చూ, హస్తికంద.)

## హు

హుం. సం. అవ్య. 1. ఊహయందువర్తించును: వితర్కము, వివేకము: చూ, యోచన; 2.—ఊ. ప్రశ్నార్థకము: చూ, సవాలు; 3. కోపమందువర్తించును: చూ, కోపము; 4. బెదరించుటయందు వర్తించును: చూ, బెదురు.

హుంకరించు. సం. అ. క్రి. హుమ్మనిధ్వనించు: చూ, గద్దించు.

హుంకారము. సం. వి. అ. పుం. 1. హుమ్మను ధ్వని: చూ, స్వరము. 2; 2=ఊఁకర, ఊఁ కొట్టుట. (సం) హుంకృతి.

హుంకారించు. సం. అ.క్రి. హుంకారముచేయు.

హుంకృతి. సం. వి. ఇ. స్త్రీ. 1-2: చూ, హుంకారము. 1-2; అం. 3: చూ; రతిధ్వనులు.

హుండి. వా. వి. రూ-హుండీ. 1. వెంటనే సొమ్ము చెల్లించుమని అడుగు పత్రిక: చెక్కు; 2. దేవళములలో ముడుపులువేయు డబ్బి.

హుండీ. వా. వి.—పై.—

హుకుము. వా. వి. 1. ఆజ్ఞ; 2. అధికారి యాజ్ఞాపత్రము. "హుకుంనామా."

హుజూరు. వా. వి. సమక్షము, సముఖము.

హుటాహుటి. దే. వి. 1. గమన వేగము; చూ, స్యదము; 2. వడి: చూ, స్యదము; విశే. 3. వేగవంతము; చూ, స్యదము.

హుడుక. సం. వి. ఆ. స్త్రీ. 1.=ఉడుక. డుబ డక్క: చూ, వీణె; వై.వి.(1)=హుడుక్కా: చూ, హుడుక. 1.

హుడుకము. సం. వి. అ. పుం.—పై.—

హుడుకు. వై. వి.=హుడుక్కము.—పై.—

హుడుక్క. సం. వి. ఆ. స్త్రీ. 1—పై.—; అం. 2: చూ, ఆనద్ధవాద్యములు.

హుడుక్కము. సం. వి. అ. పుం.—పై.—

హుడువు. సం. వి. ఉ. పుం. మగగొఱ్ఱె: చూ, మేషము. 1. తద్వి.—కొండ గొఱ్ఱెకు.— రోహిషము (చూ, మేషము 1)

హుతభుక్కు. సం. వి. జ్. పుం. 1. అగ్నిహోత్రుఁడు: చూ, వహ్ని. 1; స్త్రీ. 2. కృత్తిక: చూ, రిక్క.

హుతభుక్ప్రియ. సం. వి. ఆ. స్త్రీ. అగ్నిభార్య, స్వాహా, ఆగ్నాయి: చూ, భార్య.

హుతము. సం. విశే. హోమముచేయఁబడ్డది: చూ, ఇష్టము. 7. తద్వి.—హుతశేషమునకు:— పురోడాశము. [భుక్కు.

హుతవహుఁడు. సం. వి. అ. పుం: చూ, హుత

హుతాశి. సం. వి. ఈ. స్త్రీ: చూ, హుతభుక్కు.

హుతాశనుఁడు. సం. వి. అ. పుం.—పై.— తద్వి.—జ్వాలకు.—శిఖ.

హుతాశుఁడు. సం. వి. అ. పుం.—పై.—

హుమా. దే. వి. రూ-హుమాయి. గుఱ్ఱము: చూ, హయము. [178.

హుమాయి. దే. వి.—పై.—ఉ, రా. 2, అ.

హురుమంజి. దే. వి.—మాణిక్యము: చూ, రత్నములు. తద్వి.—గు:— చూ, పూస. 1-2-3-4; 2. రంధ్రముగల మణ్యము:— (తె) పూస (చూ, పూస. 5); 3. తారకపు బూసకు:—(సం) సగరము.

హురుమత్తు. దే. విశే. గొప్ప, పెద్ద. రూ- హుర్మత్తు-హుర్మత్తు: చూ, నుర. (3)

హురుమంజి. దే. వి. రూ- హుర్మంజి- హురుమంజీ. ఒక దేశము: చూ, దేశములు.

హురుమంజీ. దే. వి. —పై—

హుర్మంజి. దే. వి.—పై.—

హుర్మత్తు. దే. వి: చూ, రూ-హురుమత్తు.

హుర్మత్తు. వా. వి.—పై.—

హుషారు. వా. వి. 1: బందోబస్తు, జాగ్రత్త; 2. కనువిప్పు: చూ, మేలుకొలు; 3. హెచ్చరిక (హుషారుఅనియు.)

హుహువు. సం. వి. ఉ. పుం. రూ-హూహువు. ఒక గంధర్వుఁడు: చూ, పేకాట.

హుళక్కి. దే. వి. రూ-హుళికి-హుళిక్కి- హుళ్లి. 1. అబద్ధము: చూ, వితథము; 2. అసత్యము: చూ, వితథము; 3. రూ-ఉళక్కి. అభావము: చూ, శూన్యము. 1.

హుళికి. దే. వి.—పై.—

హుళిక్కి. దే. వి.—పై.

## హూ

హూ. దే. వి. అవులించేట యందగు ధ్వన్యనుకరణము: చూ, హూహూ.

**హూణము.** సం. వి. అ. పుం. చూ, దేశములు.

**హూతము.** సం. విణ. పిలువఁబడినది, ఆహూతము: చూ, సంబోధనము. 1-౨.

**హూతి.** సం. వి. ఇ. స్త్రీ. రూ-సంహూతి. పిలుపు: చూ, సంబోధనము.

**హూరేణావు.** సం. వి. ఉ. పుం: చూ, రాజార్హ్యము.

**హూహువు.** సం. వి. ఊ. పుం. హూహూయనిపాడెడి ఒకదేవగాయకుఁడు: చూ, సీకారి.

**హూహూ.** దే. వి. చేసియుండగు ధ్వన్యనుకరణము. భాగ. 4, స్కం. 648. తద్వి.—అమ్మయ్య, అనురునురు-అన్నురు, అవురు, ఇన్స్, ఇహిహీ, ఉచే కుక్క,ఉచ్చిచ్చిరె-ఉచ్చిచ్చిరే, ఉడుకుట, ఉబ్బు, ఉల్లల, ఉసురుసురు-ఉసురు-ఉన్సు - ఉన్సురు-ఉసూరు-ఉన్సురున్సురు, ఓంబాయి, కకకకలు, కచికుక్క, కటకట, కటపెట, కటుక్కు, కడిల్లు, కతుక్కు, కనకన, కరకర-కఱకఱ, కలుక్కు, కలకల, కలుక్కు, కళపెళ, కవకవ, కవ్వోయ్యము, కాండ్రి-కాండుర్రి, కావు, కికకిక-కికాకిక, కిచేకిచే, కిటకిట, కిఱకిఱ, కిల్లు, కిలకిల, కిసకిస, కిసాలున, కీఁచే, కుతకుత, కులకుల, కే, కై, కొకొక్కొరొకో-కొక్కొరోకో, కో, కోవు, కోహో, కుర్రింగు, క్రియో, కేర్రివు, ఖంగుఖంగు, గడగడ-గణగణ-గనగన, గజిల్లు, గబాలు, గబీగుబీ, గబీలు, గమగమ, గమ్మ, గఱగఱ, గబ్బు, గలగల-గళగళ, గల్లు-గల్లుగల్లు, గింగురు, గిజేగిజే, గిటగిట, గిరగిర, గిఱుక్కు-గిబ్బు, గిలగిల, గిలుకు, గుటగుట, గుటుకు-గుటుకు గుటుకు-గుటుగుటుకు-గుటుక్కు, గుడగుడ, గుడిగుడి, గుడుక్కు, గుడుగుడు, గునగున, గుప్పు, గుబగుబ, గుబాలు-గుబీలు-గుబేలు, గుబ్బు, గుమగుమ, గుమ్మ, గుఱక-గుఱుక-గులు-గుల్లు, గుఱగుఱ, గుఱుగుబ్బు, గులగుల, గొటగొట, గొణగొణ, గొఱగొఱ, గొలగొల, గోండ్రి, గోలుగోలు-గోల్గోలు, చేంగు, చేకచేక, చేటాలు-చేటిల్లు, చేరచేర, చేలో చేలో-చెలో-చెలోచెలో, చిటచిట, చిటపొట, చిటాలు, చిటుకుపొటుకు, చిమచిమ, చిలచిల, చిల్లు, చివచివ, చివుకుచివుక్కు, చేంయి, చేమ్చే, చేఱచేఱ, చేఱుకు-చేఱుక్కు, చేబ్బు, చెల్లు, చొటచొట, చొడచొడ, చొఱచొఱ, జేగ్గు, జేఱజేఱ, జేలజేల, జేల్లు, జేనజేన, జేవు జేవ్వు-జాజేవ్వు, జిఱ-జిబ్బు-జిఱజిఱ, జిబ్బు, జిల్లు, జివ్వు, జివ్వురు, జేంజేం, జేఱుకు, జేబ్బు, జేవ్వు, జొటజొట, జోఱు జోఱు, టంటం (టముకు-టముక్కు), టివు, ఠంగు, ఠంగుఠంగు, డబ్బుడబ్బు, డులడుల, డూడూ, తకతక, తటతట, తటాలు, తపతప, తళతళ, తళుక్కు, తిమిడి, తుకతుక, తుటుక్కు, తుపుక్కు, తుప్పు, తుబ్బు, తున్సు-తుర్రిస్సు, తూ, తెకతెక, తొటతొట, తొట్టు, దగదగ, దబదబ, దబాదిబ, దబ్బు, దిగదిగ, దిగ్గు, దిబదిబ, దిరదిర, దిద్దిర, దన్సు, దు, దుడిదుడి, దుమా, దుముక్కు, దూ, దూబూచి, దొడదొడ, దొప్పుదొప్పు. (సం) ధగద్ధగ, ధుత్కారము, ధూధూ, ధే, ధై ధై. (తె) నడునడు, నఱుక్కు, నిగనిగ, నెగ్గురు, నెటుకురు, నెళినెళి, పకపక-పకాపక, పకీలు, పటపట, పటుకు-పటుక్కు, పటేలు, పఱపఱ, పబ్బు, పలపల-పల్పల-పళపళ-పలపలన-పల్పలన, పిలపిల, పుటపుట, పుటుక్కు, పుతపుత, పురపుర, పులుకుపులుకు - పుల్కుపుల్కు, పుసుకు-పుసుక్కు, పెటపెట, పెటిల్లు, పెళపెళ, పెళ్లు, పొటపొట, పొటుకు-పొటుక్కు, పొలపొల, బంబం, బగబగ, బగీలు, బ

బడబడ, బఱబఱ, బళుకున – బళుక్కున, బల్లు, బళ్లున, బాకురుబాకురు, బావురు, బిఱబిఱ్ఱు, బిస్సు, బుగబుగ, బుగులుబుగులు, బుటుకు-బుటుక్కు, బుడబుడ, బురబుర, బుఱ్ఱు, బుసబుస, బుస్సు, బొడ బొడ, బొసబొస, బొళుకుబొళుకు, బొళుక్కు, బోరు, బ్రిల్లు, మటమట, మలమల, మిటమిట, మినమిన, మిలమిల, మిసమిస, ముర ముర, మూసమూస, రవరవ, రిక్కు, రెవరెవ, ఱివ్వు, రివ్వు-ఱివ్వు, ఱుఝ్ఝ, లగాలగా, లటుక్కు, లబోలబో, లివలివ, లుకలుక, లుసుక్కు, లొటలొట, లొడలొడ, వజీ వజే, వటవట, వడవడ, వలవల, వికవిక-వికా విక, విజ్జే, విరవిర, విలవిల, విసవిస, వెకవెకలు, సరసర, సఱ్ఱు, సలసల, సుఱసుఱ, సువ్వాల, సువ్వి, హుఱ్ఱా, హూహూష్లు, హో, హోరు. మఱి కొన్ని ధ్వన్యనుకరణములు:—౧: (సం) ఆఘీట్కారాకర్ణనము, ఆఫూత్కారాచరణము, కా; ౨: కొక్కొరొకో–కొక్కొరొకో; (అ. కి౹.): అవసోపాలుపడు, ఉఱుగొట్టు; ౩: పూర్వకవులచేఁ బ్రయోగింపఁబడిన ధ్వని లోపగు అనుకరణములు:— (౧) నవ్వుట, (౨) అల్లుట, (౩) అడుట=జోగుట, (౪) రొవ్వుట, (౫) సుర్రుక్కుట, (౬) మాడుట, (౭) వేగుట, (౮) మంచుట, (౯) మ్రోఁత, (౧౦) ఏడ్చు, (౧౧) చొచ్చుట, (౧౨) పొక్కుట, (౧౩) ప్రొద్దుఁబొడుచుట, (౧౪) ఒలుకుట=కాఱుట, (౧౫) చినుకులుపడుట, (౧౬) ఉడుకుట, (౧౭) కూయుట, (౧౮) తెల్లవాఱుట, (౧౯) కొఱుకుట, (౨౦) పడుట, (౨౧) త్రిమ్ముట, (౨౨) మూచుట, (౨౩) గులగుల, (౨౪) మెట్టుకొనుట. (౨౫) ఝుళంఝుళలు, (౨౬) కాంతులు, (౨౭) కప్పలు, (౨౮) పందులు, (౨౯) ఏనుఁగులు, (౩౦) సింహము, (౩౧) పెద్దపులి, (౩౨) గుఱ్ఱము, (౩౩) ఎద్దులు, (౩౪) గాడిద, (౩౫) కోళ్ళు, (౩౬) పాములు, (౩౭) పిల్లులు, (౩౮) కొంగలు, (౩౯) ఆఁబోతులు, (౪౦) మేఁకలు, (౪౧) ఎలుకలు, (౪౨) కొట్టుకొనుట, (౪౩) మద్దెలమ్రోఁత, (౪౪) మెఱయుట, (౪౫) నొక్కుట, (౪౬) ఘల్లుమనుట, (౪౭) జల్లుమనుట, (౪౮) తుమ్మెదలు, (౪౯) ఈఁగలు, (౫౦) ధ్యానములు, (౫౧) దంతములచేవ్రేళ్లు ఇత్యాది; ౪. మఱికొన్ని శబ్దములనుకరణములవలెనుండి యొకానొక యర్థ విశేషము నిచ్చుచున్నవి. ఉదా.— మనసు కళవళపడెను, చెకపికలాడెను, చిత్తము వకావకలయ్యెను, సొంపు సొటసొటవోయెను, బుడిబుడి తేఁకువ కొనుకనకలాడెను, వెల వెల వెలఁబాఱెను, వలవల కన్నీరు నించెను, తోవలు విలవిలఁబడెను, కస్తూరి ఘుమఘుమలు, బంగరువిగనిగలు, మెఱుపుల తళతళలు, పసిఁడి గాజుల మిసమిసలు, గర్వపుమిటమిటలు, శుకపికములు పిలపిలనే తేరెను, పావట బొట్టు మొకమునతళుకుపికలు నేసె, గుసగుసలాడుట, రవరవ, హుటాహుటి, ముసిముసినవ్వులు, మిడిమిడి యెండ, యదాయదలై వఱతెంచె, మాటలు తొకతొకలై పెనలెను, గంటాలు కిలకిలలు, కత్తి ఝుళిపించుట, “కట పెట తొటతొట రాలెడు సొట సొట చినుకులు ధరిత్రి పొడనట్లు పడన్ । సొట సొట న్యాఁకట సోలుచు చిటచిటపడు చాతకముల దైన్యము వాసెన్”, బుడిబుడిచేను డించుట, రవరవలు వోడముట=కోపము, బిసి బిసి మాటలు, తెలతెల వాఱెు, వెలవెలఁబాఱెు, అంగంబులు చేకచేకలు మొక మొకపాటు, మదిచివుక్కు మనెను, బొజ్జపుటపుటలాడెను ఇత్యాది; ౫: చూ. ఉపస్కారపదములు. (౩-౪ విశేషాంశములు

అకారాదిక్రమమున శీర్షి కలుగఁజేర్పలేదు.); ౘ: చూ, స్వరము. 2.

హాహాష్టు. (హహాన్స్సు. హాష్టు.) వా. వి. శాకి లోనగువానిని రెచ్చగొట్టుటయందగు ధ్వన్యనుకరణము: చూ, హహాహహా.

# హృ

హృతము. సం. విణ. హరింపఁబడినది: అపహృతము, ఆత్తము, ఉపాత్తము, ముషితము-మూషితము. తద్వి.—తేఁబడినది;—అహృతము. [(అహృతి అనియు.)

హృతి. సం. వి. ఇ. స్త్రీ: చూ, హరణము. 1.

హృదయంగమము. సం. విణ. మనసుకింపైనది (మాట), సంగతము: చూ, శబ్దము. 2.

హృదయగతశల్యము. జా. బాధచేయునది. "ఒప్పిదంబున వీనితోడిన శరధులు హృదయశల్య వ్యథ నెఱియకున్నె." (కవికర్ణరసాయనము.)

హృదయము. సం. వి. అ. న.—ఎద-ఎడఁద. మనస్సు. రూ-హృది. (మనస్సులోనుండునది. విషయాదులచేత హరింపఁబడునది.): అంతరంగము, అంతఃకరణము, అనంగము, ఆత్మ, ఆశయము, అస్వనితము, ఇచ్ఛ, క, కర్మి, కాళీనము, గుహ, గూఢపదము, చిత్తము, చేతస్సు, చైత్యము, తనము, తురగము, మనము-మనస్సు, మానసము, సత్యము, స్వాంతము, హృది. (తె.వ) అద, ఇచ్చె, ఉల్లము-ఉల్లల, ఎద-ఎడఁద-ఎడ్డ-ఎడ్డ-ఎద, కందనకాయ, గుండియ-గుండె-గుండెకాయ, డెందము-దెందము, తలఁపు, మది, మనము. తద్విశేషములు:—౧. కఠిన హృదయమువాడు.—(తె) బాతిగుండె; ౨. పిశాచము పట్టిన మనస్సువాడు:—రిక్తవారము; ౩. దేవ హృదయమువాడు:—శీరకము; ౪. మనసులో నుండునది:—అంతరంగము; ౨. గుండెకాయ: చూ, హృదయము. 1; (ఎవనిగుండె వానికు ప్పిడంతయుండును. ఇందు నాలుగుగదులుండును:—౧. ఎడమకర్ణిక, ౨. కుడికర్ణిక, 3. ఎడమజఠరిక, ర. కుడిజఠరిక. ఊపిరితిత్తులయందు శుభ్రపరుపఁబడిన రక్తము గుండెయందు చేరును. దానినుండి ధమని (అరోర్టా) యను శుద్ధరక్తవాహినిగుండ శరీరమంతటను వ్యాపించును. (చూ, ధమని. ౪. ఇది శారీరశాస్త్ర విషయము.); 3. బ్రొమ్మ: చూ, వక్షము; అం. 4: చూ, చక్రములు.

హృదయశంకువు. జా. బాధచేయునది: హృదయశూలము.

హృదయశూలము. జా.—వై.—"నేను మీకు హృదయశూలమును"(ధర్మజరాజసూయము.)

హృదయావర్తి. అం: చూ, అశుభావర్తములు.

హృదయాళువు. సం. విణ. (ఉ): సుహృదుఁడు.

హృది. సం. వి. ద్. న: చూ,హృదయము.1-2-3.

హృద్భేదతంత్రము. అం: చూ, తంత్రములు.

హృద్య. సం. వి. ఆ. స్త్రీ. బుద్ధియనెడుఓషధి: చూ, రాజార్హము.

హృద్యము. సం. వి. అ. పుం. 1. వశీకరణ వేద మంత్రము: చూ, మంత్రము.1; విణ. 2. మనసు కింపైనది, మనోజ్ఞము: అంకతి,అంతము, అనఘము, అనువము, అభిరామము, అభిరూపము, అభీష్టము, అమృతము, ఉజ్జ్వలము, ఉదాత్తము, కమనము, కమనీయము, కమ్రము, కాంతము, కామనము, కూబరము-కూవరము, చంగము, చారువు, చోక్షతరము, చోక్షము-చాక్షము, జాత్యము, ణ, తలిమము, ధవళము, నిర్భరము, నందమము, పేశలము, పరిక్షిప్తము, బంధురము, మంజువు, మధురము, మనోజ్ఞము, మనోరమము,మనోహరము,ముగ్ధ,రమణీయము,రమ్య

ము, రామము, రుచిరము, రుచ్యము, రూప్యము, లఘువు, వలితము, వల్గువు, వామము, విమల, శమ్, శాలి, శృంగారము, శోభనము, శ్రీమంతము, సాధువు, సుందరము, సురభి, సుషమ, స్వాదువు, హారి. (అవ్య) ఆరాత్, శమ్. (తె. వ):—అనుఁగు, అలరు, అరజేతు, ఇంపితము, ఇమ్ము, ఒడికము, ఒనరు, ఒప్పిదము, ఒఱపు, కలికి-కల్కి, కొమరు, గమకము, గరగరిక, గొనబు-గొనము, గోవ, చిని-చిన్ని, చిన్నరి-చిన్నారి, చిన్నరిపొన్నరి-చిన్నారిపొన్నారి, చెంచే, చేందు, చోక-చోకా, చొక్క-చొక్కా, చోకాటము-చొక్కటము-చొక్కాటము, చోకారము-చొక్కారము, చొక్కరము, చొక్కము, జోక, తిన్న-తిన్నన, తీరు-తీఱు, తోరము, నయము, నలువు, నిబ్బరము, నున్న, నునుపు, పొంపు, పొన్నరి-పొన్నారి, పోలు, ప్రిన్న, బాగు, బెడఁగు, బెళఁగు, మాను, ముద్దు, మురువు-మురువ్వ, రకము, రమణ, రెస్స, వింగడము, విన్నాణము, సవర-సవరన, సవురు-సౌరు, సని, సింగారము, హరువు, హవణింపు. తద్విశేషములు:- ౧. మిక్కిలి మనోజ్ఞమునది:—బృందిష్టము. (తె) అల్లారుముద్దు; ౨. చేక్కనిది: (తె) చేక్క, జేవర, తిన్న. (వి) ఆర్జవము, ప్రగుణము. (తె) చేక్కన, చెక్కటి, చోయ, జేవరన, తిన్నన; 3. మనోజ్ఞతకు.—మంజిమ-మంజిమము, మనోజ్ఞత. (తె) గొనబు, తిన్నన, ప్రిసన్న, బంగారుకుఁడ, మాను, ముద్దు, హరువు. (సం) (అవ్య.) వ; ౪. సరిమైనది:—అజిహ్మము-అజిహ్మము, ఋజువు, ప్రగుణము; ౫. మేలైనది:—చూ, సుశ్రుతము. 8; ౬: చోక్షతరము. (తె) చొక్కటరము: చూ, సమీచీనము. 2 (చూ, ప్రశస్తము. 8.)); 8. మనస్సునకు ప్రీతమైనది (వస్తువు): చూ, హృద్యము. 2; 4. మనస్సునందుఁ బుట్టినది (కోరిక): చూ, వాంఛ; 5. వశీకరణ వేదమంత్రము: చూ, మంత్రము. 1; తద్వి.—౧: వ్యాహృతి; ౨: గాయత్రి, సంజ్ఞ.

హృద్యశారీరశాలిత్వము. అం: చూ, సుగుణములు.

హృల్లేఖము. సం. వి. అ. పుం. 1. ఎడఁబాటు: అయోగము-అయోగము, అయుల్లకము, విచ్ఛిత్తి, విచ్ఛేదనము, విధురము, విప్రయోగము, విప్రలంభము, వియోగము, విరహము, విరోధము, విశ్లేషము. (అవ్య): అప. (తె): ఎడఁబాటు, ఎడయిక, విరాలి; 2. బుద్ధి: అంకము, అనుభవము, అకలధి, అభిజ్ఞానము, అభిమానము, అవగతి, ఆకలనము, ఆత్మ, ఆత్మజ్ఞానము, ఆయోగము, ఇంగము, ఇతము, ఇతిహాసము, ఉపజ్ఞ, ఉపలంభము, ఉపలభ, ఉపలబ్ధి, ఋ, క, కలాపము, కావ్య, కానువు, ఖుంబు, గతి, గృధువు, గృహీతి, గ్రహణము, చర్వరి, చార్వి. చితి-చిత్-చిత్తు, చేతన, చైతన్యము, జ్ఞప్తి, జ్ఞానము, ఢ, ణ, దర్శనము, దృక్కు, దృష్టి, ద్రవ్యము, ద్రవ్యాంగము, ధిషణ, ధీ, న, నిర్వేదము, నివేదనము, నిష్క్రమము, పండ, పరికరము, ప్రజ్ఞ, ప్రజ్ఞానము, ప్రతిపత్తి-ప్రతిపత్తు, ప్రణిధ, ప్రత్యయము, ప్రధానము, ప్రాజ్ఞ, ప్రేక్ష, బుద్ధి, బోధము, భగము, మంతువు, మతి, మనము-మనస్సు, మనీష, మాయ, మేధ, రహి, వికసనము-వికాసము, విజ్ఞానము, విద్య, విద్రవము, వివేకము, వేదన, శరము, శేముషి, సంఖ్య, సంగతి, సంజ్ఞ, సంవిత్తు, సంవిత్తి-సంవిత్తు, సమయము, సూత్మము, స్మరణము, స్మృతి, హేవాకము. (అవ్య) అధ్యాత్మము—అధ్యాత్మికము, ఇతి. (తె. వ.):—అరువు, ఎఱుక-ఎఱుకువ, కఱదు, గరగరిక, గురికొచ్చే, తెలుకువ-తెలుకువ తెలివి-తెలివిడి నేఁకువ నేట

నెఱి, వగ్గె, బుద్ధి, మది, రహి. తద్వి.— ౧. సామాన్యజ్ఞానమునకు:—బుద్ధి (తె) బుద్ధి; ౨. నిష్ఫలమైన తరువాత నుండెడి తెలివికి: ఖేదము; 3. బుద్ధికుశలతకు:—(తె) చొరవ; శాస్త్రజ్ఞానమునకు:— వ్యుత్పత్తి. (అవ్య) ఆజ్; ౫. శ్రవణేంద్రియములోఁగాడు కొను బుద్ధికి:— ఆశ్రిమము, ౬. ఇచ్ఛలేని బుద్ధికి:—క్షేపము, వికల్పము; ౭. చాలు ననెడి బుద్ధికి:—పర్యాప్తి. (తె) చాలు; ౮. దేహాత్మాది భేదజ్ఞానమునకు:(తె) తెలివి; ౯. మిక్కిలి తెలివికి:— ప్రబోధము; ౧౦. యథార్థజ్ఞానమునకు:—ప్రమ, ప్రమితి; ౧౧. స్వాధీనముకానిబుద్ధికి:— (తె) చిమ్మటి; ౧౨. జ్ఞానవిశేషమునకు:—కేవలము; ౧౩. తెలివిగలది:—అర్థ్యము; ౧౪. సప్తవిధబుద్ధులకు:—చూ, సప్తవిధబుద్ధులు; 3.అపూర్వార్థమును తేఁప్రేక్షించుట: అధ్యాహారము, ఊహము, తర్కము,యోచన. (తె) ఉజ్జె.

హృషితుఁడు. సం. వి. అ. పుం: చూ, హృష్టుఁడు,

హృషీకము. సం. వి. అ న.(దీనిచేత సంతోషింతురు.): అక్షిగతము, గోచరము, ఇంద్రియము, విషయి: చూ, ఇంద్రియార్థము, చూ, విషయము. 3) తద్వి.— నేత్రాదిజ్ఞానేంద్రియములు:—ఇందు జ్ఞానేంద్రియములు 5, కర్మేంద్రియములు 5=10. జ్ఞానేంద్రియములు:—త్వక్కు, చక్షువు, శ్రోత్రము, జిహ్వ, ఘ్రాణము; కర్మేంద్రియములు.—వాక్కు, పాణి, పాదము, పాయువు ఉపస్థలు, మనస్సుతోఁడఁగూడ ఏకాదశేంద్రియములు. మఱియు ఆకర్షణము, ఇంద్రియము, కరణము, ఖమ్-ఖంబు, గుణము మొ.)

హృషీకేశాయనమః. అం. (హృషీకేశః=హృషీకాణాం=ఇంద్రియాణాం, ఈశః=నియామకః) ఇంద్రియములను నియమించే వస్తువుకొఱకు నమస్కారము: చూ, ఓమ్.

హృషీకేశుఁడు. సం. వి. అ. పుం.చూ, విష్ణువు.1.

హృష్టమానసుఁడు. సం. విణ. సంతోషించేమనస్సుగలవాఁడు: చూ, హృష్టుఁడు.

హృష్టము. అం: చూ, దృష్టులు.

హృష్టి. సం. వి. ఇ. స్త్రీ: చూ హ్లాదనము.

హృష్టుఁడు. సం. విణ. సంతోషించినవాఁడు. రూ-హృషితుఁడు, ఆనందుఁడు, ఉత్కుఁడు, ఉల్లాఘుఁడు, ఊర్జస్వలుఁడు, ఊర్జస్వి, తుష్టుఁడు, తృప్తుఁడు, నందనుఁడు, ప్రమనుఁడు, ప్రముదితుఁడు, ప్రహ్లన్నుఁడు, ప్రీతుఁడు, ముదితుఁడు, వికుర్వాణుఁడు, హర్షమానుఁడు, హృష్టమానసుఁడు. (తె) గెలివికాఁడు. తద్వి.—౧. సంతోషముగలవాఁడు:— హ్లాది; ౨ సంతోషించేవాఁడు:— హర్షణుఁడు; 3. సంతోషింపఁజేయువాఁడు: హర్షకుఁడు.

హృష్యక. అం: చూ, మధ్యమగ్రామ గత మూర్ఛనలు.

హృష్టాంశము. అం: చూ, షష్ట్యంశములు.

## హె

హెగ్గడి. దై. వి.=హేడక. 1. అంతఃపురకావలికత్తె: చూ, సౌవిదల్లుఁడు; 2.=అంతఃపురకావలివాఁడు: చూ, సౌవిదల్లుఁడు.

హెగ్గడికత్తె. దై. వి. అంతఃపుర కావలికత్తె. కళా. 2, అ 69. రూ-ఎగ్గడికత్తె-హెగ్గడి: చూ, సౌవిదల్లుఁడు. [చూ, సౌవిదల్లుఁడు.

హెగ్గడికాఁడు. ద్వ. వి.అంతఃపుర కావలివాఁడు:

హెగ్గడివాఁడు. ద్వ. వి.—దై.—

హెగ్గడీఁడు. ద్వ. వి.=హేడక. (హెగ్గడి+ ఈఁడు)—దై.—

హెచ్చరించు. దే. స. క్రి. 1: రూ-ఎచెరించు-ఎచ్చరించు-ఎచ్చరికించు-హెచ్చరికించు, పలుకరించు-పల్కరించు, సుందలించు, మూదలించు, సొపాయించు; అ. క్రి. 2. వృద్ధిఁబొందు. ఆం, భా. త్రి. 88: చూ, వర్ధిల్లు.

హెచ్చరిక. దే. వి. 1: రూ-ఎచ్చరిక-ఎచ్చరరము-ఎచ్చరింత-ఎచ్చరింపు-హెచ్చరింపు, ఎదబదిలము, ఏద, ఏవ, బదిలము, పొణవి, బరాబరి-బరాబరిక, హణిక-హవణిక. (సం. వ):—అవధానము, ఆవేక్ష, నిపకము-నిపాకము, పాకము, ప్రతిజాగరము, భద్రము. తద్వి.—పలుకరింత-పల్కరింత, పలుకరింపు; 2. రూ-ఎచ్చరిక, అమోకి: చూ, సూచన. 1; 3. ఉత్సాహము: చూ, సన్నాహము. 2; వా. 4: ప్రేరేపణ-ప్రేరేపణము, ఎక్కుట, డీకు-దీకు. (సం) ప్రేరణము.

హెచ్చరికపడు. దే అ. క్రి: రూ-ఎచ్చరికపడు. (సం) అవధరించు.

హెచ్చరికరించు. దే. స. క్రి. రూ-ఎచ్చరించు. చూ, రూ-హెచ్చరించు.

హెచ్చవేఁత. దే. వి: గుణకారము, ఆహతము, గుణము, గుణితము, క్షుణ్ణము, రితము, నిదిగ్ధము, నిహతము, పాలితము, పిండితము, పూరణము, పూరితము, వర్ధితము, వృద్ధి. తద్వి:—ఘనము. (చూ, గణితశాస్త్రము.)

హెచ్చవేఁతగుఱుతు. వా. వి. ఇఁటు. గుణకారపు గుఱుతు ×.

హెచ్చించు. దే. స. క్రి. ఎక్కుడించు.

హెచ్చిరిలు. దే. అ. క్రి. హెచ్చిరిల్లు-హెచ్చిలు-హెచ్చిల్లు-ఎచ్చిరిలు: చూ, వర్ధిల్లు.

హెచ్చిరిల్లు. దే. అ. క్రి.—పై.—

హెచ్చిలు. దే. అ. క్రి.—పై.—

హెచ్చిల్లు. దే. అ. క్రి.—పై.—

హెచ్చు. దే. వి. రూ-ఎచ్చు. 1. అధికము, ఉఁకపోఁకములు: చూ, హేరాళము. తద్విశేషములకు.—చూ, హేరాళము; 2. ఆధిక్యము, అగ్గలము: చూ, హేరాళము. తద్విశేషములకు:—చూ, హేరాళము; విశే. 3. అధికమైనది: చూ, హేరాళము; అ. క్రి. 4: (మి) అధికమగు. (తె) ఎచ్చు, కడచు, దళకొను-దళముకొను, దళగించు, దొట్టువాఱు, బలపడు, బలియు, మున్మరించు. (సం) ప్రకోపించు

హెచ్చుగలవాఁడు. దే. విశే. అతిశయవంతుఁడు: (సం) అతిమాత్రుఁడు.

హెచ్చుతగ్గులు. వా. విశే. రూ-ఎచ్చుతగ్గులు: చూ, విషమము. 2.

హెచ్చు రాయసతనము. వా. వి. పెంకితనము.

హెచ్చైనవాఁడు. వా. విశే. మేలుచేయి: చూ, సమర్థుఁడు.

హెడ్. హెడ్డు వా. విశే. 1. అధికారి; 2. యజమాని. "హెడ్ మేస్టరు, పోలీసు హెడ్డు" మొ.( రూ-హేడ్డు.)

## హే

హే. సం. అవ్య: చూ, సంబోధనార్థకములు.

హేజీబు. దే. వి. మంత్రిరి: చూ, మంత్రి. 1.

హేడకుఁడు. సం. విశే.=హెగ్గడీఁడు: చూ, సౌవిదల్లుఁడు.

హేడుఁడు. సం. వి. అ. పుం. 1.—పై.—; విశే. 2. ఎడ్డె: చూ, మూర్ఖుఁడు.

హేడ్డు. వా. విశే. రూ-హెడ్-హెడ్డు.

హేతి. సం. వి. ఇ. స్త్రీ. 1. అగ్నిశిఖ, నిప్పుమంట: చూ, వహ్ని. 1; 2. మంట: చూ, వహ్ని. 1; 3. సూర్యకిరణము: చూ, హాయనము. 2; 4. ఆయుధము: చూ, బాణము.1. తద్విశేషములు:— (౧) బాణమునకు సంబంధించినవి: ౧. క్రూరబాణమునకు.—(తె) లకోరి-లకోరీ; ౨. వత్సదంతము; ౩. ఇం

ద్విధనుస్సునకు.-వాల్మీకము; ౪. విష్ణుచక్రమునకు.-లోకపావనము, సుదర్శనము; ౫. వాఁడిగలబాణమునకు.— (తె) వాలికతూఁపు; ౬. ఏనుఁగునుబొడిచెడి బరిగోలకు.—తోత్రకము, వైణుకము. (చూ, సృణి); ౭. అలుఁగులేనియీఁటెకు.—(తె) బరికట్టె, బతిగమ్మి; ౮. బాణమునకు.—భల్లము, శల్యకాష్ఠము, శిలీముఖము, శిఖండి; ౯. వజ్రాయుధమునకు.-(తె) మగమానికపురాలు, మగటాతివాలు; ౧౦. యుద్ధసాధనమునకు:-(తె) మున్ను; ౧౧. శివుని శూలమునకు:—మహితము, లోహితము; ౧౨. విల్లుకు:-కార్ఙ్గము; ౧౩. విష్ణువుయొక్క విల్లుకు.-శార్ఙ్గము; ౧౪. ఈఁటెవంటి ఆయుధమునకు.—(తె) సబడి-సబిడి-సబిడీ-సబరి-సబళము—సబళి; ౧౫. చిల్లకోలకు.—శర్వల, శక్తి, విశిఖము. (తె) సత్తి; ౧౬. తోత్రమునకు:(తె) సాటి; ౧౭. అంకుశమునకు.—సూనము. (తె) సిడి (చూ, సృణి.); ౧౮. (తె) పెడఁగవాతియమ్ము; ౧౯: శృంగిణి; (౨) రిష్టికి సంబంధించినవి:- ౧. కల్లుగీఁచేవానికత్తికి:-(తె) పెలగత్తి; ౨. తుపాకికొనను చెక్కియుండెడి బాఁకువంటి కత్తికి: (తె) సన్ని-సన్నీ; ౩. కత్తికి:-వాలము; ౪. కొంకికత్తికి.—వక్రిమ; ౫. శిపాయికత్తికి:—వజ్రపాసము; ౬. పెద్దకత్తికి:—వరాకము, వరాశి-వలాసి; (చూ, రిష్టి 2; చూ, బాణము. 1.)

హేతువు. సం. వి. ఉ. పుం. 1. కారణము: అ, అప్, అపదేశము, అర్థము, ఉపపత్తి, ఉపాదానము, కారణము, కార్యము, గుంభము, త, తంత్రము, తర్కము, తలము, నిబంధనము, నిమిత్తము, ప్రత్యయము, ప్రయోజనము, బీజము, యోని, సంభవము. (అవ్య) అను, ఇతి, కిమ్, కిల, ఖలు, చ, తత్, తు, యత. (తె. వ):-అక్కఱ, కతము, కోపు, జోలి, నెవము-నెపము, నేరము, కట్టు, రిజేను, పయినము-పైనము, సబబు, హేత్వర్థకమునకు—అటుగాన, కనక-కనుక, కాఁగ, కాన, కాఁబట్టి, కావున; అని; ఎందువలన. తద్విశేషములు:—౧. ముఖ్యకారణమునకు.—ఉపాదానము; ౨. పుట్టుటకుకారణము:—ప్రభవము; అం. 2. హేత్వలంకారము. కార్యకారణములకు హేతువుఁ జెప్పుట. ఉదా.—"చంద్రుఁడిదేమదవతీమానవిచ్ఛేదసాధ్యముదయించెమేం శ": చూ, అలంకారము 8; అలంకారములు నూటయిరు అలంకారము 8 వ యర్థమందుఁ జూపఁబడెను. వానివివరము లాయాపదముల క్రిందఁ జూడనగు. ఇంకను లెక్కకుమించినన్ని యలంకారములుగలవు. గ్రంథవిస్తరభీతిచే కొన్నిమాత్రమేఁ జూపఁబడెను:—(చూ, శబ్దాలంకారములు.) (చూ, అలంకారము 8.): అంగాంగిభావసంకరము, అక్రమాతిశయోక్తి, అత్యంతాతిశయోక్తి, అధేయపర్యాయము-ఆధేయపర్యాయము, అధికతాద్రూప్యరూపకము, అధికాభేదరూపకము, అనుక్తవిషయస్వరూపోత్ప్రేక్ష, అనుభయతాద్రూప్యరూపకము, అనుభయోక్తిరూపకము, అనుపలబ్ధి, అన్యత్వ్యాయోక్తము, అన్యత్వ్యాయోక్తి అన్యద్విషమము, అన్యాతుల్యయోగిత, అన్యావినోక్తి, అన్యాసంగతి, అపరాతుల్యయోగిత, అపరాసంగతి, అపరవిషమము, అపహ్నుతి, అప్రస్తుతతుల్యయోగిత, అప్రకృతానేకవిషయశ్లేషము, అప్రస్తుత ప్రసంగము, అయోగసంబంధాతిశయోక్తి, అర్థాంతరము, అర్థాపత్తి, అశ్లాఘ్యగుణోత్కర్షసారము, అసదర్థనిదర్శనము, అసి, అసిద్ధవిషయహేతూత్ప్రేక్ష, అసిద్ధవిషయఫలోత్ప్రేక్ష, అక్షేపణ, అచారప్రమాణశబ్దము, అత్యుక్తి